# నేను - నా దేశము

దరిశి చంచయ్య

ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ.

ఆదర్శ ప్రచురణ
తొలికూర్పు
సెప్టెంబరు 1952

ముద్రణ :
కల్యాణి ప్రెస్, విజయవాడ.
వెల : ఆరు రూపాయలు

కృతజ్ఞత :

ఈ గ్రంథాన్ని వెలువరించుటలో మాకన్నివిధముల తోడ్పడిన మిత్రులు శ్రీ అన్నవరపు సుబ్బారావుగుప్త, శ్రీ అడ్డేపల్లి సత్యనారాయణ గార్లకు.

—సంపాదకుడు

సంపాదకుడు :
గద్దె లింగయ్య

బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ఉరి
కొయ్య కెరయైన అమరజీవి—
నా మిత్రుడు సర్దార్ బలవంత
సింగుకు, ఆయన భార్యకు

అంకితం

"నేను సైతం ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ధారవోశాను"

—శ్రీ శ్రీ

# పీఠిక

—ం౦ః౦ం—

ఇంగ్లీషులో సంవత్సరానికి కనీసం పది, పదిహేను ఆత్మకథల ప్రచురణ జరుగుతుంది. కాని, మన తెలుగులో గడచిన నలభై రెండు సంవత్సరాలలో పట్టుమని పదైనా వెలువడలేదు. ఇక్కడనేను ఈ "నలభై రెండు సంవత్సరాల" ప్రసక్తిని నిర్నిమిత్తంగా తీసుకురాలేదు. మన భాషలో తొలి ఆత్మకథ ప్రచురణ సరిగా నలభై రెండు సంవత్సరాలనాడు. అంతకు ముందు ఈ సాహిత్య విభాగం మనకు లేనేలేదా అనే సందేహానికి ఆస్కారం లేకుండా 1910 లో "స్వీయ చరిత్రము" అనే పేరుతో ఆత్మకథను ప్రచురిస్తూ శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు "తెలుగు భాషలో స్వీయ చరిత్రమును వ్రాయబూనుకొనుట కిదియే ప్రథమ ప్రయత్నము" అని స్పష్టపరిచారు. తమ ఇతర ప్రథమ ప్రయత్నములలోవలె దీనిలో కూడా పంతులుగారు తెలుగుజాతికి చక్కని బాటనే తీర్చారు. అయినా దానివెంట నడచినవారిని వేళ్ళ మీద లెక్కించవచ్చు.

శ్రీ వీరేశలింగం పంతులుగారి తర్వాత ఆత్మకథలను ప్రచురించిన తెలుగువారు నాకు తెలిసినంతవరకు—శ్రీ రాయసం వెంకటశివుడు, శ్రీ వల్లూరి సూర్యనారాయణ, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం, శ్రీ టంగుటూరి ప్రకాశం, డాక్టర్ కె. యన్. కేసరిగార్లు మాత్రం. ఈ అయిదుగురి కృషిలో కూడా ఒకరిది

అసమగ్రం. రెండవవారిది ఇంకా గ్రంథరూపం ధరించలేదు. ప్రకాశం పంతులుగారి "నా జీవితయాత్ర" బాల్యంనుంచి ఒక మజిలీ మాత్రం చేసి, "పంచాశద్వర్షాల" వద్ద నిలిచిపోయింది. డాక్టర్ కె. యన్. కేసరిగారి "నా చిన్ననాటి ముచ్చట్లు" ఇంకా "గృహలక్ష్మి" సంచికలలోనే వుండిపోయింది. ఇంత కొద్దిమంది మాత్రమే నడచిన ఈ బాటవెంట సాహసించి ఇప్పుడు కొత్తగా నడిచినవారు శ్రీ దరిశి చెంచయ్యగారు.

స్వీయ చరిత్ర వ్రాయడం నిజంగా సాహసంతో కూడిన పనే. శ్రీ వీరేశలింగంగారే ఈ విషయాన్ని కొంతవరకు సూచించారు. "స్వీయ చరిత్రము వ్రాయుటలో నితర గ్రంథరచనలో నున్నవానికంటె నెక్కుడు కష్టములుకానవచ్చు చున్నవి" అని చెప్పి, ఆ కష్టము లేవో వారే వివరించారు. "తన్నుగూర్చి తాను వ్రాసికొనునప్పు డీశ్వరముఖము జూచి సత్యమునే చెప్పబూనినను సమకాలపువా రది యాత్మస్తుతిగానో, పరనిందగానో చేసెనని యన్యథా భావింపవచ్చును. ఒకానొకప్పుడు పరులనుగూర్చి యప్రియములగు సత్యములు బయలుపఱుప వలసివచ్చినప్పుడు వారికిని, వారి మిత్రులకును, బంధువులకును మనస్తాపము కలుగవచ్చును."

స్వీయచరిత్ర రచనలో పంతులుగారు చెప్పిన చిక్కులున్నా, ఆత్మస్తుతి, పరనిందల ఆరోపణలకు బెదిరినందువల్లనే, అప్రియ సత్యప్రకటనకు సంకోచించినందువల్లనే ఆత్మకథా రచన జోలికి హెచ్చుమంది పోలేదని నే ననుకోను. "కథ" అంటూ వుంటేనే తప్ప "ఆత్మకథ" వ్రాయడం సాధ్యం కాదు. ఎవరికి

వారికే తమ జీవితం ఒక కథ కావచ్చు గాని, ఇతరులకు దాన్ని గురించి అన్యథావా ఉండవచ్చు. నిత్యజీవితంలో "నా కథ కాస్త వినండి" అంటూ వచ్చేవారిలో వెయ్యికి 999 మంది నిజానికి మనకు వినిపించేది "ఆత్మకథ"ను కాదు; "ఆత్మ క్షోభ"ను. మన క్షోభ సాహిత్య గౌరవం పొందగల కథ కావడం సమకాలికసంఘ జీవిత విస్తృతిని, వైవిధ్యాన్ని, వైశిష్ట్యాన్ని—దాని వెలుగునీడల సమేతంగా—మన జీవితచరిత్ర బహుధా ప్రతిఫలింపజేయగలిగి నప్పుడే. ఈ మహద్భాగ్యానికి నోచుకొన్నవారు మనలో కొద్ది మంది. వారిలో ఆత్మపరీక్షను చేసుకొనగలవారేమి, తమను గురించి,ఇతరులను గురించి న్యాయమైన తీర్పులకు రాగలవారేమి మరింత తక్కువ. ఈ శక్తి వున్నా, కొన్ని నెలలతరబడి రచనను కొనసాగించగల ఓర్పు చూపగలవారు అసలే తక్కువ. ఇందు వల్లనే మనకు ఆత్మకథలు ఇంత తక్కువని అనుకొంటాను.

కారణాలేవైనా మనకున్న స్వీయ చరిత్రలు బహుకొద్ది. ఈ పరిస్థితిలో ఒక క్రొత్తది వెలువడ్డమే సంతోషం కలిగిస్తుంది. ఇక, ఆ వెలువడింది—పరభాషలలోనివాటితో పోల్చినప్పటికీ—ఉత్తమశ్రేణికి చెందినదైతే పరమ సంతోషమే. శ్రీ చెంచయ్య గారి "నేనూ - నా దేశము" నిస్సంశయంగా ఉత్తమ శ్రేణికి చెందిన ఆత్మకథ. నిజానికి అది ఆయన ఆత్మకథ కాదు; మన దేశ చరిత్ర. పోయిన అర్థశతాబ్దిలోను మనదేశంలో ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో వచ్చిన ప్రతి మహోద్యమం శ్రీ చెంచయ్యగారి జీవిత దర్పణంలో తన ప్రతిబింబాన్ని మిగిల్చింది. పైగా, అవి నిర్జీవ ప్రతిబింబాలు కావు; సజీవ

మైనవి. సాక్షిభూతులై తీరాన నిలవడం చెంచయ్యగారి ప్రవృత్తికి విరుద్ధం. తమను ఆకర్షించిన ప్రతి మహోద్యమ వాహినిలో ఆయన తల మునకలు కావలసిందే. ఈ విశిష్టతే ఆయన జీవితగాథకు సమకాలిక దేశచరిత్ర కాగల గౌరవాన్ని కూర్చి, "నేనూ - నా దేశము" అనే నామకరణాన్ని సార్థకం చేసింది.

అయితే పరసపెట్టి ప్రశంస లేకపోతే, తెంపులేని దూషణ తప్పు. మనకు నిష్పాక్షిక విమర్శ లేదనే నింద నిర్హేతుకమైంది కాదని నమ్మేవాడిని కాబట్టి, మామూలు తప్పిదాన్ని చేయక, శ్రీ చంచయ్యగారి రచనలో నాకు లోపాలుగా తోచిన విషయాలను ముందుగానే చెప్పివేస్తున్నాను. తమ బాల్యదశను ఆయన "కట్టె–కొట్టె–తెచ్చె" ధోరణిలో సరిపుచ్చారు. ఇందువల్ల ఇరవయ్యో శతాబ్ది ప్రారంభంలో ఆంధ్రదేశ–ముఖ్యంగా నెల్లూరు జిల్లా–సాంఘిక పరిస్థితులను గురించి సవిస్తరంగా తెలుపడానికి వీలులేకపోయింది. గదర్‌పార్టీ పుట్టు పూర్వోత్తరాలను గురించి కొంత విపులంగానే వ్రాసినా దాన్ని గురించి చెంచయ్యగారు మాత్రమే తెలుపగలవి మరెన్నో కలవని అనుకుంటాను. జయిళ్ళలో—ముఖ్యంగా ఇండియన్‌జెయిళ్ళలో–తమ అనుభవాలను గురించి అనవసరంగా పెంచి వ్రాశారనికూడా నా నమ్మకం. ఈ భాగాలను తగ్గిస్తే, యితర వ్యక్తులకు కొందరికి బాధ కలిగించే విషయములను యెత్తుకోవడం జరిగేది కాదేమో! స్వీయ చరిత్ర రచన సందర్భంలో ఎవ్వరికీ, ఏవిధమైన నొప్పి కలిగించకుండా వ్రాయడం—అప్రియ సత్యాలను పలుకనేరని భీరువికి తప్ప—సాధ్యం కాదనుకోండి. శ్రీ వీరేశలింగం పంతులుగారు

కూడా "సాధ్యమైనంతవరకన్యులమనస్సులకు నొప్పికలిగించెడి విషయముల ననావశ్యకముగా జొప్పించుట మానితిని గాని, కొందరినిగూర్చి మనస్సున కింపుగాని విషయము లనివార్యముగా వ్రాయవలసివచ్చినది" అని తమ "స్వీయ చరిత్రము"లో చెప్పినారనుకోండి. అయితే, శ్రీ చెంచయ్యగారు "నివార్యము" లైనప్పటికీ అన్యులకు బాధకలిగించగల సంఘటనలను నాలుగైదింటిని అనవసరంగా పేర్కొన్నారని నా అభిప్రాయం.

నా బుద్ధికి లోపాలుగా తోస్తున్న లోపాలను విడిచిపుచ్చితే "నేనూ-నా దేశము" సర్వోత్కృష్టంగా వున్నది. తాను రచయితను కానన్న సంకోచం శ్రీ చెంచయ్యగారికి వున్నట్టున్నది. కాని, ఆయన సూటిగా ఆలోచిస్తారు; సూటిగా బ్రతుకుతారు. అందువల్ల సూటిగానే వ్రాయగలరు. రచయిత కావడానికి దీన్ని మించిన అర్హత నా మట్టుకు నాకు తెలియదు.

స్వీయ చరిత్రలో ఒక చోట శ్రీ చెంచయ్యగారు ఎప్పటి కప్పుడు తాము తమ వయస్సుకంటే పిన్నగా కనబడుతుంటామని వ్రాశారు. ఆయన అంతరంగంలోకి తొంగిచూడగలిగితే దానికి ఈ వైచిత్రి మరింతగా వర్తిస్తుందని మనం తెలుసుకోగలము. మానసికంగా నిత్యయౌవనం ఒక విశిష్టత కాబట్టే, షష్టిపూర్తిచేసుకొన్న తర్వాతకూడా ఏ కొత్తవుద్యమాలను నడిపి, నా దేశానికి కొత్తసేవ చేయగలనన్న తపన ఆయనలో కనబడుతుంది. ఆయన జీవితంలో ఈ నవ నవోన్మేషం ఆయన రచనలో కూడా వెల్లివిరుస్తున్నది.

దాపరికం లేకుండా చెప్పాలంటే "నేనూ - నా దేశము" లోని కొన్నిభాగాలను "కిన్నెర"లో చదవకముందు శ్రీ చెంచయ్య గారు నా దృష్టిలో—ఏమని చెప్పను?—సరే—ఒక చెంచయ్య గారు. ఆ భాగాలను చదువుతుండగానే ఆయన ఒక విశిష్టవ్యక్తి అని గ్రహించగలిగాను. తర్వాత ఆయన ఆత్మకథను ప్రూఫులలో పూర్తిగా చదవగలగడం మరపురాని ఒక విశిష్టానుభూతిని పొందడంగా—లేదు, జీవించడంగా—పరిణమించింది. "నేనూ-నా దేశము" పాఠకులందరు "నిజమే సుమీ!" అని నాతో ఏకీభవించగలరన్న ఆశ నాకు పూర్తిగా వున్నది.

మద్రాసు
18—1—52

నార్ల వెంకటేశ్వరరావు.



## ఒక మాట:

నే నీ రచన నారంభించేముందు తటపటాయించాను. రచయితను కానుగదా, ఏం వ్రాయగలను గనక, అనిపించింది. కాని నా రచనలో కవిత్వం లేకపోయినా, నా జీవితంలో ఎంతో కొంత కవిత్వం లేకపోలేదనిపించిది. సాహిత్యదృష్టితో కాక, స్వాతంత్ర్య సమరాంగణంలో సైనికుల అనుభవాలను వారిముఖతః వినాలన్న కుతూహలం నా సోదర ప్రజలలో ఉన్నదన్న విశ్వాసంతోనే ఈ పుస్తకాన్ని వ్రాయసంకల్పించాను.

దేశంకోసం, స్వతంత్రంకోసం తమ జీవితాలను బలిపెట్టిన వీరుల గాథలను నాకు తెలిసినంతవరకు మీ కిందులో వినిపిస్తున్నాను. మన దేశ స్వాతంత్ర్యోద్యమాలతో సన్నిహిత సంబంధమే కాక, వాటిలో స్వయంగా పాల్గొనేభాగ్యం నాకు కలిగింది. ఆ గాథలను వినిపించాలన్న ఉబలాటాన్ని అణచుకోలేక ఈ సాహసానికి దిగవలసివచ్చినది.

ఆత్మపరిశీలన అంత సులభమైనపని కాదని నే నెరుగుదును. సాధ్యమైనంతవరకు మనిషి తన్ను తాను చూచుకొనేందుకు వెనుకంజవేస్తాడని మనశ్శాస్త్రజ్ఞు లనే మాటలు విన్నాను. అయినా, ఈ కష్టమైన పనికి పూనుకొన్నాను. ఎంతవరకు కృతార్థుడనైనదీ చెప్పవలసినది మీరు కాని, నేను కాదు.

మన దేశ మహోద్యమానికి మకుటప్రాయమైన మహాత్ముని జీవితచరిత్ర తలపున వచ్చి హడలిపొయ్యాను. అంత

గొప్ప ఆత్మకథ తర్వాత నేనూ వ్రాయడమేమిటి! అని నాలో నేను నవ్వుకొన్నాను.

కాని, ఆ మహోద్యమంలో ఆయనజీవిత మొక మహాగ్ని గుండమైతే నా సమిధకూ అందులో తావులేకపోలేదు కదా అన్న భావం మాత్రమే కాదు నన్ను ప్రేరేపించినది. మరొక కారణ మున్నదని మనవిచేసుకొంటున్నాను.

మనదేశంలో స్వాతంత్ర్యసముపార్జనకై జరుగుతున్న మహోద్యమము ఆ యా ప్రత్యేకదశలలో అనేక రూపాలను ధరిస్తూవచ్చింది. విప్లవకారులయుగం, గదర్ ఉద్యమము, కమ్యూనిస్టు ఉద్యమము—ఇవన్నీ ఆ మహా ప్రజోద్యమరూపాలే.

వీటిలో గదర్ ఉద్యమాన్నిగూర్చి మనప్రజల కెక్కువగా—ఈనాటివారి మాట చెబుతున్నాను—తెలియదు. ఆ ఉద్యమము 1913—1919ల మధ్య వెలసినది. గదర్ అంటే సైనికులు తిరుగుబాటు చేసి, నూతన ప్రభుత్వస్థాపనకై సాయుధపోరాటాన్ని సాగించడమని అర్థం.

అవి ప్రథమ ప్రపంచయుద్ధం జరుగుతున్న రోజులు. గదర్ ఉద్యమము అప్పుడే విజృంభించినది; కాని, బ్రిటిష్‌ప్రభుత్వం దానిని అణచివెయ్యగలిగింది. ఆ ఉద్యమవివరాలు మన ప్రజలలో వ్యాప్తిచెందకుండా ప్రభుత్వం మరుగుపరిచింది.

1947 ఆగస్టువరకూ ఈ ఉద్యమవివరాలను రహస్యంగా తప్ప బాహాటంగా వ్రాయ వీలులేకపోయింది. అదొక ప్రమాద భూయిష్టమైన పనిగా తేలినది. అందువల్లనే ఆ ఉద్యమచరిత్ర అంతగా ప్రచురణకాలేదు. అందులో పనిచేసిన వీరు లెందరో మరణించారు.

నే నీ ఉద్యమారంభంలో పాల్గొన్నందుకు గర్వపడుతుంటాను. ఆ ఆరంభచరిత్ర నెరిగినవారు పట్టుమని పదిమంది కంటె యెక్కువలేరు. వారిలో తొమ్మండుగు రిప్పుడు మనమధ్య లేరు. మిగిలిన నేను- నే నెరిగినంతవరకు- సంగ్రహంగా ఈ వీరగాథను తెలియచేయడం విధిగా భావించాను. ఆ ఉద్యమం అంతిమదశలో తిరిగి పాల్గొంటిని. ఈ సందర్భంలో వచ్చిన లాహోరు కుట్రకేసులో (Lahore Conspiracy Case—Second Supplementary) "నేరస్థులలో" నే నొకడను. ఈ ఘట్టానికి చెందిన మిగత సోదరులలో జీవించినవా రెవరున్నారో లేదో నాకు తెలియరాలేదు. వారు పంజాబీయులు, బెంగాలీలు. నే నెరిగినంతవరకు, జ్ఞాపక మున్నంతవరకు వ్రాసినాను. కాని, సమగ్ర చరిత్ర వ్రాయగల సమర్థులకు నేను వ్రాసినది సహాయపడగలిగితే ధన్యుడను.

"పంజాబులో మాత్రమే. రాజద్రోహం అనే నేరం ఆరోపించి, షుమారు అయిదువేలమంది మీద కేసులు పెట్టారు. మిలిటరీ కోర్టు (కోర్టు మార్షల్) అయిదువందలమందికి ఉరిశిక్ష విధించెను. ఎనిమిదివందలమందికి యావజ్జీవ శిక్ష విధించి అండమానుదీవులకు పంపెను; ఏలాంటి కేసులు ఆరోపించబడకనే పదివేలమంది "ఇంటరన్" చేయబడిరి; ఎందరో అజ్ఞాతవాసంలో ఉండవలసివచ్చెను. *

---

* "పొలిటికల్ ఇండియా" అనే గ్రంథములో 136 వ పేజీలో నుండి. దీనికి యెడిటరు సర్ జాన్ కుమ్మింగ్.

అట్లే, ఆంధ్రదేశంలో సంఘసంస్కరణోద్యమాలెన్నో జాతీయోద్యమములోని శాఖలుగా బయలుదేరినవి. కుళ్ళుకంపు గొడుతున్న ఋష్కాచారాలకు, మూఢవిశ్వాసాలకు తావలమైన వ్యవస్థను కదిలించి, దుమ్ము దులిపివేయగలంత గట్టి గాలిదుమారం లేచినది. సనాతనులు ఊపిరి తిప్పుకోలేక, కళ్లుతెరవలేక, అల్లల్లాడిపోయిన రోజులవి. ఈ నాడు హిందూకోడ్ బిల్లును ప్రతిఘటించగల పెద్దలు, అభ్యుదయవాదులుగా రొమ్మువిరిచి నడవగలుగుతుండడం చూస్తుంటే, ఆనాటి సంస్కరణోద్యమాల మహత్తరత్వం గోచరిస్తుంది.

ఆ ఉద్యమాలు కొన్నింటిలో నేను చాలాకాలం పనిచేశాను. వానిలో నా పాత్ర ఎంతో కొంత ముఖ్యమైనదే. అందువల్ల వీనిని గూర్చికూడ కొంత స్వయంగా కని విని చవి చూచిన సంఘటనలనుగూర్చి వ్రాయగలిగాను. మన ఆంధ్రుల సంస్కరణోద్యమ చరిత్ర సమగ్రముగా వ్రాయవలసిన అవసరమెంతైనా కలదు. అందుకు సమర్థులు పూనుకుంటారని విశ్వసిస్తున్నాను. వారి కీ భాగం ఉపకరించగలుగుతుందని ఆశిస్తున్నాను.

తర్వాతభాగంలో కమ్యూనిస్టు ఉద్యమంలో నేను పని చేసినప్పటి జ్ఞాపకాలు వ్రాశాను. కమ్యూనిస్టులతో కలిసి నేను సుమారు పదిహేనేళ్లు పనిచేశాను. సన్నిహితంగా వారిని నే నెరుగుదును. వీరొకరే కాదు; జాతీయోద్యమంలో పాల్గొన్నవారి సంతానమే. పూర్వకాలం మహాభారతయుద్ధాదులు జరిగిన విధం మనము చదువుకొన్నాము. మన పూర్వులు చేసిన తప్పులనే మనము పునశ్చరణ చేయవలసినపనిలేదు. అది మన తెలివితేటలను

ప్రదర్శించదు. గత చరిత్రనుండి మనం నేర్చుకొనవలసిన గుణ పాఠా లెన్నో గలవు.

పెద్దలు తమవిజ్ఞానాన్ని, అనుభవాన్ని, తమ సంతాన విధ్వంసనకై ఉపయోగించరాదు. ఆల్లే మన అర్జనులు, అభిమన్యులు వృద్ధుల నుసుమాడ కూడదు. వీనిలో ఏ ఒక్కటీ గర్వించదగినది కాజాలదు.

యువకుల వాంఛలెన్నో న్యాయమైనవని, వివాదాలను న్యాయదృష్టితో పరిష్కరించుకొన వీలున్నదని, అలా చేయవల సినదని సవినయంగా మనవిచేయుచున్నాను. సహృదయంతో, సానుభూతితో ఈ భాగాన్ని చదవమని సోదరులను ప్రార్థించు చున్నాను. ఈ విషయంలో ఈ రచన ఆవగింజంత సహాయ పడినా సంతోషిస్తాను.

ఇలా నాజీవితం నాలుగుపాయలుగా పారినది. గదరుపార్టీ జీవితం, సంస్కరణోద్యమాలలో పనిచేయడం, కమ్యూనిస్టు ఉద్యమం. ఇలా ఈ మూడింటినే రెండు మూడు నాల్గు భాగాలలో వివరించాను.

ఈ రచనలో తోడ్పడినట్టి, సాయపడినట్టి మిత్రు లెందరో ఉన్నారు. వారి సహాయ సానుభూతులకు కృతజ్ఞతను వెల్లడిస్తు న్నాను. శ్రీ చవలవాడ పిచ్చయ్య, ఏల్చూరి సుబ్రహ్మణ్యం గారలకు ఈ సందర్భంలో నమస్కృతులర్పిస్తున్నాను. వ్రాత ప్రతిని చదివి అమూల్యములైన సలహాలిచ్చిన శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యకవి, సెట్టి ఈశ్వరరావు, పందిరి మల్లికార్జున రావుగార్లకు అభివందనా లర్పిస్తున్నాను.

నా భార్య సుభద్రమ్మగారి సహకారం ఉన్నందువలనే నేనీ రచనను ముగించగలిగానని నా సంపూర్ణ విశ్వాసం.

ఏదో ఈ వయసులో, ఎన్నో పనితొందరలలో ఆనాటి రోజులు జ్ఞాపకం తెచ్చుకొని ఆ వుత్సాహంతోనే ఈ పుస్తకం వ్రాశాను. మీ చేతులలో ఉంచుతున్నాను. నా పని తీరినది. మీ పని ఇక ఆరంభం కావాలి. అందుకే కొంత ఉపకరించినా నాకంటె ధన్యాత్ము దెవ్వరని గర్వపడతాను.

మదరాసు
1—10—51

దరిశి చెంచయ్య



# విషయ సూచిక

## 1. నా జీవితపు పునాదులు (1890—1912)

## 2. గదరు పార్టీలో

# చిత్రపటములు

పుట

# నేనూ - నా దేశము

## 1. నా జీవితపు పునాదులు.

### అప్పటి ఆంధ్రదేశము

నా జన్మస్థానం నెల్లూరుజిల్లా కనిగిరి గ్రామం. 1890 సం॥లో జన్మించాను. కసగిరి సింగరాయకొండ స్టేషనునుండి కంభంకు పొయ్యే రస్తామీద 42 మైళ్ల దూరంలో వుంటుంది. చుట్టూ కొండలు,గుట్టలు,రాళ్లు,రప్పలు. వర్షాలు అరుదు. బావులు చెరువులలో నీరు అతిస్వల్పం. వానకురిస్తే ఏళ్లలో వాగుల్లో నీరు, లేకపోతే రాళ్లు. ఆనకట్టలు అసలేలేవు. ఎప్పుడూ ఎఱ్ఱని ఎండలే. పచ్చని పొలాలే కనపడవు. దరిద్ర ప్రకృతి, దరిద్ర ప్రజలు.

ఆకాలంలో దొంగలబాధ విపరీతం. కనిగిరికి ఆయిదు మైళ్ల దూరంలో పట్టపగలే వచ్చే పొయ్యేవాళ్లను చెట్టుకు కట్టేసి దోచుకునేవారు. తరువాత దొంగలు పారిపోయి కొండల్లో దాక్కునేవారు. 1922 సం॥వరకూ మా ప్రాంతంలో పరిస్థితులు యిలాగుండేవి. 1930సం॥ తరువాత బస్సులు వచ్చాయి. అంతవరకు ఒంటెద్దుబళ్లలో ప్రయాణం. బండ్లవెంట పోలీసుల కాపలా. పదిమైళ్ల దూరంలో ఉన్న గ్రామాలతో మాత్రమే వివాహసంబంధాలు ఉండేవి; ఇచ్చి పుచ్చుకోటాలు జరిగేవి అందువల్ల నాగరికత, నాజూకు జీవితాలకు అవకాశం లేకపోయింది. పురుషులకు చెటి

రెండు చంగావిపంచలు;స్త్రీలకు చెటిర్రెండు ముతకచీరెలు వుండేవి. తువాళ్లులేవు నులకమంచాలు,కంబళ్లు,జోరాలు,నల్లులు.ఉండేవి. ఇక స్త్రీల ఆభరణాలు—చేతులకు వెండిమురుగులు, నడుముకు వెండి వడ్డాణాలు. వంటపాత్రలు:-కుండలు,చట్లు.1910. సం॥నాటికి బం గారు ఒత్తులు,ఇత్తడి పాత్రలు నేనే ఓంప్రథమంగా ప్రవేశపెట్టాను. 1922లో బంగారు మురుగులు,బంగారు వడ్డాణాలు,పట్టుచీరలు వాడడం మాయింటిలోనే మొదలు.ఇట్టి ప్రదేశం,ఇట్టి పరిస్థితులు, ఇట్టి వాతావరణంలో నేను పుట్టి పెరిగాను.

### పేద కుటుంబం

నాది వైశ్యకులం.మా తండ్రి పుట్టుకతో కడుబీదవాడు. కాని క్రమేణ పదిహేనువేలరూ.ల ఆస్తిని ఆర్జించాడు.ఆకాలంలో ఆప్రదేశంలో షాహుకారే.పరువు ప్రతిష్ఠలకు ఎంతమాత్రం లోటు లేని స్థితిలో ఉండేవాడు.అంతేగాదు;న్యాయశీలుడు,వివేక విచక్ష ణలు గలవా డనిపించుకున్నాడు. కాబట్టి ఇరుగుపొరుగు కుటుం బాలలోగాని,స్వగ్రామములోగాని,పరిసరగ్రామాల్లోగాని కలహాలు, తగాదాలు ఏర్పడితే మాతండ్రిని మధ్యవర్తిత్వంచెయ్యమని ప్రజలు కోరేవారు. ఆయన తీర్పుకు బద్ధులయ్యేవారు. ఆయన యందు ప్రజలకు పరిపూర్ణవిశ్వాసం.

ఆరోజుల్లో కోమట్లంటే అధికారులు విరసనగా చూచే వారు. పోలీసులు వీరిని ఎన్నో బాధలు పెట్టేవారు. నిర్నిమిత్తంగా న్యూసెన్సు కేసులు పెట్టేవారు. భయపెట్టేవారు. తహసీల్దార్లే ఎంతో హింసించేవారు. ఆకాలంలో తహసీల్దారంటే తగని భయం. కారణం, అనేక అధికారాలతోపాటు ఇన్కంటాక్సు వసూలుచేసే అధికారంకూడ వీరికుండేది. బ్రాహ్మణులు, కాపులు,

ముసల్మానులు కొంచెం ధైర్యశాలులు. వైశ్యులుమాత్రం ఎక్కువ భయస్తులు. అందువల్ల వైశ్యులను మాత్రమే సర్కారు వుద్యోగస్థులు నానాబాధలు పెట్టేవారు; అగౌరవపరచేవారు. ఇతర కులాలన్నింటికి వైశ్యులే కొంచెము లోకువగా వుండేవారు. ఇలాంటి సంఘటనే ఒకటి నన్ను 1898—1900 లో చాల కలవరపెట్టింది.

నన్ను కలవరపెటిన సంఘటన

కనిగిరిలో కలకాలం కరువే.బావుల చాలా లోతు;అధఃపాతాళంలో నీరుండేది. ఆ నీరు ఉప్పన; త్రాగటానికి ఉపయోగపడదు.దొరువులోదే మంచినీరు.అయితే ఎండాకాలంలో ఎండిపొయ్యేది.అప్పుడు "పట్టుబావి" అనబడే ఒక చిన్న ఊటనుండి నీరు తెచ్చుకోవాలి.అది గ్రామానికి రెండుమైళ్ల దూరంలో వుంది. కొండప్రదేశం.రాత్రిళ్లు ఎలుగుబంట్లు.చిఱుతపులులు విచ్చలవిడిగా సంచరించేవి.దీనికి తోడు దొంగలభయం.వంతులప్రకారం ఏ 24 గంటల కాలమో, 36 గంటలకాలమో కనిపెట్టుకొనివుండి నీళ్లు తెచ్చుకోవాలి.ఇట్లా అష్టకష్టాలూ పడందే త్రాగటానికి నీరు లభించదు.

1899 సం.ప్రాంతంలో రంగారావు అనే తాసిల్దా రుండేవాడు.అతను రెండెడ్ల బండిమీద గంగాళాలుపెట్టి నౌకర్ల చేత నీరు తెప్పించుకొనేవాడు.స్నానానికి,బట్టలకుకూడా ఆ నీరే. అతని నౌకర్లుకూడా అతనిలాగే చేసేవారు.పాత్రలు తోమి,బట్ట లుతికి స్నానపానాలుచేసి,బండెడు గంగాళాలతో నీరు నింపుకొని తీసుకెళ్లేవారు.వంతుపంతులు పాటించేవారుకాదు. ఎంతవరకని ప్రజలు ఓర్చుకొంటారు? చివర కొకనాడు కొందరు తిరుగబడ్డారు.వంతుల ప్రకారం తీసుకుపొమ్మన్నారు.వారికి నాయకుడు ఒక మిఠాయి

దుకాణదారుడు—వైశ్యుడు. ఈ విషయం తాసీల్దారుకు తెలిసింది. మరుక్షణమే ఒకసిపాయిని పంపాడు. వీరిని తన్నిరమ్మన్నాడు. మిఠాయివ్యాపారి తిరుగబడ్డాడు కాని ఇద్దరు అన్నదమ్ముల తలలు బ్రద్దలయ్యాయి. వీళ్ల ధైర్యసాహసాలను తహసీల్దారు సహించలేకపోయ్యాడు. వైశ్యనాయకుల్ని తన్నిరమ్మన్నాడు. వైశ్యులకు మానాయన ఒక ముఖ్యనాయకుడు. ఆయనకు పరాభవం జరిగింది. అప్పుడు నేను 8,9 ఏళ్ల కుఱ్ఱవాణ్ని. నాకన్న పెద్దవారు ఇద్దఱు అన్నలు, ముగ్గురు బావలు, మరెందరో దాయాదులు, బంధువులు, ఉండిరి. కాని కసి తీర్చుకోలేకపొయ్యారు. ప్రతిఘటించటానికి ప్రయత్నం కూడచెయ్యలేకపోయారు. ఇంతమాత్రమే కాదు. మా తండ్రిని, ఇతరనాయకులను పోలీసుస్టేషన్‌లో లాకప్ చేయించాలని తాసిల్దారు ప్రయత్నంచేశాడు. ఆ ప్రయత్నాన్ని పడగొట్టి పరువు ప్రతిష్ఠలను నిలుపుకోవాలి. అందుకు వందలు వేలు ఖర్చుపెట్టారు. ఈ సంఘటన నన్ను కలవరపెట్టింది. కత్తితో పొడిచినట్టయింది. చెప్పరాని బాధ; హృదయంలో తుపాను చెలరేగింది. మరచిపోవాలన్నా మరుపురాదు. గౌరవంగా జీవించడంఎలాగు ? ఈ సంఘటనే నా భావిజీవితానికి పునాదిఅయింది.

## విద్యాసక్తి

అప్పటినుంచి మాబంధువులు "ఇంగ్లీషు చదువుకో నాయనా! తాసిల్దారు ఉద్యోగం చేస్తువుగాని. ప్రస్తుతం మనబ్రతుకు గౌరవంలేనిబ్రతుకు" అని ప్రోత్సహించసాగారు. వారి బోధ నాకు చాల నచ్చింది. ఆవయసులో, ఆవాతావరణంలో, అంతకంటె గొప్ప ఆదర్శం నాకు తోచలేదు. దానిని సాధించుటకు ఎంతో ప్రయాసపడ్డాను.

అపుడే నాలుగో తరగతిలో ఉత్తీర్ణుడనయ్యాను.అంతకన్న ఉన్నతవిద్యకు అవకాశాలు లేవు.మా అన్నయ్యకు, నాకు వ్యాపారం నేర్పించటానికి మాతండ్రి ఒక చిల్లరదుకాణం పెట్టించాడు.ఒక అనుభవశాలిని భాగస్థునిగా ఏర్పరచాడు.కాని,నా కేమో ఉన్నత విద్య నభ్యసించాలని, తాసిల్దారు కావాలని కోరిక.మరొకవూరికి పంపమని మాతండ్రిని అడుగలేను. తగనిభయం.

ఇలాంటి పరిస్థితులలో దివిగిరికి ఒక వైశ్య తాసిల్దారు (తుంపాటి భగవంతం గుప్తగారు) 1903లో వచ్చారు. వీరికి తక్కినకులస్థులేగాక,బ్రాహ్మణులుకూడా దణ్ణాలు పెట్టేవారు. నాకు చాల ఆశ్చర్యం.నేనుకూడ బ్రాహ్మలచేత దండం పెట్టించు కోవాలనుకున్నాను.తాసిల్దారయితేనే నాకు బ్రాహ్మలు దణ్ణంపెడ తారు.అందుచేత నేనుకూడ గొప్పచదువులు చదవాలి,తాసిల్దారు కావాలి అనేకోరిక పుట్టింది.బంధువులబోధకూడా ఈకోరికను మరింత తీవ్రపరిచింది."నాన్నగారూ!నన్ను ఒంగోలు పంపండి. పెద్దచదువులు చదివి తాసిల్దారవుతాను."అని మాతండ్రిని బ్రతిమి లాడసాగాను.నేను చదివి తాసిల్దారుకావాలని మా తండ్రిగారికి కూడ కోరికపుట్టింది. కాని, వేరే వూరికి నన్ను పంపటానికి మా తల్లి సమ్మతింపలేదు.అందుచేత మాతండ్రి మా స్వగ్రామంలోనే ఒక స్కూలుపెట్టించి నన్ను ఫస్టు,సెకండుఫారాల్లో చదివించాడు. స్కూలుకువచ్చిన నష్టాన్నంతా ఆయనే భరించేవాడు.తరువాత థర్డుఫారం చదవటానికి ఒంగోలుకు పంపకతప్పిందికాదు.

## మా తండ్రి యిచ్చిన శిక్షణ

ఎప్పుడూ మాతండ్రి మా అన్నయ్యల విషయం, నా విష యంలో ఎక్కువ శ్రద్ధాళువై ఉండేవాడు. మమ్మల్ని క్రమ

శిక్షణలో పెట్టేవాడు. నా నడవడిని ఆయన ఎంతో చక్కగా సరిదిద్దేవాడు. మచ్చుకి ఒకటి రెండు విషయాలు చెప్తాను. నేను వ్యాపారం నేర్చుకొనే రోజుల్లో మాతండ్రిగారు ప్రతి సాయంకాలం నా దుకాణంవద్ద మంచం వేసుకొని కూర్చొనేవారు. గ్రామ పెద్దలు అనుదినం ఆయనవద్దకు వచ్చి కబుర్లతో కాలక్షేపం చేసేవారు. మాతండ్రి ఒకవైపు కబుర్లువింటూ, వేరొకవైపు నా చిల్లర వ్యాపారంపై దృష్టి ఉంచేవారు. అంటే నేను చిల్లరవ్యాపారము సరిగ్గా నేర్చుకుంటున్నానా, లేదా అని పరికించేవాడు. ఒకరోజున ఒక కొతాదారుడు వచ్చి ఏదో వస్తువు కావాలన్నాడు. అది మా దుకాణంలో లేదు. నేను ప్రక్క అంగట్లో ఆవస్తువును అణన్నరకు కొని, అణాముక్కానికి అమ్మాను. దీన్ని మానాన్న కనిపెట్టాడు. కొతాదారుడు వెళ్లిపోగానే మాతండ్రికి నాకు యీలాగున సంభాషణ జరిగింది.

"ఒక కాని ఎక్కువ ఎందుకు తీసుకున్నావు?" అన్నాడు మాతండ్రి.

"నేను ప్రక్కదుకాణానికివెళ్లి తెచ్చియిచ్చాను. నా కష్టానికిగాను ఒకకాని ఎక్కువ తీసుకున్నాను" అన్నాను.

"అతనే వెళ్లి కొనుక్కుంటే అణన్నరకు లభించేదికదా! అతనికి మనయందు చాలనమ్మకం. నిన్ను నమ్మినందుకు మోసం చేశావు. అంతేగా! ఇలాంటి మోసగాడివి! నీ జీవితంలో వృద్ధికి రాలేవు. పో! కానీ తీసికెళ్లి ఆయనకిచ్చి క్షమాపణ అడుక్కో" అని మాతండ్రి ఉత్తరువు చేశాడు. వెంటనే వెళ్లి తండ్రి ఆజ్ఞ ప్రకారం చేసి వచ్చాను. ఈ విషయం నా జీవితాన్నే సరిదిద్దింది.

## పితృహృదయం

దీనివల్ల పొందిన గుణపాఠం నేనెప్పుడూ మరచిపోలేదు. రెండోవిషయం. నేను తర్డుఫారం చదువుకోడానికి వెళ్లబోయే ముందు జరిగింది. మావూరినుంచి ఇద్దరు విద్యార్థులు ఒంగోలుకు చదువుకోటానికి వెళ్ళారు. ఒకరిది భోగంకులం. తల్లి ఎంతో కష్టపడి కుమారుడిని పోషించింది. అయితే వానిమనస్సు ఫాషన్ల మీదనే పోయింది. షోకిల్లా కావడంతో చదువు ముగిసింది. వాని నడత తరువాత తరువాత వారికి పెద్ద ఆటంకంగా ఏర్పడింది. రెండవవాడు వీడికంటె ఒక ఆకు ఎక్కువే చదివాడు. కనిగిరిలో చాలామంది మహమ్మదీయులున్నారు. వాళ్లు చాలాపట్టుకు బీదవాళ్లు. ముఖ్యంగా గవర్నమెంటు ఆఫీసుల్లో ప్యూన్లు, పోలీసులు మొదలైన చిన్నచిన్న నౌకరీలలో చేరుతుండేవారు. అయితే చాలా పౌరుషశాలురు. వారికి నాయకుడు పోష్టుబంట్రోతు- హసన్నా సాయిబు. ఇతన్ని చూస్తే వైశ్యులకు తంతాడనే భయం వుండేది. అతనికి బిడ్డలు లేరు. ఒకణ్ణి పెంచుకొని చదివించసాగాడు. వాడు పెద్దఉద్యోగం చెయ్యాలని తండ్రి కొండంత ఆశపెట్టుకున్నాడుకూడా. అయితే చిన్నవయస్సులోనే ఒంగోలులో సుఖరోగాలు సంపాదించుకున్నాడు. కాళ్ళు చేతులు పడిపోయినై. తండ్రి కృంగిపొయ్యాడు. హసన్న సాయిబు ఆశలన్నీ నిరాశలయినయి. నన్ను ఒంగోలుకు పంపడానికి మానాయన అప్పుడు నాకు చొక్కాలు కుట్టిస్తున్నాడు. హసన్నసాయిబు మానాన్నతో*"మామా! అబ్బాయిని ఒం

---

* ఆకాలంలో ఆగ్రామంలో అన్నికులాలవారే గాక.

గోలుకు పంపుతావా?"అని అడిగాడు. హసన్న కళ్లలో నీళ్ళు కమ్మినయి.

అతని కళ్లలోకి చూస్తూ మానాన్న "నాకు అందుకే భయంగావుంది.మీవాడిలాగే మావాడూ ఆరోగ్యం పాడుచేసుకుంటాడేమో నని దిగులుగానే ఉంది.ఒంగోలుకు పోయిన తరువాత పిల్లవాళ్లమనస్సు షోకులమీద,స్త్రీలమీద పోతున్నదేకాని చదువులమీద వుండడంలేదు"అని నావైపు ఎంతో దుఃఖంతో చూచాడు.

ఆ తండ్రులు యిద్దరి దుఃఖమూ, బాధ చూచాను. ఈ సంఘటన నా హృదయానికి హత్తుకపోయింది. నా జీవితంలో యెంతో మార్పుతెచ్చింది. వెంటనే నాకొక తీర్మానం ఏర్పడింది. నేను విద్యార్థిగా ఉన్నప్పుడు జపాను, అమెరికాలలోకూడ ఇలాంటి లోపాలు రాకుండా నా విద్యార్థిజీవితాన్ని కొనసాగించాను.నాలాగే అనేకమంది విద్యార్థులుకూడా ఒంగోలులో చదువుకునేలాగు

హిందూ మహమ్మదీయులలోకూడ వావివరసలతో పిలుచుకొంటూ,సరసాలాడుతునేవారు. మా బజారులంగళ్లో దర్జీగావుండిన పాశ్చా సాహెబు మానాన్నను మాలాగే నాన్న అని పిలిచేవాడు. మేము పాశ్చాను అన్నఅని పిలిచేవాళ్లం.మా బావలను అతను "బావ"అని పిలిచేవాడు.అతని మామలను,బావలను,మేముకూడా అలాగే పిలిచేవాళ్లము.ఇప్పటికీ ఆయన బిడ్డలు మాబిడ్డలు ఈ సాంప్రదాయాన్నే సాగిస్తున్నారు.అయితే ఇప్పుడు జనసామాన్యంలో యీ సాంప్రదాయం క్షీణించిపోతోంది.మతద్వేషాలు పెరిగిపోతున్నై.

చేశాను.వాళ్ళని చెడిపోకుండా కాపాడటంలో ఎన్నోప్రయత్నాలు చేశాను.అయినా కొందరిని కాపాడలేకపొయ్యాను.

## ఇంకొన్ని విషయాలు

ఒంగోలులో చిన్నప్పుడు విద్యార్థిదశలోని విషయాలు మరికొన్ని జ్ఞాపకం వస్తున్నాయి. సుబ్బరామయ్య అనే రౌడీ ఒక డుండేవాడు. వాడు నాకు సహాధ్యాయి. పుస్తకం ముట్టడు. నాల్గవఫారం దాటలేకపొయ్యాడు. బలశాలి. కుస్తీ పట్టేవాడు. పోకిరి. విద్యార్థులను బెదరించి డబ్బులాక్కునేవాడు. ధారాళంగా మార్కులువెయ్యనిటీచర్ల(డాయర్లలో తేళ్ళను విడిచేవాడు. దసరాకు టీచర్ల యిండ్లమీద రాళ్ళు వేసేవాడు. వేయించేవాడు. వాడికి భయబడి డబ్బు యివ్వడం నాకు ఏమాత్రం గిట్టలేదు. అందువల్ల నాపుస్తకాలులాక్కొనిపోయాడు.నామీద రాళ్ళువువ్వాడు.ఎన్నెన్నో చేశాడు.నన్నుమాత్రం లొంగదీయలేకపోయాడు. ఈ స్వగౌరవ మనేది నన్ను ఎన్నోబాధలకు గురిచేసింది,కాని అందుకు సంతోష పడుతూనేవున్నాను.

మూడవఫారంలో హెడ్మేస్టరు కాశిదాసు వెంకటసుబ్బయ్యగారి క్లాసులో సరిగా ప్రత్యుత్తరం ఇవ్వజాలని విద్యార్థులను జుట్టుపట్టుకుని వంగతీసి బాదేవాడు. ఈచర్య నాకు చాలా ఘోరంగా వుండేది. చదువు చాలించుకొని పోలేకపోయాను.అయితే అలా అగౌరవం చేయించుకొనుటకు యిష్టంలేదు.అందువల్ల ఎంతో కష్టపడి చదివి, తప్పించుకొనేవాడిని. పదేళ్లవయసప్పుడుకూడ నాకు యిలాంటి మనఃప్రవృత్తి వుండేది.

ఒకసారి అంగట్లో చెప్పకుండా నే నొక కానీ తీసుకెళ్లడం మా తండ్రి కనిపెట్టాడు.అలాచెయ్యడం అదే మొదలు.పెన్సులు పోయింది.కొనుక్కోటానికి నాకుమరోమార్గం కనపడలేదు.దొంగిలించినందుకు మా తండ్రి నన్ను "వెధవ"అని తిట్టి ఒకదెబ్బ వేశారు.అందుకని మూడురోజులు ఉపవాసంచేశాను.టీచర్లు బెదరించారు.మా తండ్రి డబ్బులిచ్చి నన్ను లాలించాలని చూచాడు.ఉపయోగం లేకపోయింది. రెండోనాటిరాత్రినుండి నా తల్లిదండ్రులు కూడా నాకోసరమని భోజనం మానేశారు.అయినా నిష్ఫలమయింది వారి ప్రయత్నం.మూడవరోజున వాంతులయి స్పృహ తప్పి పడిపోయినతరువాత నా మనస్సు శాంతించింది.ఇలాంటి ప్రవృత్తి ఎన్నోసందర్భాలలో తప్పులుకాని,నీచపుపనులుకాని చేయకుండా కాపాడింది.1915–1919వరకు గదరుపార్టీలో పనిచేసే రోజుల్లో పోలీసులు,మిలిటరి,సి. ఐ డీలు,జైలుఅధికారులు, నన్ను చిత్రహింసపెట్టారు.చాలా క్లిష్టసమయాలలో ఒంటరిగానే నా గౌరవం, నా పార్టీగౌరవం, నా దేశగౌరవం కాపాడుకోవలసివచ్చింది.ఒక్కొక్కపుడు ప్రాణాన్ని ఒడ్డాల్సివచ్చింది.ఈ ఆత్మగౌరవ మనేభావం ఎన్నోకష్టాలను సంతోషంతో స్వీకరించేలాగు సహాయపడింది నీచగుణాన్ని,పిరికితనాన్ని నాలోనుండి పారదోలింది.

రషియా–జపాన్ యుద్ధం ముగిసింది.రషియా ఓడింది. జపాన్ జయించింది. "తెల్లవాళ్ళు ఓడారు.మన నల్లవారు గెలిచారు" అని మనదేశీయులు విఱ్ఱవీగారు. దేశంలో రాచకీయచైతన్యం త్వరితగతిని పెరిగిపోయింది.బెంగాలు విభజన,స్వదేశీ ఉద్యమం నన్ను బాగా ఆకర్షించాయి.అప్పుడు నేను ఒంగోలు

హైస్కూల్లో విద్యార్థిని.శ్రీనల్లమిల్లి వరదరాజంగారు అనే తోటి విద్యార్థితో కలసి చదివే భాగ్యం నాకు లభించింది.ఆయన నాకు పైతరగతిలో చదువుతున్నాడు. ఆయన మంచి ప్రవర్తనగలవాడు. ఉన్నతాశయాలు,రాజకీయ చైతన్యంగల మిత్రుడు.ఎప్పుడూ రాజకీయాల్లో ముందడుగు వేసేవాడు.రాజకీయ చైతన్యం పెరిగిపోతున్న రోజులవి.అప్పట్లో బిపిన్‌చంద్ర పాల్ ఆంధ్రదేశానికి వచ్చి ఉపన్యాసాలు ఇచ్చారు.ఆయన ఉపన్యాసా లిచ్చినట్టి కాకినాడ, రాజమండ్రి మొదలగు పట్టణాల్లో విద్యార్థులు తిరుగబడ్డారు.తెల్ల దొరలు పారిపోయారు. బిపిన్‌చంద్ర పాల్ విద్యార్థులకు ఒక గొప్ప వీరుడయ్యాడు. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఆ రోజుల్లో మా ఆంధ్రవిద్యార్థిలోకానికి ముఖ్యవీరుడు.

బిపిన్‌చంద్ర పాల్ రాజకీయ ఉపన్యాసాలిచ్చుటకు మద్రాసుకు వెళ్తున్నాడని మేము విన్నాము.ఒంగోలులో దిగి ఉపన్యసించి వెళ్లమని కోరుతూ ఆయనకు మేము వ్రాశాము.వస్తామన్నారు.వారివిడిదికొరకు అక్కడి వకీళ్లను,టీచర్లను,మరెందరో దేశభక్తులను బ్రతిమిలాడాము,కాని వారు భయపడ్డారు.చివరకు మా గదిలోనే అంత గొప్పనాయకుడిని ఉంచుకోటానికి నిశ్చయించుకున్నాము.కాని మాకు అంత తృప్తికరంగా లేదు.చివరకు ఆయన ఒంగోలులో దిగలేకపొయ్యాడు.కారణం:-ఎండాకాలపు శలవురోజులు ప్రారంభమవుతున్నవి. మద్రాసులో కాలేజీలు మూయకముందే ఆయన వెళ్లి ఉపన్యసించాలి.అందుకని మద్రాసుకు తిన్నగా వెళ్లిపోయాడు.

మద్రాసు హైకోర్టు బీచిలో అనేక మీటింగులు జరిగినట్టు, వేలకొలది ప్రేక్షకులు వచ్చినట్టు,పెద్దలు,విద్యాధికులు అధ్యక్ష

పదవి నలంకరించుటకు భయపడినట్టు పత్రికలో చదివాము.ఒక సమావేశమునకు శ్రీ చక్రయ్యశెట్టిగారు,మరొకదానికి శ్రీప్రకాశం పంతులుగారు శమంతట తామే ముందుకువచ్చి అధ్యక్షత వహించినందుకు మేము ఎంతో గర్వించాము.

శ్రీ తిలకుగారు స్వదేశీ వస్తువులను ప్రోత్సహించసాగారు. నూలు విదేశీయులనుండి వచ్చినదయినప్పటికీ,మన మగ్గాలమీద నేసిన బట్టలను మాత్రమే కట్టుకోమని బోధించేవారు.నేనూ,నా మిత్రులు ఒంగోలు దాపునవున్న గ్రామాలకు వెళ్ళి బట్టలు నేయించుకొనేవారం. బొంబాయి మిల్లులలో ధోవతులు తయారై వచ్చేవి. చాలముతక,బరువు ఒక జత ధోవతులనుకొని కట్టాను. అపుడు నన్ను కొందరు పరిహసించేవారు. ఆధోవతులు ఎంత ముతకంటే, రెండేండ్లు కట్టినా చినిగిపోలేదు.

ఆకాలంలో బర్మా వెళ్ళే ప్రయాణీకులకు "బ్రిటిష్ స్టీమ్ నేవిగేషన్" కంపెనీవారి స్టీమర్లు మాత్రమే వుండేవి.చార్జీలు ఎక్కువ.దానికితోడు మనప్రయాణీకులకు అసౌకర్యాలేగాక పరాభవంకూడ జరుగుతూండేది.ఈబాధలను సహించలేక దేశభక్తుడు -చిదంబరం పిళ్లేగారు ట్యూటికోరన్(తూత్తుకుడి)లో "స్వదేశీ స్టీమ్‌షిప్ కంపెనీ"ని స్థాపించాడు.ఆ కంపెనీ మూలధనంకోసం "రూపాయి ఫండు"పెట్టి వసూలుచేశాడు.నేనుకూడా ఒకరూపాయి ఇచ్చాను.నా విద్యార్థిమిత్రులచేత ఇప్పించాను.ఇదే నాకొక గొప్పగా వుండేది. బెంగాలులో విద్యార్థులు బాంబులు చెయ్యడం, విదేశప్రభువులను చంపడం.ఉరికంబాలెక్కి సంతోషంతో ప్రాణాలు అర్పించడం,మాలో ఎంతో దేశభక్తిని

పురికొల్పింది.తాసిల్దారు కావాలనుకొన్న ఆదర్శాన్ని తలచుకొని సిగ్గుపడేవాడిని.

## మెట్రిక్యులేషన్ పరీక్ష

ఒంగోలులో వుండినంతకాలం శ్రద్ధగా చదివాను. మెట్రిక్యులేషన్ పరీక్ష ఆసంవత్సరంతో ఆఖరు.తరువాత యస్. యస్. యల్.సి ప్రారంభం.ఆకాలంలో మెట్రిక్యులేషన్ పరీక్షలో మొదటిసారే ఉత్తీర్ణులయ్యేవారు అరుదు.అందువల్ల నేను మొదటి మాటే పరీక్షలో కడతేరాలని కష్టపడిచదివాను.ఎవ రెంత ఎగతాళి చేసినాసరే బహుపట్టుదలతో చదివాను.

పరీక్షకు కొద్దిరోజులే మిగిలాయి.ప్యాసుఅవుతామో లేదో అని అందరం భయపడసాగాము.ఎందుకంటే ఆకాలంతో 100కి 10మందిని కూడా ప్యాసుచేయించరు.ఎంత తక్కువమంది ప్యాసయితే అంత గొప్పగా విద్యాధికులు,అధికారులు భావించే వారు.అప్పుడు విద్యావిధానం అంత అమానుషంగావుండేది.అందు వల్ల పరీక్షంటేనే విద్యార్థులు భయపడేవారు.

శ్రీ ముక్తినూతలపాటి గోపాలకృష్ణయ్యశాస్త్రిగారు మాకు తెలుగుపండితులు.దేవీపూజ చేసేవారు.ఒకనాడు కుంకుమనుక్లాసుకు తెచ్చారు.విద్యార్థులు పరీక్షహాలోకి వెళ్లేటప్పుడు పెట్టుకోమని.అలా చేస్తే భయం పోతుందనీ బోధించి పంచిపెట్టసాగారు.హిందువులే గాక క్రైస్తవులుకూడ తీసుకున్నారు.నేను ఒక్కణ్ణే నిరాకరించాను. అయితే ఆరోజు పండితులు,సహాధ్యాయులు "దేవీప్రసాదం నీ నొసట పెట్టుకో ప్యాసవుతావు" అని బ్రతిమలాడారు.నేను నిరాక రిస్తూ యిలాగన్నాను. "ఈకుంకుమ తీసుకొన్నవాళ్ళంతా పరీక్ష

అంటే భయపడేవారు. ఈభయంవల్లనే వారుఫెయిల్‌కావచ్చు. పరీక్ష విషయంలో నాకెంతమాత్రం భయంలేదు. నా యీ నమ్మకమే నన్ను పరీక్షలో ఉత్తీర్ణుణ్ని చేస్తుంది. మొదటిసంవత్సరమని మీకు భయం. ఇంట్లా భయపడనివాణ్ని నేనొక్కడినే. ప్యాసయినా నేనొక్కడినే"

ఆయేడు అరవైనల్గురు విద్యార్థులలో మొదటి సంవత్సరంలో ప్యాసయింది నేనొక్కణ్ని ఆకాలంలో మెట్రిక్యులేషన్ ప్యాసుకావడం గొప్పవిజయంగా తలిచేవారు. అందువల్లనే మాబావగారు (ప్లీడర్‌గుమస్తా) కలకండ పంచారు. ఆరోజుల్లో ఒకనాయుడుగారు తాసిల్దారుగా వుండిరి. వారు మాయింటికివచ్చి నన్ను కౌగిలించుకొని ప్రశంసించారు.

## స్వశక్తిపై నమ్మకం

హైస్కూలు విద్యార్థిగా ఉండిన కాలంలో శ్రీ నల్లమల్లి వరదరాజం మూలంగా బౌద్ధమతతత్వమునందు నమ్మకముండేది. తోటి విద్యార్థులు నన్ను "నాస్తికుడు"అని నిరసించేవారు; హేళన చేసేవారు. దేవీకుంకుమ పెట్టుకోనని నిరాకరించినప్పుడు, నాస్తికుడయినందున నేను కుంకుమపెట్టుకోలేదని తలిచారు. కాని, అసలు కారణం నా శక్తిసామర్థ్యాలమీద నాకు నమ్మకం ఉండేది. నాపరిశ్రమనుబట్టి ఫలితం కల్గుతుందని నమ్మేవాణ్ణి. వాస్తవమైన కర్మవాదంలో నమ్మియుంటిని. దేవునిమీద భారంవేసే మూఢనమ్మకం అప్పటికే నశించింది. శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారి పుస్తకాలు నన్ను సంస్కరణప్రియుణ్ణి చేసినై. కాలేజీలో చదువుకునేకాలంలో సంఘసంస్కరణలయందు కార్యశూరులయిన బ్రహ్మ

సమాజికులతో కలసిపోయాను.ఇలాగే నాజీవితంలో అనేక నమ్మ కాలు మారిపోతూవచ్చాయి.అనాస్తికజం, హ్యూమనిజం తత్వశాస్త్రా లుకూడా నన్ను ఆకర్షించి,నాజీవితంలో మార్పులు కలుగచేశాయి. వీటినిగురించి సమయానుకూలంగా విపులంగా వ్రాస్తాను.

## విదేశ విద్యాభిలాష

పచ్చయప్ప కాలేజీలో ఇంటర్ లో చేరాను.లెక్కలు,సైన్సు గ్రూపు నాకు చాలయిష్టం. కాని ఆలస్యంగా వెళ్ళినందున ఆగ్రూ పులో స్థానం దొరకలేదు. చరిత్ర,తర్కం గ్రూపులో సీటు దొరి కింది. హైస్కూల్లో గణితశాస్త్రంలో నాకు నూటికి నూరు మా ర్కులు వస్తుండేవి. అందువల్ల ఇంజనీరింగు చదవాలని నా కెంతో ఆశ.కాని ఆశ నిరాశ అయింది.చరిత్ర, తర్కం గ్రూపు నా కిష్టం లేదు. కాబట్టి అసలు చదువుమీదనే విరక్తిగలిగి,ఏకాగ్రతతో చదవ లేక పోయాను.తత్ఫలితం తప్పడం.కష్టపడి బి. ఏ.డిగ్రీ పొందినా ఏ 30 రూపాయల జీతానికో గుమస్తాగిరి చూచుకోవాలి కదా అని దిగులు. క్రమేణ జీతం ఎక్కువవుతూవచ్చినా.55 ఏండ్లు వచ్చేటప్పటికి ఏ 200రూ.ల జీతమో రావచ్చును. అప్పటికి భార్య, బిడ్డలు,మనుమలు,మనుమరాండ్రు ఏర్పడుతారు.ఇంతమం దితో యీరెండువందలరూపాయలతో జీవితం గడపడం నా కెం తమాత్రం ఇష్టంలేదు. విదేశాల్లో చదివిస్తే 250 రూపాయల జీతంతో ప్రారంభించి వెయ్యిరూపాయల జీతం దాకా వృద్ధికి రావ చ్చును.అప్పుడే హాయిగా జీవించవచ్చునన్న తీవ్రమైనకోరిక పుట్టింది,ఆంధ్రదేశంనుండి ఎందరో మంత్రుల బిడ్డలు తల్లి-దండ్రు లకు తెలియకుండా అప్పులు తీసుకొని ఇంగ్లాండుకు వెళ్తుండే

చాను.కాని దూరదేశాలకు నేను వెళ్లటం మాకుటుంబంలో ఎవ్వరికీ ఇష్టంలేదు.అప్పటికి మాతండ్రి చనిపోయాడు.మిగిలిన వారెవరూ నన్ను శాసించలేరు.

విపరీత ప్రేమ

నన్ను ప్రేమించి,అభివృద్ధికి తేవలెనని పట్టుదలతో ప్రయత్నించినవారిలో మాబావ గురవయ్యగారు ముఖ్యులు.అయితే పూర్వాచారపరాయణుడు;భయస్తుడు.నన్ను అమెరికా పోనిచ్చుటకు యిష్టపడక ఎన్నో ఆటంకాలు పెట్టిరి.మాబావగారు మొన్ననే నాకొక రహస్యం చెప్పారు.నేను కనిగిరినుండి ఒంటెద్దుబండిలో రాత్రివేళ బయలుదేరి ప్రయాణం చెయ్యాలి. మార్గంమధ్యలో నాకాళ్లు విరగకొట్టించుటకు మాఅన్నగారు బసవయ్యకు సలహా యిచ్చాడు.మాఅన్న అందుకు సమ్మతించలేదు. ఈవిషయాన్ని నాకు చెప్పి క్షమించమనికోరారు. ఆకాలంలో విదేశప్రయాణ మంటే అంత అసహ్యామూ, భయమూ, కోపమూ ఉండేవి.

సంస్కరణోద్యమ బీజాలు

అటు తరువాత అసలు వైశ్యకులంలోనే రెండు పక్షాలు పడ్డాయి. దరిశివారి పార్టీ, (2) గొంట్లావారి పార్టీ. అయితే ఈ రెండవపక్షంలోని విద్యార్థులు నా ప్రాణమిత్రులు. వారికి నాయందు మంచి గురుత్వం. శ్రీ. సి. యస్. గుప్తా, (అటు తరువాత పోలీసు సర్కిలు ఇన్‌స్పెక్టరు అయ్యాడు) శ్రీ గొంట్లా శ్రీరాములు శెట్టి (అడ్వకేటు) మేము ముగ్గురము కలసి కులపెద్దలను హేళనచేసే వారము. మా మధ్యనున్న స్నేహాన్ని, ప్రేమను భగ్నపరచడానికి ఎంతమాత్రము మా పెద్దలు సాహసించలేక పోయారు. నేను విదేశాలనుండి వచ్చిన తరువాత, వితంతు వివాహాలు చేయించు

చున్నప్పుడు, నన్ను కులంనుండి వెలివేసి నప్పుడు, నా కేలాంటి హాని రాకుండా నామిత్రులు నన్ను కాపాడారు. వారే నాతోకలసి భోంచేసి పెద్దల తీర్మానాల్ని మట్టిలో గలిపేస్తుండేవారు. కందుకూరి వీరేశలింగంగారి పుస్తకాలు చదవడం వల్లనే యీ పని నేను చెయ్యగలిగాను.

సంఘ సంస్కరణలంటే నా కమిత ప్రేమ. నేను బ్రహ్మ సమాజ సభ్యుదనయ్యాను. శ్రీ కె. వైకుంఠరావుగారి ఆదర్శ జీవితమే నన్ను బ్రహ్మ సమాజకుని చేసింది శ్రీ ఆచంట రుక్మిణీ లక్ష్మీపతిగారి వివాహానికి, శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్ పెండ్లికి ఆహ్వానింపబడకనే వెళ్ళాను. అంతమాత్రమేగాదు. మా బ్రహ్మ సమాజానికి సుబ్బరాయన్ దంపతుల నాహ్వానించి గౌరవించాము. వర్ణాంతర వివాహాన్ని మా బ్రహ్మసమాజము చేయించగలిగినవని మేము గర్వపడ్డాము.

నేను అమెరికాకు వెళ్ళే విషయం నామిత్రుల కమిత ఆశ్చర్యాన్ని కలిగించింది. "అన్యదేశం ఎంత దూరం! ఎంత సాహసం! అగాధమైన అయోమయంలోకి దూకుతున్నాడే మనవాడు!" అని వారు విచారించసాగారు. ఇక మా అమ్మ, మా అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, బంధువుల అభిప్రాయాలు చెప్పడానికి అలవికాదు. నే నేదయినా సాహసకార్యం చేస్తానంటినా, ఇక చేసే తీర్తాను అని మావారికి నమ్మకం. వీళ్లంతా చాల భయస్తులు. చివరకు ఈత అయినా నేర్చుకోనివ్వరు. వారికి తెలియకుండా ఒంగోలులో నేను, నామిత్రులు ఈతనేర్చుకున్నాం. ఏదిగుడుభావిలోనూ మేమే. ఒకరు ఒకచేదుడు భావిని త్రవ్వించారు. కాకతాళన్యాయంగా వారి వంశం నశించింది. ఇక మూఢనమ్మకాలకు



దరిశి చెంచయ్య 1912 లో అమెరికా వెళ్ళే సందర్భంలో మద్రాసులోతీసు కొన్న చిత్రము.

1. శ్రీ సుంకు సుబ్రహ్మణ్యం శెట్టి
2. శ్రీ దరిశి చెంచయ్య
3. శ్రీ కారు మూరి వైకుంఠ రావు.

## వీడ్కోలు

నన్ను సాగనంపటానికి నామిత్రులందరూ ఎగ్మూరు స్టేషనుకు వచ్చారు. కంటతడిపెట్టనివారుండరు. నా తమ్ముడు గురుస్వామి దుఃఖముతో కుంగిపోయాడు. నేనేదో తెలివితక్కువ పనిచేస్తున్నాననీ, నా సాహసం నన్ను ప్రమాదాలకు గురిచేస్తుందే మోననీ నా బంధు మిత్రులు అనుకుంటున్నట్టు నాకు తోచింది. ఖర్చులకు కావలసినంత డబ్బుకూడా నా చేతులో లేదనే విషయం వారికి బాగాతెలుసు. ఇక నా విషయమా, ఏమిచెప్పను ? రైలు ఆగేచోట దిగేసి మద్రాసు చేరుకుందామాఅని ఆలోచన. "ఛీ! నా ఆరంభ శూరత్వాన్ని, నన్ను చూచి నలుగురూ నవ్వుపోతారే! నా మర్యాద మట్టిగలిసి పోతుందే! చస్తే చస్తానుగాని, వెనక్కు డుగు వెయ్యనని గట్టిపట్టు పట్టాను. మనస్సు మరల ఎంతమాత్రం చలించకుండ దృఢపరూమన్నాను. నన్ను మెత్తపరచే ఆలోచనలు వచ్చీరాకముందే వాటిని మంచలించేవాడిని. చివరకు నా ప్రయత్నం ఫలించింది. మరల మనస్సు చలించలేదు.

కొలంబోలో జపాను స్టీమర్ మీద జపానుకు ఇంటరుక్లాసులో ప్రయాణం. మాగదిలో 8 మంది ప్రయాణికులు. నేను తప్ప తక్కినవారు జపాను, చైనా వ్యాపారస్తులు. స్త్రీలు, పురుషులు; వారిలో బెల్జియంలో చదువుకొని ఆ దేశపు యువతిని వివాహమాడి, ఆమెతో చైనాకు వెళ్లుచుండిన చైనావిద్యార్థి ఒకడున్నాడు. కులాసాగానే కాలంగడిచింది వారితో.

## ఓడలో వింతలు

రాత్రి 10 ఘంటలు. గాలి స్తంభించి పోయింది. ఉక్క పోస్తున్నది. ప్రయాణీకులు నిద్రపోతున్నారు. జపానునావికులు

స్నానంచేసి,బట్టలువిడిచి నగ్నంగానే డెక్కు మీద పచారుచెయ్యడం చూచాను. నాకు కోపంవచ్చి ఆక్షేపించాను. నామాటలకు వారు పరిహసించారు. మరుసటి ఉదయం స్టీమరు కెప్టనుకు కంప్లయింటు చేశాను.ఆయన పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వాడు. ఇండియా మొదలు సూయజువరకున్న దేశాలలో తప్ప తక్కిన దేశాలలో ఈ ఆచారం సర్వసామాన్యంగా వుంది. నాకనుభవం లేనందుచేత కోప్పడ్డానని కూడా చెప్పాడు. ఆరోజు మొట్టమొదటిసారి బట్టవిడిచి స్నానం గదిలో స్నానం చేశాను. నా దేహాన్ని చూచుకోటానికి సిగ్గుపడలేదు. ఆ రోజునుండి ఈలాంటి వింతభావాలు కోపాలు నాకు రాలేదు. అమెరికాలో వున్నప్పుడు జిమ్నిజియం (Gymneseme) లో కసరత్తుచేసి తరువాత బ్రహ్మాండమైన స్నానవాటికలో వందల మందిని ఒకేసారి నగ్నదేహాలతో షవర్ బాత్ (శీకర స్నానం) చేసేవారం. అలవాట్లు మార్చుకోటం అతికష్టం. పాశ్చాత్యదేశాచారాలను, మన ప్రాచ్యదేశాచారాలను అవగతం చేసుకొన్నవారే వాటి మంచిచెడ్డలు నిర్ణయించ గలరు.

నేను ప్రయాణం చేస్తున్న స్టీమరులో చీనా దేశస్తులు, జపానీయులు, భారతీయులు మొదలగువారు అనేకులు మూడవ తరగతిలో ప్రయాణం చేశారు. వారిలో జపాను దేశస్థులు మాత్రం కసరత్తుచేస్తూ, కుస్తీలు పట్టుతూ, కర్రలతో సాముచేస్తూ వుండేవారు. ధైర్యసాహసాలను ప్రదర్శించేవారు. చైనావారు ఏలాంటి చైతన్యం లేకుండ నిర్జీవ ప్రతిమల్లాగ, మన్నుతిన్న పాముల్లాగ పడివుండేవారు. అస్తమానం సిగరెట్లు మాత్రం కాల్చేవారు. ఇక భారతీయులలో!వీరికెప్పుడూ వాగ్వాదాలే, మతచర్చలే. వాటికి అంతులేదు.

అమెరికాలో చదివేటప్పుడుగూడా వీరిలో ఈలాంటి గుణాలే గోచరమయ్యేవి. జపాను విద్యార్థులు క్లాసులలో మొద్దు ల్లాగు వుండేవారు. చదవరు. మార్కులలో వీరిది అంత్యస్థానం. కసరత్తు, కుస్తీ, సాములలో వీరిదే అగ్రతాంబూలం. వీరి తూకం సగటున ఒక్కొక్కరు 100 పౌన్లకన్నతక్కువ. అయినా 150 మొదలు 200 పౌన్లుదాకా బరువున్న అమెరికన్ విద్యార్థులను సునాయాసంగా కుస్తీలో ఓడించేవారు. చైనా విద్యార్థులకు అదే క్లాసులో ప్రధానస్థానం, మంచిమార్కులు. ప్రొఫెసర్లకు ప్రియ శిష్యులు.కాని సాము, కుస్తీలు, ఆటలలో మాత్రం సున్న. అసలు జిమ్నాజియముకు గాని, ఆటలకు గాని వచ్చేవారు కాదు.

విద్యార్థుల నైజగుణాలకు, వారి వారి దేశాలలో రాజకీయా లకూ సన్నిహిత సంబంధాలున్నవన్న విషయం ఆనాడు నాకు బోధపడిందికాదు.

## జపానులో

నేను అమెరికాలో చదవవలసిన "కాలిఫోర్నియా యూని వర్సిటీ" బర్కిలే పట్టణంలో ఉంది. పశ్చిమ తీరంలోవున్నది. జపానుద్వారా వెళ్ళడమే సమీపమార్గం.అందువల్ల నేను జపానుకు వెళ్ళవలసి వచ్చింది. అమెరికాలో చదువు పూర్తిఅయిన తరువాత ఐరోపాద్వారా రావలెనని నా అభిలాష. కాబట్టి ఇప్పుడే జపానులో ఒకనెల రోజులుండి, ఆ దేశ ప్రజలను, వారి ఆచార వ్యవహారా లను తెలుసుకోవలెనని నిశ్చయించుకున్నాను.

రష్యా - జపాన్ యుద్ధములో జపాను గెలిచినందుకు ఆకాలంలో జపాన్ను ప్రశంసిస్తూ వివిధ విషయాలు పత్రికలలో ప్రచురింపబడుతుండేవి. ఆవ్యాసాలు అతి ఆకర్షణీయంగా వుంద

డంచేత, అనేకులకు వాటిని చదవడం పరిపాటి అయింది అందు వల్లనే నే నక్కడ ఒకనెల మకాం వేశాను. జపానీయుల నాగరికత, సాంప్రదాయాలను తెలుసుకోవలెనని అభిలాష వున్నందు వల్ల నేను యూరపియన్ స్టైయిలు ననుసరించిన హోటలుకు వెళ్ళక జపాను వారి హోటల్లో మకాం వేశాను.

జపానీయులలో అభివృద్ధియైనంత "శుభ్రత" మరేదేశ ప్రజలలోను నేను చూడలేను. వారు సౌందర్యపిపాసులు. శుచి, సౌందర్యములు వారిసొమ్మని చెప్పుట అతిశయోక్తికాదు. వారి ఇండ్లలో బూజు, దుమ్ము, చీమలు, దోమలు వెతికినా కనబడవు. స్నాన సౌఖ్య మనుభవించాలంటే జపానులో తప్ప మరే దేశంలోను లభించదు. టర్కీ దేశంలో మాత్రం కొంత వుందట. కాని ఇంత శుభ్రత వుండదని విన్నాను. ఇంక మిలిటరీ పిచ్చకు అంతు లేదు. 20 ఏళ్ల ఈడురాగానే ప్రతియువకుడు సేనలో చేరి ఒకటి రెండు సంవత్సరములు తరిఫీదు కావాలి. సైనికవిద్య నభ్యసించ యువకుడు వెళ్లేటప్పుడు ఆవూరిలోని స్త్రీలు. పురుషులు, పిన్నలు, పెద్దలు ఆబాలగోపాలం ప్రతివారు జాతీయ పతాకాన్ని చేత పట్టుకొని ఆ యువకుని వూరంతా వూరేగించి పంపేవారు. ఇంక నాటకాల విషయం:-మన పల్నాటివీరుల చరిత్రలు, బొబ్బిలియుద్ధంలాటి వీర గాథలు ప్రదర్శింపబడుతాయి. జపాను ప్రజల దేశభక్తి, ధైర్యసాహసాలు, స్వతంత్రకాంక్ష, సౌందర్యార్చన ఎంతో ఆకర్షణీయంగా కనుపించటంలో ఆశ్చర్యంలేదు. అమెరికాలో అడుగుపెట్టేదాక జపానీయుల నాగరికతలో ఏలాంటి లోపం తెలుసుకోలేకపోయ్యాను. అమెరికావెళ్లిన తరువాత అమెరికా జపానులమధ్య దోమకు, ఏనుగకున్నంత భేదం కనిపించింది.

ముఖ్యంగా జపానుకు సంబంధించిన ఒకటి రెండు విషయాల్లో నాకు పరమఅసహ్యంకలిగింది. స్త్రీలవిషయంలో పూజ్యభావం అనేది వారిలో పూజ్యం. అంతేకాదు. అక్కడ మహిళల మాన - శీలాలకు ఎంతమాత్రం విలువలేదు. వారు అతి నీచంగా చూడబడుతారు. అక్కడ వేశ్యాగృహాలు, వేశ్యానగరాలు అనంతం. "యొషావరా" అనే నగరభాగంలో వేశ్యలు మాత్రమే వుంటారు. అసలు అక్కడ ప్రభుత్వమే ఈ వేశ్యల కామందులకు ఇండ్లు కట్టించి, అద్దెకిస్తుంది. పైగా లైసెన్సులనిచ్చి సుంకం వసూలు చేసుకొంటుంది. మనదేశంలో కల్లుదుకాణాలు ఎలాగో అక్కడ వేశ్యాగృహాలు అలాగే. యొషావరాలో ప్రతి ఇంటి పంచలోను ఏ పదిమంది వేశ్యలో శృంగారించుకొంటూ వుంటారు. వారికి ఒక మేనేజరుంటాడు. ఆ మేనేజరు ఆ పంచలోనే ఒక మేజాబల్లవేసుకొని కూర్చొనివుంటాడు మన కాఫీ హోటళ్లలోలాగు. గవర్నమెంటు నిర్ణయించిన రేటు వుంటుంది. సాయంత్రం విటగాండ్రు గుంపులుగా— చైనాబజారులోను, తిరువళిక్కేణి బీచ్‌లోమాదిరిగా—యొషావరాయొక్క రమణీయమైన విశాలవీథులలో షికార్లు చేస్తూవుంటారు. వేనవేలు స్త్రీలు ఇట్టి నీచాతి నీచమైన దుర్భరజీవితం గడుపుతుంటారు.

జపానులో వేశ్యలనుండి తప్పించుకొనుట అతికష్టమనీ, అతిజాగ్రత్తగా వుండమనీ నా శ్రేయోభిలాషి పాదిరీ బ్రాకుడొర (కనిగిరిలో అప్పుడున్న పాదరీ) నాకు బాగా బోధించాడు. జాగ్రత్తగా వుండటానికి దృఢ ప్రతిజ్ఞకూడా చేశాను. కాని, నా ప్రతిజ్ఞను పదిల[illegible] కాపాడుకోటానికి పలుపాట్లు పడవలసి వచ్చింది. పడ్డాను[illegible]. చివరకు నెగ్గాను.

ప్రతి దేశంలో విదేశీయుని అవలీలగా అనవాలుపట్టి రిక్షా బళ్లవాళ్ళు విదేశీయులను నానాబాధలు పెట్టుతుంటారు. ప్రయాణీకులు చెప్పిన చోటికి తీసుకెళ్లరు. సరే అంటారు, కాని వారి మనస్సులో నున్న గమ్యస్థానానికే చివరకు చేర్చివేస్తారు. అంటే వేశ్య వాటికలకు పోవడం మనకు అయిష్టమని తెలియగానే, ఇక బోధ ప్రారంభిస్తారు. బ్రతిమిలాడినాసరే, బెదరించినాసరే వాడి పని వాడు నెరవేర్చుకుంటాడు. ఇట్లా చేస్తే వాడికి మంచి కమీషను వస్తుంది. అలాంటి రిక్షావాడే నన్ను పట్టుకున్నాడు.

నేను తరచుగా నగరసౌందర్యాన్ని, వింతలు, వినోదాలు చూడడానికి రిక్షాలో పోతూవుండేవాణ్ణి. ఒకనాడు ఒక రిక్షావాడు వేశ్యవీధికి తీసుకుపోబోయాడు. నేనెంతగా వాడిని బ్రతిమిలాడినా, బెదరించినా వాడు తనపట్టు వదలలేదు. రిక్షా ఆప లేదు. దిగనివ్వ లేదు. నా కమిత ఆగ్రహము వచ్చింది. కూర్చున్నవాణ్ణి చటుక్కున లేచి రిక్షాను నా బలంకొద్ది అణగద్రొక్కాను. రిక్షా వాడి చేతులనుండి జారిపడి కొయ్య విరిగిపోయింది. జపానీయులు గుంపు కూడారు. రిక్షా విరిగినందున నన్ను నష్టము కట్టి ఇమ్మంటారు. వారి భాష నాకు బోధపడదు. నా భాష వారికి తెలియదు. తప్పు వానిదైనా, తమ దేశీయుని పక్షమే వహిస్తారు. విదేశీయుని పక్షము వహించరు. ఇంతలో పోలీసువాడు వచ్చాడు. స్టేషనుకు తీసుకెళ్ళుచున్నాను. ఆఫీసర్లకు ఇంగ్లీషు తెలుసు. చెప్పవలసిన దంతా చెప్పాను. రిక్షావాణ్ణి చీవాట్లుపెట్టి పంపేశారు. మరొక రిక్షాను కుదిర్చి మెలకువగా మెలగమని చెప్పి పంపారు.

జపాను హోటల్లో మొదటినాడు స్నానం గదిలోకి వెళ్లి నగ్నంగా స్నానం చేస్తూవున్నాను. గదితలుపుకు గడియలేదు. ఒక

స్త్రీ నవ్వుతూ లోపలికి వచ్చింది. భయపడి బిగ్గరగా కేకవేశాను. హోటల్లోని మేనేజరు మొదలు నౌకర్లందరూ నా స్నానం గది లోకి వచ్చారు. మేనేజరుకు మాత్రమే ఇంగ్లీషు తెలుసు. "నేను స్నానం చేస్తూండగా ఈ స్త్రీ నాగదిలోకి వచ్చింది. వెళ్ళిపొమ్మంటే పోటంలేదు" అని కంప్లైంటు చేశాను. వారందరూ నవ్వారు. తమ దేశంలో స్త్రీలే ఒళ్లుతోముతారు. నగ్నదేహం చూడకూడ దనే "దురలవాటు" జపానులో లేదన్నారు. నాకు ఆశ్చర్యం వేసింది. కాని నా దేహాన్ని తాకనివ్వలేదు.

సీమ ప్రయాణంలోకూడ రాత్రి నిద్రించేటప్పుడు ఉక్క పోస్తుంటే జపానుస్త్రీలు బొడ్డుకుపైగా బట్టలన్నీ పూర్తిగా తీసేసి పురుషులతో మాట్లాడుతూ ఉండేవారు. జపాన్ హోటల్లో నా గదిని శుభ్రపరిచి, సకాలమునకు అన్నపానీయాదుల సమకూరుస్తూ వుండిన ఒక పరిచారికకు (Waitress) పొయ్యేటప్పుడు నేను బహుమానంగా కొంతడబ్బు యిచ్చాను. మేనేజరు ఆ పిల్లవైపు చూచి విపరీతంగా నవ్వసాగాడు. "ఏమిటీ?" అని అడిగాను. "మీరు ఎక్కువగా యిచ్చారు." అన్నాడు. విపులంగా చెప్పమన్నాను. "మా దేశంలో హోటళ్లలో స్త్రీలను మాత్రమే నౌకరీకి పెట్టు తాము. వారికి అన్నం బట్టలు మాత్రమే యిస్తాము. జీతం ఇవ్వం. హోటళ్లకు వచ్చేవారివద్ద డబ్బును సంపాదించుకోటానికి సర్వా ధికారం, సర్వస్వాతంత్ర్యం వాళ్లకుంది." అన్నాడు. ఇంతకన్న మరింత దారుణమైన ఆచారంగూడ అక్కడ వేళ్లపాతుకొనివుంది.

భర్తయే తన అప్పులను తీర్చుకోటానికి భార్యను కొంత కాలం యొషావరాకు అమ్మివేస్తాడు. పెండ్లి కట్నానికి డబ్బు

సంపాయించుకోమని కన్నకూతుర్ని తండ్రి యొషావరాకు కొంతకాలం అమ్మివేస్తాడు. రాజు తమ జమీందారు ఇంటికి వెళ్లితే, జమీందారు భార్య రాజుతో పడకగదిలో వుండాలి. అప్పుడే నిజమైన ఆతిధ్యమవుతుందట! అలాగే జమీందారు భూస్వాముల ఇండ్లకు వెళ్లినా, భూస్వాములు పాలేర్ల ఇండ్లకు వెళ్లినా ఇలాంటి ఆతిధ్యం జరుగుతుంది. స్త్రీల శీలానికెంత మాత్రం విలువలేని ఫ్యూడల్ (జమిందారీ) నాగరికతను, స్త్రీల నీచాతినీచస్థితిని చూడాలంటే జపానులోనే చూడాలి *. ఇట్టి నీతి బాహ్యాలు దేశాలను జయించి, తమ నాగరికతను వ్యాపింపచేయటానికి ప్రయత్నించారు. జపానులోను, ఫ్రాన్సులోను, టర్కీలోను వేశ్యావృత్తి గొప్ప వ్యాపారం. సంపాదనకు ముఖ్య మార్గం. గవర్నమెంట్లే ఈ వ్యాపారానికి సౌకర్యాలన్నీ కల్పిస్తాయి. దేశదేశాల శ్రీమంతులు ఇక్కడకు వచ్చి స్త్రీలకోసం ద్రవ్యం ఖర్చు పెట్టుకుంటారు. కొందరు అమాయికులు బికారులు అయిపోతూవుంటారు.

కొత్త జిజ్ఞాస

రెండు మూడు నెలల తరువాత జపానునుండి అమెరికాకు వెళ్లే స్టీమరులో ఎక్కాను. స్టీమరులో చాలామంది జపాను వాళ్లను కలుసుకున్నాను. వారిలో విద్యార్థులు, మిషనరీలు, (షావుకారు) వ్యాపారస్థులు వున్నారు. రెండవ తరగతిలో ప్రయాణం చేశాం. వారి దేశాన్ని ఏ మాత్రం చులకనచేసి మాట్లాడినా, వాళ్లు తోకతొక్కిన త్రాచులాగ మీద పడేవారు. వారి చక్రవర్తే వారికి

* ఆకాలంలో, మన దేశంలో జమీందారీ ప్రదేశాల్లో వ్యవసాయ కూలీ స్త్రీల గతి ఎంత హీన స్థితిలో వుండినది నాకు తెలియదు.

పరమ దైవం. వారికన్న గొప్పవారు పృథ్విలోనే లేరంటారు. వాగ్వాదాల్లో వారికి నామీద కోపంవచ్చినప్పుడు "మీ రాజెవరు? ఒక విదేశీయుడు! మీకు స్వరాజ్యం, స్వగౌరవం అనేవే లేవు" అని తలవంపులయ్యేట్లు మాట్లాడి నన్ను అగౌరవపరచేవారు. ఆ ప్రయాణ సమయంలో ఒకనాడు ఢిల్లీలో వైస్రాయి (Lord Hardinge) మీద బాంబు వేశారనే వార్త విన్నాము. అప్పుడు జపానీయులకు (స్టీమరుమీద) భారతీయులమీద కొంత గౌరవం కలిగింది. నేను, బైసాక్ అనే ఒక బెంగాల్ విద్యార్థి మాత్రమే ఆ స్టీమరు ప్రయాణీకులలో భారతీయులము. ఈ సంఘటనను ప్రశంసిస్తూ మా యిద్దరిని జపానీయులు అభినందించారు.

జపాను చూచినప్పటినుండి "మన మెప్పుడు స్వరాజ్యం సంపాయించుకొంటాము? ఎప్పుడు యంత్ర పరిశ్రమల నభివృద్ధి చేసుకుంటాము? మంచి బలవంతుల మనిపించుకుంటాము? వివిధ దేశముల మధ్య మనదేశానికి, మనకు ఎప్పుడు గౌరవస్థానం ఏర్పడుతుంది? అనే జిజ్ఞాస నాలో రేకెత్తసాగింది. విదేశీయులకు పరాధీనులమై ఉండడమనేది ఎంత ఏహ్యమో మొట్ట మొదటిసారిగా గుర్తించాను. నామీద నాకే అసహ్యం పుట్టింది.



# నేనూ - నా దేశము

## గదర్ పార్టీలో

### అమెరికాలో మొదటి అనుభవాలు

1912 సం॥ డిశంబరు మాసంలో అమెరికా చేరాను. స్టీమరు సేన్‌ఫ్రాన్సిస్కో చేరింది. 'కాలిఫోర్నియా యూనివర్సిటీ' బర్కులే పట్టణంలో, సేన్‌ఫ్రాన్సిస్కోకు 12 మైళ్ల దూరంలో వుంది. నేనూ, బైసాక్ అనే బెంగాలు విద్యార్థి రాత్రి పూట బర్కులేకు చేరుకున్నాం.

ఆ పట్టణాలు, ఆ కట్టడాలు, రైళ్లు, ట్రాములు, ఎలెక్ట్రిక్ దీపాలు, అందమైన శుభ్రమైన వీధులు, ఆ ప్రజలు, స్త్రీల అందచందాలు, వారి ఉన్నత నాగరిక జీవితం మాకు దిగ్భ్రమ కలిగించాయి. వారి హోటళ్లలో ఎలా ప్రవర్తించాలో, ఏ పొరపాటు చేస్తామో, వారేమనుకుంటారో అని మా కంగారు. వెయ్యేందుకు- ఒకపక్క ఆశ్చర్యం, మరొకపక్క అయోమయం. ఏమీ తోచదు. కొంతసేపటికి తెప్పరిల్లుకున్నాము చివరకు ఒక హోటలుకు వెళ్లాము. మమ్మల్ని "ఎలెక్ట్రిక్ లిఫ్టులో" (విద్యుచ్ఛక్తితో పైకితీసికొనిపోవుయంత్రం) పై అంతస్తుకు తీసుకెళ్లారు. అక్కడి కట్టడాలకు అనేక అంతస్థులుంటాయి. "లాలా హరదయాళ్‌గా రెక్కడ వున్నారు?" అని ఆ లిఫ్టునౌకరుని

అడిగాము. ఇండియన్ విప్లవనాయకుడు ఉన్నచోటు చెప్పారు. ఆయన ఇంటికి వెళ్లుతామనిచెప్పి సెలవు పుచ్చుకున్నాము. వీధిలో నడుస్తుండగా ఒక కుఱ్ఱవాడు లాలాహరదయాల్ వుండే వీధి, యిల్లు చూపించుతానని మావెంట వచ్చాడు. మా యిద్దరిచేతుల్లోను సూటుకేసులున్నై. ఒకటి ఆ కుఱ్ఱవాడే మోసుకొచ్చాడు. వాని ఆదరణ చూచి, అమెరికావారు ఎంతో మంచివారని, ఆదేశంలో సుఖంగానే ఉండగలమని మాకు ధైర్యం, నమ్మకంకలిగాయి.

[1910 ప్రాంతంలో ఒక బెంగాల్‌స్వామి అమెరికానుండి ఇండియాకు తిరిగివచ్చాడు. ఒకరిద్దరు వృద్ధులైన తమ అమెరికన్ శిష్యురాండ్రతోవచ్చి మద్రాసులో విక్టోరియా హాలులో ఉపన్య సించారు. అతనిపేరు "భారతి" అనుకుంటాను. అమెరికాలో స్త్రీ పురుషులు తప్పతాగి పబ్లిక్ వీధులగట్టర్లలో పడివుంటారని, పండ్లు తోమరని, ప్రతిరోజు స్నానం చెయ్యరని, ముడ్డి కడగరని ఏమేమో చెప్పాడు. ఆయన చిత్రించినదానికి, నేను అమెరికాలో చూచినదానికి పోలికేలేదు.

అదేమాదిరిగా అమెరికా పాదిరీలు భారతీయులను గురించి శుద్ధ అబద్ధాలు అమెరికాలో ప్రచారం చేస్తున్నారని తెలుసు కున్నాను.]

అమెరికాలో అడుగుపెట్టినక్షణంనుండి "మనమూ, మన దేశమూ ఎప్పుడు అమెరికాలాగు అభివృద్ధి చెందుతాము? యంత్ర పరిశ్రమలు ఎప్పుడు ఏర్పడతాయి? స్వాతంత్ర్య సౌభాగ్య సౌఖ్యాలు ఎప్పుడనుభవిస్తామా!" అనే అభిలాష, ఆరాటం నన్ను వెన్నంటాయి. జపానులో రేకెత్తిన యీ దేశాభిమానం అప్పుడు బలంగా నాటుకపోయింది.

నేనూ, బైసిక్ బర్కులే పట్టణంలో హరదయాల్‌గారింటిలో ప్రవేశించాము. అది పంజాబు విద్యార్థుల హాస్టలు. అక్కడ పదిమంది విద్యార్థులే వున్నారు. వారు మమ్మల్ని కుశల ప్రశ్నలువేసి ఆదరించారు, కాని, ఆ ఆదరణ హృదయపూర్వకమైనది కాదని గ్రహించాము. భోజనమైనవెంటనే మమ్ములను ఇంకో హాస్టలుకు తీసుకెళ్లారు. అక్కడ బెంగాలీలు, ఆంధ్రులు, తమిళులు, ఉత్కళులు, మహారాష్ట్రులు కలిసివుండిరి. అనగా పంజాబీ తప్ప తక్కినవారందరూ వున్నారు. మొత్తం 12 మంది మాత్రమే. వారిలో గుంటూరు పట్టణవాసి శ్రీ భాగవతుల సోమయాజిశర్మ బి. ఏ. బి. యల్. గారు నన్ను కౌగలించుకున్నారు. మదరాసులో ఆయన లాకాలేజీలో చదివేటప్పుడు మా యిద్దరికి పరిచయం కలిగింది. ఇక్కడ విద్యార్థు లందరూ మమ్మల్ని ఆదరించినందువల్ల మా సామానులను ఈ హాస్టలుకే తీసుకవచ్చి ఇక్కడే మకాంపెట్టాము.

కాలిఫోర్నియా యూనివర్సిటీలో 3500 మంది విద్యార్థులున్నారు. వీరిలో షుమారు 1000 మంది స్త్రీలు. దేశదేశాల నుండి వచ్చిన విద్యార్థులు షుమారు 500 మంది వుండిరి. భారతీయులు 30 మంది. వీరిలో రెండు రాజకీయపార్టీ లుండేవి.

ఇండియాలో బ్రిటిషుప్రభుత్వాన్ని హతమార్చి, స్వరాజ్యాన్ని స్థాపించుకోవాలనే కక్షి ఒకటి. పంజాబీ విద్యార్థులందరు ఈ కక్షిలో వుండిరి.

మరొక కక్షి ఆశయమేమిటంటే అమెరికాలో ఉన్నత విద్య నభ్యసించి ఆరితేరాలి; ఇండియాకు వెళ్లి ఉన్నతోద్యోగాల్లోచేరి పుష్కలంగా సంపాదించుకొంటూ ఇతోధికంగా దేశ

సేవ చెయ్యాలి; కాని, దౌర్జన్యాలకు దిగినా, ఏవిధంగా పోరాడినా బ్రిటిషుప్రభుత్వం పెట్టే అష్టకష్టాలకు గురిఅవుతామని ఈ పార్టీకి భయంకూడా. నాకుకూడ ఈ మితవాదపార్టీయే నచ్చింది. వీరితో కలిసిపోయాను. అతివాద, మితవాదపార్టీలు రెంటినీ ఏకైక



విప్లవమూర్తి లాలాహర్దయాల్

పార్టీగా చేయదలచి హరదయాల్‌గారు, భాయి పరమానంద్‌గారు ఈ విద్యార్థులందరినీ సమావేశపరిచారు. ఈ సమావేశం నేను ఆ దేశం వెళ్లిన ఒకవారం రోజులకు జరిగింది. అంటే 1922 సం. డిసెంబరు చివరలో జరిగివుంటుంది.

ఆ సభలో హరదయాల్‌గారు ఉపన్యసించాడు. అలాంటి విప్లవ వీరవాక్కులను, ప్రతిభాశాలిని, నా జీవితంలో ఆరోజు వరకు చూళ్లేదు. ఆతని రాజకీయ వుపన్యాసం అనన్యమూ, అత్యద్భుతమూ అనిపించింది. బ్రిటిషు సామ్రాజ్యవిధానంలోని అమానుషకృత్యాలను అద్దంలోలాగు చూపెట్టాడు. ప్రపంచంలోని ప్రజాకోటికే అసలది ఎంత అరిష్టదాయకమో నిరూపించాడు. ఇట్లాంటి రాక్షస ప్రభుత్వాన్ని నాశనం చేయకపోతే అసలు మానవజాతే నాశనమైపోతుందన్నాడు.

"ప్రపంచ ప్రజానీకాన్నే బలిగొంటున్న బ్రిటిష్ సామ్రాజ్య విధానానికి మన భారతదేశమే ఆయువుపట్టు. ఈ ప్రభుత్వాన్ని కూలద్రోయాల్సిన విధి మనదే! విముక్తికై పురోగామిలోకం మనవైపే చూస్తున్న"దని ఉద్ఘాటించాడు. అట్లా ఖచ్చితంగా ఖండించే శక్తిగల నిశిత విమర్శకుణ్ణి, స్పష్టంగా కండ్లకు కట్టినట్లు రాజకీయాలను చిత్రించిన మరొక వ్యక్తిని అదివరలో నేను ఎరిగియుండలేదు.

"ఇట్టి పైశాచిక ప్రభుత్వాన్ని కూకటివ్రేళ్లతో పెకలించి పారవేయుటకు దేశభక్తులు, మానవాభ్యుదయాన్ని ఆకాంక్షించే మహాపురుషులు, మహావీరాధివీరులు కావాలి. ఈ కార్యాన్ని కొనసాగించడంకన్న ఉత్తమవిద్య, పవిత్ర లక్ష్యం, మతం వేరేలేదు. విద్యార్థులారా! వీరాధివీరులు కండి! దేశభక్తశిరోమణు లని పించుకోండి!" అని ప్రబోధించాడు. ఈ విప్లవవీరుని ప్రబోధం నాలో ఒక విచిత్రమైన ఉద్రేకాన్ని పురిగొల్పింది. నా జీవిత దృక్పధమే మారిపోయింది. అట్లాగే నా సహాధ్యాయులు, సహచరులైన కొందరిలోగూడా దేశభక్తి, త్యాగా లుద్భవించాయి.

మాలోకలిగిన ఈ పరిణామం మా ముఖాల్లో ప్రదర్శితమవడం జితేంద్రనాథ లాహిరీ అనే ఒక బెంగాలీ యువక పెరరిస్టు కని పెట్టాడు.

హరదయాల్ ఈ సమావేశంలోనే తన ఉపన్యాసంలో మతబోధకులను నిరసించి మాట్లాడాడు. స్వామీ వివేకానంద కొలంబో మొదలుకొని హరిద్వారంవరకు ఉపన్యసించిన ప్రసంగా లన్నింటిని చదివాననీ, ఆత్మ - పరమాత్మలు, ఇహలోక పరలోక ములనుగురించి మాట్లాడుటంటే అతిసులభమేగాని, బ్రిటిష్ సామ్రాజ్యాన్నిగురించి పల్లెత్తుమాట అనలేవనీ, అందువల్ల అతను పట్టి పిరికిపందయనీ దూషించసాగాడు. జితేంద్రనాథ లాహిరీ హరదయాళుయొక్క విమర్శను ముక్కలుముక్కలుగా ఖండిస్తూ "వివేకానంద అంతరంగిక సంభాషణలలో బ్రిటిషు సామ్రాజ్య తత్వాన్ని అతికఠినంగా ఖండించాడనీ, బెంగాలులో విద్యార్థులను, యువకులను, దేశభక్తులుగాను, మృత్యువును ఎదిరించి పోట్లాడే ధీరులుగాను చేసి దేశస్వాతంత్ర్య సంపాదనయే భారతీయ యువ కుల విద్యుక్తధర్మమని ప్రబోధం చేశాడనీ చెప్పి అప్పటి దుర్భర రాజకీయపరిస్థితులలో ఆయన ఎంతవరకు దేశవిముక్తికొరకు పాటుపడసాధ్యమో అంతవరకు చేశాడు. కాబట్టి ఆయన దేశ భక్త శిరోమణి, పరమత్యాగి, ధీరుడు, వీరుడేగాని పిరికిపంద కాదు" అని సమర్థించాడు. అంతేగాక, హరదయాళుని రాజకీయ ప్రవర్తనను లాహిరీ ఇట్లా విమర్శించాడు—"ఇండియాలో పోలీ సులబాధలు భరించలేక మాతృభూమిని వదలివేసి పరదేశాలకు పారిపోవటంవల్ల, బ్రిటిషుప్రభుత్వంవల్ల ఏలాంటి బాధలులేని అమె రికాలో ప్రశాంతంగా కూర్చొని బ్రిటిషుప్రభుత్వాన్ని ఖండించడం

వల్ల హరదయాళ్ పిరికిపందయని నిరూపించుకున్నాడు."
అందుకు హరదయాళు తానెన్నటికి పిరికిపంద కాలేదు — కానే రను అని నిరూపిస్తూ ఈ విధంగా సమాధాన మిచ్చాడు. "ఫ్రెంచి విప్లవానికి తరువాత వచ్చిన గొప్ప విప్లవం ఇటలీ స్వాతంత్ర్య విప్లవం. ఇటలీదేశ స్వాతంత్ర్యపోరాటాన్ని స్వదేశం లోనే వుండి జరపడానికి వీలుపడదని గ్రహించిన ఇటలీ దేశ భక్తశిరోమణి 'మాజినీ' విదేశాలకువెళ్ళి అక్కడి ఇటలీ దేశస్థు లను దేశభక్తులయ్యేట్లు ప్రబోధించాడు వారిని సంఘటితపరచి సైన్యాన్ని చేకూర్చుకున్నాడు. ఇటలీలో స్వాతంత్ర్యాన్ని నెల కొల్పాడు. ఈవిప్లవపాఠాన్నే చైనా దేశభక్తుడు 'సన్‌యట్‌సేన్' తన దేశవిముక్తి విషయంలో ఉపయోగించుకొని కృతకృత్యుడయ్యాడు. నా దేశవిముక్తికై ఈ లోకైక దేశభక్తుల, విప్లవనాయకుల అడుగు జాడలనే నేనూ అనుసరిస్తూ విదేశాలకువచ్చాను"అని చెప్పాడు.

హరదయాళుని ఆలోచనలో పొరపాటువుంటే వుండ వచ్చును, కాని ఆయన దేశభక్తుడు, త్యాగి, విప్లవయోధుడు నని విద్యార్థులలో సంపూర్ణవిశ్వాసం ఏర్పడింది. అదేవిధంగా స్వామీ వివేకానంద దేశభక్తుడని తీర్మానించుకొంటిమి. జితేంద్రనాథలాహిరీ సామాన్య విద్యార్థికాడని, నివురుకప్పిననిప్పు అని భావించాము.

## జితేంద్రనాథ లాహిరీ

హరదయాళు చెప్పిన సమాధానానికి లాహిరీ ఈలాగున ప్రశ్నలవర్షం కురిపించాడు—"మీరు విదేశపర్యటనం ప్రారం భించి ఐదారు సంవత్సరాలైంది. మీ ఆదర్శ విప్లవనాయకులు మాజినీ, సన్‌యట్‌సేనులలాగు దేశస్వాతంత్ర్యంకొరకు విదేశాల్లో

మీ రేమిచేశారు ? * అనార్కిజం స్వచ్ఛందప్రేమ, తత్వశాస్త్ర గుణగణవిచక్షణలు (Comparative Philosophy) మొదలైన వాటిని అమెరికనులకు బోధించుటవల్ల మనకు స్వతంత్రం లభిస్తుం దనుకున్నారా ? అమెరికాలో రమారమి 15000 మంది పంజాబీ వ్యవసాయకూలీలు వున్నారుకదా ? వారిలో అనేకులు బ్రిటిషు సేనల్లోవుండి యుద్ధాలు చేసిన యోధులేకదా ? అట్లాగే ఇండియాకు వెలుపలిదేశాల్లో లక్షలాదిగా భారతీయులు, ముఖ్యంగా సిక్కులు వున్నారన్నవిషయం మీ రెరింగినదే! దేశస్వాతంత్ర్యంకొరకు వీరిలో విప్లవప్రబోధం ఎందుకుచెయ్యలేదు ? 1857 సం॥లో జరిగిన స్వాతంత్ర్యపోరాటం (గదర్ అనగా సాయుధ సైనికతిరుగుబాటు) విచ్ఛిన్నంకావటానికి కారణం తెలుసుకోలేకపోయారా? అప్పుడు పంజాబీసైన్యం బ్రిటిషు ప్రభుత్వానికి సహాయం చెయ్యకపోతే, మనకీపాటికి స్వాతంత్ర్యం వచ్చివుండేదికదా ? రాబోయే స్వాతంత్ర్య సమరంలో పంజాబీయులు పాల్గొనకపోతే మరల పరాజయం తప్పదుగదా ! ఈ ప్రమాదకరమైన పొరపాటును అత్యవసరంగా సరిదిద్దుకోవాలన్నమాట మరచారా ? వీరందరిని సంఘటితపరచి ఒక విప్లవ నిర్మాణకార్యక్రమానికి ఎందుకు తల పెట్టలేదు ? కనీసం వారి కొరక విప్లవప్రబోధంచేసే పత్రికనైనా

---

* అనార్కిజం (Anarcism) అనగా తెలుగు నిఘంటువులలో "అరాచక వాదము" "అనాయకత్వము" అని వ్రాశారు. దానికి వ్యుత్పత్తి అర్థము - రాజు లేక ప్రభుత్వములేని సంఘము. అలాటి సంఘములో ప్రతివ్యక్తి తనవిధిని, ఏలాంటి నిర్బంధము లేకుండా నెరవేరుస్తాడు.

ఫ్రీలవ్ (Free love) అనగా స్వేచ్ఛాప్రేమ అని వ్రాస్తారు: అనార్కిజంలో "స్వచ్ఛందప్రేమ" అంటారు.

ఇంతవరకు ఎందుకు ప్రకటించలేదు ? ఈ ఉద్యమానికి మీకంటే తగినవారెవరు ?"

కఠినంగావున్న లాహిరీగారి విమర్శలో నిర్మాణయుక్తమైన కార్యక్రమం గర్భితమైయున్నదన్న విషయాన్ని హరదయాళు గ్రహించాడు. లాహిరీని చాల మెచ్చుకున్నాడు.

విప్లవ సంకల్పం

హరదయాళులో లాహిరీ ప్రబోధంవల్ల ప్రబలమైన నూతన నిర్మాణశక్తి వికసించింది. వెంటనే కార్యాచరణకు ఉద్యుక్తుడయ్యాడు. అమెరికాలో వున్న పంజాబీయులకు మీటింగులు, కాన్ఫరెన్సులను పెట్టాడు; విప్లవాత్మకమైన ఉపన్యాసాలను ప్రారంభించాడు. వారిని సంఘటిత పరిచాడు. వీరి ఉపన్యాసధోరణే మారిపోయింది. ఒక నూతన విప్లవచైతన్యం తొణికిసలాడ సాగింది. ఫలితం—పంజాబీయులలో - ముఖ్యంగా సిక్కులు ఈయన ఉద్బోధవల్ల ఉత్సాహపూరితు లయ్యారు. వేలకొలదిగా సభలకు వచ్చేవారు. వీరిని ఆహ్వానించి తీసుకెళ్లేవారు. కార్యక్రమ మేమని అడిగేవారు.

అమెరికాలో ప్రతి పంజాబీ కార్మికుడు నెలకు షుమారు రు 300 లు సంపాయించుకొనేవాడు. కాబట్టి, విప్లవపత్రిక నొకదాన్ని స్థాపించాలనగానే వేలకొద్దీ డబ్బు వసూలుకాజొచ్చింది. పత్రికపేరు నిర్ణయించవలసి వచ్చింది. "రాబోవు స్వాతంత్ర్య సమరంలో భారతసైన్య సహాయం అత్యవసరం. ఈ మహత్కార్యాన్ని పంజాబీయులమగు మనం మాత్రమే నెరవేర్చగలం. గత 1857 సం॥లో జరిగిన "గదరు" (సిపాయీల తిరుగుబాటు)లో పంజాబీయుల సహాయం లేనందుచేతనే పరాజితుల

మయ్యాము. యీపర్యాయం మనం గదరును జయప్రదంగా సాగి స్తాం ! విజయం చేకూరుస్తామనే ప్రతిజ్ఞచేద్దాం ! మన విప్లవపార్టీ పేరు 'గదర్'పార్టీ. మన పత్రికపేరు'గదర్'. మనం సాధించాల్సి నది భారతదేశస్వాతంత్ర్యం అని హరదయాళ్ ఉద్ఘాటించాడు.సమా వేశానికేతెంచిన వేలకొలది పంజాబీల ఉత్సాహానికి అంతులేదు. హర్షధ్వానులతో ఆమోదించి అంగీకరించుటేగాక కనకవర్షం కురి పించారు. ఈవిధంగా 1913 సంవత్సరారంభములో "గదర్‌పార్టీ" పుట్టింది. గదర్ పార్టీ కేంద్రకార్యాలయం సేన్‌ఫ్రాన్సిస్కో నగ రములో స్థాపించబడినది.గదర్ పత్రికకూడా కేంద్రస్థానంనుంచే ప్రకటింపబడింది.

అది స్థాపింపబడినవెంటనే పంజాబీలు అనేకులు వాలం టీర్లుగా పనిచేయటానికివచ్చారు. అలా వచ్చినవారే పృథ్వీసింగ్, సోహన్‌సింగ్‌భాక్‌నా మొదలగు గదరు బాబాలు వీరు భారతస్వాతం త్ర్యోద్యమంలో ఎంత ప్రముఖపాత్ర వహించినదీ భారతీయులకు తెలిసినవిషయమే.

ప్రపంచంలోని వివిధదేశాలలో కోరినవారందరికి గదర్ పత్రికను ఉచితంగా పంపుతూవచ్చాము.విరాళాలు విస్తారంగా రా సాగాయి.

అప్పట్లో భారతస్వాతంత్ర్య సంపాదనకు నిర్మాణయుక్త మైన ఒక కార్యక్రమాన్ని నిర్మించుకొన్నాము.పంజాబీయులకు సైనికవృత్తి వందలకొద్దీ ఏండ్లనుండి పరిపాటి అయిపోయింది, అమెరికాలో కూలిచేసుకొని జీవించుతున్న పంజాబీయులుకూడా సామాన్యంగా బ్రిటిషుసైన్యంలో ఉద్యోగాలుచేసి యుద్ధాలకు అలవాటుపడ్డవారే. వీరి బంధుమిత్రు లెందరో సైన్యంలో ఉన్నారు.

కాబట్టి వీరు 1857 సం॥లో వలెనే సైన్యంలో చేరి ఇప్పుడు మళ్లీ తిరుగుబాటు తెస్తామన్నారు. మొదటి సైనిక విప్లవాన్ని (1857 సం) ఎదిరించి యుద్ధం చేసిన బ్రిటిష్ సేనలలో తమ తాత ముత్తాతలున్నారని, బ్రిటిష్ సామ్రాజ్యానికి తోడ్పడ్డారని విచారపడ్డారు. తమ పూర్వీకులు అజ్ఞానంతో చేసిన మహాపరాధాన్ని, కళంకాన్ని తుడిచివేయటానికి, మాతృదేశ విముక్తికొఱకు పాటు పడడానికి వారు సిద్ధపడ్డారు.

ఎత్తుగడలు - చర్చలు

ఆదిలోనే ఒకేపర్యాయం ఆసేతు హిమాచలపర్యతం జయించటం సాధ్యంకాదు. సమతల ప్రదేశాలనుండిగాని, తీర ప్రాంతాలనుండిగాని, బ్రిటిష్ ప్రభుత్వాన్ని తరిమివేయటం దుస్సాధ్యం; కాని పర్వత ప్రదేశాలనుండి సాధ్యమవుతుంది. పర్వత ప్రదేశాలగు కాశ్మీర్‌నుండిగాని, పశ్చిమోత్తర పరగణాల (North - west Frontier) నుండిగాని మొట్టమొదట బ్రిటిష్ ప్రభుత్వాన్ని తరిమివేసి, అక్కడ రిపబ్లిక్కును (ప్రజాప్రభుత్వాన్ని) స్థాపించుకోవాలి. అంటే ఐరోపాఖండంలోని స్విట్జరులాండులాగా, క్రమేణా పంజాబు, యు. పి. మొదలగు రాష్ట్రాలను జయించుకొంటూ, యావద్భారతదేశాన్ని జయించుకోవాలి; ప్రజాప్రభుత్వాన్ని స్థాపించుకోవాలని మేము నిర్ణయించుకొన్నాం.

ప్రథమంలో కాశ్మీర్‌లో ప్రారంభించాలని కొందరు, పశ్చిమోత్తర పరగణాలలోనని మరికొందరు వాదోపవాదాలు జరిపారు. చివరకు కాశ్మీర్‌లో ప్రారంభించాలని తీర్మానించుకొన్నాము. కారణం ఏమంటే- కాశ్మీర్‌దేశంలో జమీందారీ ప్రభుత్వం వుంది. అక్కడి రాజులు, జమీందారులు, బ్యాంకర్లు,

విద్యావంతులు, పాలకవర్గము హిందువులే; వీరు చాలా కొద్ది మంది. ప్రజలేమో మహమ్మదీయులు: వారు రైతులు మొదలగు నిరక్షరకుక్షులు; కడు బీదలు. పాలక పాలితుల మధ్య పొత్తు ఎంతమాత్రం లేదు. ఇలాంటి పరిస్థితులుగల కాశ్మీరంలోని ప్రజలలో తిరుగుబాటు తీసుకొనిరావటం సులభసాధ్యమని మేము నిశ్చయించుకొన్నాము. 1925 సం॥లోగా కాశ్మీరులో రిపబ్లిక్కును స్థాపించాలని మా సంకల్పం ఒక పెద్ద ఇండియా మ్యాపును గోడకు తగిలించాము. కాశ్మీరు సరిహద్దులను ఎఱ్ఱసిరాతో చక్కగా కనబడేలాగు గీచి, '1925 సం॥లోగా కాశ్మీర్ రిపబ్లిక్' అని అందరి దృష్టిని ఆకర్షించేలాగా వ్రాశాము. ఇలాంటి గొప్ప కార్యాలలో నేను కూడా కలిసి చేస్తున్నాకదా అని గర్వపడేవాడిని.

సాధారణంగా ప్రజానీకం మాట్లాడే వాడుక భాషల్లో- అంటే పంజాబి, ఉరుదూ, గురుముఖి భాషల్లో గదర్ పత్రికను ప్రచురించాము. బ్రిటిష్ సామ్రాజ్య తత్వాన్ని బహుకఠినంగా ఖండిస్తూ తిడుతూ వ్రాసేవాళ్లం. పంజాబీ కార్మికులు చదువరులుకారు; గాని, దేశభక్తివల్ల కలిగిన చైతన్యంతో పాటలూ, పద్యాలూ అల్లి పత్రికకు పంపేవారు. తత్ఫలితంగా వారికి సాహిత్యంలో అభిరుచి కలిగి కవిత్వం చెప్పడం, వ్రాయడం వచ్చింది. వారి వాడుక భాషలో కొన్ని అసభ్యమైన మాటలుండేవి. అయినా ఆ భాషే వారికి నచ్చేది; హృదయాలకు హత్తుకపొయ్యేది. అసలు అక్షరజ్ఞానంలేని వారెందరో చివరకు రచయిత లయ్యారు; స్వాతంత్ర్యోద్యమనిర్మాత లయ్యారు.

గదర్ పత్రికలు అనేక దేశాలకు పంపబడ్డవి. దేశభక్తి, ఉత్సాహాలు నానాటికి పెరిగిపోతూవచ్చాయి. వీటితోపాటు బ్రిటిష

ప్రభుత్వంయొక్క ఆగ్రహంకూడా గదర్ పార్టీమీద కసితీర్చుకో టానికి ఎన్నో మాయోపాయాలు, కుట్రలు, పన్నడం మొదలెట్టింది ప్రభుత్వం. అమెరికా ప్రభుత్వంమీదకూడా బ్రిటిష్ ప్రభుత్వం ఒత్తిడి తెచ్చింది. గదర్ పార్టీని స్థాపించిన ఒక సంవత్సరానికే హరదయాళుని అమెరికానుండి తరిమివేయించారు.

## లాలా హరదయాళ్

గదర్ పార్టీని స్థాపించిన విప్లవనాయకుడు హరదయాళుని గురించి కొన్ని వివరాలు వ్రాయటం అవసరం. హరదయాళు జన్మస్థానం ఢిల్లీ. పంజాబు యూనివర్సిటీలో యమ్. ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. యూనివర్సిటీ ప్రతి పరీక్షలోను ఈ ప్రతిభా శాలికి అత్యధికంగా మార్కులు వచ్చేవి. ఎమ్. ఏ.లో అప్పటి వరకూ ఎవరికీ రానన్ని మార్కులతో ఉత్తీర్ణుడయ్యాడు. ప్రతి సబ్జక్టులోను సాటిలేనివా డనిపించుకున్నాడు. ముఖ్యంగా కొన్ని కళలలో, శాస్త్రములలో (Subjects) ఆయనకు వచ్చినన్ని అత్యధిక మార్కులు అంతవరకూ ఎవరికీ రాలేదని పంజాబీయులం టారు. సునిశిత మేధావి. ఇలాంటి ప్రతిభాశాలులను బ్రిటిష్ ప్రభుత్వం తమ బుట్టలో వేసుకోటానికి విద్యార్థి వేతనాలను ధారాళంగా యిచ్చి, ఇంగ్లాండుకు ఐ. సి. యస్. చదవటానికి పంపుతుండేది. కాని హర్దయాళ్ విషయంలో ప్రభుత్వయత్నం ఫలించలా. ఆయన బ్రిటిష్ సామ్రాజ్యానికి తొత్తు అవటానికి బదులు శత్రువయ్యాడు; విప్లవ నాయకుడయ్యాడు. ఈయనలో మార్పు కలగడానికి కారకుడు శ్రీ శ్యాంజీ కృష్ణవర్మగారు.

## శ్యాంజీ కృష్ణవర్మ

శ్రీ శ్యామ్‌జీ కృష్ణవర్మగారు జయపూరు, ఉదయపూరు మొదలైన రాజపుత్ర సంస్థానాలో దివానుగిరి చేశాడు. 1857సం॥ స్వాతంత్ర్య యుద్ధం విఫలమైన తర్వాతకూడ స్వాతంత్ర్యప్రియులు కొందరు మాతృదేశ విముక్తికై స్వాతంత్ర్యజ్వాలలను రగుల్చుతూనే వచ్చారు. అట్టి దేశభక్తుల్లో వర్మగా రొకరు. తన ఉద్యమానికి అనేక ప్రతిబంధకా లుండడంచేత ఇటలీ దేశభక్తుడు—మాజినీ లాగా విదేశాలకు వెళ్లి తన ఉద్యమాన్ని ప్రారంభించాడు. తన లక్షల ద్రవ్యాన్ని వెంటతీనుకొని యూరపుకు వెళ్లాడు. ఇంగ్లాండులో "ఇండియన్ సోషియాలజిష్టు" అనే ఒక విప్లవ పత్రికను స్థాపించాడు. "మేడమ్ కామా" అనే పార్శీ మహిళ వర్మగారి వలెనే మాతృభూమిని, కుటుంబాన్ని వదలి, భారత స్వాతంత్ర్యం కోసం ఈయనతో కలసి పాటుబడుతూ వచ్చింది. 1900 సం॥ ప్రాంతంలో ఇంగ్లాండులో వేలకొలది భారతవిద్యార్థులు ఉన్నత విద్య నభ్యసించుతుండేవారు. ఈ విద్యార్థుల్లో వర్మగారు తమ విప్లవ ప్రచారాన్ని సాగించారు. వీరి ప్రబోధ ప్రభావంవల్ల విప్లవోద్యమంలో ముఖ్యంగా ప్రతిభాశాలులైన నలుగురు విద్యార్థులు చేరారు. వారు బెంగాలు విద్యార్థి అరవింద ఘోష్, మహారాష్ట్రవిద్యార్థి వి. డి. సావర్కార్,పంజాబు విద్యార్థి లాలా హరదయాళ్,మదరాసు విద్యార్థి శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగార్లు. రెడ్డిగారు తప్ప తక్కినముగ్గురూ భారతదేశ విప్లవోద్యమంలో ప్రముఖపాత్రను వహించినవారే.

హరదయాళులో వర్మ ప్రబోధంవల్ల దేశభక్తి, త్యాగాలు వికసించసాగినై.తన విద్యార్థివేతనమును ఐ. సి. యస్. చదువును

హరదయాళు ఒక్కసారిగా పరిత్యజించివేశాడు.స్కాలరుషిప్పును నిరాకరిస్తూ ప్రభుత్వానికి వ్రాసిన ఉత్తరాన్ని పార్లమెంటులో చదివారు.దానిసారాంశం ఇది: "అర్ధాకలితో అటమటించిపోతున్న నా రయితు రక్తమాంసాలతో నిర్మించబడ్డ ఈ బ్రిటిషు సామ్రాజ్యానికి తొత్తునై దానికి నేను చదువవలెనా ? పీడితులైన నా రైతుసోదరులను శాశ్వత దాస్యానికి గురిచేయవలసిందేనా ? నే నెన్నటికి అట్లాచెయ్యను. బ్రిటిషు సామ్రాజ్య విషవృక్షాన్ని నా పవిత్ర మాతృక్షేత్రంనుంచి కూకటివ్రేళ్లతో పెకలిస్తాను.భారత స్వాతంత్ర్య సంస్థాపనకంటే నా జీవితపరమావధి మరొకటిలేదు. ఇదే నా జన్మసాఫల్యం !"

హరదయాళు ఇంగ్లాడునుండి ఇండియాకు వచ్చేశాడు. మోడరన్ రివ్యూలో అనేక వ్యాసాలు వ్రాశేవాడు.అందులో అతి ముఖ్యమైన వ్యాసం "ఇండియాను సాంఘికంగా జయించడం" (Social Conquest of India) ఈ వ్యాసాన్ని ఇండియా ప్రభుత్వం నిషేధించింది.ఈ వ్యాసంయొక్క సారాంశం :—

ఒకదేశాన్ని మరొకదేశం కత్తిబట్టి పశుబలంతో జయించి ప్రజలను బానిసలుగా చేసుకొనుట సులభమే. కాని, కలకాలం కత్తితో పరిపాలన సాగించడం కల్ల. ఒకజాతిని మరొకజాతి ఆజన్మదాసులుగా చేసుకోవాలంటే, వారిని ఆధ్యాత్మికంగా, నైతికంగా, వైజ్ఞానికంగా వశపరచుకోవాలి.అందుచేతనే బ్రిటిష్ ప్రభుత్వం క్రైస్తవమతప్రచారాన్ని శక్తిసంపన్నలేకుండా సాగించింది. గురుపదవిని పొందటానికి ప్రయత్నించింది.మన దేశభాషలను, సాంప్రదాయాలను, విజ్ఞానాన్ని విచ్ఛిన్నపరుస్తున్నది.ఈవిధంగానే పూర్వం ఆర్యులు ప్రస్తుతం పంచములనబడే ఆదిమవాసులను

మతవిషయికంగాను,ఆధ్యాత్మికంగాను జయించినందువల్లనే వారిని అజన్మదాసులుగాచేసుకోగలిగారు.ఆర్యులు అనార్యులకు ఏనాడు మతగురువులయ్యారో ఆనాడే వారి పరిపాలనకు కత్తితో అవసరం లేకుండా స్థిరపడిపోయింది.అయితే, ఆంగ్లేయులు వివిధసంస్థలలో పెత్తనాన్ని స్థాపించుకొని నాయకు లయినప్పటికీ,భారతీయులమీద ఆధ్యాత్మిక యాజమాన్యాన్ని మాత్రం సంపాదించి గురుపదవిని పొందలేకపోయారు.పైన చెప్పినట్లు క్రైస్తవమతప్రచారం ప్రబలంగా సాగించినప్పటికీ, వారి ప్రయత్నం నెరవేరలేదు.కారణం మనం మతవిషయికంగాను, తత్వశాస్త్రజ్ఞానంలోను క్రైస్తవులకంటె అధికంగా అభివృద్ధిచెంది వుండడమే.కాబట్టి వా రా ప్రయత్నంలో విఫలులయ్యారు. అందుచేత వీరు మరొక ఎత్తుగడవేశారు.హిందూమతమే తక్కినమతములకన్న కడుశ్రేష్ఠమని పొగడుతూ హిందూమతసంస్థలకు గురువులగుటకు అనిబిసెంటు, లెడ్‌బీటర్లలాగా ప్రయత్నిస్తున్నారు.పాలకులే మతగురువులైతే వారి పాలన శాశ్వతంగా, నిరాటంకంగా సాగిపోతుంది.కత్తితో పని వుండదు.కాబట్టి వారి ఎత్తుగడలను ఎంతమాత్రం కూడ సాగనివ్వకండి ! జాగ్రత!" ఇలాంటి వ్యాసాలను హరదయాల్ వ్రాస్తూ వచ్చారు.వివిధ వేదికలపై ఉపన్యసిస్తూవచ్చారు.

బ్రిటిష్‌ప్రభుత్వ నిర్బంధం.

ఈవిధంగా హరదయాల్ రాజకీయ విప్లవప్రబోధాలను సాగిస్తుంటే ఇండియా ప్రభుత్వానికి కన్నుకుట్టింది. ఆకాలంలోనే అరవింద ఘోష్‌గారు బెంగాలులో విప్లవం ప్రారంభించారు. భారతదేశమంతటా ఎందరో దేశభక్తులు జైళ్ళపాలయ్యారు.హరదయాళు పోలీసుబాధలకు గురిఅయ్యాడు.ప్రభుత్వబాధలను పడ

లేక ఇటలీ దేశభక్తుడు మాజినీలాగా విదేశాలకు వెళ్లిపోయాడు. ఇండియా స్వాతంత్ర్యసమరాన్ని మాజినీవలె విదేశాల్లో వుండి సాగించవచ్చని ఆయన భావం. మొదట ఇంగ్లాండుకు వెళ్ళాడు. కాని బ్రిటిష్‌ప్రభుత్వం అక్కడినుంచి తరిమివేసింది. రష్యా విప్లవయోధుడు - ప్రిన్స్ క్రోపాట్కిన్‌లాగా దేశదేశాలుతిరుగుతూ అక్కడి ప్రజల కష్టనిష్ఠూరాల నివారణార్థం ప్రయత్నాలు సాగిస్తూ, ఆయా ప్రభుత్వాలచే తరిమివేయబడి చిట్టచివరకు అమెరికాచేరుకున్నాడు *

అమెరికాలో హరదయాళ్ వివిధదేశాల స్వాతంత్ర్యోద్యమచరిత్రలను, గొప్ప రాజకీయవేత్తల, అర్ధశాస్త్రజ్ఞుల రచనలను చదువసాగాడు. "కారల్ మార్క్స్-అభినవ ఋషి" (Karl marx-the modern rishi) అనే వ్యాసాన్ని మాడరన్ రెవ్యూలో 1910సం॥ప్రాంతంలో వ్రాశాడు. కాలిఫోర్నియా రాష్ట్రంలో స్టాన్ ఫర్డు యూనివర్సిటీలో అనార్కిజాన్నిగూర్చి బోధించుతూ తత్వశాస్త్రాలన్నిటిలోను దానికంటె శ్రేష్ఠమైనదిలేదని నిష్కర్షగా వాదిస్తూవచ్చారు. తత్ఫలితంగా అక్కడకూడ ఉద్యోగానికి ఉద్వాసం జరిగింది.

* [గడచిన 150 సం॥లలో మూడు గొప్ప ఆదర్శ విప్లవాలు జరిగాయి. మొదటిది ఫ్రాంసులో షుమారు 1790॥లో జరిగింది. అటుతరువాత విప్లవాలకు, విప్లవకారులకు అదే ఆదర్శమైనది. రెండవది ఇటలీలో 1850సం॥ప్రాంతంలో జరిగింది. అప్పటినుండి జరిగిన విప్లవాలకు ఇటలీ-ముఖ్యంగా మాజినీ ఆదర్శమూర్తి అయ్యాడు. మూడవది రష్యాలో 1917 లో జరిగిన విప్లవం. అప్పటినుండి ఏదేశంలో విప్లవంజరిగినా రషియా విప్లవఛాయలు కనుపడుతున్నవి. కాబట్టి హర్‌దయాల్, అరవింద, సన్‌యట్ సేన్‌గార్లకు మాజినీ మార్గదర్శకుడయ్యాడు.

## వివిధదేశాల విప్లవకారులు

ఆ కాలంలో వివిధదేశాలకు సంబంధించిన విప్లవ సంఘాలు సేన్‌ఫ్రాన్సిస్కోలో వుండేవి. అంటే రష్యా, ఐర్లండు టర్కీ, ఈజిప్టు, స్పెయిన్, చైనా, జపాన్ మొదలైన అనేక దేశాల విప్లవసంఘాలు వీటన్నిటిలోను హరదయాల్‌ది ప్రముఖ పాత్ర.అప్పుడే (1913సం.) గదర్ పార్టీని స్థాపించాడు.ఆయన ఇంగ్లీషు,ఫ్రెంచి,సంస్కృతము,ఉర్దూ,పర్షియన్ భాషలలో గొప్ప పండితుడు,ఉపన్యాసకుడు,రచయితాను.ఆయా దేశాల్లో విప్లవనాయకులు ప్రచ్ఛన్నంగావుండి,వారి వారి స్వాతంత్ర్యోద్యమాలను ఏ విధంగా నడుపుతున్నారో ఆయా దేశాల నాయకులచే మాకు ఉపన్యాసా లిప్పించేవాడు.వీరిలో రష్యన్ విప్లవనాయకులుకూడా ఉండేవారు.బ్రిటిష్ ప్రభుత్వం భారతీయవిప్లవనాయకులను దేశాంతరశిక్ష విధించి అండమాన్ దీవులకు పంపుతున్నట్టే,అప్పట్లో రషియా విప్లవకారులను ఏడాదిపొడుగునా మంచుమయమైవుండే సైబీరియాకు రష్యన్ జారుప్రభుత్వం పంపుతూండేది.సైబీరియా నుంచి తప్పించుకొని అమెరికాకువచ్చిన వీరులు వారు.ట్రాట్స్కీ అనే రష్యన్ విప్లవనాయకుడుకూడ మా గదర్‌పార్టీ సమావేశాల్లో ఉపన్యసించారు.అప్పట్లో ఆయన అంతగా ప్రసిద్ధిచెందలా.పూల అంగడి పెట్టుకొని జీవిస్తూ తన మాతృభాషలో ఒక విప్లవపత్రికను నడుపుతూండేవాడు*

---

* ఈవిధంగా వివిధదేశాల విప్లవవీరులవల్ల స్వాతంత్ర్యోద్యమాలను గురించీ,వారి సాహసకార్యములనుగురించీ వినుటవల్ల మేముకూడ అలాంటి మానవాభ్యుదయోద్యమాలలో కలసి పనిచేస్తున్నామని గర్వపడుతూండే వాళ్ళం.మాలో ఉత్సాహము,త్యాగము అభివృద్ధిఅవుతూవచ్చాయి.

## గదర్ పార్టీ సన్నాహం

హరదయాళని గొప్పవాడనడానికి అనేక ముఖ్యకారణా లున్నై. ఆయన పదేపదే ఆలోచించుకొని స్థిరపరచుకొన్న ఆదర్శాలను ఆచరణలో పెట్టేవాడు ఇతరులకు బోధించినప్రకారం ఆచరించేవాడు. నిరాడంబరజీవి. ఉన్నతాదర్శాలు. ఋజు ప్రవర్తనగల తత్వవేత్త. ఈ విప్లవయోధునిచే మేమందరం ఆకర్షింపబడేవాళ్ళం. "గదర్ పార్టీ వీరులు" అనే పుస్తకంలో అభిమన్యులాంటి అసమాన వీరులైన కర్తార్ సింగ్, కేదార్ నాథ్ మొదలగువారినిగురించి చదివే వుంటారు. వీరు లాహోర్ కుట్రకేసులో ఉరితీయబడ్డారు వీరు విద్యార్థిరంగంలోనుంచి వచ్చిన హరదయాళని శిష్యకోటిలోని ముఖ్యులు.

గదర్ పార్టీ పత్రిక దేశదేశాలకు పాకిపోయింది. ద్రవ్య సహాయం విస్తారంగా రాసాగింది. ఆర్థికబాధలు లేవు. జనసహాయం, వాలంటీర్లసహాయం విస్తారంగా ఏర్పడసాగింది. అనేకులు వచ్చి పని చేయసాగారు. అనేక దేశాల్లో అనేకచోట్ల స్థానిక గదర్ పార్టీ ఆఫీసులుఏర్పడినై. పార్టీ రెపరెపా పెరిగిపోతోంది. బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వానికి ఆయువుపట్టైన పంజాబీసేనలో గదర్ ప్రచారం ప్రారంభమైంది. మన విదేశపాలకులగుండెలు దడదడ కొట్టుకోసాగాయి.

## హర్దయాళ్ అరెస్టు - అలజడి

ఇక ఊరుకోలేక బ్రిటిష్‌ప్రభుత్వం తన కుట్రలుప్రారంభించినది. కాలిఫోర్నియా రాష్ట్రంలోని శాసనసభ్యులను, ఉన్నతో



కర్తార్ సింగ్

ద్యోగులను డబ్బు వెదజల్లి కొనివేసింది. చివరకు హరదయాళు మీద కేసు బనాయించి అరెష్టు చేయించింది.

హరదయాళుని తక్షణమే విడుదలచేయమని అమెరికా కాలేజీల ప్రొఫెసర్లు, పత్రికాసంపాదకులు, మేధావులు, తత్వశాస్త్రజ్ఞులు, విద్యార్థులు మొదలగు అభ్యుదయవాదులు అతిఆగ్రహంతో ఆందోళనచేయసాగారు. ఒక ఐరిష్ విప్లవవీరరమణి రు. 35000/- జామీనిచ్చి హరదయాళుని విడుదలచేయించింది.

అప్పట్లో అమెరికాకు వుడ్‌రో విల్సన్ ప్రెసిడెంటు. హరదయాళుమీద పెట్టిన కేసు ఆయనకు సుతరాము ఇష్టంలేదు. ఆయన అంతరంగిక కార్యదర్శి విలియమ్ జన్నింగ్సు బ్రయన్ గారికికూడా యిష్టంలేదు.

## బ్రిటన్ అమెరికాలమధ్య పోటీ

అప్పటికే (1914సం.) ఇంగ్లాండు అమెరికాలమధ్య వ్యాపారపోటీ ప్రపంచమంతటా వ్యాపించినది. ఇంగ్లాండును ప్రపంచంలో అగ్రస్థానాన్నుంచి తొలగించి, ఆస్థానాన్ని అమెరికా ఆక్రమించాలని ప్రయత్నించుచుండిన పార్టీలో బ్రయను ముఖ్యుడు. ఇండియాకు వచ్చి పరిస్థితులను పరిశీలించి బ్రిటిష్‌ప్రభుత్వాన్ని తీవ్రంగా ఖండిస్తూ ఒక పుస్తకాన్ని బ్రయన్ వ్రాశాడు. దానివల్ల నశించిన ప్రజాదరణను తిరిగి సంపాయించగోరి, బ్రిటను అమెరికా మాజీ ప్రెసిడెంటు ఫ్రెడరిక్ రూజువెలును తమదేశానికి రప్పించి, తమ సామ్రాజ్యరాజనీతిని పొగిడేలాగా ప్రోత్సాహపరిచింది.

హర్దయాళ్‌పై అమెరికా బహిష్కారం

అమెరికా ప్రెసిడెంటు, ప్రయివేటు సెక్రెటరీ—ఇద్దరూ హరదయాళు కేసును తొలగించడానికి శాయశక్తులా పాటుపడ్డారు. కాని, అమెరికా ప్రభుత్వనిర్మాణచట్టం అనుకూలించలేదు. అమెరికా సంయుక్తరాష్ట్రాలలో ప్రతిరాష్ట్రానికి స్వపరిపాలన (autonomy) అత్యధికంగా వుంటుంది. హరదయాళు కేసులో చట్టప్రకారం కేంద్రప్రభుత్వం జోక్యంకలుగజేసికోజాలదు. అందువల్ల హరదయాళును అమెరికాను వదలివెళ్లమని సలహా యిచ్చారు. ఆయన్ను మార్గంమధ్యలో అడ్డుపెట్టవద్దని రహస్యంగా వివిధరాష్ట్రాల అధికారులకు సలహా యిచ్చారు. అందువల్ల హరదయాళ స్విడ్జర్‌లాండుకు వెళ్ళారు.

ప్రథమ ప్రపంచసంగ్రామం ప్రారంభమైనవెంటనే హరదయాళ్ జర్మనీ, టర్కీలతో కలసి ఇంగ్లాండుపై పోట్లాడాడు అటు తరువాత స్వీడనులో సర్వకళాశాలలో ప్రొఫెసరుగా చేరాడు. ఆయన్ను మాతృభూమికి రప్పించుటకు చేయబడిన కాంగ్రెసు నాయకుల ప్రయత్నాలు నెరవేరలేదు. లండనులో నివసించుటకు మాత్రమే మన విదేశీప్రభువులు అంగీకరించారు. కొద్ది వారాలలో లండనులో హరదయాళ్ చనిపోయారు.

నా జీవిత దృక్పథంలో కొందరు మహనీయులు మార్పులను తేగలిగారు. వారందరిలోను హరదయాళు నా మాతృదేశ స్వాతంత్ర్యోద్యమానికి ప్రాణత్యాగము సైతం చేయుటకు సంకల్పించుకొనేలాగు నన్ను మార్చివేసిరి. నాలాగే వేనవేలమంది ఆయనప్రభావంవల్ల మారిపోయారు. గదరు ఉద్యమంలో ఎందరో ఉరికంబాలెక్కారు; తుపాకి కాల్పులకు రొమ్మువిరిచి నిలబడ్డారు;

అండమానులో నిరహారదీక్షలో మరణించారు. హరదయాళుఅద్భుత శక్తిని విపులంగా వ్రాయగలశక్తి నాకు లేదు*

---

* హరదయాళుని గొప్పతనాన్ని గురించి కొన్ని నా అనుభవంలో తెలిసిన విషయాలు.

1. తన బట్టలమీద శ్రద్ధపెట్టుకోడు. తన ఓవరు కోటు చాలా పాతది. క్రొత్తది కొనవలసిందని ఎంతో చెప్పితిమి. వినిపించుకోలేదు. కోటును దాచిపెట్టాము. కొద్ది రోజులకు ఒక పాతకోటు వేసుకొని వచ్చి "చూడండి! మంచికోటు! చౌకగా కొన్నాను" అన్నాడు. చూచాము - ఏన్నోరంధ్రాలు ఉన్నై. ఎంత చెప్పినా ఉపయోగముండదని బట్టల విషయంలో చెప్పడం మానేశాము.

2. మరొకప్పుడు బూటులు అరిగి చిల్లులు పడ్డాయి. వర్షపు నీరు లోపలికి వచ్చేది. జలుబు, జ్వరం వస్తుందేమోనని భయపడితిమి. ఎంత చెప్పినా క్రొత్తవికొనలేదు. మేమే ఒక జతకొని, రాత్రిసమయంలో నిద్రపోతూవుండగా నిశ్శబ్దంగా పాతవాటిస్థలంలో క్రొత్తవిపెట్టి, పాతవాటిని దూరంగా ఎత్తుకవెళ్లి పారవేస్తిమి. తెల్లవారిలేచి పాతబూటులు మరి కొంతకాలము ఉపయోగపడునని వెతకడం ప్రారంభించాడు.

3. గదరుపార్టీ ఆఫీసులో భోంచేస్తూ వుంటిమి. మాలో ఒకరైన గోవింద బిహారీలాల్ (1949లో అమెరికానుండి ఇండియాకు వచ్చి ఇండియన్ నైన్సు కాంగ్రెసు చరిత్ర వ్రాస్తున్న ప్రముఖ జర్నలిష్టు) ఉప్పు చాలదన్నాడు. "రాత్రికి కొంచెము ఎక్కువతినులే!" అన్నాడు. లాల్ ముఖం చిన్నపోయింది. హరదయాళుకు రుచులమీద దృష్టే వుండదు.

4. ఒక ఉదయం కాఫీ త్రాగుచుండగా తినుటకు ఏమీ వుంద లేదు. యువకులు అటూఇటూ వెతుకనారంభించిరి. రాత్రి మంచి బిస్కత్తులు తెచ్చానని పెద్ద పార్సెలు తెరిచాడు. నోటిలో పెట్టుకొన్నాము. కొరికితే పండ్లు విరిగేలాగు గట్టిగా వుండినయి "భాయిజీ! ఏలాగు తినడం" అని నవ్వసాగితిమి. "ఏముంది! కాఫీలో ముంచితే నానుతాయి" అని నవ్వాడు. ఆయన ఏమి తింటూవున్నాడో, ఏలాంటి రుచో యీ విప్లవయోధునికి తెలియదు. ఎక్కడో ఆలోచన! ఎక్కడో చూపు!

5. తెల్లవారు జామున చూడగా మెట్లమీద పడుకొని యుండెను. తనగదిలో తన మంచముమీద ఎందుకు పడుకోలేదు? అని అడిగితిమి. "రాత్రి రెండు ఘంటలకు వచ్చాను. మీరందరు గాఢనిద్రలో వుంటిరి. మీ నిద్రను పాడుచేయుటకు యిష్టంలేకపోయింది" అన్నాడు. ఎంత సంస్కారము!

6. ఢిల్లీనుండి తనభార్య నెలనెలకు రు 100/- పంపుచుండెను. తనకు డబ్బుమీద నమ్మకంలేదు. తాను ఒక అనార్కిస్టు. అడిగినవారికల్లా యిచ్చేవాడు. మూడునాలుగు రోజులలో చిల్లిగవ్వ కూడా తనవద్ద మిగలదు. ఆకలయినప్పుడు సమీపంలో కనపడ్డ స్నేహితుని యింటికి వెళ్ళేవాడు. స్నేహితులకు ఆయన విషయాలు బాగా తెలుసు. వారే భోజనం పెట్టేవారు.

7. అనార్కిస్టులు,సోషలిస్టులు కమ్యూనిస్టులు,సిండికలిస్టులు, విప్లవకారులు మొదలయిన వివిధదేశాల అభ్యుదయవాదులు ఏదోవార్షికోత్సవము జరుపుకొనుచుండిరి. వెయ్యి మందికిపైగా స్త్రీపురుషులు మీటింగుకు వచ్చిరి. హరదయాళుని ఉపన్యాసం గొప్పగా ఉండింది. చప్పట్లు విపరీతంగా కొట్టుచుండిరి; టోపీలు

## జితేంద్ర నాధ లాహిరి

అమెరికాలోని పంజాబుకార్మికులలోను, భారతీయవిద్యార్ధులలోను దేశభక్తిరేకెత్తించి విప్లవబీజాలను నాటింది శ్రీ లాలా హారదయాళుగారు.అయితే గదరు పార్టీని స్థాపించమని నిర్మాణయుక్తంగా ఒక ప్లానునిచ్చి అమెరికాలోని భారతవిద్యార్థులను టెరరిష్టులుగాను, గొరిల్లా యోధులుగాను తర్ఫీతునిచ్చినది బంగాళా విద్యార్థి జితేంద్రనాధ లాహిరి.• వీరు బెంగాలులో టెరరిష్టు నాయకులలో ఒకరు.ప్రచ్ఛన్నంగానుండే కార్యకర్తలలో నొకరు.బెంగాలు విభజనకాలంలో బహిరంగసభలో ఉపన్యసించుతూన్న ఒకగవర్నరును రివాల్వరుతో కాల్చి చేజిక్కక తప్పించుకొన్నది ఈ లాహిరే. *

---

ఎగురవేస్తుండిరి. ఒక అందమైన స్త్రీ ప్లాటుఫారం ఎక్కి హారదయాళుని ముద్దు పెట్టుకున్నది. 'మరొకసారి'అని కొందరు, ఎందుకు అలాచేశావో చెప్పుమని మరి కొందరు అన్నారు. ఆమె శీలవతియని అందరికి తెలుసు, "హారదయాళ్ ధైర్యసాహసాల్లో సాటిలేనివాడు. అలాంటి వానిని ముద్దుపెట్టుకొనే అదృష్టం లభించింది" అని అన్నది. ఆయననుగురించి ఈలాంటి వాస్తవ గాధలు ఎన్నో వున్నాయి.

• ఇదివరకు బొంబాయిలోని "పీపుల్సు పబ్లిషింగు హౌస్"వారు ప్రచురించిన "గదరు వీరులు" "సర్దార్ పృధ్వీసింగు" మొదలగు గ్రంధములలో గదరు పార్టీ పుట్టుకను గురించి సరిగా వ్రాయబడలేదు. జితేంద్రనాధ లాహిరీపేరు లేనేలేదు. గ్రంధకర్తలకు వివరములను యిచ్చిన గదరు బాబాలు, నాయకులకు సయితం,

లాహిరీ కలకత్తా యూనివర్సిటీలో బి. యస్. సి. (కెమిస్ట్రీ)లో ప్రథముడుగా ఉత్తీర్ణుడైన మేధావి. బెంగాలీ యువకులకు తర్ఫీదిచ్చి టెరరిష్టులనుగా చేశాడు. పోలీసులతో పోట్లాడుట, ఆయుధములను సంపాదించుట, బాంబులువేయుట, మొదలగు ధైర్యసాహసకృత్యాలలో ఆరితేరాడు శత్రువులకు పట్టుబడకుండా తప్పించుకొనుటలో నేర్పరి. ఉపన్యాసకుడుకాడు; రచయితాకాడు; కాని నిపుణుడైన నిర్మాత. యువకులనేకులను సంఘటితపరచి, వారిచేత అనేక మహత్కార్యములను చేయించే సూత్రధారుడు.

---

ఈ విషయం తెలియదు. గదరు పార్టీని నిర్మించిన కొంతకాలానికి వీరు పార్టీలోచేరి, గదరు ఉద్యమాన్ని ఎంతో వృద్ధికి తెచ్చిరి. గదరు పార్టీని స్థాపించినవారిలో నేనొక సభ్యుడను. అందువలన యీ వివరాలను వ్రాయగలుగుచున్నాను. స్థాపించిన సభ్యులలో మరొకరు మాత్రమే జీవించియున్నారు ( ప్రొఫెసరు రంజిత్‌సింగ్‌జెయిన్, బెనారస్ హిందూ యూనివర్సిటీ.)

* ఈవిషయం లాహిరీని అడిగాను."ఎవరు కాల్చారు అనేది అంతముఖ్యంకాదు.బాహాటంగా ఎంత ధైర్యసాహసాలతో ఒకకార్యాన్ని నిర్వహిస్తామో అది అంత భద్రమైనది ('The Breavst deed is the Safest') అనేసూత్రం టెరరిష్టు ఎత్తులలో ప్రధానమైనది.ఇందుకు ఈ కాల్పే ఉదాహరణ"అని అనేక వివరాలను అతివిపులంగా ఆయన చెప్పుతూంటే శరీరం పులకరించేది. .... టెరరిజం ( Terrorism ) అనగా నిరంకుశ ప్రభుత్వంలో ప్రజలను హింసించే ప్రభుత్వోద్యోగులను విప్లవపార్టీ వారు చంపివేయుటే.

## తిలక్ ప్రోత్సాహం

వంగ విభజన తరువాత బయలుదేరిన విప్లవోద్యమములో బెంగాలీ యువకులకు ఆత్మరక్షణకు సంబంధించిన విద్యలను, అనగా కత్తిసాము, లాఠీతిప్పుట, కుస్తీ, బాక్సింగు మొదలయినవి నేర్పుట అత్యవసరమని తిలకు మహాశయుడు భావించాడు. కత్తిసాములో మహారాష్ట్రం ప్రసిద్ధికెక్కింది. ఈ విషయంలో మహారాష్ట్రమంతటికి అజేయుడనిపించుకొన్న యోధుని అరవింద ఘోష్‌గారివద్దకు తిలకు మహాశయుడు తీసుకవెళ్ళిరి. "మా బెంగాలీయువకులుకూడా స్వయం సంరక్షక శిక్షణలో నిపుణులవుతూ వచ్చారు. అయితే వారి కృషి ఎంతవరకు సఫలీకృతమయినదో నాకు బాగా తెలియదు;పోటీపెట్టి చూద్దాం" అని అరవింద ఘోష్ గారు తిలకుగారికి సూచించిరి. అయితే కత్తిసాములో బెంగాలీ యువకులలో సాటిలేనివాడనిపించుకొన్న వ్యక్తిగాని,రెండవవాడు గాని ఆసమయంలో లేకపోవడం వల్ల మూడోవాడుగా పరిగణించబడ్డ జితేంద్రనాధ లాహిరీని ఆ మహారాష్ట్రునితో పోటీ చేయిస్తున్నారు. పోటీలో రెండు నిముషములలో మహారాష్ట్రయోధుడు ఓడిపోయాడు. తిలకుగారి ఆనందాశ్చర్యాలకు అంతు లేకుండా పోయింది. లాహిరీని కౌగలించుకొని అంత అవలీలగా ఎలాగు ఓడించావో చెప్పమన్నారు. "మొదట్లో దెబ్బ కాచుకుంటూ వుండి ఎదిరియొక్క సామర్థ్యాలను, లోపాలను ఒకనిముషంలోనే గ్రహించాను. మరుక్షణమే విజృంభించి ఓడించాను"అని లాహిరీ వివరించారు. "సాము విద్యలో ఎలా ఇంతనేర్పరులు కాగలిగారో" చెప్పమన్నారు తిలకుగారు. బెంగాలు విప్లవోద్యమం ప్రారంభంకాగానే తెల్లసోల్జర్లతోను, పోలీసులతోను పోట్లాటలు ప్రారంభ

మైనయి. స్వయంరక్షకశిక్షణలోను, ఆటల (స్పోర్ట్సు)లోను ఆంగ్లేయులకన్న బెంగాలీలే మేటికావలెనని సంకల్పించుకొని ప్రయత్నించవలసివచ్చినది. కత్తిసాములో నేర్పరియైన బెంగాలీయువకుని ఇతరదేశాల్లో నేర్చుకొనిరమ్మని పర్షియా, ఇటలీ, ఫ్రాన్సు, స్పెయిను దేశాలకు పంపాము. ఈ నేర్పరి ఆరితేరి వచ్చి మాకు నేర్పాడు. అలాగే ప్రతి విద్యయందును విప్లవసంఘం నేర్పు సంపాదిస్తున్నదని లాహిరీ చెప్పిరి బెంగాలీల విప్లవ కార్యసాధనను తిలకుగారు ప్రశంసించారు.

మందు, గుండు, బాంబులు తయారుచేయుట మొదలగు ప్రేలుడు (Explosives) వస్తువులలో క్రొత్తవిషయాలను కనిపెట్టడానికి (Researches). సైనికవిద్యను అభ్యసించడానికి, బెంగాల్ విప్లవపార్టీ లాహిరీ అమెరికాకు పంపిరి. (లాహిరీ రసాయన శాస్త్రంలో కలకత్తా విశ్వవిద్యాలయంలో ప్రథముడుగా ఉత్తీర్ణుడయ్యాడు. సర్. పి. సి. రేగారి ప్రియశిష్యుడు.) కాలిఫోర్నియా యూనివర్సిటీలో కెమిస్ట్రీలో యమ్ యస్. సి. క్లాసులో చేరి "యక్స్ప్లోజివ్సు"లో పరిశోధన చేయుచుండిరి.

విప్లవ శిక్షణ

లాలాహరదయాళుగారి ప్రబోధ ఫలితంగా దేశ స్వాతంత్ర్యమును కొరకు ప్రాణత్యాగము సయితము చేయుటకు సంసిద్ధులయిన విద్యార్థులందరికీ ప్రత్యేకంగా ఒక హాస్టలు పెట్టించాడు లాహిరీ. వారిలో నే నొకడిని. "టెరరిజమ్" పద్ధతిని, గొరిల్లా యుద్ధవిధానాన్ని మాకు నేర్పసాగాడు. కత్తిసాము,కుస్తీ, బాక్సింగు మొదలగు స్వయంసంరక్షక విద్యలేగాక, తోటాలు చెయ్యడం,రివాల్వరు, తుపాకీలు కాల్చడం మొదలయినవి నేర్పాడు

బెంగాలీ విప్లవకారులు బాక్సింగుకు ప్రాముఖ్యతనిచ్చారు. వారి అనుభవంవల్ల అలాచేశారు. ఎందుకంటే, మన యువకులు సాధారణంగా తెల్లవారలను చూస్తే భయపడుతారు ఈ భయాన్ని పోగొట్టాలి. సోల్జర్లమీద పోట్లాడమని కవ్వించేవారు. ఈలాంటి పోట్లాటల్లో కుస్తీకంటే బాక్సింగు ఎక్కువ ప్రయోజనకారియని తెలుసుకున్నారు. మాకుగూడ బాక్సింగులో మంచిశిక్షణయిచ్చాడు. ఇంతేకాదు; మాలో విప్లవభావాలు, దేశభక్తి, త్యాగదీక్ష, ధైర్య శౌర్య - సాహసాలు పెంపొందించటానికి అనేక ఉద్గ్రంధాలను మాచే చదివించాడు. వాటిలో ముఖ్యమైనవి: విప్లవచరిత్రలు (ఫ్రాన్సు, రషియా, ఇటలీ, చైనా, ఇంగ్లాండులను గూర్చినవి); విప్లవవీరుల జీవితగాధలు - ముఖ్యంగా ఫ్రెంచి విప్లవాన్నిగురించి, రూసో సోషల్‌కాంట్రాక్టు, మాజినీ "డ్యూటీస్ ఆఫ్ మాన్" (మానవుని విధులు); దేశభక్తుల ప్రచ్ఛన్న జీవితాలను, సాహసకృత్యాలు, కారాగృహ అనుభవాలను చిత్రించే గ్రంధాలు చదివేవాళ్ళం*

---

* ప్రిన్సు క్రోపాట్కిన్ తన జైలు జీవితాన్ని చిత్రించిన గ్రంథం నాకు బాగానచ్చింది; అందువల్ల ఆయన వ్రాసిన గ్రంథ రాజముల నన్నింటిని చదివితిని. ఆయన "పరస్పర సహాయం" (Mutual Aid) అనే గ్రంధమును చదివి, సంఘం ఎలా అభివృద్ధి చెందుతుందో తెలిసికోగలిగాను. "పొలాలు, ఫ్యాక్టరీలు, కార్ఖానాలు" (Fields, factories and workshops) అనే గ్రంథంలో ప్రతిదేశంలో కావలసినన్ని సహజ సంపదలు Natural resources) వున్నవని, అభివృద్ధి చెందుచున్న శాస్త్రీయ విధానాల ద్వారా వాటిని మన హస్తగతం చేసికొని, ఆ దేశ ప్రజల నిత్యజీవితావసరాలన్నింటికి సమృద్ధిగా ఉపయోగ పడే

రాణా ప్రతాప్‌సింగు, గురు గోవిందసింగ్ మొదలగు వీరో త్తముల జీవితాలు నన్ను అమోఘంగా ఆకర్షించాయి. ఇవిగాక, అనేక సాంఘిక రాజకీయ గ్రంథాలను చదివేలాగుచేశాడు లాహిరి. సావర్కారుగారి భారత స్వాతంత్ర్యసమరం (Indian War of Independance) అను పుస్తకాన్ని చదువుచున్నప్పుడు బ్రిటిష్ పాలనలో మనదేశం ఎంత అధోగతికి వచ్చిందో కన్నులకు కట్టినట్టు స్పష్టమైంది. బ్రిటిష్ సామ్రాజ్యాన్ని నాశనం చెయ్యవలె వనే ఉద్రేకం పుట్టేది. కర్నలు టాడ్ అనే ఆంగ్లేయుడు వ్రాసిన

లాగు చెయ్యవచ్చునని, పరదేశాలను జయించి అక్కడి ప్రజల రక్తాన్ని పీల్చి పిప్పి చెయ్యనవసరంలేదని స్పష్టంచేశాడు. అప్ప ట్లో పరిణామ సిద్ధాంతాన్ని (Theory of evolution) ప్రతి పాదించిన డార్విన్ (Darwin) పోటీ ప్రకృతిసిద్ధమని, ఒక దేశం మరొక దేశాన్ని దోచుకోవడం, ఒక వ్యక్తి మరొక వ్యక్తిని దోచుకోవడం సహజమేనని చెప్పాడు. దీనివల్ల ఒక తత్వశాస్త్రమే ఏర్పడింది. దీనిని పెట్టుబడిదారులు, ఇంపీరియ లిష్టులు తమ స్వార్థానికి ఉపయోగించుచుండిరి. ఈ నీతిబాహ్య మైన దృక్పథాన్ని ఖండించుచు క్రోపాట్కిన్ పైన చెప్పబడిన గ్రంథాలలో శాస్త్రరీత్యా వివరించాడు. ఒక్క మానవజీవితం లోనేగాక, పెంపొందే పశు పక్ష్యాదులలోకూడ అభివృద్ధికి "పర స్పర సహాయసూత్రం" అవి స్పష్టీకరించాడు.....అనార్కిజమను తత్వశాస్త్రమును గురించి వ్రాసిన గ్రంథాలలో మనుష్యుడు ఇం కనూ ఎంత సంస్కృతి పొందగలడో, నైతికంగాను, ఆధ్యాత్మికం గాను మనుష్యుడు ఎంత అభివృద్ధికి రాగలడో, అట్టి మానవ సంఘం ఎలా వుండునో ఈ వేదాంతి వ్రాశాడు.

"రాజస్థాన కథావళి" చదివినప్పుడు, మన దేశస్వాతంత్ర్యం కొరకు మన పూర్వులు చేసిన అఖండ త్యాగాలు అనంతమైనవని గర్వపడే వాణ్ణి. రమేశచంద్రదత్తుగారి గ్రంథరాజాలు 'బ్రిటిష్ ఇండియా ఆర్థిక చరిత్ర' చదివాను. బ్రిటిష్‌సామ్రాజ్యతత్వం మనదేశాన్ని ఏవిధంగా దోస్తూ మన ప్రజలరక్తాన్ని పీల్చి పిప్పిచేసిందో, తత్ఫలితంగా క్షామదేవత మనదేశంలో ఏవిధంగా సుస్థిరనివాసం ఏర్పరచుకొని విలయతాండవం చేస్తున్నదో నాకు స్పష్టంగా బోధపడ్డది. ఇటలీ స్వాతంత్ర్యోద్యమనాయకుడు మాజీనీవ్రాసిన "మానవుని బాధ్యతలు" అనే గ్రంథాన్ని చదువగానే భారత బంధవిముక్తికొరకు నా జీవితాన్ని అర్పించడం నా విద్యుక్తధర్మం అను నా సంకల్పం స్థిరపడసాగింది. మాక్సుముల్లరు లండనులో ఐ.సి.యస్ విద్యార్థులకు ఇచ్చిన ఉపన్యాసాలు చదివితిని. అతి పురాతనకాలంలో కూడ, భారతజాతి నాగరికత ఎంత ఉత్కృష్ట స్థితిలో వుందో గ్రహించి గర్వపడ్డాను.

వంగ విప్లవచరిత్ర విచిత్రమైనది; అద్భుతమైనది. వంగ విభజనవరకు బెంగాలీలు మాటలలో మహాశౌర్యం చూపేవారే గాని, వస్తుతః కార్యశూరులుగారని అందరూ హేళనచేసేవారు. ఇండియా అంతటా బెంగాలీ లంటేనే ఉత్త వాచాలురని గౌరవముండేదిగాదు. కాని, వంగ విభజన జరగగానే, వీరు ఏలాగు కార్యశూరులయ్యారో తెలుపుటకు ఒక గాథ వున్నది. బ్రిటిష్ గవర్నమెంటుమీద ప్రజలకు ఆగ్రహం, ఉద్రేకం చెలరేగిపోయినవి. అవి సభలు, తీర్మానాల మూలకంగా మాత్రమే ప్రదర్శితమైనవి. అట్టి తరుణంలో లాలా లజపతిరాయిగారు కలకత్తాలో ఉపన్యసించుతూ "నా బెంగాలీ సోదరులారా! ఎంతకాలమని ఆలోచిస్తూ

కార్యశూన్యులై యుంటారు? దేశభక్తులారా! ఇకచాలు, మీ ఆలోచనలు కట్టిపెట్టండి! కార్యనిరతులు కండి; పట్టిప్రగల్భాలవల్ల ప్రజలకు ముక్తికలుగదు. దేశవిముక్తిమార్గం కార్యశూరత! రెండు! "అని లాలా లజపతిరాయిగారు చేసిన ప్రబోధంవల్ల బెంగాలీలు వీరావేశపరులయ్యారు; కార్యాచరణకు నడుంకట్టారు. ఈ ఘట్టం బెంగాల్ చరిత్రనేకాదు, యావద్భారత చరిత్రనే మార్చింది. టెరరిస్టు ఉద్యమానికి దారి తీసింది*

టెరరిష్టుల నియమాలు

టెరరిష్టు విధానవిషయంలో ముఖ్యసూత్రాలను లాహిరి మాకు ఈవిధంగా నేర్పాడు—

1. మౌనంగా వుండడం నేర్చుకో. ( Keep your lips shut.

2. అనవసరంగా మాట్లాడకు.(Do not tell others what they need not know.)

* స్వాతంత్ర్యోద్యమాన్ని విచ్ఛిన్నంచేస్తూ, అడ్డంకులు కల్పించే క్రూరులను, ప్రభుత్వ తొత్తులై దేశభక్తులను హింసించే ఉద్యోగస్థులను నాశనంచేసి ప్రజాక్షేమంకోసం పాటుపడే దేశభక్తుల ఉద్యమాన్ని "టెరరిజమ్" అని అంటారు. ఈ ఉద్యమములో పాల్గొనేవారిని టెరరిష్టులంటారు. ప్రతిదేశంలోను విప్లవోద్యమ చరిత్రలో కొన్ని అంతస్థులు కనుపించును. మొదటి స్టేజి టెరరిజము. వ్యక్తిగతమైన సాహసకృత్యాలు ( Adventurism). ఇవి చివరకు విఫలం అవుతాయి. రెండవదశలో ప్రజా వుద్యమము బయలుదేరుతుంది. కడపటి దశలో సాయుధపోరాటము, ఆశయసిద్ధి.

3. రహస్యాలోచనలకు బహిరంగ ప్రదేశమే భద్రమైనస్థలం. (Walls have got ears)

4. ఎంత ధైర్యసాహసాలతో ఒకకార్యము నెరవేర్చగలిగితే అంత సురక్షితం. (The bravest deed is the safest.)

5. రహస్యకార్యాలు ఎంత తక్కువమంది కలిసిచేస్తే అంత భద్రం. (The lesser the number of persons involved in a conspiracy, greater is the chance of success.)

ఈ సూత్రాలేగాక కొన్నినియమాలు, నిబంధనలు కూడా వుండేవి:—

1. 30 ఏండ్ల వయసు వచ్చేవరకు బ్రహ్మచారిగా వుండాలి. అప్పటికే వివాహమైతే, బ్రహ్మచర్యం అవలంబించాలి. అయితే ఈ విషయంలో భార్యను ఒప్పించాలి. ఈ రహస్యాన్ని భార్యాభర్తయి రహస్యంగా వుంచాలి.

2. 30 ఏండ్ల వయసువరకు దేశసేవలోనే నిమగ్నుడై యుండాలి. (అంతవయసు వరకు దీక్షతో వుండగలిగితే, యావజ్జీవం మానవసేవా దురంధరుడై వుండగలడని వారి దృఢవిశ్వాసం.)

3. స్త్రీలు తమ మానప్రాణములను రక్షించుకోవాలి; కాబట్టి భార్యకు బాకును బహుమతిగా ఇచ్చి, పోట్లాడటం నేర్పాలి.

4. పెరరిష్టులు తమతమ శక్తి సామర్థ్యాలను బట్టి తమతమ విధులను విభజించుకోవాలి—

(a) బోధకులు

(b) తాలింఖానా అధ్యాపకులు (ఆత్మరక్షణకోసం గరిడీ, సాము, కుస్తీ, కత్తితిప్పుట, బాక్సింగు మొదలగు విద్యలు నేర్పువారు.)

(c) పోట్లాడువారు. శత్రువులను ప్రతిఘటించి చచ్చుటకు, చంపుటకు సయితము సిద్ధపడువారు.

(d) కార్యక్రమం నిర్ణయించి ప్లానులను వేయువారు.

(e) మందుగుండు, ఆయుధములను సేకరించువారు.

(f) డబ్బును పోగుచేసేవారు.

(g) పోలీసు, సి. ఐ. డి. శాఖలలో చేరి రహస్యములను తెచ్చేవారు.

ఈ విధంగా ప్రత్యేక ప్రత్యేక కార్యకలాపాన్ని నెరవేర్పు బాధ్యతలను వారివారి శక్తులను బట్టి తీర్మానించుతారు.

5. దౌర్జన్యంతో కూడినపనులను, రహస్యకార్యములను చేయువారు అయిదుగురుకన్న ఎక్కువగాకుండా వుండాలి. రహస్యం ప్రభుత్వానికి తెలిసినా అంతకంటె ఎక్కువమంది నశించి పోకూడదు.

6. హింసలకు ఓర్చుకోలేని సమయంలో, విషంత్రాగిగాని ఉరివేసుకొనిగాని చనిపోవాలి.

7. డబ్బును పోగుచేయుటలో, ప్రభుత్వ గులాములు, తొత్తులు అయిన జమీందార్లు గొప్పఉద్యోగస్తుల ఇండ్లు దోచుకోవాలి. ఈ పనిని స్థానికంగావుండేవారిచేత చేయించక ఇతర ప్రదేశాలవారిచేత చేయించాలి.

ఇన్ని నియమాలు, జాగ్రతలు క్రమశిక్షణలు ఉండినా బ్రిటిష్ ప్రభుత్వం ఎలాగో రహస్యాలను తెలుసుకొని విప్లవకారులను నాశనం చేస్తూవుండేది.

## పిరికితనం రక్తంలో లేదు

కాలిఫోర్నియా యూనివర్సిటీ బర్కిలే నగరంలో ఉన్నది. గదర్ పార్టీలో చేరిన భారత విద్యార్థులం ప్రత్యేక హాస్టల్లో ఉంటిమి. దానిపేరు నలందా హాస్టలు. దానిలో పది మందిమి ఉంటిమి. మా నాయకుడు జితేంద్రనాథ లాహిరీకి నామీద ఎంతో ప్రేమ. మేమిరువురం ఒకేగదిలో వుంటిమి. మేమంతా కలిసి మాట్లాడుకుంటూ వేళాకోళం చేసుకొనేటప్పుడు నా మిత్రుడు వెంకయ్య నాయుడు (హైదరాబాదు - ఇంజనీరింగు విద్యార్థి) ఎగతాళికి ఇలాగన్నాడు— "లాహిరీ! చంచయ్యను వీరుణ్ణి, ధీరుణ్ణి, విప్లవకారుణ్ణి చేయాలనుకుంటున్నావే! నీ ప్రయాస వృథా అవుతుంది సుమా! తరువాత విచారపడుతావు. వాడు కోమటి. అంతకంటే పిరికిజాతి ఇండియాలోనే కాదు. పృథ్విలోనే లేదోయ్" అన్నాడు.

"పిరికితనంగాని, ధైర్యంగాని జాతి లక్షణం కాదు; రక్తంలో లేదు; శిక్షణలో వుంటుంది" అన్నాడు లాహిరీ. దీనితో ఎగతాళి మాటలు మాయమైనవి. చివరకు అందరం అందుకున్నాం. తర్క వితర్కాలు తీవ్రంగా ప్రారంభమైనవి.

"చంచయ్యను ధీరుణ్ణిగా చెయ్యలేవు" అని వెంకయ్య, ఇతర మిత్రులు నొక్కిచెప్పారు.

"ఏం పందెం జెప్పండి?" అన్నాడు లాహిరీ.

"నీకు ఆరునెలల గడువు యిస్తాం. ధీరుణ్ణి చెయ్యి చూద్దాం" అని తక్కిన వారు.

"చంచయ్యచేత మిమ్మల్నందరిని తన్నిస్తే పందెమేమి?" అని లాహిరీ.

"అందరం కలసినీకు టీపార్టీ చేస్తాం. మానవ స్వభావాన్ని తెలిసికోలేకపోతిమని మా అజ్ఞానాన్ని ఒప్పుకొంటాం. నువ్వు ఇవ్వబోయే తర్ఫీదును ప్రపంచమంతటా చాటుతాం" అని అందరూ పందెం వేసుకున్నారు.

నేను సరదాగా వింటున్నా. "వీరందరినీ నేనెలా తన్నగలను ? వీరిలో అభిమన్యుల్లాంటి కర్తార్ సింగు, ముకుందలాల్ గారు ఉండిరి.(ప్రథమ లాహోరు కుట్రకేసులో నవ్వుతూ ఉరి కంబాలెక్కినవారు వారే.) లాహిరీ నాకెలాంటి తర్ఫీమనిస్తాడు?" అనే భయం, కుతూహలం నాలో రేకెత్తినై. సందేహం ఎలావున్నా లాహిరీ శక్తిసామర్థ్యాలలో నాకు గట్టినమ్మకం ఉండేది. నేను సరే నన్నాను. కాని, ఈ మాట కంఠంలోనుంచి గట్టిగా రాలేదు.

తర్ఫీదు

నాకు తర్ఫీదు ప్రారంభమైంది. బాక్సింగు, కుస్తీ, కత్తితో పోట్లాడుట, రక్తంకారినా భయపడకుండా ఉండేట్టు నేర్పసాగాడు. ఆత్మరక్షణసామర్థ్యం "(Defensive tactics) చాలదు. పోట్లాడే నైపుణ్యాన్ని ( Offensive tactics) నేర్చుకో ! శత్రువు పైబడి పోరే (Attack)విధానాన్ని సాధించు"అని లాహిరీ ఎంతబోధించినాసరే, నాకు మానసికంగావున్న చేతకానితనం మాత్రం నన్ను వదల్లేదు. సాహసించేవాణ్ణికాను బాక్సింగుచేసే సమయంలో, ఒకప్పుడు లాహిరీ పరాకుగా ఉన్నాడు ఆసమయంలో అతనిముక్కుమీద బలంగా కొట్టాను. అతడు సింహగర్జనచేస్తూ నాముఖం, పెదవులు, గడ్డం బాగా వాచేట్టు బాక్సుచేశాడు. మూడు రోజులదాక యూనివర్సిటీకి వెళ్లలేకపోయాను. అయితే, దానితో

కొంతభయం పోయిందే కాని, నేనే ముందుగా అతనిపైనపడి తెగించి పోరాడేపద్ధతిమాత్రం నాకింకా అలవడలేదు.

లాహిరీ పరోక్షఉపాయాన్ని పన్నాడు.ఉదయం 8ఘంటలు మొదలు రాత్రి పదిఘంటలదాక మేము సర్వకళాశాల గ్రంథాలయంలో చదువుకోవచ్చు. అక్కడ శీతోష్ణస్థితి హాయిగావుంటుంది. మేము ఎక్కువకాలం గ్రంథాలయంలోనే చదువుకొనేవాళ్లం. హాస్టల్లో అతిచలి.అంతేగాదు. మాకవసరమైన గ్రంథాలన్నీ లైబ్రరీలో లభించేవి. మనదేశంలో విద్యావిధానం వేరు.ఒకవిషయాన్ని గురించి ఒకటిరెండు పుస్తకాలనుమాత్రమే సమగ్రంగా చదివే పద్ధతి.దీన్నే Intensive method అంటారు.ఆదేశంలో అలా కాదు.ఒకేవిషయాన్నిగురించి అనేకగ్రంధాలు చదువుతారు.దీన్నే Extensive method అంటారు.అందుకు అవసరమైన వందల గ్రంధాలు యూనివర్సిటీ లైబ్రరీలోమాత్రమే లభిస్తాయి.అందువల్లనే మేము అక్కడే మా సబ్జెక్ట్సు అన్నిటినీ చదివేవాళ్లం. రాత్రి పదిగంటలతరువాత మేము చలిలో గడగడవణకుతూ, వడివడిగానడిచి హాస్టలు చేరుకునేవాళ్లం.దుస్తులు తీసేసి,రాత్రి బట్టలు వేసుకోగానే మంచంమీద పరుపులు,రజాయీలకుమధ్య దూరాలి.అలాంటప్పుడు లాహిరీ నా మంచంవద్దకు వచ్చి,నేను కప్పుకున్న రజాయీలను లాగేసేవాడు.తగని చలి; అతిబాధ. నరాలు బిగుసుకుపోయేవి "నిన్నింత హింసించినా నోటితో ఖండిస్తావేకాని నా మీదపడి కొట్టవేం? నీకు దేవుడిచ్చిన కాళ్లు, చేతుల్నిఎందుకుపయోగించవు"అని మరీమరీ నన్ను కొట్టేవాడు, తన్నేవాడు,రోషంకలిగించేవాడు. అప్పుడు ఆగ్రహంకలిగి, అత

న్ని కొడితే "నన్ను కొడతావా? తన్నుతావా?" అని పూర్తిగా అలసిపోయేదాక నన్ను హింసించేవాడు.

నాకు ఈ హింస తప్పదని తెలిసిపోయింది. కాబట్టి నా దగ్గరికి వచ్చేరాకముందే కొట్టేవాణ్ణి. తన్నేవాణ్ణి. అందుకు నన్ను 'శెహబాష్'అని ఉత్సాహపరిచేవాడు. అటుతవాత లోకతొక్కిన తాము-గ మండిపడి నన్ను చితకకొట్టేవాడు.

ఈ లాంటి ట్రెయినింగువల్ల ఎంతో సులభంగా కోపం రావడం అలవాటు పడింది. ఏమాత్రం కోపంవచ్చినా పోట్లాటకు సిద్ధం అయ్యేవాడిని. అందుకు ఆలోచన పాలోచన ఉండే దేలేదు. చేతికి పుస్తకం, బూట్సు, ఏది దొరికినాసరే, ఎగిరి పొయ్యేది. నాగురువు లాహిరీతప్ప విద్యార్థులందరు, నేనెక్కడ కోప్పడతానో, నేనెక్కడ తంతానో అని నాతో ఎంతో జాగ్రత్తగా మాట్లాడేవారు. నాతో ఎగతాళిమాటలు, నవ్వులాటలు పోయినయి. "పిచ్చికుక్క" అని నాకు పేరుపెట్టారు. ఒకరోజున భోజనాలవద్ద, చిన్న పొరపాటుమాటకు చేతిలోవుండే ఫలాహారాన్ని నా గురువు లాహిరీ మొఖాన కొట్టాను. అందరికి నామీద కోపం వచ్చింది. అందరూ నాతో మాట్లాడడం మానేశారు. అందరూ నన్ను బాయికాట్ చేశారు. "రాక్షసుణ్ణి చేశావు. అనుభవించు "అని లాహిరీని అందరూ నిందించారు. లాహిరీ నాతో మాట్లాడక పోవడం, నాకు చాలా మనోవ్యధను కలిగించింది.

కొన్నిరోజుల తరువాత క్షమించమని వేడుకున్నాను. రాజీపడడానికి పదిమంది కలిశాం. లాహిరీ ఇలాగన్నాడు "మనుష్యుడు దేవుడు కాగలడు; రాక్షసుడూ కాగలడు. రెండు శక్తులూ మనలోనే వున్నాయి. పరులకు ఉపకారం చేసేవాడు

దేవుడవుతాడు; అపకారం చేసేవాడు రాక్షసు డవుతాడు. ఇప్పుడు చంచయ్య తనశక్తిని అన్యాయాన్ని నిర్మూలించడానికి ఉపయోగించితే దేవుడవుతాడు. ఇప్పుడు చేసేలాగున చేస్తూవుంటే రాక్షసుడు కాకమానడు. తన బలాన్ని, సాహసాన్ని, త్యాగాన్ని, పరులను అన్యాయంనుండి రక్షించడానికి ఉపయోగపెట్టుతానని, ప్రతిరోజూ అలాగు ధ్యానము, సాధన చేస్తానని, దేశభక్తుడు, మానవసేవాప్రియుడవుతానని వాగ్దానం చేస్తే, చంచయ్యతో తిరిగి మాట్లాడుతాను, లేకపోతే మాట్లాడను" అనిచెప్పి లాహిరీ కూర్చున్నాడు. నేనెంతో సంతోషంతో ఒప్పుకొన్నాను. అందరూ నన్ను కౌగలించుకొన్నారు. లాహిరీ తనపంతం గెలిచాడు. నా మనసులో బరువు ఎంతో దిగిపోయినట్టయింది.

అటుతరువాత, అయిదు సంవత్సరాలకాలం గదరుపార్టీ కార్యక్రమంవల్ల పోలీసు, మిలిటరీ, సి. ఐ. డీ. ల స్వాధీనంలో ఉండినప్పుడు, ఒంటరిగా జైళ్లలో ఉండినప్పుడుకూడా లాహిరీ ట్రైనింగు, ఆయన చేసిన ధర్మబోధ నాకెంతో ఉపకరించాయి.

ప్రాణానికి తెగించి పోట్లాడేవాడితో, తెగింపులేక పోట్లాడేవాళ్లు ఎందరైనా సమానం కాజాలరని నాకు ప్రత్యక్ష అనుభవం. ఈలాంటి సాహస కార్యాలను కొన్నింటిని సందర్భాను సారంగా వ్రాస్తాను. వ్యక్తిగతంగానేకాదు; సైన్యాలు చేసే యుద్ధాల్లోకూడ; వాలంటీర్లతోకూడిన సైన్యానికీ యుద్ధం చేయుటే వృత్తిగా ఏర్పడ్డ సైన్యానికీ మధ్య యుద్ధం జరిగినప్పుడు, సాధారణంగా వాలంటీర్ల సైన్యం గెలుస్తూ వచ్చినట్లు చరిత్రలు నిరూపించాయి. వృత్తిగా ఏర్పరచుకొనిన సైన్యానికి, యుద్ధంచెయ్యడం బాగా తర్ఫీదు అయివుంటుంది; జయించగలమనే మనో

నిశ్చయంతో యుద్ధరంగానికి వస్తారు; కాని చావడానికి సిద్ధపడి రారు. వాలంటీర్లకు ట్రెయినింగు చాలదు. ఆయుధాలుండవు. అయితే చావడానికి తెగించుతారు. దానితో శతృనాశనం కావడం ప్రారంభం కాగానే శతృసైన్యం పారిపోతుంది. ఫ్రెంచి విప్లవ చరిత్ర, ఇంగ్లాండు, అమెరికా, రషియా, ఐర్లండు, చైనా స్వాతంత్ర్య యుద్ధచరిత్రలూ; సిక్కు, మహారాష్ట్రులు మొగలాయి సైన్యంతో చేసిన యుద్ధాలూ యీ సత్యాన్నే నిరూపించాయి. మొదటి, రెండవ ప్రపంచయుద్ధాలు కూడ యీ విషయాన్నే దృఢపరిచాయి. విప్లవాలు జయించుటకు కారణం విప్లవసైన్యాలు వాలంటీర్ల సైన్యాలు అవడంవల్లనే. ప్రజలు తిరుగబడగానే పోలీసులు తమ తుపాకులను టోపీలను పారేసి కాళ్లకు బుద్ధి చెప్పడం భారతీయులు ఎరిగిన విషయమే !

—:ప్రపంచ యుద్ధప్రారంభం - గదర పార్టీ పరిస్థితులు:—

1925 సం॥లోగా కాష్మీర్‌ను యుద్ధంలో జయించి రిపబ్లిక్‌గా చెయ్యాలని, గదరుపార్టీని స్థాపించగానే ప్లానువేశామని లోగడ వ్రాశాను. * కామగాటోమారో స్టీమరు విషయంలో

* కామగాటోమారో అనేది జపాను స్టీమరు. దీనిపేరు మన రాజకీయ చరిత్రలో ప్రసిద్ధికెక్కినది. 1913-14 లో జరిగిన విషయం. భారతీయులు—ముఖ్యంగా పంజాబీయులు కెనడాకు వ్యవసాయ కూలీలుగా వలసపోతూవచ్చారు. మనలను ఆదేశానికి రానివ్వడం కెనడావారికి ఎంతమాత్రమూ యిష్టంలేదు. ఇందుకు జాతిద్వేషమే ముఖ్యకారణము. అయినా ఒకే బ్రిటిష్ సామ్రాజ్యంలో ఉండిన కారణంవల్ల మనలను ప్రత్యక్షంగా రాకూడదని శాసనం చేయుటకు మారుగా ఒక ఉపాయం కనిపెట్టారు.

ఆసియా నుండి ఒకే స్టీమరులో నేరుగా ప్రయాణంచేసి రావాలి అనేసాకు పెట్టారు. ఆకాలంలో ఇండియానుండి జపానువరకు స్టీమర్లు వెళ్లి నిలిచిపోయ్యేవి. జపానునుండి మరొకస్టీమరులో ఎక్కి కెనడాకు వెళ్లాలి. అందువల్ల ఆశాసనం చేశారు. అయితే గురుదత్‌సింగ్ అనే దేశభక్తుడు ఒక జపాను స్టీమరును ప్రత్యేకంగా బాడుగకు ఏర్పాటుచేసి. హాంకాంగు రేవులో చాలామందిని పంజాబీయులను ఎక్కించి కెనడాకు తీసుకెళ్లాడు. వీరిలో చాలా మంది కొంతకాలం సైన్యంలో ఉండి యుద్ధాల్లో ఆరితేరినవారు. ఆకాలంలో పంజాబులో రోజుకూలి ఎనిమిది అణాలు మాత్రమే; కెనడాలో పదిరూపాయలు. కెనడాలో వీరిని దిగనివ్వలేదు. కెనడా పోలీసులు, సోల్జర్లకు మనవారికి పోట్లాటలు, కొట్లాటలు, కాల్పులు జరిగాయి. నీరుగాని, ఆహారంగాని, సప్లయి చెయ్యటానికి కెనడా గవర్నమెంటువారు నిరాకరించడమే గాక, స్టీమరును ముంచేస్తామన్నారు. చివరకు తిరుగు ప్రయాణం చెయ్యవలసి వచ్చింది. దీనివల్ల మనదేశంలో బ్రిటిషు ప్రభుత్వంమీద ద్వేషం పెరిగిపోయింది. ఇండియాకు తిరిగి వచ్చారు. కలకత్తావద్ద డమ్‌డమ్ స్టేషనులో సర్కారు ఒక స్పెషల్ ట్రెయినును వీరిని పంజాబుకు నేరుగా తీసుకెళ్లటకు తయారుగాపెట్టి, దానిలో కూర్చుండమని అన్నారు. కొందరు సమ్మతించలేదు. చివరకు కాల్పులు జరిగాయి. ఇరువైపులవారు కాల్చారు. కొందరు మరణించారు. కొందరు పంజాబీయులు తప్పించుకపోయ్యారు. మన పోరాట చరిత్రలో అదొకగొప్ప సంఘటనగా నిల్చిపోయింది.నాయకుడైన గురుదత్‌సింగ్ షుమారు 30 సం॥ల తరువాత తనంతట తానే పోలీసులకు దొరికిపోయిరి.

గదరు పార్టీ విద్యార్థులం జోక్యం కలుగజేసికోలేదు గాని, పంజాబీ వ్యవసాయ కూలీలైన గదరు పార్టీవారు ఉద్రేకంతో పనిచేశారు. రివాల్వర్లు, రైఫిల్సు, తోటాలు వగైరా కొని యిచ్చారు. * ఇండియాలో ఇంగ్లీషు ప్రభువులను చంపండి, చావండి అని నినాదం యిచ్చారు. గదరు పార్టీ సాహిత్యాన్ని చాలా యిచ్చారు. కొందరు వీరితో కలసి ప్రయాణం చేశారు. చాలా తీవ్రప్రచారం జరిగింది. ఇండియాకు చేరగానే గవర్నమెంటుతో పోట్లాడి కొందరిని కాల్చిచంపారు; చచ్చారు.

గదరుపార్టీని స్థాపించిన హరదయాళ్ విధిలేక యూరపుకు వెళ్ళాడు. ఈ సమయంలో రామచంద్ర అనే పంజాబీ తనభార్యతో ఇండియానుంచి అమెరికాకు వచ్చాడు. ఇతడు రాజకీయంగా పాటుపడి బాధలు పడలేక విదేశానికి వచ్చాడు. గదరుపార్టీవారు యీయనను నమ్మి హరదయాళ్‌స్థానే గదరుపత్రికకు సంపాదకునిగా నియమించారు.

## తర్జన భర్జనలు

అమెరికాలో విద్యార్థులకు షుమారు మూడునాలుగు మాసాలు ఎండాకాలం శలవులు ఇస్తారు. డబ్బు సంపాదించుకొనుటకు వ్యవసాయపు పనులు చాలా లభించుతాయి. భారత విద్యార్థులం స్వయం పోషకులమేగాని, ఇండియానుండి డబ్బు తెప్పించుకొని చదువుకొనేవారు అరుదు. కాబట్టి కూలినాలి చేయుటకు

---

* అమెరికాలో కొనుటకు లైసన్సు అవసరంలేదు. ఎవరైనా ఎన్నైనా కొనుక్కోవచ్చు. కొన్న షాపులో రిజిష్టరులో సంతకం చేస్తే చాలును.

మేము తలా ఒక చోటికి వెళ్ళాము. ఆ శెలవుల్లోనే ప్రథమ ప్రపంచయుద్ధం 1914లో ప్రారంభమయింది. వెంటనే మా కార్యక్రమం తీర్మానించుకొనుటకు విద్యార్థి విప్లవకారులం పదిమందిమి బర్కిలే పట్టణంలో సమావేశమయ్యాము. ఈ యుద్ధాన్ని ఉపయోగించుకొని, భారత దేశాన్నంతటిని పారతంత్ర్యంనుండి విముక్తి చేయుటకు ప్రయత్నించుటే కర్తవ్యమని తీర్మానించుకొన్నాము. ఇదివరకే గదరు పార్టీ వేసుకొన్న ప్లానులో, కాశ్మీరును 1925 సంవత్సరంలోపల రిపబ్లికుగా చేయాలన్న విషయం చాలా స్వల్పమయినదని తోసివేశాము. ఎలా మన దేశానికి సేవ చేయాలో, సంపూర్ణ స్వాతంత్ర్యం సంపాదించాలో, అన్నచర్చలు దీర్ఘంగా గదరుపార్టీ నాయకులు జరిపారు; కాని వెంటనే తీర్మానానికి నాయకులు రాలేకపోయిరి. విద్యార్థులలో మూడు ప్రధాన అభిప్రాయాలు ఏర్పడ్డాయి. (1) మనము ఇండియాకు వెంటనే వెళ్లి విప్లవాన్ని తేవాలి; అమెరికాలో ఉండి మనము ఏమీచెయ్యజాలమని కొందరు;వీరిలో ముఖ్యులు: శ్రీ భాగవతుల సోమయాజిశర్మగారు,గుంటూరు. (2) ఇండియాకువెళ్లి మన మేమి చెయ్యగలము ?తీగలు నరుకగలమా ? వంతెనలు నాశనం చెయ్యగలమా ? ప్రజలను పోగుచేసి మిలిటరీతర్ఫీదు నివ్వగలమా? ఏ యే కోటలలో ఎన్నెన్ని ఫిరంగులున్నాయో,ఎంతెంత సైజో, ఎన్నెన్ని రైఫిల్సు ఉన్నాయో వగైరా విషయాలు తెలుసునా ? యుద్ధం కొంత సాగగానే ఇండియాకు స్వాతంత్ర్యం సంపాదించడానికి మన కితరదేశాలవారు సహాయపడుతారు;మనకు సహాయం వస్తుంది.మనం వెంటనే మిలిటరీవిద్య నేర్పే కాలేజీలలో చేరి రిటైరయిన అమెరికన్ మిలిటరీ ఆఫీసర్ల సహాయంతో ఇండియా

లోని కోటలు వగైరా ప్లానులను సంపాయించి,బాగాఆలోచించు కొని ప్లానువేసుకొని ఇండియాకు వెళ్దాము అని లాహిరీ సలహా. ఇది పంజాబీయులు కాని విద్యార్థులకు నచ్చింది. (3) పంజాబీ విద్యార్థులు ఇండియాకు వెళ్లి,సైన్యంలోచేరి 1857 లోలాగే సిపాయీల సాయుధపోరాటం ఏర్పాటుచెయ్యాలన్నారు.శర్మగారు మాత్రం ఒప్పుకోలేదు.వెంటనే ఇండియాకు ఆవేశంతో వెళ్లారు. కాని,ఆయనవద్దనుండి చాలాకాలం మాకు ఉత్తరాలు రాలేదు. ఇండియాలో పరిస్థితులెలాగుండెనో మాకు తెలియలేదు.మిగిలిన తొమ్మిదిమందిమి మిలిటరీవిద్యను నేర్పే కాలేజీలలో చేరి పోయాము. అందువల్ల చెదిరిపోయాము.నేను లోగన్ టవున్‌లో యూటారాష్ట్రపు వ్యవసాయకాలేజీలో చేరితిని.

చదువు

ఆకాలంలో వరాధారంవల్లమాత్రమే పండే పంటలను గురించిన వ్యవసాయశాస్త్రంలో,ప్రపంచమంతటిలో ప్రధానశాస్త్ర జ్ఞుడు డాక్టరు విడ్‌ట్జో (Dr. widtsoe) ఆకాలేజి ప్రిన్సిపాలు. ఆయనవద్ద చదువుకోవాలని నాకు ఎంతో కుతూహలంగా వుండేది. మిలిటరీ సబ్జక్టుకూడా నేర్చుకొనుటకు యిష్టపడి చేర్చుకున్నారు. కాలిఫోర్నియా యూనివర్సిటీ ప్రిన్సుపాలు, ఆంగ్లేయులకు సాను భూతిపరుడు.మిలిటరీక్లాసులో మమ్ముల్ని చేర్చుకోటానికి నిరాక రించాడు.మనదేశంలో పండించే చెరుకు,పొగాకు,దూది వగైరా పంటలనుగూర్చి లూజియానారాష్ట్రం కాలేజిలోచేరి నేర్చుకోవాలని కుతూహలపడితిని;కాని,నీగ్రోలు,నల్లరంగుజాతులమీద ద్వేషం విశేషంగా పెరిగిపోయిన ఆ కాలేజీలో చదువుకొనుట దుస్తర మని ప్రిన్సిపాలుగారు నాకు వ్రాసిరి.నేను క్రొత్తగా చేరిన లోగను

కాలేజీలో 800 మంది యువకులు 400 యువతులు ఉండిరి. ఆకాలేజీలో ఆసియాఖండవాసిని నే నొక్కడనే. 12వేలమైళ్ల దూరం నుంచి తమ కాలేజీలో చదవటానికి వచ్చానని ప్రిన్సిపాలు మొదలుకొని విద్యార్థులవరకు నన్ను చూచి గర్వపడ్డారు; నన్ను ఆదరించి సహాయంచేశారు. వారి యిండ్లలో వారి బిడ్డలలాగే కాలంగడిచింది.

మిలిటరీవిద్య చాలా ఉత్సాహంగా నేర్చుకొన్నాను. మిలిటరీ ఆఫీసరు నాకు కావలసిన మాపులు, ప్లానులు అమెరికన్ మిలిటరీడిపార్టుమెంటుకు వ్రాసి తెప్పించి యిచ్చేవాడు. నా ఉత్సాహాన్ని మెచ్చుకొనేవాడు. మిలిటరీట్రెయినింగుకు బలమైనదేహం అవసరం. అమెరికనులతో పోలిస్తే, నా శరీరబలం చాలతక్కువ. అమెరికా చేరినప్పుడు నా తూకం 100పౌనులు మాత్రమే. కాలిఫోర్నియా యూనివర్సిటీలో 3500 విద్యార్థులలో, తూకంలో కట్టకడపటివారు నలుగురూ భారత విద్యార్థులే. బలహీనతవల్ల చలికాలంలో రెండు మూడడుగుల మంచులో (snow) అమెరికను విద్యార్థులతో సమానంగా రైఫిల్ మోసుకుంటూ నేను పరుగెత్తలేకపోయాను; బాయనెట్ ఛార్జి యక్సర్‌సైజు చేయలేకపోతిని. రెండున్నర సంవత్సరాలలో, అమెరికాలో 125పౌనులవరకు నా తూకంపెరిగింది. కొన్ని శిక్షణపోరాటాలలో (mockfights) పాల్గొంటిని. నన్ను బయలుదేరి రమ్మని 1915మేనెలలో గదరుపార్టీనుండి పిలుపువచ్చింది. పరీక్షల సమయం. ఇండియాకు అర్జంటుగా తిరిగిపోవాలనీ, వెంటనే ప్రత్యేక పరీక్షలుచేసి పంపమని కాలేజి అధికారులను కోరాను. లోగడ విద్యార్థులకు లాహిరీ ఒకచక్కని సలహా యిచ్చాడు. బాగా చదివి పరీక్షలలో బాగా మార్కులు తెచ్చుకుంటూ వున్నంతకాలం మన తలితండ్రులు మనలను సంశయించరనిచెప్పి బాగాచదివించే

వాడు. ఆ అలవాటుప్రకారం చాలా ఎక్కువమార్కులు సంపాదించేవాణ్ణి. కాబట్టి ఏడుగురులో నలుగురు ప్రొఫెసర్లు పరీక్షచేయకనే, మామూలు ప్యాసుమార్కులు (అమెరికాలో 60%) యిచ్చారు. మిగిలిన ముగ్గురు పరీక్షచేసి ప్యాసుచేశారు. ఎందరో స్నేహితులు, ప్రొఫెసర్లు, విద్యార్థులు, విద్యార్థినిలవద్ద ఎంతోకష్టంతో శలవుపుచ్చుకొని శాన్‌ఫ్రాంసిస్కో గదరుపార్టీ ఆఫీసుకు హాజరయ్యాను. *

---

* లోగను కాలేజిలో చేరిన కొన్నిరోజులవరకు ఆ దేశంలో సర్వసాధారణమైన వర్ణద్వేషంవల్ల విద్యార్థులు నన్ను వారిహాస్టల్సులో చేర్చుకోలేదు ప్రిన్సిపాలుగారైన డాక్టరు విడ్జుటో, వృక్షశాస్త్రంప్రొఫెసరుగారైన డాక్టరు మైజనుగారు పట్టుపట్టి అన్నిటిలో ముఖ్యమైన బోర్డింగుహావుసులో చేర్పించారు. అమెరికాలో కుటుంబాలవారు తమయిండ్లలో కొందరువిద్యార్థులను పెట్టుకొని తమబిడ్డలలాగే అన్నిసౌకర్యాలు చేస్తూ, పూటకూళ్లయిండ్లవలెగాక, విద్యార్థులు సుఖంగాఉండేలాగుచేస్తారు. ఒక్కొక్కకుటుంబంలో 6 మొదలు 10 మందిని చేర్చుకుంటారు. అట్టి బోర్డింగుహావుసులో నన్ను చేర్పించారు. క్రమేణ విద్యార్థులు నాకు స్నేహితులవుతూ వచ్చిరి. విద్యార్థినులుమాత్రం కొంతకాలం దూరంగానే వుండేవారు. నాఅంతట నేనే స్నేహంచేసుకొనే అలవాటు నాకు అప్పుడూ ఇప్పుడూకూడ లేదు. ఒకానొకసందర్భంలో నా స్నేహితులు త్రాగారు; భోగంయింటికి వెళ్లారు. నేను వారితో కలిసివున్నా త్రాగలేదు, గదిలోకి వెళ్లలేదు. ఈసంగతి కాలేజీలో ఎలాగో తెలిసిపోయింది. అప్పటినుండి ఎంతోమందివిద్యార్థినులు నాకు స్నేహితులయ్యారు. డాన్సుచెయ్యమని బాధపెట్టేవారు. వారియిండ్లకుపిల్చి ఫలాహారాలు యిచ్చేవారు. ప్రేమసంబంధాలతగాదాలు నేను రాజీచేయాల్సి

వచ్చేది. క్రిస్మస్ పండుగలో తమ యిండ్లకు తీసుకెళ్లి తల్లిదం డ్రులకు, బంధుమిత్రులకు పరిచయంచేసి, చాక్లెట్లు, కేకులు బహుమానం యిచ్చేవారు. ఒక సంవత్సరం ఎంతో సౌఖ్యంగా అమెరికను విద్యార్థులతో గడచింది. వివాహానికిముందు వారు ప్రేమించుకొనే పద్ధతి చాలా తమాషాగా వుంటుంది. వారి జీవితా లలో అదొక సౌఖ్యదాయకమైన ముఖ్యఘట్టము. మనము సాధా రణంగా తలంచే కేవల కామవాంఛ,(lust) స్వేచ్ఛా ప్రేమలు చాలా అరుదు. కొన్నినెలలు, సంవత్సరాలు ప్రేమించుకొని, స్నేహితం పెరిగిన తరువాత వివాహమాడుతారు. భార్యాభర్తల మధ్య ప్రేమలు, బిడ్డలను పెంచేపద్ధతి, శిక్షణ, వారి కుటుంబ జీవితం, సంఘజీవితం నాకు అనుభవంలోకి వచ్చేకొద్దీ వారిని చూచి గర్వించేలాగు చేశాయి. స్త్రీలలో నిగ్రహం చూడాలంటే వారిలోనే చూడాలి; నేను ఒక మనిషిని అని గర్వపడేవారిని చూడాలంటే అక్కడే చూడాలి. యుద్ధకాలంలో తల్లిదండ్రులకు గాని, ప్రియురాండ్రకుగాని చెప్పకుండా, రైఫిల్ తీసుకొని రహ స్యంగా వెళ్లి సైన్యంలోచేరే దేశభక్తులను, సాహసవంతులను చూడాలంటే అమెరికాలో చూడాలి. రెండున్నర సంవత్సరాలు అలాంటివారితో నా జీవితం గడిచింది. ఇప్పటి ప్రపంచ రాజ కీయాల్లో అమెరికా ప్రభుత్వపాత్ర అక్రమంగా వున్నప్పటికీ, నా అనుభవంలోని ఆ ప్రజల ప్రజాస్వామిక నాగరికతమీద నాకు ఎంతో గౌరవంవున్నది. అమెరికాకు వెళ్లిన వెంటనే, యూని వర్సిటీలో చేరే సమయంలో ఒక ప్రొఫెసరును నేను "సర్" అని పిలిచాను. "నిన్ను నేను "మిస్టర్" అని పిలుస్తున్నానుగదా, నీవు నన్ను "మిస్టర్" అని పిలవాలి, లేదా "ప్రొఫెసర్" అని

## లాహోరు కుట్రకేసులు.
## (1915 – 1918)

గదరుపార్టీవారిమీద ముఖ్యంగా నాయకులమీద లాహోరులో మూడు కుట్రకేసులు, మాండలే (బర్మా)లో ఒకటి పెట్టారు. అవిగాక గదరుపార్టీ ప్రోత్సాహంతో ఇండియా గవర్నమెంటు సైన్యం తిరుగుబడినందువల్ల, సైనికులమీద పెట్టినకేసులు ఇంకనూ ఎన్నో ఉన్నాయి. షుమారు 5000 మంది పంజాబీయులు డెటిన్యూలుగా వుండిరి. వీరుగాక శిక్షింపబడినవారు ఎన్నోవందలు. అదేకాలంలో బెంగాలులో ఎన్నో కేసులు జరిగాయి. అక్కడకూడా షుమారు 5000మంది డెటిన్యూలు గానుండిరి. కొన్ని వందల మంది శిక్షింపబడిరి. బెంగాలు కేసులతో నాకు సంబంధములేదు. గదరుపార్టీకిన్ని బెంగాలు విప్లవపార్టీకిన్ని సంబంధాలుండినయి. నాకు గదరుపార్టీకేసులతోమాత్రమే సంబంధముండినది.

---

పిలవాలిగాని, "సర్" అని పిలువ కూడదు. అమెరికాలో మేము ఎంత గొప్పవానినిగాని "సర్" అని పిలువము. త్వరలో అమెరికా ప్రజాస్వామిక పద్ధతులను నేర్చుకో" అని ప్రప్రథమములో నేర్పాడు. ఆ స్వేచ్ఛావాతావరణం, ఆ స్వతంత్రభావాలు, సమతాబుద్ధి చూచి అమెరికన్ నాగరికులయెడ నాకు ఆ కాలంలో ఎంతో గౌరవము, కృతజ్ఞత కలిగింది. ఈలాంటి ప్రజలను, నాగరికతను, స్నేహితులను విడిచిపెట్టి రావడం చాలా కష్టమని పించినది. అయితే మన భారతదేశాన్నికూడ స్వతంత్ర దేశంగా చెయ్యాలిగదా! వెంటనే స్వతంత్ర యుద్ధానికి, గదరు పార్టీ యిచ్చిన పిలుపును సంతోషంతో అందుకున్నా.

## సైన్యంలో కల్లోలం

యుద్ధం ప్రారంభంకాగానే, గదరుపార్టీలో చేరిన పంజాబీయులు అమెరికానుండి మాత్రమేగాక అనేక విదేశాలనుండి ఇండియాకు వచ్చిరి. వారి ముఖ్యోద్దేశం సైన్యంలో చేరిగాని, సైన్యంలో వుండే తమ బంధుమిత్రుల సహాయంతోగాని, బ్రిటిష్ ప్రభుత్వంమీద సాయుధపోరాటం జరపాలని, స్వాతంత్ర్యం సంపాదించాలని. వీరు గదరుపార్టీ సాహిత్యాన్ని ఇండియాకు తెచ్చారు. ప్రభుత్వాధికారులకు కొంపరి వద్ద సాహిత్యందొరికింది. అప్పట్నుంచి ప్రయాణీకులను ఇండియా రేవులవద్ద జాగ్రత్తగా సోదాచేసేవారు. ఈ కారణంచేత, తరువాత తరువాత గదరుపార్టీ సాహిత్యం తెచ్చుటకు వీలుపడలేదు. అప్పుడు మరొక ఉపాయం చేశారు. మన పూర్వులు వేదాలు పఠించి వల్లించినట్లు వల్లించి, ఇండియాలో దిగగానే కాగితాలమీదికెక్కించి, సైక్లోస్టైలుచేయించిగాని, అచ్చు వేయించిగాని సైన్యంలో ప్రచారం సాగించారు. మొదటి గ్రూపు (ముఠా) ఇండియాలో సైన్యం తిరుగుబాటుచేయుటకు ఒకతేదీని నిర్ణయించింది. సావర్కారుగారి 1857 సం॥పు స్వాతంత్ర్య యుద్ధమనే పుస్తకంలో విప్లవవైఫల్యానికి ముఖ్యకారణం, అందరూ నిర్ణయింపబడినరోజున తిరుగబడక ముందుగా మంగళ్‌సింగ్ మొదలగు వీరులు తిరుగబడుటవల్ల చాలా హాని కలిగిందని వ్రాశారు. ఇప్పుడు గదరువీరులు ఒకేరోజున తిరుగుబాటు చెయ్యాలని తీర్మానించుకొన్నారు. కాని గదర్‌పార్టీలో చేరుతామని వచ్చిన వారందరిని విచక్షణలేకుండా చేర్చుకుంటూ వచ్చినందున, ఎందరో సి. ఐ. డీ. లుచేరి సర్కారుకు ఎప్పటి సమా

చారాలు అప్పుడు అందజేస్తూవచ్చారు. కాబట్టి నిర్ణయింపబడిన తేదీనాటికి, మిలిటరీ డిపార్టుమెంటు సైన్యాలను వేరువేరు ప్రదేశాలకు, దేశాలకు మార్చివేసింది. చివరకు అందరిని ఫ్రాంసుకు తీసుకువెళ్ళారు. పోవుటకు నిరాకరించి తిరుగబడ్డ కొందరు సైనికులను జెయిళ్ళలో వేశారు. కొందరు కాల్చబడ్డారు. ఫ్రాంసు చేరిన తరువాత అక్కడ పరిస్థితులెలాగున్నాయనగా జర్మనులను వైప్రస్ గండి దాటకుండా ఇంగ్లీషుసైన్యమూ, వర్డుమ్ దాటకుండా ఫ్రెంచి సైన్యం హోరాహోరిగా పోరుచుండిరి. ఒక్కొక్కప్పుడు కుప్పలు తిప్పలుగా చచ్చిపోతూవుండిరి. లక్షల ఇండియా సైనికులు వైప్రసు యుద్ధానికి తీసుకరాబడ్డారు. జర్మనులతో యుద్ధం చెయ్యడం వారికి యిష్టంలేదు. ఇంగ్లీషువారిని నాశనం చెయ్యడమే వారికి యిష్టము. వీరు ఎలాగయినా ఓడిపోవాలి. కందకాలలో తమ ఆఫీసర్లయిన యింగ్లీషువారిని కాల్చిచంపుతూవుండిరి. ఎక్కువగా తమ ఆఫీసర్లు చావడంవల్ల, సైనికుల విప్లవ రాజకీయ భావనలను గ్రహించి వెంటనే వైప్రసు యుద్ధానికి పంపారు. ఎదుట జర్మను సైన్యం; వెనుక ఇంగ్లీషు సైన్యం మెషీను గన్‌లతో సన్నద్ధులైయుండిరి. ఈ వ్యూహంవల్ల మన భారతీయసైనికులకు ఎటుచూచినా మరణం తప్పేట్టులేదు. అప్పుడు చాలా మంది రైఫిల్సుపారేసి, జర్మనువైపు వెళ్లారు. జర్మనులు వారిని ఆహ్వానించి గౌరవించారు. ఇలాంటివారు లక్షలమంది యుద్ధంలో చచ్చిపోగా వేనవేలమంది జర్మను యుద్ధఖయిదీలుగా వుండిరి.

ఆకాలంలో టర్కీదేశము జర్మనీతో కలసి ఇంగ్లాండు మీద యుద్ధంచేస్తోంది. అప్పుడు టర్కీ మిలిటరీ ఆఫీసర్లు భారత సైనికులను తమతోచేరి ఇంగ్లీషు సైన్యంతో పోరాడమని

కోరారు. వేలాది ముసల్మాను సైనికులు టర్కీ సేనలోచేరి మెసపొటోమియా మొదలయిన ప్రదేశాలలో ఆంగ్లేయులతో పోరాడిరి. కడపటికి కొన్నివేలమంది టర్కీలో స్థిరనివాసం ఏర్పరచుకొని టర్కీ స్త్రీలను వివాహమాడి, టర్కీ గవర్నమెంటు యిచ్చిన భూములను దున్నుకుంటూ ఆ దేశవాసులయిరి.

ఈలాగు ప్రచారాలు, కుట్రలుచేసి. తిరుగబడేలాగు చేశారని గదరు నాయకులమీద కేసులు పెట్టిరి. లాహోరు మొదటి కేసు, మొదటి సప్లిమెంటరీకేసు పై విషయాలకు సంబంధించినవి. చాలామంది ఉరితీయబడిరి. ఎందరో అండమాన్లకు పంపబడిరి. వీరే ప్రసిద్ధికెక్కిన గదరు బాబాలు. ఇంకనూ దేశసేవ చేయుచునే ఉన్నారు. వీరికి నాయకులుగా పనిచేసి ఉరితీయబడిన కర్తారుసింగు, కేదార్ నాథ్ మా [illegible] విప్లవ విద్యార్థులలో చేరినవారే. నాతోకలసి గదరుపార్టీ సంస్థాపన నుండి సభ్యులుగా చేరి, లాహిరీ వద్ద తర్ఫీదు పొందిరి. ఈలాంటి వీరాధి వీరులు నా మిత్రులు అని గర్వపడుచున్నాను.

నాకు సంబంధించిన కుట్ర కేసులను మరొకచోట వ్రాస్తాను.

## బర్మాను పట్టు కోవాలి (1915 సం॥)

ప్రధమ ప్రపంచ యుద్ధంలో పరిస్థితులు మారిపోతూ వచ్చాయి. అలాగే గదరుపార్టీలో ప్లానులు మారుతూ వచ్చాయి.

యుద్ధానికి ముందుగా కొందరు బెంగాలీ విప్లవ నాయకులు ప్రభుత్వం పెట్టే బాధలు పడలేక, అనేక కుట్ర కేసులలో అరెస్టులు తప్పించుకొని ఇండియా విడిచి వెళ్ళిరి. వీరు జర్మనీలో

ఉంటూ వచ్చారు. ఇండియా స్వాతంత్ర్యముకొరకు కొన్ని ప్లానులు వేస్తూనే వుండిరి. యుద్ధం ఆరంభంకాగానే జర్మనీ కైజరు ప్రభుత్వ సహాయం పుచ్చుకొని, బ్రిటిష్ ప్రభుత్వాన్ని పడగొట్టడానికి ఒక ప్లానువేసి సాగిస్తూ వచ్చారు. యూరపు, అమెరికాలలో గడుపు చుండిన భారత విద్యార్థులలో 250 మందికి జర్మనీలో యుద్ధ శిక్షణ యిప్పించుటకు ఏర్పాట్లు అయినవి. అమెరికాలో బి. ఎ. లేక బి. ఎస్. సి. ప్యాసయినవారికి మాత్రమే యీ అవకాశం లభించింది. అందువల్ల నాకు లభించలేదు; రెండవమాటు అవకాశం యిస్తా మన్నారు. లాహిరీ మొదటి గ్రూపులో జర్మనీకి వెళ్లాడు. కొంతకాలానికి యూరపులోఉండే ఇండియా విద్యార్థులు చాలామంది చేరిపోవుచుండినందున అమెరికానుండి క్రొత్తవారిని తీసుకోలేదు. అందువల్ల నాకు ఆ ఛాన్సు లభించలేదు. నన్ను ఇండియావైపు వెళ్లమని ఆజ్ఞాపించారు.

లోగన్ టవున్లో బయలుదేరేసమయంలో చాలామంది స్నేహితులు, స్నేహితురాండ్రు సాగనంపడానికి మాయింటికి వచ్చారు. కొంపౌండు గేటు చేరీ చేరగానే ఒక పోష్టుబంట్రోతు నాకు ఒక కార్డు యిచ్చాడు. అది గుంటూరునుండి శ్రీ బి. యస్. శర్మగారు వ్రాసినది. "అమెరికాలో తీవ్రమైన ఉత్సాహం వున్నది. కాని ఇక్కడ ఎంతమాత్రం ఉత్సాహకరంగాలేదు" (It is red hot there, but it is ice cold here") అని వ్రాశారు. నేను నిర్ఘాంతపొయ్యాను. "నే నిప్పు డేమి చెయ్యాలి? పార్టీ తీర్మానం ప్రకారం నేను సేన్‌ఫ్రాన్సిస్కోకుపోయి పార్టీ యిచ్చిన కార్యక్రమం చెయ్యడమా లేక మానివేయడమా" అని ఒక నిముషం ఆలోచించి, కార్డును చించేసి రైలు ఎక్కాను.

పగలు పన్నెండు ఘంటలకు గదరుపార్టీ ఆఫీసుకు చేరాను. "స్టీమరు 2 ఘంటలకు జపానుకు బయలుదేరుతుంది. పార్టీవారు ఇద్దరు దానిమీద వెళ్లుతున్నారు. నీవు వెంటనే బయలు దేరుతావా? లేక ఒక వారం తరువాత వెళ్లుతావా?" అని రామచందర్ (గదరు పార్టీ పత్రిక కొత్త సంపాదకుడు) అడిగాడు. అప్పుడు పార్టీకి అమెరికాలో ప్రధాన నాయకుడు ఆయనే. "నాకు ఇక్కడ పనేమీలేదు. ఇప్పుడే బయలుదేరుతాను" అని స్టీమరు ఎక్కాను. అంతవరకు ప్లాను ఏమిటో, నే నేమిచెయ్యాలో, ఎక్కడ పని చెయ్యాలో, ఒకటీకూడ నాకు తెలియదు. స్టీమరుమీద తెలుపుతారు అని చెప్పారు. జర్మను కాన్సలు యిచ్చిన కొన్ని ఉత్తరాలను మనీలాలో జర్మను రాయబారికి యిమ్మని నా చేతికిచ్చారు. దానినిబట్టి నేను ఫిలిప్పీన్ దీవులకు వెళ్ళుతున్నానని తెలిసింది. రెండుస్టీమర్లు ఆయుధాలతోనింపి జర్మనులు అమెరికానుండి పంపారు. ఒకటి బెంగాలులో సుందరవాను దీవులలో అడవులలో ఆయుధసామగ్రిని దింపేటందని వింటిని. రెండో స్టీమరు ఆయుధాలను సయాములో రహస్య ప్రదేశములో దింపేయాలి. ఆ సామగ్రిని బర్మా పట్టుకొనడానికి మా గ్రూపు ఉపయోగించాలి. నా చేతికి యిచ్చిన ఉత్తరాలు ఈ రెండవ స్టీమరుకు సంబంధించినవే.

ఇప్పటినుంచే సాహస కృత్యాలు ఒక దాని తరువాత ఒకటి ప్రారంభమయ్యాయి. హరిదయాళుగారి దేశభక్తి ప్రబోధం, లాహిరీ యిచ్చిన శిక్షణ ఈ పరిస్థితులలో నాకెంతో తోడ్పడ్డాయి. ఈ సాయుధ విప్లవాలు సాగించటానికి తెగించి ప్రాణాలు బలిపెట్టాల్సిందే.

స్టీమరుమీద ఇద్దరు గదరుపార్టీవారు ఉన్నారు—బెంగాలీ యువకుడు చటర్జీ; పంజాబీ జోద్‌సింగ్. చటర్జీ ఒక విద్యార్థి కుడు. హిందూ వేదాంతం మొదలయిన విషయాల మీద ఉపన్యాసా లిస్తూ అమెరికాలో సౌఖ్యంగా జీవితం గడిపేవాడు. సంగీత, సాహిత్య, చిత్రలేఖనములలో ప్రవేశంవుంది. శరీరానికి సిల్కు బట్ట తప్ప మరే బట్టగాని అంట కూడదని తీర్మానించుకొన్న వ్యక్తి. భోగి; త్యాగి; సాహసుడు. ఎలాంటి క్లిష్టసమయంలో కూడా ఏదో ఉపాయంచేసి తప్పించుకొనే నేర్పరి. బెంగాలులో టెరరిష్టు ఉద్యమాలలో జైళ్లకు వెళ్లాడు. ఇండియా నుండి విదేశ ప్రభువులను పారదోలి స్వరాజ్య సంస్థాపనకు ఉద్యమించిన వ్యక్తి.

జోద్‌సింగు జర్మనీ నుండి వచ్చాడు. అసలు ప్లాను అత నికి బాగా తెలుసు. ఈ ప్లానును ముందుముందు విపులీకరిస్తాను. బర్మా పట్టుకోవాలి అనే ఉద్యమములో పాల్గొనడానికి వచ్చాడు. రిక్రూట్సును సంపాదించడం అతని ముఖ్యపని. అందుకుగాను ఉత్తర దక్షిణ అమెరికాలు సంచారంచేసి వచ్చాడు. అయితే చాల పిరికివాడు. సి.ఐ. డీ. లని అందరినీ అనవసరంగా అనుమానిస్తూ వుంటాడు. ఎవరినీ నమ్మడు. ఏ రహస్యాలులేని మామూలు మాటల సందర్భంలోకూడా కండ్లు అటూ ఇటూ త్రిప్పి "వాడు సి. ఐ. డి, వీడు సి. ఐ. డి, అంటాడు. టేబిల్ వద్ద భోంచేసే సమయంలో కూడా తల త్రిప్పుతూనే వుంటాడు. కండ్లలో భయంతో కూడిన చూపులు. స్టీమరుమీద ఎవరితో మాట్లాడినా "ఎందుకు మాట్లాడావు"అని ఆక్షేపణ చేస్తాడు. స్టీమరుమీద ఒక జపాను విద్యావతి మాతృ దేశానికి ప్రయాణం చేస్తూవుంది. నేను ఆమె స్నేహితులమయ్యాము. ఆవిడతో మాట్లాడ వద్దంటాడు.

మాగదికి వస్తే, తన పెట్టెలు ఏవో చూడడానికే వచ్చిందంటాడు. జపాను చేరడానికి 12రోజుల ప్రయాణం. ప్రాణంమీద విసుకె త్తించాడు. వీడితో నే నెలా కలసి పనిచెయ్యడం? అమెరికానుండి నాకు యివ్వవలసిన ప్రయాణం ఖర్చులు యివ్వడం మానేశాడు. కాని, నా స్వంత డబ్బు చేతినిండా వుంది.

మేము మనీలా వెళ్లాలి. హాంగుకాంగు సింగపూరు మొదలయిన బ్రిటిష్ రేవులకు వెళ్లకుండా తప్పించుకొంటూ మేము ప్రయాణం చేస్తూ వుండాలి. మనీలాలో జర్మను మిలిటరీ ఆఫీసర్లు, రాయబారి, మేము కలసి ముందు కార్యక్రమాన్ని నిర్ణయించుకోవాలి.

సన్‌యట్ సేన్ సందేశం.

జపానులో సన్‌యట్ సేన్ గారిని సందర్శించాను. ఆయన కుమారుడు ప్రస్తుత చైనా కొమింటాంగ్ ప్రభుత్వ ప్రధాన మంత్రి. సన్‌ఫో * నేను కాలిఫోర్నియా యూనివర్సిటీలో కలసి చదువుకొన్నాం.సన్‌యట్‌సేన్ చైనాలో 1911 ప్రాంతంలో

* సన్‌ఫో సన్‌యట్‌సేన్‌గారి ప్రథమభార్య పుత్రుడు. ఆమెను డైవోర్స్‌చేసి తనకు ప్రయివేటు శక్రటరీగా పనిచేయుచుండిన మిస్ సూంగును (మదాం చాంకైషేక్ అక్కను) వివాహమాడిరి. సన్‌ఫో అప్పుడు మాతో చదువుచుండిరి. తండ్రి మీద ఆగ్రహం ఏర్పడింది. తండ్రి పంపుతూవుండిన డబ్బును తీసుకొనుటకు నిరాకరించాడు. భుక్తి కొరకు ఒక కాఫీ హోటలు స్థాపించాడు. దానిలో సంపాదించేడబ్బుతో కాలేజీలో చదువుకొంటూ వచ్చాడు.

రిపబ్లిక్కును స్థాపించి, మొదటిప్రెసిడెంటుగా వుండి, విప్లవకార్యక్రమాన్ని జయప్రదంగానడుపుటకు అవకాశంలేక "వార్‌లార్డు" అయిన యూన్షికాయికి ప్రెసిడెంటుపదవిని వదలివేసి, చివరకు ఆయన కుట్రలనుతప్పించుకొని, జపానులోఉంటూ, చైనాలో రెండవ ప్రజావిప్లవానికి ప్రయత్నాలు చేస్తూనేవుండిరి.

టోకియోలో ఆయన అడ్రసు లభించక, చివరకు జపాన్ సీ.ఐ.డి. కేంద్ర కార్యాలయానికి వెళ్ళి అడిగాను. వారు నన్ను ఎన్నోప్రశ్నలువేసి కడపట ఒకఆఫీసరు నన్ను తనకారులో సన్‌యట్‌సేన్‌గారి యింటివద్ద వదలిపెట్టివెళ్లాడు. నా విజిటింగుకార్డును పంపగానే సన్‌యట్‌సేన్ సర్వసామాన్యమైనబట్టలతో ఎదురువచ్చి చేతులుపట్టుకుని తనకుమారుని చూచినట్టు వాత్సల్యంతో నన్ను లోపలికి తీసుకెళ్ళాడు. తనకుర్చీలో నన్ను కూర్చోబెట్టి యినుపకుర్చీలో కూర్చున్నాడు. అంత కన్న చవుక కుర్చీలు, బట్టలు ఏ బీదవాని ఇంటిలోనూ ఉండబోవచ్చు. అతి నిరాడంబరజీవి.

"ప్రపంచంలో అనేక దేశాలనుజయించి, పీల్చి పిప్పిచేస్తూవున్నది ఈ బ్రిటిష్ సామ్రాజ్యప్రభుత్వం. చైనాను కబళించి ప్రపంచాన్నే ఏలాలని ఆంగ్లపెట్టుబడిదారుల కోరిక. జపానుకు ద్రవ్యమిచ్చి ఆయుధాలనిచ్చి, వేటకుక్కలను ఉసికొల్పినరీతిగా చైనామీదికి పురికొల్పి, చైనాను కాలికింద రాచేస్తున్నది. ఇంగ్లాడు ఈ ప్రపంచయుద్ధంలో ఓడిపోయి దాని ఆ సామ్రాజ్యనాశనం కానిది చైనాలో స్వాతంత్ర్యంగాని, ప్రజాప్రభుత్వంగాని స్థిరంగా ఏర్పడజాలవు కొబట్టి ఇండియాలో భారతీయులు ఆంగ్లేయప్రభుత్వాన్ని కూలద్రోసిననాడు చైనాకు విముక్తికలుగుతుంది. భారతీయులు చేసే విప్లవప్రయత్నాలన్నీ నాకెంతో నచ్చాయి"అని అన్నాడు సన్

యట్ సేన్."జపాను మీకు ముఖ్యశత్రువుకాదా" అని ప్రశ్నించాను. జపాను వాస్తవంగా బలహీనమైనదేనని,ఒంటరిగా చైనాను పట్టు కొని రాజ్యం చెయ్యజాలదని,ఇంగ్లాండు ఆసరాతో నాటకమాడుతూ న్నదని చెప్పి, బ్రిటిష్‌సామ్రాజ్యాన్ని ఇండియాలో నాశనం చెయ్య నంతవరకు మానవజాతికి శాంతి—సౌఖ్యాలు ఏర్పడజాలవని నొక్కి చెప్పాడు. నాకు యీ ఉపదేశం ఎంతో నచ్చింది. నేను చేయబూను కొన్న పనులలో ఎంతో ఉత్సాహంకలిగించింది. సన్‌యట్‌సేన్ గారి ఆశయాలు, త్యాగాలు ఎంత ఉన్నతమైనవో వారి జీవితం అంత సామాన్యమైనది.

బ్రిటిష్ ప్రభుత్వాన్ని తలక్రిందులు చెయ్యాలి:

స్టీమరులో మనీలానగరం( ఫిలిప్పైన్‌దీవులు ) చేరాము. ఆయుధాలనుతెచ్చిన రెండవస్టీమరుకు సంబంధించినఉత్తరాలను జర్మనురాయబారికి యిచ్చాను.చటర్జీ,జోద్‌సింగ్,నేనూముగ్గురమూ మూడు ప్రత్యేకహోటళ్లలో చేరాము.జోద్‌సింగుతో మాట్లాడటం మానేశాను.నేను ఒకస్పానిష్ హోటల్లోఉంటిని.ఒకరాత్రి దిండు క్రింద పర్సుపెట్టుకొని,గదితలుపుతెరచి పడుకొని నిద్రపోతుంటిని. తెల్లవారేసరికి నా పర్సులేదు.రాత్రి కాపలావాడే దొంగిలించి పారిపోయాడు. రొఖ్ఖమూ,నోట్లూ పోయాయి. అంతర్జాతీయ ప్రయాణీకుల బ్యాంకు చెక్కులు(ఇంటర్‌నేషన్ టూరిష్టుచెక్కులు) మాత్రము మిగిలాయి. ఏ బ్యాంకుకు వెళ్లి రొఖ్ఖం యిమ్మన్నా బ్రిటిష్‌కాన్సల్ అనుమతిలేనిది యివ్వ మన్నారు. కాన్సలువద్దకు వెళ్లగా "ఈ దేశంలో నీకు ఏంపని? బెంగాలీవాడివా? బాంబులువెయ్యడానికి వచ్చావా? జర్మనువాళ్లతో సంబంధం వుందా? బ్యాంకునోట్లు మార్చుకొనడానికి అనుమతియిచ్చేదిలేదు"

అన్నాడు. ప్రయాణం ఖర్చులకు యివ్వవలసిన జోద్‌సింగ్ యివ్వడు.మాకార్యక్రమాన్ని తీర్మానించవలసిన జర్మను మిలిటరీ ఆఫీసర్లు రాలేదు.హోటల్లో నుండి వెళ్లిపొమ్మన్నారు. ఎన్నిరోజులు ఊరకే ఉండనిస్తారు?

ఎక్కడికి పోవాలి? ఎలాగు జీవించడం? పూరంతా తిరిగాను.విచారించాను.అమెరికాలో పొందిన ట్రెయినింగువల్ల ఏ విధంగానైనా గౌరవంగా ఏదేశంలోనైనా జీవించగలననే నమ్మకం నాలో ఉంది.ఆసియా ఖండంలో ఏ రేవుపట్టణానికి వెళ్లినా ఫాన్సీవస్తువులు అమ్మే సింధివర్తకులు,కాపలాపనులు చేసే పంజాబీయులు (మన నగరాల్లో గూర్ఖాబ్రోతుల్లాగ) ఉంటారు వీరిని కలుసుకొనగా కాపలానౌకరీకి పగలుచేసేవారికి నెలకు రు 90-0-0 అనీ,రాత్రిళ్లుచేసేవారికి రు 120-0-0 అనీ తెలిసింది. రాత్రికాపలానౌకరీ కుదుర్చుకొన్నాను.ఇంతలో జర్మను మిలిటరీ ఆఫీసర్లు వచ్చారు.ప్లానులు పూర్తిఅయినాయి.కాపలానౌకరీ అవసరం లేకపోయింది.

జర్మనీలో బెంగాలీ విప్లవనాయకులు తయారుచేసిన ప్లానునుగురించి వివరాలు తెలిశాయి: ఇండియాలోవుండే బ్రిటిష్ సైన్యము చాలాకొద్ది. ఇండియాలో శాంతిభద్రతలుపోయి,మన సిపాయీలుగాని ప్రజలుగాని ఎదురుతిరిగేతే, ఇండియా పెద్ద దేశమయినందున అడవులు, కొండలు, నదులు విశేషంగావున్నందున గొరిల్లాయుద్ధాలకు ఎన్నో అవకాశాలున్నాయి. తిరిగి శాంతి భద్రతలు ఏర్పడుటకు ఎన్నో లక్షలసైన్యము, ఎన్నో సంవత్సరాలు అవసరమవుతుంది. ఇండియాను పోగొట్టుకొనుటకు ఇంగ్లాడు ఎంతమాత్రం యిష్టపడదు. బ్రిటిష్ సేనలను ఇండియాకు విరివిగా పంపు

తుంది.అందువల్ల జర్మనులతో యుద్ధంచేయుటకు సైన్యం చాలదు.యూరపులో ఆంగ్లేయులు ఓడిపోతారు.ఓడిపోయి ధైర్యము.బలము క్షీణించిన ఈ విదేశప్రభువులను ఒక లెంపకాయ వేస్తే వెళ్లిపోతారు.ఇండియాకు స్వతంత్రం వస్తుంది.ఇది జర్మనీలోని బెంగాలీ విప్లవనాయకుల యోచన.

ఇండియాలో అశాంతిని రేపడంఎలాగు ? (1) ఇండియా సైన్యంలోచేరి తిరుగుబాటుచెయ్యడం, (2) అరేబియాసముద్రం మొదలు బంగాళాఖాతం వరకు ఇండియాకు ఉత్తరాన కొండలు బారులుతీరి ఉన్నాయి. ఈకొండలలో నివసించేవారు నాగరికులు కారు.వారికి యూనిఫారం దుస్తులు, తుపాకీ యిచ్చి సిపాయి అని పేరుపెడితే ఎవరిని కాల్చివేయమంటే వారిని కాల్చివేస్తారు. ఇలాంటివారితోచేరి దబ్బిచ్చి సైనికులను తయారుచెయ్యాలి. (3) జర్మనుసైన్యం ఇండియావైపు వస్తున్నది.ఇండియా ప్రభుత్వం వణుకుతూవుంటుంది.ఇండియా కొండలలో తరిఫీదు అయిన సైన్యం మైదానాలమీద పడాలి.ప్రభుత్వసేనలు కొన్ని తిరుగబడేలాగు చెయ్యాలి.ఈవిధంగా బ్రిటిష్ మిలిటరీబలం నాశన మవుతుంది;పోలీసులు,మాజిస్ట్రేటులు పారిపోతారు;ప్రభుత్వం ప్రజలవశమవుతుంది;ఇవీ అప్పట్లో మా ఆలోచనలు. (4) జర్మనీకి వెళ్లుటకు వీలుపడక విదేశాలలో నిలిచిపోయిన జర్మను ఆఫీసర్లు మాకు సహాయంచెయ్యాలి (5) ఈపనులను కొనసాగించటానికి రెండుష్టీమర్లనిండా ఆయుధాలను జర్మనులు అమెరికాలో కొని పంపాలి. (6) ఖర్చులన్నిటికి జర్మను గవర్నమెంటు రెండుకోట్లరూపాయలు యిస్తుంది.

పైప్లానులో ఒకభాగం సయాము కొండలుదాటివచ్చి

బర్మాను పట్టుకోవాలి. ముందుగా కొందరు బర్మాలోని భారత సైనికులను కలుసుకొని వారు తిరుగబడుటకు ఏర్పాట్లుచెయ్యాలి.

జావాలో బటేవియానగరం వెళ్లి ఆయుధాలష్టీమరు రాగానే సయామునకు పంపి రహస్యమైన సముద్రతీరంలో ఆయుధాలను దింపించివేయుటకు నన్ను వెళ్లమన్నారు అటుతరువాత జావాలో ఒక అచ్చాఫీసును కొని ద్రావిడభాషలు నాల్గింటిలోను గదరుపత్రికను ప్రచురించి ఇండియా వెలుపలిదేశాలలో ఉండే మనప్రజలకు విప్లవపత్రికలను, సాహిత్యాన్ని అందచేయమని కోరారు. నేను ఇలాంటి ప్రాంతపనులకు ఒప్పుకోలేదు. బర్మాను పట్టుకొనుటకు నియమింపబడిన ఎనిమిదిమంది ముఖ్యులలో ఒకనిగా నన్ను చేర్చుకున్నారు. సయాములో మా కేంద్రం ఉండాలి. మలయా, జావా, చైనా మొదలయినదేశాలను డి మాలో చేరే ఇండియన్ సిక్కుజాతులను సయామునకు రప్పించాలి. కొండల మీదుగా బర్మాలోకిపోయి యుద్ధంచెయ్యాలి.

అమరసింగు మలయాదేశంలో కంట్రాక్టరు, గదరుపార్టీ ఆర్గనైజరు బర్మాలోని భారతసైన్యంతోను, మిలిటరీపోలీసులతోను (30000 పంజాబీయులు) రహస్య ఏర్పాట్లు చేయుంచడం ఆయన పని. ఈసందర్భంలో శివసింగు ఆయనకు సహాయం చెయ్యాలి.

బల్వంతసింగ్ గ్రంధి కెనడాలో వాంకోవరు నగరంలో సిక్కులసంఘం. ఆయన మా ఎనిమిదిమందిలో ఒకరు; యుద్ధసంబంధమైన విషయాల్లో ఆయన మా నాయకుడు. కొద్దివయసప్పుడు ఇండియాసైన్యంలో చేరాడు. యుద్ధాలు చేశాడు. ఆయన, చటర్జీ, నేను కాల్బలానికి (Infantry) ఆఫీర్లం. ముగ్గురు జర్మనులు ఫిరంగిదళాలకు ఆఫీసర్లుగా చేరారు. ఇవన్నీ ఇప్పుడు

నాకే నవ్వుపుట్టిస్తాయి:అనేక లోపాలుకూడా ఇప్పుడు కన్పడుతున్నై.ప్రజలను సంఘటితపరచి.వారు విప్లవకార్యక్రమంలో పాల్గొనేలా చెయ్యకపోతే అపజయం తప్పదని ఇప్పుడు నాకు బాగా తెలుసు:ఒక్క సైన్యమే తిరుగబడినంతమాత్రాన జయం రాదనికూడా ఇప్పుడు నాకు తెలుసు.కాని,ఆకాలంలో ఇవన్నీ సాధ్యంగానే తోచాయి మాఅందరికీ.

మనీలానగరంనుండి సయాముకు ఎలా చేరడం ? సింగపూరు రేవులోగాని,హాంగ్‌కాంగురేవులో గాని ఆగకుండావెళ్లే ష్టీమర్లు ఉండవు.ఆ రెండురేవుల్లో బ్రిటిష్‌ప్రభుత్వం అరెష్టు చేస్తుంది. వేరే ప్రత్యేకప్లాను అవసరం.చైనాసముద్రతీరంలో అంతర్జాతీయమైన రేవుపట్టణాలున్నై.అక్కడికి నేరుగావెళ్లే చైనా స్టీమర్లలో వెళ్లాము.అక్కడ ప్రత్యేకంగా ఒకష్టీమరును ఏర్పరచుకొని హాంకాంగులో ఆగకుండా సరాసరి సయాంలో బాంకాక్ నగరం చేరాము.

సయాము స్వతంత్రరాష్ట్రమని,మమ్మల్ని అరెష్టుచేయరని, చేసినా అంతర్జాతీయ చట్టంప్రకారం మేము ఏ విదేశరేవులోనుంచి వచ్చామో ఆరేవుకు పంపివేయగలరేగాని మరే హాని జరగదని తీర్మానించుకొని వెళ్లాము.

చటర్జీ, జోద్‌సింగు, నేను, బాంకాకులో వేరేవేరేహోటళ్లలో చేరాము.వెళ్ళిన సాయంత్రమే కార్యక్రమం ప్రారంభించాము. ఒక పంజాబీ మిఠాయి కొట్లో యజమానికి సంగీతంమీద ఇష్టమన్నసంగతి చటర్జీ గ్రహించి పాటలు పాడమని తానే పాడడం ప్రారంభించాడు. గుంపులు చేరారు;తబలాలు వచ్చాయి; అభినయాలు, నాట్యాలు ప్రారంభమైనై; విందు చేశారు. మాకు

స్థానికంగా కావలసిన సదుపాయాలు ఏర్పడ్డాయి. బలవంతసింగు, ఠాకుర్ సింగు షాంగై నుండి వచ్చారు. అమరసింగ్, శివదయాళ్ బర్మాలో సైన్యాలలో ఆలోచనలు పూర్తి చేసికొనివచ్చారు. సయాం కొండలమీదుగా మేము చిన్నసైన్యంతో బర్మాలోకివెళ్ళి యుద్ధం ప్రారంభించగానే భారతసైనికులు మాతో చేరిపోతామన్నారు.

సి. ఐ. డీ. లు

అయితే ఇండియాగవర్నమెంటుకు సంబంధించిన సి. ఐ. డీ.లు పంజాబునుండి వచ్చారు. మావెంటపడ్డారు. మా రహస్యాలను తెలుసుకుంటున్నారు. సయాంగవర్నమెంటు పోలీసుడిపార్టుమెంటులో ముఖ్యోద్యోగులు ఆంగ్లేయులే. వారు ఇండియా పోలీసుడిపార్టుమెంటులో ఇన్స్పెక్టరు జనరలు, సూపరింటెండెంటు ఉద్యోగాలు జేసి రిటైరై ఫించన్లుపుచ్చుకుంటూ, సయాం పోలీసు డిపార్టుమెంటును తమ హస్తగతంచేసుకొన్నారు. కాబట్టి పోలీసు శాఖ మాకు విరోధంగా పనిచేసింది.

ఈబాధలనుండి తప్పించుకొనుటకు కొండలకు, అడవులకు వెళ్ళడం మంచిదని నిర్ణయించుకున్నాం. బాంకాకులో కొంతకాలం ఒకరుమాత్రం ఉండివచ్చేవారిని రహస్యప్రదేశాలకుపంపుతుండాలి. బహిరంగంగావుంటూ, రహస్యకార్యకలాపాలను నిర్వర్తించడానికి నేను బాగా ఉపయోగపడతానని వారినిర్ణయం, కారణం నేను వొక్కడినే యూనివర్సిటీలో చదువుకొన్నవాడిని; బి. ఎస్.సి.ని; బాంకాకు కాలేజీలో వృక్షశాస్త్రప్రొఫెసరు పదవి ఖాళీ అయింది.ఆ వుద్యోగం సంపాదించుకోమని నన్ను ఆజ్ఞాపించారు. 1-2 నెలలో రహస్యాలు బయటపడేలోగా నా పనులు పూర్తిచేసికొని కొండలకు చేరుకోవాలి. కాలేజీకి దరఖాస్తుచేశాను. పేరుకూడా మారుపేరే

ఉద్యోగం నాకే యిస్తామన్నారు. కాని, ఈ ప్లాను పూర్తి కాకముందే ఒక తప్పు జరిగింది.

బాంకాకుకు ఒక పంజాబు సి. ఐ. డి. ఆఫీసరు గట్టివాడు వచ్చాడు. మాఅందరివెంటా పడ్డాడు.మాయింద్లకు వచ్చి మాతో స్నేహంచేసుకోవాలని ప్రయత్నించాడు. ఆర్యసామాజికుడనని చెప్పుకొని, ప్రముఖ ఆర్యసమాజనాయకుని యింట్లో బసపెట్టాడు. పంజాబులో గదరుపార్టీవారు చేసిన సాహసకార్యాలను చాటిస్తూ దేశభక్తుడనని ప్రకటించుకున్నాడు.ఇంతేకాదు. ఎంతోమంది సి. ఐ. డీ. లు గదరుపార్టీలో చేరుతూవచ్చారు.ఎవరు ఎలాంటివారో పరీక్షించటానికి మాకు వ్యవధిలేదు.గదరుపత్రిక ప్రపంచమంతటా ప్రచారంచేసింది. దానిఫలితంగా ఎందరో పార్టీకోచేరి తమ దేశ భక్తిని ప్రకటించారు.

బాంకాకులో మా ఏడుమందిలో జోద్‌సింగు చాలాపిరికి వాడు; అసమర్థుడు.ఇదివరలో చెప్పినట్లు సి. ఐ. డి. ల అనుమానం ఎక్కువగావున్నవాడు.ఏకాలంలో ఎవరితో ఎట్లా ప్రవర్తించాలో బొత్తిగా తెలియదు.కాబట్టి బాంకాకువచ్చింది మొదలు చాలా రహస్యంగా కాలంగడిపాడు.చివరకు మేముకూడా ఆయన్ను కలుసుకోవడంయిష్టపడడని దూరంగా వుంటూవచ్చాం.మిగిలినవారందరం ఒకరిఅనుభవాలను మరొకరికి తెలుపుకుంటూవచ్చాము. మేముమాత్రం పంజాబు సి. ఐ. డి. ఆఫీసరు విషయంలో జాగ్రత్త పడ్డాం. ఇది జోద్‌సింగుకు తెలియదు.ఆఫీసరు జోద్ సింగును కలుసుకొనిఏమేమో చెప్పిమోసగించి వలలోవేసుకొని, తనబసకు తీసుకెళ్లి విందుచేస్తూన్నట్లు నాకు తెలిసి ఆఫీసరు ఇంటికి వెళ్లాను.ఇద్దర్నీ కలుసుకొన్నా.జోద్‌సింగును ప్రత్యే

కంగా కలుసుకొనుటకు అవకాశమివ్వలేదు.చివరకు కంటితో సైగ చేయుటకుకూడా నాకు వీలుపడలా.సెలవుతీసుకోడానికి అనే సాకుతో జోద్‌సింగుకు షేక్‌హాండుయిస్తూ అరచేతిని గీరి వెళ్లి పోయాను.అయితే జోద్‌సింగు జాగ్రత్తపడనేలేదు:త్రాగి రహస్యాలన్నీ చెప్పాడు.నన్నుతప్పమిగిలినఆరుగురినిఆరాత్రిఅరెస్టుచేశారని, తెల్లవారుజామున నాలుగుగంటలకు ఆర్యసమాజనాయకుడు నన్ను నిద్రలేపి చెప్పాడు.నేను ఆఫీసరు మోసగించాడని విచారపడ్డాడు. ఇప్పుడు నన్ను తప్పించటానికి సహాయంచేస్తానన్నాడు. అడవులగుండా చైనాపేరేమార్గం చూపుతానన్నాడు. అయితే సాయంత్రం 7 గంటలవరకు రయిలులేదు. అంతవరకు మరెక్కడయినా దాక్కోవాలి. అతనిని నమ్మాను. పెట్టెలు సామానులు ఎలాగున్నయ్యో అలాగేవుంచి చేతిపెట్టె, చిన్నబట్టలమూట తీసుకొని చీకటిలో బయలుదేరాను. ఎక్కడదాగుకోవాలి? చేతిపెట్టెలో రహస్యపుకాగితాలు, ప్లానులు, ఉత్తరాలు, డైరీలు, రివాల్వరు వున్నయి. సాయంత్రంలోగా నేను అరెస్టయినా, యీ చిన్నపెట్టె పోలీసులకు లభించకుండా చెయ్యటం ఎట్లా? ఇదే నా ఆలోచన. చివరకు ఒక యూరపియనుహోటలుకు వెళ్లాను. తెల్లవారలేదు. ఆహోటలు మొదట నేనుఉన్నదే. ఒకగదిని నాకుప్రత్యేకించి ఉంచమనిచెప్పి, చేతిపెట్టెను భద్రంగా పెట్టమని ఆఫీసులో యిచ్చేసి వెళ్లాను. మమ్మల్ని ఎవరూ కనిపెట్టలేదు. దోవలో జపానువాళ్ల బోగంయిల్లు కనపడింది. సాయంత్రం చీకటిపడే వరకు, నేను రహస్యంగా ఉండుటకు అనుకూలప్రదేశమని సలహాయిచ్చాడు. తెల్లవారుజామున మేము అక్కడికి వెళ్లడం వారికి ఆశ్చర్యాన్ని కలిగించింది. ఎలాగో ఒకగది సంపాదిం

చాము. ఆయన తిరిగి వెళ్ళిపోయాడు. ఆరాత్రి 8 ఘంటలకు నేను బాంకాకు సమీపంలో వుండే రైలుఎక్కి ఆయనను ట్రెయినులో కలుసుకోవాలని, చైనావైపుకు ప్రయాణం చెయ్యాలని, హోటలో వుంచిన పెట్టెను తానే తెస్తానని అన్నాడు. అప్పటికి అదిప్లాను.

అరెస్టు

ఆ యింటిలో నాకు అసహ్యంగా వున్నది. వారికి నామీద సంశయాలు ఎక్కువ అవుతూవచ్చాయి. నాకు విసుగుపుట్టింది. సాయంత్రం 5 గంటలకే బయటకువచ్చాను. రిక్షాపై రైలుస్టేషనుకు బయలుదేరాను. మూడు నాలుగు మైళ్ళదూరం పోయేసరికి ఒక మోటారుకారు వెంబడించింది; ఒక ఆంగ్ల పోలీసు ఆఫీసరు నన్ను అరెస్టుచేసి, తనకారులో ఎక్కించుకొని తన బంగళాకు తీసుకవెళ్ళాడు. టీ పంపుతానని ఇంటిలోకి వెళ్లాడు. ఒక పోలీసు అక్కడేవున్నాడు. ఆఫీసరుకు నేనా స్నేహితుడనని పోలీసు అనుకొన్నాడు. నాడైరీని పూర్తిగా చించి అక్కడే చిత్తుకాగితాల బుట్టలోవేశా. వ్రాతమూలకమయినది నావద్ద ఏమీలేదు. బాంకాకులో నన్ను విదేశీయుల జెయిల్లో పెట్టారు. నాయింటిలోని సామానులన్నియు తెచ్చియిచ్చారు. హోటల్లో పెట్టిన చిన్నపెట్టె మాత్రం రాలేదు.

జెయిల్లోకి అడుగుపెట్టేసరికి, భాయి బలవంతసింగ్ గ్రంధీ, భాయితాకుర్‌సింగ్, జోద్‌సింగ్, ఛాటర్జీ, భాయిఅమర్‌సింగ్, శివ ప్రసాద్‌గుప్త ప్రత్యేకగదుల్లో ఉన్నారు. జోద్‌సింగ్‌వద్ద వున్న డైరీ పోలీసులకు దొరికిందన్నవార్తతో గుండెలుపగిలాయి.

అంతర్జాతీయ చట్టం ప్రకారం మమ్మలను ఏ విదేశరేవుల నుండి వచ్చామో ఆరేవులకు—చైనాతీరంలోవున్న ఆమాయ్‌పూచౌ,

స్వాటోవ్, షాంగై లకు—తిరిగి పంపాలి. అయితే మాకు కలిగిన కొంచెం పరిచయాన్నిబట్టి, సయాందేశము ఆంగ్లేయులకు లోబడి యున్నదని. పోలీసుశాఖ ఆంగ్లేయుల స్వాధీనంలో వున్నదని, మాకు అంతర్జాతీయచట్టం వర్తింపచెయ్యరని తలచితిమి. మమ్మల్ని ఇండియాకు పంపించేస్తారని. జెయిలుసూపర్నెంటు సయాముదేశస్తుడు- ఎప్పటి రహస్యాలు అప్పుడే చెపుతూవచ్చాడు. జయిలు నుంచి మేమందరం తప్పించుకపోవటానికి అమరసింగు ప్లాను వేశాడు. ఆయన విగ్రహం చాలచిన్నదైనా ధైర్యసాహసాలలో అతనికి అతనేసాటి జయిలుబయటవుండే విప్లవకారులతో సంబంపెట్టుకొన్నాడు. జెయిలుగోడను బాంబుతో పడగొట్టడం, ఆ గందరగోళంలో మేము పరుగెత్తి బయట తయారుగావుండే కారులో కూర్చోపడం, దగ్గరఅడవులకువెళ్ళి దాక్కొని తప్పించుకోవాలన్నాడు. అయితే ఈ ప్రయత్నం కొనసాగలేదు. రెండు నెల్లకు సింగపూరునుండి మిలిటరీ పోలీసుదళం వచ్చి మమ్మల్ని అందరిని సింగపూరు కోటకు తీసుకెళ్లారు.

బాధలు ప్రారంభం

స్థూలకాయుడు, ఎత్తైన ఒక బ్రిటిష్‌పోలీసు ఆఫీసరు యిరవైమంది మలయాపోలీసుదళంతో వచ్చి మా ఏడుగురిని సయాం పోలీసులనుండి స్వాధీనం చేసుకొని తమష్టీమరులోకి తీసుకెళ్లారు. వీడు మమ్మల్ని పెట్టిన హింసలు ఇన్నీ అన్నీ అని చెప్పటానికి వీలులేదు. కారణమేమిటో అప్పుడు మేము ఊహించలేకపొయ్యాము. ఒక్కొక్కరికి ప్రత్యేకంగా సంకెళ్లువేసి, తిరిగి యిద్దరిద్దరిని కలిపి సంకెళ్లవేశాడు. మూడున్నరజతలు అయ్యాం. అటుతరువాత అనవసరంగా నాలాంటి సన్నని వానిని దొక్కలో

పొడిచాడు. అమరసింగు, చటర్జీ, నేను చాలా సన్నటివాళ్లము. మిగిలినవారు ఆజానుబాహులు; ముఖ్యంగా భాయి బలవంత సింగ్. మమ్మల్ని స్టీమరుమీద బయలుప్రదేశానికి (డెక్కు) తీసుకెళ్లాడు. స్టీమరులోని సామానులను తీయటానికి పెట్టటానికి డెక్కుమీద ఒకకంత వున్నది; 15 అడుగులు 12 అడుగులు వున్నది. దానికిపక్కగా మూడడుగుల దూరంలో చుక్కానికి స్టీమరు వెనుకభాగంలో దిక్కులను మార్చేదానికి మణికట్టంత లావైన యినుపగొలుసొకటి వుంటుంది. చుక్కానిని అటూయిటూ త్రిప్పుతూవుండాలి. అప్పుడు గొలుసు కదులుతూ వుంటుంది. ఈకంతకు గొలుసుకు మధ్యవుండే 15 అడుగుల పొడవు మూడడుగుల వెడల్పు స్థలంలో మమ్మలను కూర్చోపెట్టాడు. నెత్తిమీద దేరాలేదు. ఎండకు యెండాము, వానకు తడిశాము. కప్పుకోటానికి మా బట్టలయినా మాకు యివ్వలేదు. వొరుసుకుపోతున్న సంకెళ్లతో జతలప్రకారం పడుకోవాలి. మాకు కాళ్లు చాచుకోటానికి పొడుగు చాలలేదు. వెడల్పుచాలక యినుపగొలుసు రాచుకపోతున్నది. చలి, తడిగుడ్డలు, రాత్రిళ్ళు దస్సిపోయాము మొదటిరాత్రే. ఉదయాన పళ్లు తోముకోడానికి నీళ్ళు యివ్వలేదు. దొడ్డికికూడా జతగావెళ్లాలి; అప్పుడైనా సంకెళ్లు తీసివెయ్యలేదు. మూడ్డితుడుచుకోమని న్యూసుపేపరు యిచ్చాడు. తుడుచుకోవడం ఎట్లా? ఓపికలేదు; తిండిలేదు; ఏమిచెయ్యటానికీ సాధ్యపడదు. బాంకాకు జెయిలువిడిచిన 36 ఘంటలకు, అప్పడాలవంటి సన్నని మైదాపిండి చపాతీలు, వెడల్పుగాచేసి ఒక్కొక్కరికి ఒక్కొక్కటి యిచ్చాడు. ఈ పోలీసు

దొరగారు ఒక దొరసానిని వెంటపెట్టుకొని ఒక కెమెరాతో ఫొటో ఎత్తాడు. దొరగారు దొరసానితో గప్పాలు కొట్టుకొంటున్నాడు.

"తిండి చాలిందా" అని మాతో పరిహాసం ప్రారంభించాడు.

ఆకలి ఉన్నప్పటికి మాకు తిండిమీద ఆలోచనలేదు. కసి తీర్చుకోవాలని మాత్రమే మాకోరిక. ఎవరమూ పలకలేదు. తిరిగి నవ్వుతూ ఏంకావాలన్నాడు. "ఒక ఉల్లిపాయ కావాలి" అన్నాడు ఛటర్జీ.

"మరేం కావాలి" అన్నాడు ఆఫీసరు.

"ఉప్పు కావాలి" అన్నాడు చటర్జీ

"యింకేమి కావాలి" అన్నాడు ఆఫీసరు

"టీ కావాలి" అన్నాడు చటర్జీ.

"దొంగరాస్కెల్ ! నీకు టీ కావాలా?" అని లెంపకాయ వేశాడు.

ఛటర్జీ అంతం లేకుండా నవ్వాడు.

"ఓరి పిరికివెధవా! ఒరే, బలిసినపందీ! ఒరే రౌడీ!" అని నవ్వుతూనే తిడుతున్నాడు చటర్జీ. మాకే ఆశ్చర్యంవేసింది. పోలీసు దొర తెల్లపోయాడు. దొరగారిముఖం దొరసానిముఖం ముడుచుకు పోయాయి. దొర నిర్ఘాంతపోయాడు. దొరగారిని దొరసాని చెయ్యిపట్టి లాక్కుపోయింది. ఆరురోజుల ప్రయాణం సాగింది. కాని వాడు తిరిగి మాకంటపడలేదు. సంకెళ్ళు అలాగే వున్నై. కాని మలయా పోలీసులు కొంతసాయం చేశారు. నీళ్ళిచ్చారు. అప్పడాలు చపాతీలుగా మారాయి. ఇంకా ఎంతో చెయ్యటం మలయా పోలీసులకు యిష్టము; కాని దొరగారి భయమో!

### సింగపూరులో భారతసైనికుల తిరుగుబాటు

సింగపూరులో బ్రిటిష్ పోలీసుఆఫీసరు మమ్మల్ని ఎందుకు అంతగా హింసించాలి? కారణం మలయాపోలీసులు చెప్పారు. సింగపూరులో మన రెజిమెంటు ఒకటి ఉంది. అది రాజ పుత్రస్థానం ముసల్మానులది. వారిలో గదరుపార్టీ ప్రచారం జరిగింది. టర్కీమీద మతాభిమానంఉంది. అందువల్ల బ్రిటిష్ ప్రభుత్వం నాశనం కావాలని వారికోరిక. రెజిమెంటును యూరపుకు పొమ్మని ఉత్తరువుచేశారు. పోవడానికి ఎవరికీ యిష్టంలేదు. తీవ్రవాదులు కొందరు తమ రైఫుల్సు తీసుకొని సింగపూరునగరంలోకి వెళ్లారు. 343 మంది ఆంగ్లేయ స్త్రీలను పురుషులను బిడ్డలను కాల్చివేశారు. సింగపూరులో ఆంగ్లేయులు ఎవరూ మిగలలేదు. ఈలాగు కాల్చి వేసేవారికి, తమ రెజిమెంటులో ఒక్కరైనా అడ్డు పడలేదు. సింగపూరుసు పట్టుకున్నారు నాలుగురోజుల తరువాత. ఆకాలంలో యింగ్లాండుకు ఆప్తులైన జపానువారి యుద్ధనౌకలువచ్చి సింగ పూరును స్వాధీనం చేసుకొన్నాయి. కొద్దిరోజులు గడిచాక, తిరిగి బ్రిటిష్ సైన్యానికి సింగపూరును జపానీయులు యిచ్చేశారు. వెంటనే మార్షల్ లా ప్రయోగించారు. ప్రజలను చాలా భయ కంపితులను చేశారు.

సర్కారుకు అనుకూలంగా సాక్ష్య మిచ్చేవారందరికి పెద్ద పెద్ద జీతాలతో ఉద్యోగాలు యిచ్చారు. వారిలో ముఖ్యుడు ఒక ఆంగ్లో–పార్శీవాడు. అతని రు 100/- జీతాన్ని రు 500/కు పెంచారు. కుట్రలను పరిశోధించే ముఖ్య ఆఫీసరు (Special Investigaton Officer) అయ్యాడు. చాలామంది సిపాయీల మీద లేనిపోనివి కల్పించి, కోతిపుండు బ్రహ్మరాక్షసి చేశాడు.

ఆతని ముఖ్య ఉపాయం ఏమంటే "పిరికిగాడిదా! నిజం చెప్పడానికి భయపడ్డావా? చావడానికి భయపడుతున్నావు?" అని తిట్టేవాడు.

సిపాయీలు పౌరుషశాలురు. వారికి కోపమువచ్చి "మేము చేసిందేదో చేశాము! నీ యిష్టముంటే కాల్చేయి! తిట్టితేమాత్రం ఊరుకోము. జాగ్రత్త!" అని జవాబు ఇచ్చేవారు. ఇల్లా రెచ్చగొట్టాడు. ఈవిధంగా ఎందరో నిరపరాధులైన సిపాయీలను మార్షల్‌కోర్టుసహాయంతో కాల్పించాడు. ఈలాంటివారు ఎందరయినది నాకు జ్ఞాపకములేదు కాని, ముఖ్యంగా ఒక జమేదారుని గురించి చాలాచాలా చెప్పేవారు. ఎంతవరకు సత్యమో, ఎంత పెద్దదిచేసి చెప్పారో కాని తెలిసికొనదగిన విషయం.

జమేదారు షుమారు 400 పౌనులకు పైగా తూకం. చాలా ఎత్తూ, లావూ. ఏనుగు పిల్లలాగుండేవాడు. ఆయన కాళ్లను, నడుమును, చేతులను రెక్కలను ఇనుప గొలుసులతో బిగించారు. బ్రిటిష్ గవర్నమెంటు మిలిటరీ గదిలోనుండి వెలుపలికి తెచ్చినప్పుడు ఎనిమిదిమంది సోల్జర్లు ఆగొలుసులు పట్టుకొనేవారు. చివరకు మరణదండన విధించి కాల్చుటకు తీసుకెళ్లారు. అప్పుడు అక్కడవున్న ష్రాప్‌షైరు రెజిమెంటులోని సోల్జర్లు (వాలంటీర్లు) చిన్నవయసు వారయినందున ఆ జమేదారుని కాల్చుటకు భయపడ్డారు. వారిని వెనుకకు పంపివేసి; కాల్చివేయుటకు ధైర్యంగలవారిని, అయిదుగురిని, తమంతటతామే సమ్మతించి రమ్మన్నారు. అలాగున వచ్చినవారు మామూలుప్రకారం గురిపెట్టి గుండెలో కాల్చారు. నేలమీద కూలిపోయాడు కాని చావలేదు. ఒకమేజరు, ఆ జమేదారురొమ్ము మీద కాలుతో తొక్కిపెట్టి రివాల్వరుతో మెద

దులో కాల్చాడు; చావలేదు; గుండెల్లో కాల్చాడు; అప్పటికీప్రాణం పూర్తిగాపోలేదు. వూపిరితిత్తులను గట్టిగా చేతులతో ఒత్తి గాలి పొయ్యేలాగుచేశాడు. సింగపూరునుండి కలకత్తాకు మమ్ముల‌ను స్టీమరులోతీసుకెళ్లిన ష్రాప్‌షయిరు రెజిమెంటు సోల్జర్లు ఈ సంఘటనను ఆశ్చర్యంతోనూ ఉత్సాహంతోనూ చెప్పారు. వారివుద్దేశం ప్రపంచానికి మాద్వారానైనా తెలియపరచాలనే కుతూహలంఉన్నట్లు భావించాము. అజమేదారు ఎవరో, భోగట్టా చెయ్యడం నాకు సాధ్యపడలేదు. ఇంతవరకు మాత్రమే తెలుసు. రాజపుత్ర ముసల్మాను రెజిమెంటులో జమేదారు. సింగపూరులో సిపాయీలు తిరుగబడిరి; జమేదారు నిలువలేదు; వెనుకనుండి ప్రోత్సాహం చేశాడనే నెపంతో మార్షల్‌కోర్టువారు కాల్పించారు. (1915 సం.)

ఈలాంటి వీరగాధ సింగపూరులో జరిగిన తరువాత, అక్కడి బ్రిటిష్ మిలిటరీ పోలీసులకు మావంటి గదర్‌పార్టీవారు చేతచిక్కితే చిత్రహింసలు పెట్టారంటే విచిత్రమేమిటి? ఇంకా చెప్తా.

## మిలిటరీ రాక్షసులు

బాంకాకునుండి మమ్మల్ని తీసుకవచ్చి సింగపూరులో మిలిటరీవారికి మా ఏడుగురిని స్వాధీనంచేశారు. అప్పుడు అక్కడ మార్షల్‌లా రాజ్యం. మిలిటరీ డిటెన్షన్ బ్యారక్సులో (మిలిటరీ జయిలుపేరు) ఒక్కొకరిని ఒక్కొక్కగదిలో పెట్టారు. చక్క తలుపులతో పూర్తిగా మూసేశారు. వెనుకవైపుగోడలో సీలింగుకు సమీపంలో వెలుతురు రావడానికి ఒక చిన్నకంత వుండేది. గాలి రావడానికి సాధ్యంకాదు. లోపల ఏమి చేస్తున్నామో వెలుపలనుండి చూడడానికి, గ్లాసుతో మూసినకంత వుండేది. ఒక మంచం

(బెంచి), దోమతెర, కక్కసువట్టి, లోటా, సన్నటికాగితాలచుట్ట యిచ్చారు. తువ్వాళ్లుగాని. పండ్లబ్రష్‌గాని, దువ్వెనగాని, అద్దం గాని, సోపుగాని యివ్వలేదు. మా స్వంతవస్తువులను చూడనివ్వ లేదు. స్నానానికవి బకెట్టునీళ్లు వారానికి ఒక తడవ యిస్తారు. పుస్తకాలు చదువకూడదు. ఒకరిని కలుసుకోడానికిగాని, ఒకరితో మాట్లాడడానికిగాని వీలులేదు; పాడుకోకూడదు. ఈలాగు ఆరు నెలలు ఏకాంతవాసము. మా కంఠంలోని శబ్దమే మాకు కొత్తగా తోచేది. గడ్డాలు మీసాలు పెరిగాయి. తలలో పేలు. నోరు వాసన; పండ్లు గార; ఒకటిరెండు నెలల తరువాత వ్యాయామంపేరిట, మిట్ట మధ్యాహ్నం కాలే కాలే సన్నటి గులకరాళ్ళమీద తప్పకనడవాలి. బూట్సుగాని, చెప్పులుగాని వుండవు. బొబ్బలుపడితే సోల్జర్లు చేతులు పట్టి లాగి నడిపించేవారు. మేము ఏడుగురితో ప్రారంభమై, తొమ్మిదిమందితో స్థిరపడ్డాము, మాతోకలసి పని చేయుటకు నియమింపబడ్డ జర్మను అఫీసర్లు అరెస్టు చేయబడ్డారు. కొద్దిరోజులలో మరొకచోటికి తీసుకెళ్లారు. బెనారసులోని కోటీశ్వ రుడు- కాంగ్రెసునాయకుడు- శివప్రసాద్‌గుప్తాగారు కొద్దిరోజులు మాత్రమే ఆ జెయిలులో వున్నారు. ఆయనమీద అనుమానం ఏమంటే బెంగాలు టెరరిష్టుల ద్రవ్యాన్ని ప్రపంచయాత్ర అనే నెపముతో, దేశదేశాల్లో వారి మెంబర్లకు అందచేశాదని. ఆయన చాల లావాంటివాడు. మెట్లు ఎక్కడం దిగడం ఆయనకు చాల కష్టం. ఇద్దరు సోల్జర్లు రెక్కలుపట్టి "పందీ! ఎక్కు" అని లాక్కొని పొయ్యేవారు. గులకరాళ్ళమీద నడవలేక కూలపడ్డాడు. చేతులుపట్టిలాగి పరుగెత్తమనేవారు.

ఈలాంటి రాక్షసులమధ్య ఏకాంతవాసంవల్ల మనోవ్యాధులు ఏర్పడ్డాయి. ఒకరికి తాత్కాలికంగా పిచ్చెత్తింది. నాకు ఒకవ్యాధి (మ్యూకస్ కొలైటీస్) క్రానిక్‌అయింది. ఇది ఒక నరాల వ్యాధి. కారం ఎంతస్వల్పంగా తిన్నా బేధులు, రక్తబేధులు అవుతాయి. నా రోగలక్షణ మేమిటో తెలిసికోలేక, అన్నిపద్ధతుల వైద్య శిఖామణులు 1920 మొదలు 1931 వరకు నా ఆరోగ్యాన్ని మరీమరీ పాడుచేశారు.

నే రా రో ప ణ

జోద్‌సింగ్ డైరీ ప్రభుత్వానికి చిక్కింది. అతను జర్మనీ నుంచి అనేకదేశాలు తిరిగివచ్చాడు. కొన్ని డజన్ల విప్లవకారుల పేర్లేగాక, వారు ఏమిచేస్తున్నది డైరీవల్ల బ్రిటీష్ గవర్నమెంటుకు తెలిసింది. మమ్మల్నిగురించి జోద్‌సింగుకు తెలిసింది స్వల్పమే. మేముచేసింది ఏమీలేకపోయినా, ప్లానులువేశాము, ఆయుధాలు సేకరించాము, జర్మనులతో కలసి కుట్రలుచేశాము అనే నేరము లున్నవి. మాలో యిద్దరు- అమరసింగు, శివదయాళ్‌గుప్తల (పంజాబీ)పై బర్మాలో సైన్యము, మిలిటరీపోలీసులు తిరగబడ టానికి ఏర్పాట్లు చేసినందుకు మోపనున్న నేరము పెద్దది. నామీద ఆయుధాల స్టీమరును, దానికి సంబంధించిన ఉత్తరాలు తెచ్చానన్న నేరమున్నది. మే మందరమూ రెండు మూడు సంవత్సరాలుగా గదర్‌పార్టీతో సంబంధాలు పెట్టుకొని పనిచేశాము. ముఖ్యంగా భాయి బలవంతసింగుమీద ఎన్నో నేరా లున్నవట. పూర్వ చర్యలను గురించిన రిపోర్టులు గవర్నమెంటుకు చేరేవుంటాయి అమెరికాలో వున్నప్పుడే. మా విద్యార్థులమీద, తోటివిద్యార్థి హెన్రీయద్వర్డు పాండ్యన్ (తిరునల్వేలిజిల్లా) రిపోర్టులుయిచ్చి డబ్బు సంపాదించు

కొంటూ వున్నట్టు మాకు కొంతకాలం తరువాత తెలిసింది. * శాన్ ఫ్రాన్సిస్కోలో గదరుపార్టీ హెడ్‌ఆఫీసులో ఒకప్పుడు నాయకుడుగా వున్న రామచందర్‌ను సి. ఐ. డి. అని తెలుసుకొని గదర్‌పార్టీవారు కోర్టులోనే కాల్చిచంపారు. జోద్‌సింగు డయిరీ ప్రభుత్వానికి చాలా సహాయకారి అయింది. మమ్మల్ని ముగ్గురు ఆఫీసర్లు ప్రత్యేకంగా విచారణచేశారు:— (1) ఆంగ్లో పార్సీవాలా—పేరు జ్ఞాపకంరాలేదు. స్పెషల్ ఇన్వెష్టిగేషన్ ఆఫీసరు (2) స్కాట్‌లాండుయార్డునుండి వచ్చిన యక్సుపర్టు (3) డెన్హామ్. ఈ డెన్హామే లాహోరు కుట్రకేసులో చీఫ్ ప్రాసిక్యూషన్ ఆఫీసరు.

మొదటివానిని సర్కారు నమ్మినట్టుగా లేదు. రహస్య రిపోర్టులను—బ్లూబుక్సు—వాని కివ్వలేదు. అందువల్ల మా పూర్వచరిత్ర వానికి తెలియదు. ప్రమోషను కొరకు మసిపూసి మారేడుగాయను చెయ్యాలి. తన దురాశకొరకు, మా స్వభావాలను గ్రహించి, తనలాభంకొరకు ఉపయోగపర్చుకొన్నాడు. మేము పంజరంలో పెట్టబడిన పక్షులలాగు దొరికిపొయ్యాము. నావిషయంలో వాడి ఎత్తుగడ వివరిస్తాను. నేను కోపదారినని తెలుసుకొన్నాడు. రోషముకలిగేట్టు రెచ్చకొట్టాడు.-

....వాలా:— "నీవు ఇండియన్‌కదా! కాబట్టి ఒక పిరికి వెధవవు! ఒక అవునైనా చంపలేవు! కాని, తెల్లదొరలను చంపగలవా?

* హెన్రియద్వర్డు పాండ్యన్, ఇండియను క్రిష్టియను, ఇండియాకు రాగానే పోలీసు డెప్యూటీ సూపర్నెంటు ఉద్యోగం యిచ్చారు. జిల్లా సూపర్నెంటు నౌకరిచేసి రిటైరు అయ్యాడు.)

నేను .- "ఇండియను లందరూ పిరికివారుకారు. ఇతరదేశాలలో మాదిరే ఇండియాలోకూడ ధైర్యశాలురున్నారు, పిరికివారున్నారు. అయితే నాకూ దీనికి సంబంధం ఏమిటి?"

.... వాలా : - "మద్రాసువాడివి. ఇండియాలో మీకంటె పిరికివాళ్లు మరెవరు? ఇంగ్లీషుదొరలనే చంపదలచావుగా?"

నేను : - "మద్రాసువాండ్లలోకూడా ధైర్యశాలురున్నారు; పిరికివారున్నారు. అయితే, నాకేసుకూ దీనికి ఏమిసంబంధం?"

.... వాలా : - "నీవు తెలుగువాడివికదా: మద్రాసువాళ్లలో కూడ అధమం! ఇంగ్లీషు వాళ్లనే చంపుతావూ?"

నేను : - "........"

.... వాలా : - "నీవు కోమటివాడివికదా? ప్రపంచమంతటిలోకి పిరికి సన్నాసులు, "తెల్లవాళ్లను చంపడమే!"

చివరకు నేను కోపం పట్టలేకపోయాను. ఏం కష్టాలు వచ్చినా రానీ అనుకొని ఈలా గన్నాను :- "కోమట్లలోకూడధైర్యశాలు రున్నారు. నీ డ్రాయర్లో రివాల్వ ర్లున్నాయి. ఒకటితీసుకో; ఒకటి నాకుయివ్వు! ఆంగ్లోపార్సీ సంకరజాతివాడికంటె ధైర్యశాలి కోమట్లలో ఒక్కడైనా వున్నాడని చూపిస్తా! పిరికివెధవా!"

ఉలిక్కిపడిలేచాడు. వాడికి ఎదురుగా వెళ్లాను. అలారం యిచ్చాడు. సోల్జర్లు వచ్చి నన్ను పట్టుకొన్నారు. మా అందరి యెదుట టెలిఫోనులో మిలిటరీ హెడ్క్వార్టరుకు యిట్లా రిపోర్టు చేశాడు, "రివాల్వరును తనకు యిస్తే నన్ను కాల్చేస్తానని బెదరించి నామీద పడబోయాడు. సోల్జర్లు పట్టుకొనియున్నారు.

సోల్జర్లు నన్ను నెట్టి నాగదిలో వేసిపోయారు. 15 నిమి

షాల్లో మిలిటరీ ఆఫీసర్లు ప్రత్యక్షమయ్యారు. ఒక కర్నలు, ఒక మేజరు వగైరా వరుసగా నిలుచున్నారు.

కర్నలు:- "స్పెషల్ ఇన్వెష్టిగేషన్ ఆఫీసరును కాల్చివేస్తా నన్నావా?" నేను సమాధానం చెప్పలా.

కర్నల్:- నీవు మా పత్రులుడబ్బు పుచ్చుకొని. బ్రిటిష్ ఇండియా సైన్యాలను తిరుగుబాటు చెయ్యమని ప్రోత్సహించి మిలిటరీ జెయిల్లో ఉంటూనే మా లాయర్ ఆఫీసరును కాల్చేస్తా నంటావా?" అని గర్జించాడు.

నేను జవాబు చెప్పలేదు. చెప్పినా ఉపయోగంలేదు. ఏమిచేసినా చేసికోనిమ్మనుకున్నాను.

"వారంరోజులు చేతులకు సంకెళ్లు, రోజుకు ఒకపౌను రొట్టె, నీళ్లమాత్రమే" అని శిక్షచెప్పి వెళ్లాడు. అంత తక్కువ శిక్షకు ఆశ్చర్యంవేసింది.

అంతటితో ఆ స్పెషల్ఆఫీసరు విచారణచెయ్యడం మానేశాడు. మిగిలిన మిత్రులవిషయాలు అలాగేవుంటాయి. ఒకరి విషయాలు మరొకరికి తెలియవు. ఎంతప్రయత్నించినా మా వివరాలు మాదగ్గర తెలుసుకోలేకపోయాడు. మా పూర్వచరిత్ర వాడికి ఏమాత్రం తెలియదు.

## ద్రోహి

గొప్ప డిటెక్టివ్ ఆఫీసరు స్కాట్లండుయార్డునుండి వచ్చాడు. అప్పటికే లాహోరు మొదటి కుట్రకేసు పూర్తి అయిపోయిందట (1916 లో ) రెండవది ఇంకా ఆరంభంకాలేదట.

మా పూర్వచరిత్రల పుస్తకాలు- పెద్ద పెద్ద వాల్యూములు తెచ్చాడు. తేదీవారీగా మేము అమెరికాలో చేస్తూవచ్చిన పనులు

వివరాలతో జరిగినవి జరిగినట్టుగా అచ్చువేయబడివున్నై. నాకు ఆశ్చర్యం వేసింది. మా విద్యార్థుల్లోనే యెవడో గూఢచారిఅయి ఉండాలి.

కాలిఫోర్నియా యూనివర్సిటీలో చదువుతూ నలంద హాస్టలులో విప్లవసంఘవిద్యార్థులము కలిసివుండగా ఒకరికి ఒక మేలుచేశాము. అది పాముకు పాలుపోసినట్టు విషమయింది.

అమెరికాలో బాబా జ్వాలాసింగు అనే దేశభక్తుడు ఇండియను విద్యార్థులకు వేతనములిచ్చి చదివించుటకు అమెరికాకు రప్పించాడు 1912 సం॥లో. అనల్గురూ విప్లవసంఘంలో చేరుతారని ఆశించాడు. వారిలో ఒక్కడుకూడా అందుకు సమ్మతించలేదు. అందువల్ల సహాయం చెయ్యడం మానేయడంతో నలుగురు విద్యార్థులూ చిక్కులో పడ్డారు. తెగిపోయిన గాలిపటాలగతి పట్టింది. వారిలో (1) బి. సోమయాజిశర్మ, అడ్వొకేటు. గుంటూరు (2) గోకర్ణాకు మహారాష్ట్రుడు- ప్రస్తుతం గొప్ప యిండస్ట్రియల్ సైంటిస్టు, అమెరికా (3) గోవింద బిహారీలాల్, ఢిల్లీ; ప్రస్తుతం అమెరికాలో న్యూసుపేపర్లకు సైన్సుయెడిటర్- వీరు మాత్రం గట్టెక్కారు. కాని, నాల్గవవాడు- హెన్రీ యద్వర్డు పాండ్యన్ (తిరునల్వేలిజిల్లా) మాత్రం కష్టపడుతూ వచ్చాడు. నవంబర్ మాసం వచ్చింది. చలి అధికమవుతూవచ్చింది. చలిగాలికి మనుషులు, పశువులు చచ్చిపొయ్యేరోజు లవి. పాండ్యన్ మీద జాలిపుట్టింది. లాహిరీ, నేను అతన్ని చేరదీసి భోజనంపెట్టి మాగదిలోనే వుంచుకొన్నాం. అతనికి సహాయం చెయ్యడం మిగిలిన మిత్రులకు యిష్టంలేదు; అయినా అడ్డుపెట్టలా. వానికి కష్టంలో సహాయంచేస్తే. విప్లవోద్యమంలో చేరకపోతాడా అని

లాహిరీ ఆశ. ఆయన చెప్పినట్టు ఒప్పుకొనే శిష్యుణ్ణి నేనూ అంతే అనుకొన్నాను.

1914లో యుద్ధం ప్రారంభంకాగానే మేము వేర్వేరు కాలేజీలలో చేరిన తర్వాత "మీలో యెవరో ఒకరు రహస్యాన్ని గవర్నమెంటుకు అందిస్తున్నారు; జాగ్రత్తగా వుండాలి" అని బెంగాల్‌పార్టీనుండి వుత్తరం వచ్చింది. అప్పటికే పాండ్యన్ ఆపని చేస్తున్నట్టు బయటపడింది; ఒకసారి విద్యార్థులు పట్టుకొని కొట్టారు, తిన్నారు.

డిటెక్టివ్‌ఆఫీసరు రసపుస్తకాలు తెరచి నాచరిత్ర చదివాడు. అది తూ. చ. తప్పకుండావుంది. నేను చేసిన ఒకపని పాండ్యన్‌కు తప్ప మరెవరికీ తెలియదు. గదరు సాహిత్యాన్ని పోష్టులో రహస్యంగా పంపటానికి ఒక దూరపు టవున్లో మామూలువుండే ఒక ప్రెస్సులో ఒక కంపెనీపేరు కల్పించి పెద్దకవర్లు అచ్చు వేయించాను. అప్పట్లో గదరుపత్రికను దేశదేశాలకు పంపేశాఖలో పనిచేస్తుంటిని. పాండ్యన్ నాతో ప్రెస్సుకు వచ్చాడు. రిపోర్టులో వున్న వివరాలు మరొకరికి తెలియవు. పాండ్యనే ననుకోడానికి మరొకకారణం ఉంది. భాగవతుల సోమయాజిశర్మగారిమీద తప్ప తతిమ్మా వారందరిమీద రిపోర్టుచేశాడు. శర్మ అంటే పాండ్యన్‌కు చాలయిష్టం. నన్ను డిటెక్టివ్‌ఆఫీసరు ప్రశ్నించి నప్పుడు పాండ్యన్ అచ్చువేయించి వుంటాడని సూచించా. ఆఫీసరు కోపంతో "పాండ్యన్ నమ్మదగినవాడు; రాజభక్తిగలవాడు; నీవు అబద్ధమాడుతున్నావని" జవాబుచెప్పాడు. నామీద నేరారోపణలను పూర్తిచేసి ఆఫీసరు "నీకు ఏమిశిక్ష విధిస్తారో తెలుసునా? నిన్ను కాల్చేస్తారు! నీకు తెలిసిందంతా చెప్పు, రహస్యంగావుంచుతాను.

నీవు కోర్టులో సాక్ష్యమియ్య నవసరంలా. నిన్ను విడిచిపెట్టేస్తాము. లేదా ఉద్యోగంలో చేర్తే అన్నివిధాలా సహాయం చేస్తాను" అన్నాడు. అందుకు నేను "నేను చేసిందేదో చేశాను. ఇకముందు అట్లాంటిని చెయ్యను. వీలైతే నాకు మిలిటరీ ఆఫీసర్ ఉద్యోగం యివ్వండి. నేను ఫ్రాంసుకువెళ్ళి జర్మనీతో యుద్ధం చేస్తాను" అన్నాను.

దాని కాయన ప్రత్యుత్తరంయిది:- "నిన్ను మేము నమ్మ లేము. నీవు సైన్యంలోచేరి, అక్కడ నీ విద్రోహచర్యలు సాగించాలని చూస్తున్నావు! సరే, ఇకపో! నిన్ను తప్పకుండా కాల్చెయ్యాలి."

మిగతా మిత్రులవిషయంలోకూడా అట్లాగే జరిగి వుండొచ్చు. నా కేమీ తెలియదు. దగ్గరగదుల్లోవున్నా ఒకరినొకరం చూచుకోటానికి సాధ్యపడదు. 24 ఘంటలూ గదిలో వుంచేవారు. నా మనోధైర్యంమీదనే ఆధారపడాల్సివుంది. తోటిమిత్రులకు నేను సహాయంచెయ్యగలస్థితిలో లేను.

ఉదయం కక్కసుకు వెళ్ళటానికీ, కక్కసుచట్టిని శుభ్రం చేసుకోటానికీ, మధ్యాహ్నపు ఎండలో గులకరాళ్ళమీద నడిపించ టానికీ తీసుకెళ్ళేవారు; నామిత్రులను ఆఫీసుకు తీసుకెళ్లేప్పుడు తిరిగి తీసుకొచ్చినప్పుడు తలుపులు తెరచి మూసిన చప్పుడు వినిపించేది.

పాండ్యన్ కొంతకాలానికి ఇండియాకువచ్చాడు. మామీద కోర్టులో సాక్ష్యంఇచ్చేందుకు నిరాకరించాడనీ, అందుచే అతన్ని కొన్నిరోజులు లాకప్‌లోపెట్టి బెదరించారనీ, తుదకు డెప్యూటీ పోలీసు సూపర్నెంటు ఉద్యోగం సంపాదించుకొన్నాడని

మాయిద్దరికి మిత్రుడైన శ్రీ భాగవతుల సోమయాజిశర్మగారు 1920 లో నాతో చెప్పారు.

కోర్టు మార్షల్ — కాల్చమని శిక్ష

మా ఏడుగురిని కలిపి కోర్టుమార్షల్ చేశారు. చక్రవర్తికి ద్రోహంచేశామని ఏవేవో నేరా లారోపించారు. అందరిని మూడు రోజులకు కాల్చివేస్తామని తీర్మానించారు. ప్రాసిక్యూషను కూడ ఆదేశిష. అతను డైరీ తనదికాదని చెప్పొచ్చు. కాని, మా కెదురు తిరగలా.

లాహోరు కుట్రకేసులో ఛీఫ్ప్రాసిక్యూటరైన డెన్హాము (ఈయన్ను ప్రత్యేకంగా ఇంగ్లాండునుండి యీకేసులు నడుపుటకు స్పెషల్‌ఫీజు యిచ్చి రప్పించారు.) కోర్టు మార్షల్‌లో మామీద కేసులుపెట్టి శిక్షించేలాగు చేయించారు. అతను దీర్ఘకాయుడు; బలశాలి. మాగదులకు వచ్చి మాకుతెలిసిందంతా చెప్పి తప్పించు కోమని ఆమూడురోజులు ఎంతో ప్రయత్నంచేశాడు. పెద్దపీతాలలో ఉద్యోగాలు ఇప్పించుతానని ఆశలుపెట్టాడు. మాతల్లిదండ్రులు, భార్యా-బిడ్డలు మమ్మల్ని చూడాలని గంపెడాశతో వున్నారన్నాడు. చిన్నవాడివి, చాలాకాలం జీవించవలసినవాడవు. వృధాగా చచ్చి పోవడం బుద్ధిహీనతఅని ప్రత్యేకంగా నాకు బోధించాడు. నేను చలించలేదు; కాని, ఆమూడురోజులూ మనసులో ఆందోళన చాలాఘోరంగావుండేది. ఆమూడురోజులూ పడ్డ బాధ మరెప్పుడూ పడలా. వెంటనే కాల్చేసివుంటే ఎంతో బాగుండేదని అను కొనేవాడిని. *

* చంపివేయమని శిక్షింపబడిన తరువాత ఏవేవో మంచిచెడ్డ ఆలో చనలతో కుంగిపోతూవచ్చాను. అలాంటివారికి ఆ కష్టం తప్పదనుకుంటాను

మూడోనాడు కాల్చివేయుటకు మాఅందరినీ కోటకు తీసుకెళ్లి కూర్చోబెట్టారు. మొదట భాయి బలవంత్‌సింగ్ గ్రంధి, తరువాత నేను....చివర జోద్‌సింగ్ కూర్చున్నాము.

వీరబల్వంతసింగు, అతని వీరపత్ని. పుత్రులు

ధైర్యసాహసాల్లో, త్యాగంలో, నైతికగుణాల్లో బలవంత సింగు మా అందరిలోకి మేటి. షుమారు ఆరడుగులఎత్తు, ఎత్తుకు తగ్గ దేహము; బలశాలి. ముఖంలో సాత్వికం తాండవమాడుతుంది. నల్లని పొడుగాటిగడ్డం; బ్రిటిష్ ఇండియన్ సైన్యంలో ఉద్యోగం మానేసిన మామూలు సిపాయి. అమెరికాలో సిక్కులకు గ్రంధి-అనగా గురువు. తమ మతగ్రంధాన్ని చదివి తెలియ చెప్పడం అతనిపని. వాస్తవంగా గుణాతిశయంవల్ల గురువు. 35 సం॥ల వయస్సు. పడుచుభార్య, ఇద్దరుబిడ్డలు. షాంగైలో వారిని విడిచేసివచ్చాడు. ఆవీరుడు మళ్లీ వారిజీవితాల్లో కలుసుకోడని భార్యనమ్మినా కంట నీరుపెట్టిందేకాని, ధర్మమనసు చలించేలాగా అడ్డుపడలా. ఇద్దరు కొడుకులు (5. 8. సం॥ల వయసువారు) "అమ్మా, భయపడొద్దు! నాన్నను చంపివేస్తే మేమున్నాం! పెద్దవాళ్ళమయ్యాక అంగ్రేజివాళ్లను నరికేసి కసితీర్చుకొంటాం" అని తల్లిని ఓదార్చుటకు తెలిసీతెలియనిమాటలతో

---

కాని, ఒకవిషయంలోమాత్రం అలా జరగలేదు. ఖుదీరాం బోసు 1907 ప్రాంతంలో టెరరిష్టులకేసులో దేశద్రోహిని జైలుఆసుపత్రిలో కాల్చి సాక్ష్యంలేకుండాచేశారు ఎందరిప్రాణాలో దక్కినవి. కాని, ఆయనకు ఉరిశిక్ష పడింది. పదిహేనురోజులకు ఉరితీసేముందు క్షీణించిపోవుటకు మారుగా అతని బరువు సంతోషము, శాంతము అధికమవుతూవచ్చాయి. ఆయన ఎంత మహానుభావుడోకదా!

చెప్పారు. ఆ చిన్నపిల్లలు అర్థంచేసికొని అన్నమాటలు కావు. అయినా తండ్రి బిడ్డలను, భార్యను కౌగలించుకొని ముద్దాడి వచ్చేశాడు.

మేజరు మావద్దకు వచ్చి "బలవంతసింగ్! లేచినుంచో! ఏమయినాపుంటే చెప్పి తప్పించుకో! లేదా, కాల్చేయకతప్పదు." అన్నాడు. బల్వంతసింగ్ యిలా అన్నాడు. "మీరుచంపివేయకపోతే నేను చావకుండా వుంటానా? ఎప్పటికైనా చావాల్సిందే! ఎందరో ఎన్నో రోగాలతో చస్తారు. నేనో! బ్రిటిష్‌సామ్రాజ్యవాదం అనే అంటురోగంతో చస్తున్నా." ఆఫీసరు "అలాగయితే నడువు!" అన్నాడు. మమ్మల్నందరినీ కౌగలించుకొని, బల్వంతసింగ్ కదంతొక్కుతూ నవ్వుముఖంతో వెళ్లాడు.

మా ముఖాల్లో నెత్తురుచుక్క లేదు. దుఃఖసముద్రంలో మునిగినట్టయింది. కొన్ని నిముషాలకు తుపాకుల్కాల్చినశబ్దం వినపడింది. భాయీ చచ్చిపోయాడని మేము ఒకరినొకరం చూచుకొని విచారపడ్డాం. నిట్టూర్పులు విడిచాము. మేము అలాగే ధైర్యంగా చావాలని స్థిరపరచుకొన్నాము.

'ద్రోహంచెయ్యి, చావు తప్పిస్తా'

కొంచెంసేపటికి మిలిటరీఆఫీసరు మళ్ళీ వచ్చాడు. "నీవు చాలా చిన్నవాడివి. నీతల్లి మొదలయినవారు నిన్ను చూడాలని ఎంతో ఆశపడుతుంటారు. తెలిసిన విషయాలు చెప్పు. వృధాగా ఎందుకు చచ్చిపోతావు" అన్నాడు నాతో. "భాయి బలవంతసింగుకు భార్యా-బిడ్డయున్నా లక్ష్యపెట్టక ప్రాణాలర్పించాడు. నాకు భార్యాబిడ్డలుకూడా లేరు. నేను విచారపడేందు కేమీ లే" దన్నాను.



శ్రీ భాయి బల్వంత్ సింగ్ గ్రంథి.

(ఊహా చిత్రము)

లేవమన్నాడు. మిత్రులను కౌగలించుకొని నవ్వుముఖంతో ఛాతీవిరిచి నడిచాను. లోపల ఒక పొడుగాటి హాలు. ఒకచివర అయిదుగురు సోల్జర్లు రైఫుల్సుతో నిలబడివున్నారు. మరోచివర ఒక కొయ్యస్తంభాన్ని నిలబెట్టి వుంచారు. దానికి ఆనించి నన్ను నిలబెట్టారు. "ఏయ్! చంచయ్యా! కాల్చమని ఆర్డరు యిస్తే, చచ్చిపోతావు. ఒక్కనిముషం టైమిస్తాను, ఆలోచించుకో. నీకు తెలిసిన విషయాలు చెప్పి తప్పించుకో" అన్నాడు. మళ్లీ. "నాకు టైము అవసరంలేదు. కాల్చుకో' మన్నాను కాల్చడానికి ఉత్తరు విచ్చాడు. అయిదు తుపాకులు మోగాయి. కాని గుండ్లు నాకు తగల్లా*. నావైపు తిరిగి నవ్వాడు ఆఫీసరు.

కొంతదూరంలో ఒకగదికి తీసుకెళ్లారు. బలవంతసింగ్ కూర్చునివున్నాడు. ఇద్దరం కౌగలించుకున్నాం. "ఎంత హింస పెట్టారు! రహస్యాలు లాగడానికి ఎంత ఉపాయంవేశారు!" అనుకొన్నాము. అటుతరువాత అమరసింగ్, ఠాకుర్‌సింగ్, శివప్రసాద్‌గుప్త, చటర్జీకూడ వచ్చారు.

పంద జోద్‌సింగు

కడపట కూర్చుండిన జోద్‌సింగు రాలేదు. తుపాకులశబ్దం వినబడలేదు. మా ఆరుగురినిమాత్రమే తిరిగి మిలిటరీలో ఎక్కించుకొని తీసుకెళ్లారు. త్రోవలో మాలోమేము "జోద్‌సింగ్ చెప్పాడేమో! మిగిలినవారు చచ్చిపోయారుగదా! భయపడవద్దు చెప్పి జీవించు" అని ఆశపెట్టివుంటారు. చెప్పేవుంటాడు. వీరికి

* బ్లాంకు తోటాలు కాల్చారు. వాటిలో గుండ్లు ఉండవు: అవి శబ్దంమాత్రమే చేస్తవి. సీసంగుండ్లకుబదులు మైనంగుండ్లుపెటారు. అవి కరిగిపోతె.

వెధవ! చివరకూర్చున్నాడు. మనమధ్యలో కూర్చుండబెట్టివుంటే ఎంతో బాగుండేది అని అనుకుంటూ తిరిగి మిలిటరీ జైలుకు చేరుకున్నాం. చావునుండి తప్పించుకున్న సంతోషం ఈ సంశయంతో దుఃఖంగామారింది. తిరిగి మామూలుగా ఒక్కొక గదిలో వేశారు. జోద్‌సింగు జీవించేవున్నాడు. సర్కారుకు సాక్షి (అప్రూవరు) అయ్యాడు. తనడైరీలో వ్రాసినదంతా ఒప్పుకొన్నాడు. రహస్యాలన్నీ చెప్పేశాడు. వీడిని నాశనం చెయ్యనియెడల ఎందరో నశించిపోతారు; పార్టీనశించుకుంది.

శిక్షపొందిన సోల్జర్లు తినే తిండినే మాకుకూడ పెట్టారు. మాకు ఈభోజనం విసుగెత్తింది. చపాతీలు కావాలని బలవంత సింగు కోరాడు. తానే చేస్తానన్నాడు. చేస్తూవుండినాడు అయితే తన ఉద్దేశం వేరు. జోద్‌సింగును బయటకు తీస్తే, కట్టెలు నరికే మొద్దుకత్తితో వానిని చంపేయాలని బలవంతసింగు ఆశయం. లేకపోతే!....జోద్‌సింగు దేశదేశాలు తిరిగి, గదరుపార్టీ ప్లానులనుయిచ్చి, గదరుపార్టీ సైన్యంలో చేర్తానన్నవారికి ప్రయాణఖర్చులు అడ్వాన్సుగా యిచ్చివచ్చాడు. జర్మనీనుండి వచ్చాడు. ఉత్తర దక్షిణ అమెరికాలు సంచారం చేశాడు. జపాను, చైనా, ఫిలిప్పీన్ దీవులలో సైనికులను రిక్రూటుచెయ్యమని పార్టీ ఆర్గనైజర్లతో ఏర్పాటుచేసి వచ్చాడు. ఈ విషయాలను డైరీలో ఎక్కించాడు. కోర్టులో సాక్ష్యమిస్తాడు. వానిని చంపివేస్తే సాక్ష్యం లభించదు; కేసులు నిలవ్వు; గదరుపార్టీ మెంబర్లు ఎంతోమంది చావు తప్పించుకొంటారు. అందువల్ల బలవంత సింగు జొద్‌సింగును చంపడానికి చపాతీలుచేస్తాననే మిషతో వంటచేయటానికి ఒప్పుకొన్నాడు. సమయంకోసం కాచుకొన్నాడు.

## చటర్జీ ఎత్తుగడ

చటర్జీ మరొక ఎత్తువేశాడు. ఆహారాన్ని ప్లేటుల్లో పెట్టి మా గదులగుమ్మాలో పెట్టివెళ్ళేపని ఆయనది. జోద్‌సింగు విషయంలో జాగ్రతపడవలసిందని ఒకఎత్తుగడవేశాడు. ఆఫీసుకు వెళ్లినప్పుడు కాపీయింగు పెన్సిలును సంగ్రహించాడు. తనగదిలో సీటిలో వేసి, సీసాన్నితీసి, కాగితంలో చుట్టి జోద్ సింగుకు తప్ప మిగిలినవారికి చపాతీలమధ్య పెట్టాడు. కాగితంలో యీలా వ్రాశాడు. జోద్‌సింగు డైరీ, వానిసాక్ష్యం కలసి మనమీద కేసుగెలవడానికి, మనకు శిక్షపడడానికి చాలు. మనలో ఎవరయినా అప్రూవరుఅయి జోద్‌సింగుకు వ్యతిరేకంగా సాక్ష్యం యిస్తే, వాని సాక్ష్యాన్ని పాడుచెయ్యొచ్చు. మనమందరం చేసిన పనులను అప్రూవరు తానేచేశానని చెప్పి శిక్షను తప్పించుకోవచ్చు. మేము ఎవరమూ అప్రూవరగుటకు సమ్మతించనిచో తానే అప్రూవరవుతానని వ్రాశాడు. మే మెవరమూ అప్రూవరవటానికి యిష్టపడలా. చటర్జీ అవటంకూడ మాకు యిష్టంలేదని తెలిపాము. కాని, తాను అప్రూవరయ్యాడు.

విచారణలో ఏమేమిజరుగుతున్నది ఒకరినొకరం ఏరోజు కారోజు తెలుపుకోడానికి ఒకఉపాయం పన్నాము. ముడ్డి తుడుచు కోటానికి యిచ్చిన కాగితాలు సమృద్ధిగా ఉన్నై. వాటిమీద వ్రాసి ఉదయం కక్కసుకువెళ్లినప్పుడు పైజాములో దాచుకొనిపోయి కక్కసుమూలలో పెట్టటం, ఒకరితరువాత ఒకరు చదువుకొని చివరవాడు పెంటబకెట్‌లో వెయ్యడం ద్వారా సి. ఐ. డీ. ఆఫీసరు ఎత్తులు మాకు ముందుగానే తెలుస్తూవచ్చాయి.

చటర్జీ అప్రూవరు కావడంతో నాకు మాత్రం ఒకఅను కూలం చేశాడు. ఆయుధాల స్టీమరును గురించిన ఉత్తరాలను మనిలాలో జర్మనురాయబారికి తెచ్చి యిచ్చింది నేను కాదనీ, జోద్‌సింగు తెచ్చాడనీ, చంచయ్యమీద విరోధంవల్ల అబద్ధం చెప్పాడనీ సాక్ష్యం యిచ్చారు. జోదుసింగు మందబుద్ధి; భయస్తుడు. చటర్జీది చురుకుబుద్ధి; భయపడడు; మసిపూసి మారేడుకాయ చేయగలడు. కాబట్టి సలక్రిందులు చేసేవుంటాడు.

అయితే చటర్జీ ఏమేమిరహస్యాలు చెప్పాడో లేదో మాకు తెలియదు. కాని, సి. ఐ. డీ. లు వానిని నమ్మి, డబ్బుయిచ్చి, ఇతరదేశాలలో పనిచేయుటకు పంపారు అట్లా తప్పించుకొని తిరిగి అమెరికా చేరాడు. *

* 1928-29 లో నేనూ నామిత్రుడు శ్రీ మోతే నారాయణరావు గారు కలసి వితంతు వివాహాలు చేయిస్తూవచ్చాము. మదరాసుకువెళ్ళే మెయిల్‌లో బెజవాడలో తనను సెకండు క్లాసులో కలుసుకోమన్నారు. వెళ్ళాను. అయిదారుమంది ఆ కంపార్టుమెంటులో ఉన్నారు. శ్రీ మోచర్ల రామచంద్రరావుగారుకూడా ఉన్నారు. ప్రసంగం ప్రారంభంకాగానే ఒక వ్యక్తి హఠాత్తుగా లేచివచ్చి నన్ను కౌగలించుకొని "చంచయ్యా! ఇంకా జీవించేవున్నావా?" అని ప్రశ్నించాడు. నాకు ఆశ్చర్యంవేసింది. అతను చటర్జీ. రామచంద్రరావుగారు. నారాయణరావుగారు మొదలైన మిత్రులు "యిదేమిటి, చెప్పండి" అని ప్రశ్నించారు. ట్రెయిను కదలబోతూంది. నేను దిగాను. చటర్జీ యీకంథంతా వారికి చెప్పాడు. శ్రీ మో. రామ చంద్రరావుగారు నేను కలుసుకున్నప్పుడు "చంచయ్యా! నిన్ను బాగా యెరుగుదును. ఛటర్జీ చెప్పిన సాహసకార్యాలను నీవు చేసే వుంటావా! అనే సంశయం నన్ను బాధిస్తూవున్నది" అన్నారు.

## నరకంలో సంతోషం

జైళ్ళలో ఎన్నో "నేరాలు" చేశాను. అందరం చేస్తాం. అయితే మిలిటరీ జైలులో "మార్షల్ గా" కాలంలో చేసే నేరానికి శిక్ష చాల కఠినంగా వుంటుంది. అయితే చెయ్యక తప్పని సరి ఒకొకప్పుడు ఏర్పడుతుంది. ఒక సాయంత్రం గులకరాళ్లమీద నడచుటకు విడిచారు సోల్జర్లు. నాకు ఎదురుగా నడవటానికి క్రొత్తవానిని తెచ్చారు అతను పంజాబీ. క్రొత్తగా ఇద్దరు గదరు పార్టీవారిని తీసుకవచ్చి గదులలో పెట్టారు అని గ్రహించుకో గలిగాను చప్పుడువల్ల. అప్పటికి వీరు ఎవరయినది నాకు తెలియదు.

మాకు కాపలాఉన్న సోల్జరు సిగరెట్టు కాల్చుకోడానికి వెళ్లాడు. ఆసమయంలో, ఈవ్యక్తి, తనను కాల్చివేయుటకు తీర్మానించినట్టు చెప్పాడు. భయపడుతున్నాడని తెలుసుకొన్నా. జోద్‌సింగులాగు ఎందరికైనా హానికలిగేలాగున, మాలో ఎవరమైనా చెయ్యగలము. అలాగున జరుగనియ్యకూడదు. వెంటనే నేను ఇట్లా చెప్పాను:- "కాల్చరు; మమ్ములను ఇట్లాగే కాల్చి వేయుటకు తీసుకెళ్లారు. కాల్చేశారు. భయపెట్టి రహస్యాలు తెలుసుకొనుటకు ఇట్లా చేస్తారు. మనందరిని ఇండియాకు తీసుకెళ్లి కేసుపెట్టుతా" రని స్పష్టంగా చెప్పాను. మేము మాట్లాడడం విని సోల్జర్లు పరుగెత్తుకొని వచ్చి గదిలోకి లాక్కుపోయారు. కేసుపెట్టారు. ఒక వారంరోజులు చేతులకు సంకెళ్లు వేశారు. రోజూ ఒక పౌనురొట్టె, త్రాగుటకు నీళ్లు మాత్రమిచ్చారు.

---

ఆకాలంలో శ్రీ మోతే నారాయణరావుగారివద్ద సినిమా ఫొటోగ్రాఫరుగా చటర్జీ కొంతకాలం పనిచేశాడు. జబల్‌పూరులో మకాం,

కొందరిప్రాణాలు రక్షించాననే సంతోషమే తప్ప, సంకెళ్ల బాధగాని, ఆకలి బాధగాని నన్ను కలవరపెట్టలేదు. ఎంత సంతోషించానంటే. సంకెళ్ళను ముద్దుపెట్టుకొనేవాడిని.

క్రొత్త వ్యక్తిపేరు హరిచరణ్‌దాస్. ఇతను, మరికొందరు వాలంటీర్లు ఆయుధసామగ్రి స్టీమరుమీద నావికులుగా అమెరికా నుండి బటేవియాకు వచ్చారు. బ్రిటిష్ యుద్ధనావలు ఆ స్టీమరు వెంటపడ్డాయి. బటేవియా హార్బరులో ఆ స్టీమరు నిలబడిపోయింది, నావికులుగా వచ్చిన వాలంటీర్లు కొందరు ఇండియాకు స్టీమరుమీదవెళ్తుండగా, బ్రిటిష్ పోలీసులు ఇద్దరినిపట్టు కొని సింగపూరు మిలిటరీ జెయిలులో మాతోవుంచారు. వారు హరినామ్‌చంద్, హరిచరణ్‌దాస్. లాహోరు కుట్రకేసులో, రెండవ సప్లిమెంటరీకేసులో వీరిని మాతోకలిపి కేసుపెట్టారు. *

## ఆరునెలల ఏకాంతవాసం తరవాత

మాతోకలిసి పనిచేసే జర్మను ఆఫీసర్లను ఎక్కడనో యుద్ధఖైదీలుగా వుంచేశారు. చటర్జీ, జోమసింగులు- ఈ యిద్దరు అప్రూవర్లను మాతో కలపలేదు. ప్రత్యేకంగా వుంచేశారు. అమర్ సింగ్, శివదయాళ్‌గుప్తను బర్మాలో మాండలే కుట్రకేసు

* ఈ హరిచరణదాసుకు చుట్టలు, సిగరెట్లు, బీడీలు త్రాగకపోతే పొట్టలో నెప్పివస్తుండేది. చాల బాధపడ్డాడు. అతనిస్నేహితుడు హరి నామ చంద్ చాల ధైర్యము, బలము, త్యాగముగల గొప్ప గుణశాలి. రామ లక్ష్మణులవలె వీరిరువురు ఉండేవారు. హరిచరణదాసును బయటకుపంపి తేనే పొట్టనొప్పి పోతుందని తలచి, హరిచరణదాసు చేసిన నేరాలన్నీ తానే చేశానని చెప్పటకు హరినామచంద్ తయారయ్యాడు. కాని అవస రంతేకపోయింది. వెంటనే ఇండియాకు తీసుకెళారు.

నేరస్తులుగా తీసుకెళ్లారు. మిగిలినది - బలవంత్‌సింగ్, ఠాకుర్ సింగ్, నేను, హరినామ్‌చంద్, హరిచరణ్‌దాస్- అయిదుగురం మాత్రమే. ఆరునెలలు ఏకాంతవాసము, ఇతరహింసలు అనుభవించిన తర్వాత ఇతరులతో కలిసి మాట్లాడుటకు అవకాశం వచ్చింది. ఆరునెలలతరువాత క్షవరం చేయించారు. మా పెట్టెలు బట్టలు యిచ్చారు. చదువుకోడానికి పుస్తకాలు లభించాయి. "సాలిటరి ఇంప్రిజన్‌మెంటు" ఎంత ఘోరమో తెలుసుకోవాలి. ఎంతవ్రాసినా, చెప్పినా బోధపడదు.

మాసామాన్లు చాలా కనపడలేదు. సోల్జర్లు దొంగిలించారు. నా హాట్, బూట్, కాలర్లు, నెక్‌టైలు, రిష్టువాచి, ఫవుంటెన్‌పెన్, కెమెరా, క్షవరం సామానులు, ప్రయాణం చెక్కుబుక్కు, రొక్కము. పుస్తకాలు వగైరా దొంగిలించారు. సోల్జర్లు ఇలా దొంగలించడం సర్వసామాన్యం. సాధారణంగా అనేకమంది వ్యాపారస్తులు ముఖ్యంగా సింధివర్తకులు, చైనావర్తకులు రోజూ స్టీమరుమీద సింగపూరులో దిగుతూవుంటారు. వీరవెంట పెట్టెలనిండా ఫాన్సీ సామానులు, ముఖ్యంగా సిల్కులు ఉంటవి. వీరిని అరెస్టుచేసి కోటకు తీసుకవచ్చారు "బాంబులు, రివాల్వర్లు, ఆయుధాలు ఏమైన ఉన్నవేమో తనిఖీచేస్తాం" అనే నెపంతో సామాన్లను చిందరవందర చేస్తారు. ఈగందరగోళంలో, ఆఫీసరు పిలుస్తున్నాడని లోపలికి ఒక సోల్జరు తీసుకెళ్తాడు. మిగిలిన

కలకత్తా ఆలీపూరు సెంట్రలు జయిలులో అనుకూలత సంపాదించుకొనేందుకు మేము చేసిన ప్రయత్నాలలో వీరిద్దరిధైర్యసాహసాలు చాలా అనుకూలించాయి. కలకత్తా జైలు అనుభవాలనుగురించి వ్రాసినప్పుడు వీరినిగురించి వ్రాస్తాను.

సోల్జర్లు సామాన్లను దొంగిలిస్తారు. సింధి వర్తకులు, చైనా వర్తకులు, చాలా భయసు...సింగపూరులో మార్షల్ ఉంది. ఎప్పుడు తప్పించుకుపోతామా అనే ఆతురతతో, ఎన్నిసామాన్లను దొంగిలించినా, నష్టపడినా ఆక్షేపణ చెయ్యకుండా సలాముపెట్టి వెళ్తారు. మేము మాత్రం ఆక్షేపణ చేశాము. కాని వృధా అయి పోయింది.

కలకత్తాకు ప్రయాణ - ఓడలో ముచ్చట్లు

సింగపూరునుండి స్టీమరుమీద కలకత్తాకు షుమారు ఎనిమిది రోజులు పట్టింది. ఈ ప్రయాణంలోని ఒకటిరెండు విషయాలు మాత్రమే జ్ఞాపకమున్నై. "మిలిటరీ యస్కార్టు" (escart Shropshire Regiment) మాకు చాలా అనుకూలంచేశారు. భోజనాలకు అడిగినంతా యిచ్చారు; మా యిష్టప్రకారము మేమే వంటచేసుకొన్నాము. హరినామ్‌చంద్ వంటలలో ప్రవీణుడు. పూర్వము రాణీసంయుక్తభర్త- పృథ్వీరాజు వంశీకుడు. పంజాబులో నగలు చేసేవాడు. అమెరికాలో వ్యవసాయకూలీపనిచేసి బాగ సంపాదించాడు. దేహబలం. మనోబలంగలవాడు. పస్తాడు. 250 పౌనులతూకం. స్టీమరుమీద బస్కీలు, దండాలు ప్రారంభించాడు. ఒకరోజున హల్వా చేశాడు. ఒకవీశెకంటె ఎక్కువ వుంటుంది. చుట్టూ కూర్చుండి ఎప్పుడు తయారగునా, ఎప్పుడు తిందామాఅని ఉవ్విళ్లూరుతూన్నాము. తమాషాకు "భాయీజీ! ఈ హల్వా అంతా తినగలవా?" అన్నాము. తినగలనన్నాడు హరినామ్‌చంద్. మాకు ఆశ్చర్యంవేసింది. అంతతింటే కడుపినొప్పి వస్తుందన్నాము. కడుపునొప్పిరాదు; జీర్ణంచేసుకోగలనన్నాడు. అయితే తిని మాట నిలుపుకోమన్నాము. వుండలుచేసి మింగేవాడు.

నపలనేలేదు. జీర్ణమెలాకాగలదా అని మా సందేహం. తిన్న వెంటనే లంగోటీ కట్టాడు; బస్కీలు ప్రారంభించాడు. చమట కారిపోతూంది. చమటను చూపించి "ఇదిగో! హల్వా జీర్ణమైపోతున్న"దని నవ్వాడు. కడుపునొప్పిగాని, మరేబాధగాని రానేలేదు.

మరొకవిషయంరాద జ్ఞాపకమున్నది. మాతో ఒక పఠాను తాత ప్రయాణంచేశాడు. చాలా బలమైన నరాలు ముఖంలో తేలిఉండేవి. హాంగ్‌కాంగ్‌లో వాచ్‌మన్ నౌకరీ చేశాడు. ఆయన ముఖం చూసేకొద్దీ నాకు ఆశ్చర్యం హెచ్చుతుండేది. మన ఆంధ్ర దేశంలో అంటటి బలశాలురు అరుదుగావుంటారు. చిన్నప్పుడు సైన్యంలోచేరి కొండల్లో అడవుల్లో ఏలా యుద్ధంచేసిందీ వర్ణించే వాడు. అప్పుడు నాకు 25 సంగల వయస్సు; 125 పౌనుల తూకం. నా కండలు పట్టిచూచి "నీవేమి యుద్ధం చెయ్యగలవు?" అని పరిహాసం చేసేవాడు. తన బలాధిక్యత నా బలహీనత ప్రదర్శించమంటావా అని ఒక తమాషా పందెం వేశాడు. నా రెండు చేతులతో తన చెవును గట్టిగా పట్టుకొని, సాధ్యమైనంత గట్టిగా లాగమన్నాడు. లాగాను కాని, అతను నాచేతుల్లో బలములేదని హేళనచేస్తూ తిరిగి లాగమని ప్రోత్సాహపరిచాడు. తాను నొప్పిని లక్ష్యంచెయ్యలేదు. నా చెవిని తన ఎడమచేతి రెండు వేళ్లను మడచిపట్టుకొని కుచ్చుంచే తాను లాగుతానన్నాడు. సరే నన్నాను. లాగకముందే నొప్పికి తాళలేకపొయ్యాను. "అంగ్రేజీ వాళ్లను ఏకాలానికైనా మేమే తరిమివెయ్యాలి" అని సగర్వంగా నవ్వి అన్నాడు.

### ఇండియా జైళ్లలో

మమ్మల్ని అయిదుగురిని కలకత్తాలో ఆలీపూర్ సెంట్రల్ జైలులో వేశారు. క్రమంగా ఆరునెలలు మా సంఖ్య పెరుగుతూ వచ్చింది. నన్ను ఆ కాలంలో ఇండియాలో అయిదు జైళ్లకు మార్చారు— కలకత్తా, లాహోరు, ఢిల్లీ, కన్ననూరు, కోయంబత్తూరు. ధైర్యసాహసాలు లేకపోతే, జైళ్లలో గౌరవంగా జీవించటం సాధ్యం కాదు. ఆలీపూరు జైల్లో గదరుపార్టీ పంజాబీ వారితో కలిసివుండి, జైలు అధికారులతో ఎలాగు పోట్లాడాలో నేర్చుకొని, గౌరవంగా జీవించడం తెలుసుకొన్నాను. మనలను చూసి భయపడనిది మర్యాదచెయ్యరని తెలుసుకున్నాను.

సింగపూరు మిలిటరీ జైల్లో చీకటి గదిలో ఏకాంతంగా ఉండటానికీ, ఆలీపూర్‌లో పగలంతా స్వేచ్ఛగా ఆ చిన్నకాంపౌండులో మిత్రులతో గడపటానికీ చాలా భేదం ఉన్నది. అంతే కాదు; మా స్వంతసొమ్ముతో బజారునుండి కొనితెప్పించుకొని అనుభవించవచ్చు.

బెంగాలు జైల్లో మమ్మందరినీ 'సిక్కులని' బెంగాలీ ఖైదీలు పిలిచేవారు. కామాగాటామారువారు, గదర్ పార్టీవారూ ముఖ్యంగా సిక్కులే. వారు కలకత్తా జైలులో అమర్యాదకు లొంగలా. ఆఫీసర్లు పొగరుబోతుతనంగా ప్రవర్తిస్తారు. అలాటి వారిని "సిక్కులు" తన్నేవారు. మరికొందరు గోడలుదాటి పారిపొయ్యారు. సెంట్రీల లాఠీలు, రైఫిల్సు లాక్కొని చంపేవారు. వీరులనిపించుకున్నారు. అప్పటి నుండి బెంగాలీలుకాని రాజకీయ ఖయిదీలందరినీ సిక్కులని పిలిచే అలవాటు. అప్పటికే "సిక్కుల" సాంప్రదాయాలు మాకు బాగా అనుకూలించాయి. *

అప్పట్లో ఆలీపూర్ జైలు చాలాపెద్దది. 1500 పైగా ఖైదీలు ఉంటూరు. సూపర్నెంటు ఐ. యమ్. యస్. ఆఫీసరు; తెల్లవాడు; తగవులాడేరకంవాడు. జైలరు ఆంగ్లేయుడు: చిత్రాల్ యుద్ధంలో పాల్గొన్నాడు. జెయిలుసర్వీసులో చేరి పొట్టపెంచాడు. అనవసరంగా విరుచుకుపడే పొగరుబోతురకం.

సాయంత్రం మమ్మల్ని గదులలో మూసివెయ్యడానికి ప్రత్యేకంగా ఒక జమేదారు వచ్చేవాడు. ఒడ్డూ - పొడుగూ కలిగి టీక్‌టాక్‌గా నడిచేవాడు. మహా పొగరుబోతు. ఇతను యు. పి. వాడు. • ఇతని ప్రవర్తనతో భాయి బలవంతసింగుకు చాల కష్టం తోచింది. మాలో హరిచరణదాసు చార్లీచాప్లిన్‌వంటి వాడు. డిసిప్లిన్‌కు లొంగడు. గదిలోకి వెళ్లటానికి ఒకటి రెండు నిముషాలు ఆలస్యంచేసేవాడు. ఒకనాడు జమేదారు ఆయన్ను లోపలకు నెట్టి తలుపేశాడు. దాసుకు కోపంవచ్చింది. ఇద్దరూ తిట్టుకొన్నారు. జమేదారును తన్నేవరకు నిరాహారవ్రతంపూనాడు. తనంతటతానే జయించలేడు. వ్రతం మానేస్తే జమేదారుని తన్నడానికి సహాయంచేస్తానని హరినామసింహుడు మాటయిచ్చినాక

* 1905 మొదలు 1916 వరకు విదేశాల్లో ఇండియన్ అనిగాని, హిందువనిగాని చెప్పుకుంటే గౌరవము సామాన్యమే. "బెంగాలీ" అని చెప్పితే గౌరవం జాస్తి. ఆకాలంలో బెంగాలీలు బాంబులువేసి, ప్రాణ త్యాగంచేసి, దేశస్వాతంత్ర్యంకొరకు శ్రమపడ్డారు.

• బెంగాలులో పోలీసులు, జైలు వార్డర్లు, ప్యూనులు, వాచ్‌మెన్‌లు వగైరా వృత్తులకు బెంగాలీలు సమ్మతించరు. వారికి ఎక్కువ జీతం కావాలి: యిచ్చినా నీచపుపనులు చెయ్యరు. యు. పి. పంజాబులనుండి వచ్చి యీ వృత్తులలో చేర్తారు.

భోంచేశాడు. ఎలా పరిణమిస్తుందో చూడాలని మా అందరికి కుతూహలంగావుంది. మమ్మల్ని దీనిలో ఎంతమాత్రం జోక్యం కలుగజేసుకోవద్దన్నారు. అవసరమయితే తరువాత సహాయం చెయ్యాలని మేము తీర్మానించుకొన్నాం.

జమేదారు వచ్చాడు. దాసు తన గదిగుమ్మంలో నిలబడ్డాడు. లోపలికి పోనని తిట్టాడు. జమేదారు చెయ్యెత్తాడు. ఒక్క సెకండులో హరినామచందు జమేదారు వెనక్కు వెళ్లి వాడి రెండుచేతుల్ని వెనక్కి విరిచి పట్టుకొన్నాడు. హరిచరణ్ లెంపకాయలువేసి తన్నాడు; పూర్తిగా పరాభవించేశాడు. "జావ్,సాలా!" అని పంపివేశాడు.

జమేదారు పరాభవంతో పోయి రిపోర్టుచేశాడు. డిప్టీజైలరు తెల్లవార్లు, నల్లవార్లు హంగామంది వచ్చి దాసును, బలవంత సింగును తీసుకెళ్లి వేరేచోట లాకప్ చేశారు. బలవంతసింగును తీసుకెళ్ళడంలో పొరపాటు చేశారు. అయినా నాటకం సాగనిచ్చాము. బలవంత్ మాకు అన్నివిధాలా నాయకుడు. జమేదారు తన గుడ్డినమ్మకంతో ఆయనే తనచేతుల్ని విరిచివుంటారని ఊహించి తప్పురిపోర్టుచేశాడు. హరినామచందు ఒడ్డూ-పొడుగూ (Personality) లేనివాడు. బలవంతసింగును వెంటనే తీసుకరమ్మన్నాము; లేకపోతే లడాయికి రెడీగా వుండమని వార్నింగు యిచ్చాము. ఉదయాన భోజనం మానేశాము. వారిద్దరిని తీసుకొచ్చారు; అంతే, కేసుగాని, శిక్షగాని లేదు. ఇది మొదటి విజయం. మామూలుగా జైలు అధికారులు కొళ్లు చేతులు చితగగొట్టి, సంకెళ్లువేసి, బట్టలుతీసేసి చిత్రహింసలు పెడతారు.

రెండవ పోరాటం :- విదేశాలనుండి వచ్చిన మరికొందరు భారతీయులను అరెష్టుచేసి మావద్ద వుంచారు. మొత్తం 12 మంది. చపాతీలలో పురుగులుండేవి; అవి అరచేతి లా వుండేవి; మాడి పొయ్యేవి. ఎన్నిసార్లు ప్రార్థించినా జైలరు లక్ష్యపెట్టలా. 1500 ఖైదీలు ఆక్షేపణ చెయ్యడంలేదనీ, మేము మాత్రమే కంప్లయింటు చేస్తున్నామనీ ఆయన పొగరుబోతు జవాబు. అతన్ని ఎనాలిసి తీర్మానం పెట్టాను. "ఒక పర్యాయం సూపర్నెంటుకు చెప్పి చూడాలి; అంతవరకు తిన్నకూడదు" అన్న నా సలహాకు ఒప్పుకొన్నారు.

సాయంత్రం యిచ్చిన చపాతీలను పోగుచేసిపెట్టాము. ఉదయాన గం. 6 లకు 27 జైలరు మామూలుగా వచ్చినప్పుడు కొన్ని రొట్టెలను చూపించాము. అయితే నిర్లక్ష్యంగా వెళ్లాడు.

ప్రతి దినము 8 గంటలకు మమ్ముచూచేందుకు సూపర్నెంటు ఒక డజనుమంది సిబ్బందితో వచ్చేవాడు. మేము సైలులో నిలుచుంటాము. ఇంగ్లీషులో మాట్లాడటం నాకు బాగా తెలుసు. కాబట్టి నన్ను ముందు నిల్చొని రొట్టెలు చూపించి మాట్లాడమన్నారు. రొట్టెలను మేము పోగుచేసి వుంచినసంగతి వార్డరు వెంటనే జైలరువద్దకు వెళ్ళి చెప్పాడు. జయిలరు మావద్దకు వచ్చి "రొట్టెలను మేమే చూపిస్తాము; మాచేతి కివ్వండి! లేకపోతే రొట్టెలతో సూపర్నెంటును కొట్టటానికి వుంచారని కంప్లయింటు చేస్తా" మని నచ్చజెప్పి తీసుకెళ్ళి వార్డరుతో జైలుగోడకు వెలుపల పారేయించారు. మాకు కోపం హెచ్చింది. సూపర్నెంటుకు చెప్పాను. జైలరును అడిగాడు. నేను అబద్ధం చెప్పానన్నాడు. "మీజైలరే అబద్ధం చెప్పాడు నీచుడు" అన్నాను. నాస్నేహితులు విజృంభించి

కోపం ప్రదర్శించారు. 'విచారణ చేస్తా' నని చెప్పి సూపర్నెంటు వెళ్తూండగా జైలరు మా వైపుకు తిరిగి 'మిమ్మేమి చేస్తానో చూడండి!' అని వేలుతో చూపుతూ బెదిరించాడు. మాలో కొందరూ "హుం" అని ముందుకు సాగబోయారు. జైలరు పరుగెత్తి సూపర్నెంటుతో మేము కొట్టబొయ్యామని మళ్లీ కంప్లయింటుచేశాడు. సూపర్నెంటు వెనక్కి తిరిగి చూచాడు. మేము ఫయిల్లోనే కోపంతో మాట్లాడు కుంటున్నాము.

మధ్యాహ్నం మంచి వసతీలు వచ్చాయి. పరిస్థితులు బాగుపడేలాగు తోచింది. కాని, సాయంత్రానికి మమ్మ మరొక బ్లాకుకు తీసుకెళ్లారు. క్రింద ఒకహాలు; పైన యింకొకటి. క్రింద కాన్విక్టు వార్డర్లు; మేడమీద మేము. పెద్ద ఆవరణ, షుమారు 12 అడుగుల ఎత్తున్న యినుపకమ్ముల కటకటాలు. ఇకమీదట ఆఫీసర్లకు మాకు మధ్య ఈ కటకటా లుండె; ఇక వారిని తన్నటం సాధ్యపడదు. అందువల్ల నామీద చాలా ఆగ్రహం వచ్చి కొందరు "మద్రాసీ సలహా తీసుకొన్న గతి!" అని పరిహాసం చేశారు. "పరవాలేదు! ఒకరిమీద ఒకరం నిలబడి కటకటాలను దాటుదాం; లేదా గేటుకీపర్లను మాయచేయవచ్చు"నని సమాధాన పర్చ ప్రయత్నించాను; కాని. ఉపయోగించలా.

ఉదయాన మాకు రొట్టె, వెన్న, టీ యిచ్చే వాడుక. మమ్మ కొత్తకోటుకు మార్చిన మరునా డుదయాన జైలరు స్వయంగా "టీ"తో వచ్చాడు. చిన్న డాక్టరును వెంటతెచ్చాడు. "మీకు ఇకమీదట కంప్లయింట్లుండవులే" అన్నాడు. జైలరును పరీక్షించటానికి టీ రుచిగా వున్నా చక్కెర చాలలే దన్నాము; జైలరు తాగిచూచి చక్కెర చాలదన్నాడు. మాలో మరొకరు

పాలు చాలవన్నారు తిరిగి రుచిచూచి అవునన్నాడు జైలరు. "ఎవరు ఈ టీ చేసింది? వాడిని శిక్షిస్తాను" అని. డాక్టరుతో "ఇకమీదట వీరిభోజనసమయంలో నీవు రావాలి, ఏ కంప్లయింట్లూ లేకుండాచెయ్యాలి. నీవే జవాబుదారి" అని ఉత్తరువుచేసి వెళ్ళాడు. అంతే, మా యిష్టప్రకారం వంటలు చేయించి పెట్టాలి. అయ్యేఖర్చును ఆసుపత్రి ఖర్చుల్లో వేసుకోవాలి. అప్పటినుండి మేమే "చేయవలసిన వంటకాలజాబితా" తయారుచేసి యివ్వడం, ఆ జాబితా ప్రకారం భోజనాలు, ఫలహారాలు తెచ్చివడ్డింపడం పరిపాటి అయింది. జైళ్ళలో గౌరవంగా జీవించేమార్గం తెలిసింది: రహస్యం బోధపడ్డది. *

* కలకత్తాలో రెండు సెంట్రల్‌జెయిళ్లు. ప్రెసిడెన్సీజైలు, ఆలీపూరు సెంట్రల్‌జైలు ప్రెసిడెన్సీ జెయిలునుండి దాస్‌గుప్తాగారిని మావద్దకు మార్చారు. అమెరికాలో విద్యార్థిగావుండి ఇండియాకు తిరిగివచ్చి విప్లవ పార్టీలో చేరాడు. ప్రెసిడెన్సీ జైలులో బెంగాలు టెర్రరిస్టులు, విప్లవకారులు చాలామంది డిటెన్యూలుగావుండిరి. వారు యెలా కాలం గడుపుచున్నారో చెప్పారు.

వారి తీర్మానం యిది— సర్కారు మనమీద కేసులు నిరూపించలేక పోయారు. డిటెన్యూలుగా జైలులో వుంచి మన యవ్వనము, బలము, ఆరోగ్యము, ధైర్యసాహసాలు వగైరా నాశనముచేసి. దేశస్వాతంత్ర్యోద్యమానికి నిష్ప్రయోజకులమయ్యేలా చెయ్యాలని ఒంటరిగా గదుల్లో పెడుతున్నారు. ఈ దురుద్దేశ్యాన్ని నాశనంచెయ్యాలి. ఎలా? (1) బాగాకసరత్తు చేసి దేహబలాన్ని ఆరోగ్యాన్నీ సంపాదించాలి, (2) ఉత్కృష్టమైన పుస్తకాలను చదివి విద్యావంతులం కావాలి. (3) యోగాభ్యాసం,ధ్యానం వగైరా చేసి ఆధ్యాత్మికంగా వృద్ధికిరావాలి. (4) జైలులో ఒక సంవత్సరముంటే, రెండుసంవత్సరాల చిన్నవాళ్లంకావాలి. (5) విడుదల అయ్యే

ఈ జైలుకువచ్చి ఆరునెల లయింది. ఇప్పటికి 14 నెలలు గడిచాయి మా ఉత్తరాలు మాయిండ్లకు చేరడంగాని, మాకు ప్రత్యుత్తరాలు రావడంగాని లేదు. మా మా ప్రత్యేక రాష్ట్రాలకు పంపారు. మా మా రికార్డు అట్టలమీద 'చాలా దౌర్జన్యం చేస్తాడు' అని ఎర్రసిరాతో పెద్ద అక్షరాలతో వ్రాశారు. అనుభవంలో ఈ రిమార్కు బాగా అనుకూలించింది. ఏజెయిలుకు వెళ్లినా అధికార్లు భయపడ్డేవాళ్లు. మేము విడిపొయ్యేప్పుడు ఒక్కొక్కడు ఒక్కొక బహుమతి యిచ్చారు నాకు; నాకులేని అమెరికన్ సేఫ్టీరేజరుసెట్టు, బూట్సు, చేతిగడియారం, పెన్ను వగైరా యిచ్చారు. కొంత వయిరముకూడాను.

కలకత్తా పోలీసులు మద్రాసులో మైలాపూరులో సముద్రతీరంలో వుండే డిటెక్టివు హెడ్ఆఫీసులో నన్ను ఒప్పగించారు. పది గంటలకు విల్కిన్సన్ దొరగారు నాకు దర్శనమిచ్చారు. ఆయన అసిస్టెంటు నామీద ఒక రిపోర్టు చేశాడు. కలకత్తా జైల్లో యిచ్చిన పట్టీలోకంటె ఎక్కువ సామాను ఉన్నాయనీ, రయిలులో వచ్చేప్పుడు నా స్నేహితులను కలుసుకొని కాంటాక్టు ఏర్పరచుకొనివుంటాననీ. డబ్బుకూడా ఎవరో యిచ్చారనీ ఏమేమో చెప్పాడు. నేను జవాబు చెప్పలా. గవర్న

---

సరికి అన్నివిధాలా బాగుపడివుండాలి ఆవిధంగా సర్కారు దురుద్దేశ్యాన్ని నాశనం చెయ్యాలి. (6) ఈ ఉద్దేశాలను నెరవేర్చుటకు ఒక టైమ్‌టేబిలు వేసుకొని క్రమశిక్షణతో కాలం గడుపుచుండిరని తెలిసికొంటిమి. మాకు కూడా ఈప్లాను మంచిదని తోచింది. అలాగే మేమూ ప్రారంభించాము. అప్పటి అలవాట్లు ఇప్పుడు—అంటే 33 సం॥ల తరువాతకూడ నాకు కొంచెమో గొప్పో అంటుకొనే వున్నాయి.

మెంటు అర్డరును చదివారు. నేను కన్నూరు సెంట్రలు జెయిల్లో ఉండాలట. "నేను ఆంధ్రుణ్ణి; తెలుగు జెయిళ్ళలోగాని, మద్రాసు జైలులోగాని ఉంచాలని అడిగాను. నే నేదయినా చెప్పుకోదలచు కొంచే తన అసిస్టెంటుసూపర్నెంటుకు చెప్పమన్నాడు.నేను చెప్ప పలసినది మరేమీ లేదన్నా వినిపించుకోలేదు. ఏదో నాటకం వుందని సంశయించాను. అయితే ఆ పది పదిహేనునిమిషాల మాటలసందర్భంలో షుమారు పదిహేనుమంది ఇండియన్‌ఆఫీ సర్లు, కానిస్టేబుల్సు నాచుట్టూ కాపలాకాయడం నాకు ఆశ్చర్యం వేసింది. విల్కిన్సన్‌దొర ఎందుకు ఇంత బందోబస్తుచేశాడు? ఎందుకు ఇంతగా భయపడిపోయాడు! అనే ప్రశ్న మనసులో కలుగుతూనేవుంది.

మరొక పెద్దగదిలోకి తీసుకెళ్లారు. మెత్తటి కుర్చీలో, కూర్చోబెట్టారు. చాలామంది తెలుగు, అరవ ఆఫీసర్లు నన్ను కలుసుకొని పొగిడి ఆకాశానికెత్తారు. నాకంటె ధైర్య-సాహసాలు గలవా రుండరన్నారు. నా స్నేహితులు తమకూ స్నేహితులే నన్నారు. చివరకు "ఏం చేశారు చంచయ్యగారూ?" అని పల్లవి పాడేవారు. ఆటు తరువాత మిఠాయీలతో, పాయసాలతో, అప్పడాలు, వడియాలతో, చిక్కని పెరుగుతో, ఆవునెయ్యితో భోజనం పెట్టారు. ఎంత తిన్నా ఇంకా తినమని బ్రతిమిలాడేవారు. చివరకు పల్లవి పాడారు. అయితే నాకు సంగీతం రాదుగా!

ఒక డిటెక్టివ్ సూపర్నెంటు మొదలియారుగారు అఫీషి యల్‌గా విచారణప్రారంభించాడు. అయితే నాపూర్వచరిత్రను, ఆసంబంధమైనరికార్డును చదవకుండానే వచ్చాడు. ఈ నల్లదొరని

చదువవివ్వలేదనుకుంటాను. కాబట్టి విచారణకు తలాతోకా లేకుండా పోయింది.

సాయంత్రం గం. 4 లకు మళ్ళీ తెల్లదొరగారివద్దకు తీసు కెళ్లారు. ఆయనచుట్టూ అంతమంది కాపలాకాయడం చూస్తే తెల్లదొరగారు ఎంత ధైర్యశాలి అని నవ్వువచ్చేది.

"సింగపూరులో యిచ్చిన స్టేటుమెంటుకూ ఈనా డిచ్చిన స్టేటుమెంటుకూ చాలా భేదమున్నది, ఎందువల్ల?" అనడిగాడు.

"నన్నే జైల్లో ఉంచడానికి తీర్మానించా"వని అడిగాను.

"ముందు నే నడిగినదానికి సమాధానం యి"మ్మన్నాడు. నేను జవాబివ్వలా.

"నీవు గవర్‌సాహిత్యాన్ని బండ్లాది పంపా"వని ఒకగది వైపు చేత్తో చూపించాడు.

"బండ్లనిండా సాక్ష్యముంటే నామీద కేసు పెట్టరాదా? ఒక ప్యాకెట్టయినా చూపండి!" అన్నాను.

"నిన్ను చూచీచూడకముందే కాల్చెయ్యాలి" అన్నాడు.

"అయితే నావల్ల మీకు ఏమీ ప్రమోషన్ రాదా?"అన్నాను.

ఇక మాట్లాడి ప్రయోజనం ఉండదనుకొన్నాను. వెనక్కి తిరిగివెళ్ళాను. ఈ గుంపంతా యంత్రాల్లాగా నాచుట్టూ నడిచారు.

ఎంత భయం ఈ దొరగారికి! పది-పదిహేనుసంవత్సరాల క్రితం నాతండ్రిలాంటివారు తాసిల్దారు ఎదుట వణికిపోయారు. సర్కారన్నా, జెయిళ్ళన్నా అంత తగనిభయం. "దొరను నన్ను చూస్తే అంతరంగె భయం. ఎంతమార్పు! ఎంతత్వరలో! ప్రజల ఆమోదంలేక కత్తితో రాజ్యంచేసేవారిగతి ఇంతేకదా? ఎంతకాలం [illegible] గలను అణగద్రొక్కి ఉండగలరు? వీరినాశనానికి

కాలం సమీపిస్తోంది "అనేఆలోచనలు వచ్చాయి; సంతోషించాను. ఒక ఇన్‌స్పెక్టరు, నలుగురుపోలీసులు నన్ను కన్ననూరుజెయిలుకు తెచ్చారు.

కలకత్తాలో ఆలీపూర్ సెంట్రల్‌జైలులో వుండివచ్చిన నాకు ఈ కన్ననూరు జెయిలు చూడగానే "దిక్కుమొక్కులేని దిగా తోచింది. ఏ జెయిలుకు వెళ్లినా నా అమెరికన్ దుస్తులలో దొరలాగు వేషంవేసుకొని టీక్‌టాక్‌గా వెళ్లే అలవాటు పెట్టు కొన్నా. నావెంట పెద్దపెద్ద సూటుకేసు లుండేవి. నన్ను ఎరుగని చోట్ల యివన్నీ నా మర్యాదకూ, అంతస్తుకూ అనుకూలించాయి.

నరకకూపం

కన్ననూరుజెయిలులో చాలా సంస్కరణలు అవసరమని తోచింది. జైలరు ఫోన్సికా గేటులో నన్ను ఏదో అడుగుతూంటే లక్ష్యపెట్టకుండా పరాకపైపు చూస్తూ సటిస్తూ జవాబుచెప్పితిని. అతనితో అడుగులేస్తూ నాగవికి చేరాను. ఉరిశిక్షవేయబడినవారిని ఉంచేగదుల్లో ఒకదానిలో నన్ను పెట్టారు. రాత్రింబవళ్ళు - 24 ఘంటలూ వార్డర్ల పహరా.

అన్నంలో రాళ్లు; గంజి వాసన; పులుసులో పురుగులు. ఖైదీలు అన్నం నీళ్లలోవేసి రాళ్లను క్రిందికి పోనిచ్చి పైపైఅన్నం తినడంచూచి నేనూ అలాగే ప్రారంభించా. పులుసులో వుడికిన పురుగులను వేరేసిన తరువాతకూడ తినడానికి సహించలేదు. కంప్లయింటు చేశాను. కొంచెం జాగ్రత్తగా చేసిపెట్టేవారు; కొద్దిరోజుల్లో మళ్లీ మామూలయ్యేది ఖయిదీలందరికి భోజనం సరిగా ఉండనంతవరకూ నాకుమాత్రం బాగుపడేమార్గం తోచలేదు. అందరికొరకు కంప్లయింటు చేశా. ఇతరుల విషయంలో జోక్యం

చేసుకోవద్దని సూపర్నెంటు షామియార్ అన్నాడు. కంట్రాక్టర్ల వద్ద లంచంపుచ్చుకోవడం, ఖయిదీల పొట్టకొట్టడం. ఖయిదీల బట్టలవిషయంలోకూడ అంతే. జెయిళ్లలో క్వారంటైనువంటి నరకకూపం మరొకటుండదు. మందులు ఆసుపత్రిలోకంటే బజారులో ఎక్కువగా వినియోగపడుతుంటై. ఏక లంచాలు. ఆ జైలులో మరెక్కడా ఉండని దురభ్యాసాన్ని ఒక పెద్దవ్యాపారంగా స్థాపించుకొన్నారు వార్డర్లు. దానిని "సోడమీ" అని ఇంగ్లీషులో అంటారు. పిల్లవాళ్లను స్త్రీలకు బదులుగా ఉపయోగించుకోవడం! ఖయిదీలను కొట్టికొట్టి కష్టమయిన పనులతో హింసించి అణచేస్తారు. ఈ జెయిలు ఒకమూరుమూల వుండడం వల్ల చూడడానికి పెద్దలు సాధారణంగా వెళ్లరు.

సూపర్నెంటు షామియారు ముసలివాడు. యుద్ధమనేనెపంతో రిటైరయిన వయసులోకూడా ప్రతిసంవత్సరం ఉద్యోగం పొడిగించుకునేవుండిరి. జైలరు ఫోన్సికా సోమరిగా యింట్లోనే వుండేవాడు. కంట్రాక్టర్లవద్ద లంచాలుపుచ్చుకొని తన క్రిందివారు ఎంత అన్యాయంచేసినా కలుగజేసుకునేవాడు కాదు. డా॥ తమ్మన సింగు పండువృద్ధు. వయసు ముదిరేకొద్దీ డబ్బుమీద ఆశ అధికమవడం సామాన్యమే. కాని, ఈలోపం డా॥ తమ్మన సింగులో మరీఎక్కువగా వుండేది. లంచం యివ్వనిఖైదీలకు మందివ్వడు. "చస్తే చావనీ" అని బాహాటంగా అనేవాడు. చచ్చిన వారివిషయంలో యంత్రంలాగా ఫారాలునింపి పంపేవాడు. అసిస్టెంటు డాక్టరు పాయ్ చిన్నవాడే కాని, ఛీఫ్‌వార్డరుకు లంచమిచ్చిన వారందరూ తనకూ యివ్వాల్సిందేనని శాసించాడు. కొద్దోగొప్పో సమర్పించికోవాలి. ఛీఫ్‌వార్డరు డిసల్వ త్రాగుబోతు; త్రాగి వీధుల్లో

పడిపోయ్యేవాడు; పెద్దమృగము; బలశాలికూడా. కొత్త ఖయిదీలు రాగానే ఆస్తిపాస్తులభోగట్టా తనకు చెప్పటానికి ఒకతొత్తువార్డరును క్వారంటీన్‌లో వుంచేవాడు. ఆస్తిపరుడని తెలిస్తే బాధించి ఉత్తరం వ్రాయించి ఖయిదీయింటికి వార్డరునుపంపి డబ్బు తెప్పించుకొనేవాడు. ఈరహస్యం డాక్టరు పాయికి తెలిసేది. వాడూ అలాగే చేసేవాడు. దీనల్లా డబ్బుసంపాదనకు ఒక అమానుషకార్యం చేశేవాడు. పురుషసంయోగాన్ని ("సోడమీ") ఒక వ్యాపారం లాగా సాగించేవాడు. వాళ్లు ఆ జెయిలును ఒక జమీలాగా తయారు చేసుకొన్నారు. ఈ జైలును ఎంతో సంస్కరించాల్సినపని ఉన్నది. అయితే ఎలా చెయ్యడం? ఎంతమంది ఆఫీసర్లతో పోట్లాడడం? నేనా ఒంటరివాడివి. జోక్యంకలుగజేసుకోకుండా తప్పించుకోటానికి ప్రయత్నించా. కాని హృదయంలో కలచినట్లుండేది. నిద్రపట్టేది కాదు. నాకళ్ళబడ్డ 'సోడమీ' కేసులను రిపోర్టుచేశా; వార్డర్లకు జుల్మానాలు పడ్డాయి. కాని అసలు మూలవిరాట్టు-ఛీఫ్‌వార్డరు దొరకటంలా. అయినా కష్టాల్లోవున్నఖైదీలు ఆఫీసర్లు ఇండ్లకు వెళ్ళిన సమయంలో అనగా 12-2 గంటల మధ్య వార్డర్లకు లంచాలిచ్చి వారివెంట వచ్చి నాతో కష్టాలు చెప్పుకొనేవారు. అన్నం, బట్టలు, మందులవిషయాల్లో కొన్నినెలలవరకూ ఏమీ మార్పు తేలేక పొయ్యాను. అయితే జైలంతటా నా ఉద్యమానికి సానుభూతి పరులు ఏర్పడ్డారు. జైలుబయటినుంటి ఉత్తరాలు రావడానికీ,పోవడానికీ ఏరాట్లు కుదిరాయి. కీ॥ శే॥ కేశవపిళ్ళెగారు శాసనసభలో జైలువిషయాలనుగురించి ప్రయాసపడుచుండిరి. ఆయనకు జైల్లో నుండిరహస్యంగా వివరాలురాస్తూవచ్చాను. అన్యాయాలుతొలగించు

టకు ప్రారంభించాను. రానున్నకష్టాలు అనంతమని తెలిసికూడా ప్రయత్నం మానలేదు.

కూత్తుపరంబా (మలబారు) గ్రామవాసి గోవిందన్ కీ॥ శే॥ హైకోర్టు జడ్జీ కృష్ణన్. బావమరిది. కుటుంబతగాదాల్లో జైలుకు వచ్చాడు. ఆరునెలలశిక్ష. పదిహేనురోజుల్లో ఛీఫ్‌వార్డరు వగైరాలు అతనివద్ద షుమారు రు 500/- లంచాలు లాగేశారు. ఆయన యింటికి వుత్తరాలు పట్టుకెళ్లి పైకం తెచ్చుకొన్నారు. పాయ్‌కూడా చెయ్యిజాపాడు. గోవిందన్ బంధువులు ఇవ్వడం మానేశారు. అయితే గోవిందన్‌కు జ్వరం వచ్చింది. మందు ఇవ్వకపోగా, కొబ్బరిమట్టలను కొట్టమని ఉత్తరువుచేశాడు. డాక్టరు పాయ్ పెట్టేకష్టాలకు ఓర్చుకోలేక వచ్చి నాచేతులు పట్టు కొన్నాడు. జైలరుకు రిపోర్టు చేశాను; జస్టిస్ క్రిష్టన్ బావమరిది అని తెలియగానే భయపడ్డాడు. వెంటనే నాప్రక్క గదిలోకి మార్చాడు. పనిలేకుండా చేశాడు. అయితే మందు కావాలిగదా! చాలామంది ఖైదీలు రోగాలతో బాధపడుతున్నారు; చచ్చిపోతు న్నారు. "ఎలా ఈ దుస్థితిని తొలగించడం" అని గోవిందన్‌ను అడిగాను. 'డాక్టరు పాయిని పిలిపించండి, తంతాను' అన్నాడు. పెంకెతనం చూపితే యిద్దరం తన్నేద్దామనుకున్నాము. వచ్చాడు కాని, నోరుతెరవడానికి భయపడ్డాడు. పిరికివెధవను తన్నడం నా కిష్టంలేకపోయింది. అతనూ అందుకు సమ్మతించాడు. నెట్టే శాము. మాయిద్దరిమీద సూపర్నెంటుపద్ద కేసు. ఇద్దరం జరిగిం దంతా చెప్పాము."నా జైలుపరిపాలనా విషయంలో నీవు జోక్యం కలిగించుకోకూడ"దని కసిరాడు.

"జస్టిస్ క్రిష్ణన్ బావమరిదికే లంచంలేకుండా మందులభిం చనప్పుడు, రేపు నాగతీ అంతే! నీ వెధవపరిపాలనలో జోక్యంకలి గించుకోకతప్పదు" అన్నాను. సూపర్నెంటు భయబడిపోయాడు. మా గదులకు వచ్చేశాము.24 గంటల్లోగా డాక్టరు పాయిని బదిలీ చేయించాడు సూపర్నెంటు.

మరొక సంఘటన. మంగళూరునివాసి ఒకశెట్టి నాసహాయం కోసం వచ్చాడు. అతనొక కుర్రాడు. 20సం॥లవయస్సు. అతన్ని మైనర్లబ్లాకులో వేయించాడు ఛీఫ్‌వార్డరు. ఆ కుర్రాడు బాగా వున్నవాడు. అతనితండ్రిని ఎవరో చంపారు. చంపినవాడిని కత్తి తో పొడిచాడు. అందుకు రెండుసంవత్సరాల కఠినశిక్ష. ద్రవ్యవం తుదనితెలియగానే వార్డర్లు, ఛీఫ్‌వార్డరు పగ్గెరాలు ఉత్తరాలు వ్రాయించుకొని డబ్బుతెచ్చుకొన్నారు. ఇంతడబ్బు, లంచాలు. ఎందుకివ్వాలా అని ఇంటివద్ద ఇవ్వడం మానేశారు. అయితే ఛీఫ్ వార్డరుకు ఎంతతిన్నా చాలకశెట్టిని మైనర్లబ్లాకుకు పంపాడు.*

* దీర్ఘకాలం జైల్లోవుండేఖైదీలకు "సోడమీ" దురభ్యాసం అలవడుతుంది. ఈ దురభ్యాసాన్ని వార్డర్లు అలవాటుచేయించి డబ్బు సంపాదిస్తారు. డబ్బిచ్చే ఖయిదీలను మైనరుపిల్లవాళ్ళమీద మేస్త్రీలుగా ఛీఫ్ వార్డరు నియమిస్తాడు. మైనర్లబ్లాకు ప్రత్యేకంగావున్నా బురాక్రాటిక్, కరప్ట్ గవర్నమెంటులో మంచిపద్ధతులు చెడ్డవిగా మారిపోతవి.

శెట్టి కుర్రవానిని ఛీఫ్‌వార్డరు బెదిరించాడు. మైనర్లబ్లాకుకు పంపి ఒక మృగప్రాయునికి వానిని ఉపయోగపెట్టుకొనుటకు అనుమతి యిచ్చాడు. ఈపిల్లవాడు నావద్దకువచ్చి రక్షించమని కోరాడు.కాని, ఛీఫ్ వార్డరును జైలరు పోన్సికా శిక్షించలేకపోయ్యాడు; పిల్లవానినిమాత్రం రక్షించాడు. ఈలాంటివి ఎన్నో కేసులు పెట్టాను.

మరొకవిషయం:-డాక్టరు తమ్మనసింగు రాశిసత్వాన్ని ఎలా అరికట్టడం?నా పక్కగదిలో ఉరివేయబడుటకు ఒక మాస్లా వుండెను. యవకుడు. ఖైదీలు నావద్దకువచ్చి చెప్పుకొనే కష్టాలంతా వింటూ విచారపడుతుండేవాడు. వానికి ఒకచిన్నసహాయం చేశా. తనగదిలో దయ్యాలు బాధపెట్టుతుండేవట; అందువల్ల నిద్రపట్టుట లేదట. నేను గాఢంగా నిద్రపోవడంవల్ల నాగదిలో దయ్యాలు లేవనుకొన్నాడు. మేము గదులు మార్చుకొన్నాము. వానికి దెయ్యాలబాధ తగ్గిందట. ఒకరోజున పిచ్చివాడిలా నటించాడు. డాక్టరు తమ్మనసింగు పరీక్షచెయ్యటానికి వచ్చాడు. డాక్టరును బాగా తన్నేశాడు. చివరకు కారణంకూడా చెప్పాడు. "లంచం ఇవ్వనివాళ్ళకు మందు యివ్వకుండా చంపేస్తున్నావు; ఇదిగో శిక్ష" అని కొట్టేశాడు. సూపర్నెంటు నోటీసుకు వెళ్ళింది. నేను చెప్పి చేయించివుంటానని సూపర్నెంటు నాతో అన్నాడు. అయితేనేం, ఖయిదీలకు మందులు లభించాయి: డాక్టరు తమ్మనసింగు ఉద్యోగం పూర్తిఅయిపోయింది.

కొత్తకేసు - లాహోరు జైలుకు

1916-17 లో బర్మాలో ఒక కుట్రకేసు మాండలే నగరంలో జరిగింది. దానిలో నాపేరును, నాస్నేహితులపేర్లను ఉదహరించుచుండినట్లుగా ఒకడాక్టరు చెప్పారు. ఆ కేసులో ముఖ్యమైన ముద్దాయిలు గదరుపార్టీవారు. నా మిత్రులు అమర్ సింగ్, శివ్‌దయాళ్‌గుప్తగార్లు. అమరసింగుకు 40॥సం లకుపైగా శిక్షలువిధించారు. సుభాష్‌బోసు ఇతనితోకలిసి మాండలే జైలులో ఉండిరి; బోసుకు విడుదలకాగానే అమరసింగు విడుదలకై పాటుబడిరిగాని,అనుకూలం జరుగలేదు.జపానీయులు రంగూనులో

ప్రవేశించేవరకు (1942) అమరసింగు అక్కడ్లో వుండెను. శివదయాళు గుప్తాగారిని అండమానులకు పంపిరట కాని. ఉరి వేసి చంపివుంటారని నా నమ్మకము.

లాహోరుజెయిలుకు నన్ను మార్చినట్లు ఉత్తరువువచ్చింది. కారణం నాకు అప్పుడు తెలియలేదు. ఏదో ఒక కుట్రకేసు ఉండి వుండునని సంశయించాను. సాధ్యమైనంతవరకు ఆలస్యంగా చేరాలనుకొన్నాను.

జెయిలుగేటువద్ద యిద్దరుపోలీసులు నన్ను కలుసుకొన్నారు. ఎంతో గౌరవంతో ఆహ్వానించారు. బహుశా జెయిలువార్డర్లు నన్ను గురించి పొగిడివుంటారు. అందువల్ల పోలీసులు నేను స్నేహితుల మయ్యాము. లాహోరువెళ్ళేమార్గంలో ఆగ్రావగైరా పట్టణాలను చూడాలనే ఆశ నాకుండేది. వారికికూడ కోరిక పుట్టించా. సర్కారు రూల్సుప్రకారం రోజుకు 100 మైళ్ళకంటె ఎక్కువగా ప్రయాణం చెయ్యకూడదు. కన్ననూరునుండి లాహోరుచేరుటకు షుమారు 20 రోజులు గడుపవచ్చును. అందుకుకూడా వారు సమ్మతించారు. అయితే ఖర్చులకు డబ్బుకావాలి. అప్పుడు నాతమ్ముడు మద్రాసులో చదువుచుండెను. వానిని కలుసుకొన్నాము. డబ్బు తెచ్చియిచ్చాడు. సత్రాల్లో సామాన్లను, రైఫిల్సును వుంచేసి దారిలోవుండేపట్టణాలను చూస్తూవెళ్లాము. తాజ్‌మహలును చూచినప్పుడు ఆ యిద్దరుపోలీసులు "మా జీవితాలు పావనంచేయించా"రని దణ్ణాలుపెట్టి కృతజ్ఞత చూపించారు. మూడు రోజులు వరుసగా తాజ్‌మహలు చూచి వచ్చాము. రాళ్లమీద చేసే పనులను వర్కుషాపులో చూచాము. చివరకు లాహోరు సెంట్రలుజైలులో నన్ను విడిచిపెట్టి పోవ

సినప్పుడు కంటతడిపెట్టారు. జైలరు వగైరాలు ఆశ్చర్యపడ్డారు. అందువల్ల నన్ను జైలులో మర్యాదగా చూస్తూ వచ్చారు.

ప్రయాణంలో పత్రికలు చదివినా లాహోరులో కుట్రకేసు జరుగుచున్నదని తెలుసుకోలేకపోతిని. రహస్యంగా జరుగుతోం దనీ, ఆకుట్రకేసులో నే నొక ముద్దాయిననీ జైల్లో ప్రవేశించిన తరువాత తెలిసింది.

నన్ను ప్రత్యేకంగా వుంచారు. మిగిలిన ముద్దాయీలతో కలుపలేదు. వివరాలను తెలుసుకోలేకపొయ్యాను. వారం రోజుల తరువాత తిరిగి నన్ను కన్ననూరు జైలుకు మార్చుటకు లాహోరు రైలుస్టేషనుకు తీసుకెళ్లారు. నాలాగే శిక్షను తప్పించుకొన్న అనేకముద్దాయిలు స్టేషనులో కనపడ్డారు. వారిలో నా మిత్రుడు ఛత్తర్ సింగ్ ఒకడు.

నా మిత్రుడు భాయ్ బలవంతసింగుకు ఉరిశిక్ష వేశారు. మిత్రులు ఠాకుర్ సింగుకు, ఛత్తర్ సింగుకు, నాకు శిక్ష లేదట. మేము డెటిన్యూలుగా ఉండాలి. నాకు తెలియనివా రెందరికో శిక్షలుపడ్డవి. కొందరిని అండమాన్సుకు పంపారు. హరినామ్ చంద్, హరిచరణదాస్‌కు జైలు శిక్షలు పడ్డాయి.

బలవంతసింగుమీద చాలా కేసులున్నై. ఉరిశిక్షతప్పదని తీర్మానించుకొన్నాడు. ఎంతోమందిచేసిన పనులను తానే చేశా నని చెప్పి తప్పించివేయుటకు సాధ్యమైనంతమందికి సహాయం చేశాడు. నేనూ, ఠాకుర్ సింగ్ చేసినదంతా తానే చేశానని చెప్పాడు. "చంచయ్య కష్టాల్లోను, కష్టాలు లేనప్పుడూ ఒకే మాదిరిగా వున్నాడు. జీవించివుంటే దేశానికిఉపయోగపడకపోతాడా అని అన్నాడట. ఈ విషయం నా జీవితమంతా కలవరపెడుతూనే

వుంది. ఏదైనా త్యాగంతో కూడినపని చెయ్యవలసినప్పుడు, సంశయాలతో మనసు ఊగిసలాడుతూ బాధపడే సమయంలో బలవంతసింగు జ్ఞప్తికొస్తే వెంటనే ఒక నిర్ణయానికి వచ్చేవాడిని.

ఈకేసులో జోద్‌సింగు అప్రూవరుగా సాక్ష్యమిచ్చాడు. కేసు పూర్తిఅయినతరువాత సర్కారుసహాయంతో దక్షిణఅమెరికా వెళ్ళి దాక్కున్నాడు. అయితే నేమి చివరకు గదరుపార్టీవారి రివాల్వరుకు గురిఅయ్యాడని, కాంగ్రెసుమహాసభలలో కలుసుకున్న గదరుమిత్రులు చెప్పారు.

తిరిగి కన్ననూరు జైలుకు – పోలీసులతో పోట్లాటలు

ఒక జైలునుండి మరొక జైలుకు మార్చడం నాకు చాలా యిష్టం. ఇండియాఅంతా చూడవచ్చు. జైళ్ళలో సంవత్సరాలతరబడి ఒంటరిగా వుండవలసి వచ్చిన నాలాంటి వానికి ఈ ప్రయాణాల్లోనే కొంత స్వేచ్ఛ లభించేది. అందువల్లే కాబోలు నేను పోలీసు యస్కార్టులతో ఎంతో స్నేహంగా వుంటూ, వారిసహాయం పొందుతూండేవాడిని. కాని, లాహోరునుండి కన్ననూరుకు వచ్చేసమయంలో అన్నీ తగాదాలే జరిగాయి.

లాహోరుజైలుకు యిద్దరు రిజర్వు పోలీసులు వచ్చారు. సంకెళ్లు వేయబోయారు; నేను ఒప్పుకోలా. దీనితో తగాదాలు ప్రారంభం. చివరకు రిజర్వుపోలీసులు తమ సూపర్నెంటుకు టెలిఫోనుచేసి, ఆయన ఉత్తర్వుమీద, సంకెళ్లు లేకుండా టాంగాలో తీసుకెళ్లారు. వారిద్దరు మాట్లాడుకోవడం విన్నాను.* వారు యస్కార్టు చేయుటకు భయపడుతున్నారు. సంకెళ్లు లేకుండా

* నాకు హిందూస్తానీ, పంజాబీ, ఉరుదూ, అరబ్బీ, అరవం, కన్నడం, మలయాళభాషలు వివిధ జైళ్లలో అలవాటుపడినై.

తీసుకుపోకూడదని పోలీసులు చర్చించుకోవడం నాకు తెలిసిపోయింది. మద్రాసు చాలాదూరం; పోకూడదనుకొన్నారు. వారి భయాలను యింకా ఎక్కువ చెయ్యాలని చేశాను. నాకు సంకెళ్లు వేస్తే ఆంధ్రులు వారిని తంతారని పిరికిమందుపోశాను. ఇదంతా టాంగాలో పోతూండగా జరిగిన సంభాషణ. తమ సూపర్నెంటుకు నన్ను ఒప్పగించేసి కన్ననూరుకు తీసుకెళ్లేందుకు నిరాకరించారు.

నాకు సంకెళ్ళువెయ్యకూడదనీ, చాలా దూరప్రయాణమైనందున నేను ఒప్పుకోననీ, కావాలిస్తే ఎక్కువమందిపోలీసులను నావెంట పంపమనీ, మద్రాసుగవర్నమెంటుకు టెలిగ్రాం యిచ్చి నాకు సంకెళ్ళువెయ్యవలసిందని ప్రభుత్వం ఆర్డరుయిస్తేతప్ప తమంతటతాము వెయ్యకూడదనీ, టెలిగ్రాంఖర్చులు నేనే భరించుతాననీ ఎన్నోన్నో చెప్పాను. ఇదంతా వింటూన్న ఒక రిజర్వు యిన్‌స్పెక్టరు జోక్యంకలిగించుకొని ఇలా అన్నాడు:—"బారిష్టర్లాగా వాదిస్తున్నావే! మాతోనేయిలాచేస్తే, ప్రయాణంలో ఈ పోలీసు కానిస్టేబుల్సుగతి ఏమవుతుంది? నువ్వేంచేస్తావో చూస్తా"అని నన్ను బెదిరిస్తూ పోలీసులను పిలిచి నాకు సంకెళ్లువెయ్యమన్నాడు. "సరే, వెయ్యండి"అని నా చేతులు చాచి ఆ ఇన్‌స్పెక్టరును యిలా అడిగాను:—"నీ అధికార మెంతవరకు? లాహోరు సరిహద్దుల్లో మాత్రమే! లాహోరు దాటినతరువాత ప్రయాణించేనేదిలేదని నిరాకరిస్తా. అప్పుడు తీర్మానంచెయ్యాల్సినబాధ్యత మేజిస్ట్రేటుది. చూదాం! నీ యిష్టంవచ్చినట్టే చెయ్యి"అని నేనూ బెదిరించాను.

కొంతవరకు చల్లబడ్డాడు? ఎక్కువమందిపోలీసులను నా వెంట పంపరాదా? పంతులప్రకారం నేను పారిపోకుండా చూచు

కోవచ్చు" అని సలహా యిచ్చాను. అప్పుడు సూపర్నెంటు అందుకొని యిలాగన్నాడు.

"పంజాబులో గదరుపార్టీ ఖైదీలతో చాలా బాధపడి పోతున్నాము. ఎస్కార్టులను కొట్టి, చంపి పారిపోతారు; రైళ్ళలోనుంచి తప్పించుకపోతారు; జైళ్ళనుంచి తప్పించుక పారిపోతారు; కష్టాలకుగాని, చావుగ్గాని భయపడరు. అందువల్ల కాళ్ళకు బారుఫెట్టర్లు, చేతులకు సంకెళ్లు గొలుసులు, వేసేనేకాని పోలీసులు యస్కార్టుచెయ్యటానికి ఒప్పరు. అప్పటికీ మార్గమధ్యంలో ఖైదీల స్నేహితులు యస్కార్టుమీద పడి తప్పిస్తున్నారు. నే నేం చెయ్యను? చేతులకు మాత్రమే వేయించుకో" అని అడిగాను. నేను అంగీకరించలా. ఒక పోలీసు స్టేషనులో నన్ను లాకపు చేయించి మూడురోజుల తరువాత నలుగురు పోలీసులను ఒక జమేదారును వెంటయిచ్చి పంపడమేగాక, ప్రతిరెండువందలమైళ్ళకు యస్కార్టు మార్చడానికి ఏర్పాటుచేశాడు. యు. పి. లో ముగ్గురు పోలీసులు మాత్రమే వచ్చారు. షోలాపూరులో ఇద్దరుమాత్రమే. సంకెళ్లు లేకపోవడం చూచి భయపడ్డారు. సాయంత్రం వెయ్యటానికి ప్రయత్నించగా నిరాకరించాను. వారిభయాన్ని గ్రహించి, వారికి మంచి సలహా యిచ్చాను. నన్ను తమ సూపర్నెంటువద్దకు తీసుకెళ్ళమనీ, మర్నాడు ఎక్కువమంది ఎస్కార్టుతో ప్రయాణం చెయ్యొచ్చుననీ చెప్పాను. వారికి నచ్చింది. ట్రెయిను దిగాము. ట్రెయిను కదలబోతోంది. వారు మనసు మార్చుకొని "ప్రయాణం చేద్దాం బాపూజీ" అని నవ్వుతూ అన్నారు. సరేనని ఎక్కాను. సాయంత్రం 6 గంటలయింది. రాత్రి

రాబోతోంది. పారిపోతానేమోననీ, సంకెళ్లు తప్పక వచ్చే స్టేషనులో వెయ్యాలనీ మాట్లాడుకుంటున్నారు. వారి మరాటీ భాష నాకు అర్థమైంది.హోటీస్టేషను సమీపించకముందే మళ్లీ వెనక్కి వెంబడిట్రెయినులో పోదామని సలహా యిచ్చా. అందుకు వారు సమ్మతించలా.ట్రెయిను ప్లాటుఫారంమీదికి రాగానే దౌర్జన్యంచేసి సంకెళ్లు వెయ్యాలని ప్రయత్నించారు. ఒకఅడుగు ముందుకువస్తే తంతానన్నాను; బాక్సింగుకు తయారయ్యాను. ప్రజలు గుంపులు గుంపులుగా నాపెట్టెవద్ద చేరారు. అది తిలకుగారి దేశం. వారిప్రఖ్యాతి ఆకాలంలో చాలాబాగా వుంది. ప్రజలు నన్ను సమర్థించారు. గుంపుకూడినవారిలో తెల్లనిగడ్డం వుండే ఒక పోలీసుఇన్స్పెక్టరు జోక్యంకలుగజేసుకొని సంకెళ్ళు వెయ్యమన్నాడు. "ఈ పిరికిపంద లేమి వెయ్యగలరు? గడ్డం గిడ్డం చాలాజోరుగావుంది.లోపలికి రా, చూద్దాం" అన్నాను. ప్రజలు అల్లరిచేసి వానిచూట్టూ మూగారు.వాడికి సిగ్గేసి వెళ్ళిపోయాడు. ట్రెయిను కదిలింది. అలారంగొలుసును లాగమన్నారెవరో. పోలీసులు లాగారు. బండి నిలబడింది.నేను బయటికి వచ్చాను.నావెంట పోలీసులూ దిగారు.గార్డు,డ్రయివరు వచ్చి మా మీద కోపగించుకొని నా సామాన్లు దించేసి వెళ్ళారు.

స్టేషనుమాష్టరు వగైరాలు పోలీసులదే తప్పని నిర్ణయించారు. మేజిస్ట్రేటువద్దకు పోదామన్నాను.టెలిగ్రాం యిచ్చి మరికొందరుపోలీసులను రప్పించి షోలాపూరుకు తిరిగిపోదామన్నారు. వారు కోరినరీతిగా టెలిగ్రాము వ్రాసి యిచ్చాను. రాత్రి బాగా నిద్రపోయాను. వారు నిద్రపోకుండా నన్ను కాపలాకాచారు. మరునాడు ట్రెయిన్లో ఒకహెడ్డు,మరొక కానిస్టేబులు దిగారు. "నలుగురం

కలసి తీసుకెళ్తాం.సంకెళ్ళు వెయ్యం; అలాంటిఉత్తరువుతోనే వచ్చా" మని చెప్పారు.సాయంత్రానికి గుంతకల్లు చేరాము.

స్టేషనులో పోలీసులు చాలామంది వచ్చియుండిరి. నేను దిగగానే నన్ను చుట్టేశారు. ఒక డిప్టీ సూపర్నెంటు, ఇన్స్పెక్టర్లు ఒకడజనుమంది పోలీసుల్ని చూచి నాకు నవ్వువచ్చింది. డిప్టీ సూపర్నెంటు నన్ను రిసివుచేసి మొదటితరగతి రెష్టారెంటుకు తీసుకెళ్లి ఫలహారం, కాఫీ యిప్పించాడు. నామీద భయంకరమైన రిపోర్టు షోలాపూరునుండి వచ్చిందనీ, ఏమిజరిగిందో చెప్పమనీ కోరాడు: చెప్పాను. అందరం నవ్వాము. తనకు వచ్చిన టెలిగ్రాం చదివాడు. "ఖైదీ దౌర్జన్యం చేస్తున్నాడు. చాలా మంది పోలీసుకాపలా అవసరం" అని ఉంది. "పంచయ్యగారూ! మీరు చాలా మెత్తనివారులా గున్నారే; రిపోర్టు ఇలాగుందేం?" అన్నాడు? "నేను మెత్తనివాణ్ణే- ఆ టెలిగ్రామూ సరిగానేవున్నది. నన్ను ఆగౌరవంచేసి చూడండి: నే నేమి చేస్తానో!" అన్నాను.

"నాకు అర్థమయింది"అని చెప్పి యస్కార్టును పిలిచి "ముగ్గురు వారు,మర్యాదగా చూచుకోండి.వారికి కావలసినదంతా కొనిపెట్టండి.మీకు వారు ఎలాంటిహానీ చెయ్యరు"అని ధైర్యం చెప్పి ట్రెయినులో ఎక్కించి వెళ్ళాడు.

కాని,యస్కార్టుకు భయం పోలేదు. బండి కదలగానే ముగ్గురూ అమాంతంగా నా కాళ్లు పట్టుకున్నారు.నాకు ఆశ్చర్యం వేసింది "మాకు భార్యాబిడ్డలున్నారు. మీరు పారిపోతే మా బిడ్డల నోటికూడు పోతుంది" అని ప్రాధేయపడ్డారు.వారిభయం పోగొట్టేందుకు నేను చాలా ప్రయాసపడవలసివచ్చింది.పొడుకానిస్టేబ్లు

నాయుడు; దీర్ఘకాయుడు. మిలిటరీలో వున్నాడు. ధైర్యశాలి. పోలీసు డిపార్టుమెంటులో చేరి దొంగలను పట్టాడు. ఆ కాలంలో బందిపోటు లెక్కువ. మిగతా యిద్దరిలో ఒకరు బోయ, ఒకరు తురక. చివరకు నన్ను బాగా నమ్మారు. మద్రాసుకు తీసుకెళ్ళడానికి సమ్మతించారు. రాజా సర్ రామస్వామి మొదలియార్ సత్రంలో బసచేశాము. పట్నంలోవున్న నా బంధుమిత్రులను తీసుకవచ్చాను. నిర్భయంగా మద్రాసులో తిరిగారు. వారి రైఫిల్సును నేను కాపలా కాయవలసి వచ్చింది. రెండురోజులు మద్రాసులో నా యిష్టంవచ్చినట్టు కాలం గడిపి ప్రయాణం సాగించాము.

మార్గం మధ్యలో కోయంబత్తూరు అగ్రికల్చరల్ కాలేజి చూడడానికి పోతనూరు స్టేషనులో దిగాము. నాయుడూ నేనూ కలసి కాలేజికి వెళ్లాము; బేడ్రెస్సులో నా నౌకరువలె నటించాడు. నేనూ రాజకీయఖైదీనని తెలియనివ్వలేదు. నేను అమెరికాలో అగ్రికల్చరల్ కాలేజిలో బి. యస్. సి. ప్యాసయ్యానని తెలియగానే ప్రిన్సిపాలుగారు మర్యాదగా నావెంట తానే వచ్చి కాలేజీను, యక్స్పెరిమెంటల్ ఫారమును చూపించాడు. విజిటర్ల పుస్తకంలో వ్రాయమని కోరాడు; వ్రాశాను. *

* ప్రిన్సిపాలుగారు యీ క్రింది విషయాన్ని చెప్పాడు. ఇండియాలో వ్యవసాయ డిపార్టుమెంటును గవర్నమెంటు అభివృద్ధి చెయ్యబోతున్నట్టు, ఇంపీరియల్ సర్వీసులో నెలకు రు 350 - 50 - 1000; 1000 - 100 - 1500 రు. జీతాలు యిస్తారని, 40 మంది విదేశాలలో అగ్రికల్చర్‌లో పట్టభద్రులయిన వారిని డిప్యూటీ డైరెక్టర్లుగా నియమించుతారనీ, అభ్యర్థుల కొరకు "లైఫ్" అనే విదేశీ మాసపత్రికలోని ప్రభుత్వప్రకటన చూపించి, అర్జీ పెట్టుకోమని సూచించాడు.

కన్ననూరు జైలువద్ద నన్ను ఒప్పగించేటప్పుడు పోలీసుల దుఃఖాన్ని ఇంత అంత అని చెప్పలేను. నన్ను యరెస్టు చెయ్యడం ఏదో పాపకార్యంలా తోచింది వారికి.

కుటుంబ కష్టాలు

మేము అయిదుగురు అన్నదమ్ములం. నేను జైలులో వుండగా(1916-17) మొదటిఅన్న చనిపోయాడు. మా కుటుంబాన్ని పోషించుచుండిన రెండవఅన్న బసవయ్యకూడా హఠాత్తుగా చనిపోయాడు. భర్త వియోగాన్ని సహించలేక ఆయనభార్య మహాలక్ష్మమ్మ వెంటనే ఆత్మహత్యచేసుకొన్నది. మూడవవాడిని నేను జైల్లో ఉన్నాను; మా తల్లి దుఃఖం ఇంతింతకాదు. నాకంటె చిన్నవాళ్లు ఇద్దరు. కుటుంబాన్ని స్వయంగా పోషించేశక్తి అప్పుడు వారికిలేదు. సోదరుడు బసవయ్య మా అయిదుగురిలో శ్రేష్ఠుడని ఆకాలంలో ప్రసిద్ధి. పురాణాలు బాగా చదివిచెప్పేవాడు. ఆయనపురాణకాలక్షేపానికి ఎందరో వచ్చేవారు. ధైర్యశాలి; భీముడు, అర్జునుడు, అభిమన్యుడు ఆయన అభిమానవీరులు. కీచకవధ ఆయనకు నచ్చినకథ. తాను పనికార్య ఒకగ్రామానికి వెళ్ళాడు. ఇండ్లు తగులబడ్డవి. ఒకయింటిలో ముసలమ్మ ఉండిపోయింది. మంటల్లోదూరి తీసుకురావాలి. అందరూ సంశయించుతూంటే బసవన్న బయటికి మోసుకొచ్చాడు. మంటలబాధచే యిద్దరూ కొద్దిరోజులలో చనిపోయారు. భార్యకు ఆయనంటే అమితప్రేమ. బిడ్డలు పుట్టేవారు; చనిపోయేవారు. భర్త పోగానే, నిరాశురాలై చనిపోవాలనితీర్మానించుకొన్నదని సంశయించి మాతల్లి, పినతల్లులు జాగ్రత్తపడిరి; కాని, ఒక నడిరాత్రి ఇంటిప్రక్కబావిలో దూకి ఆత్మహత్యచేసుకొన్నది. ఇలాంటికష్టాల్లో నా కుటుంబానికి సహాయం చేయలేకపోతినని

దుఃఖించాను. కాని, దేశమాత అంతకంటె కష్టాల్లో ఉందని, దేశ స్వాతంత్ర్యంకొరకు పనిచెయ్యడమే ఉత్తమమని నమ్మి, కష్టాలను దిగమింగుచుంటిని.

ఈకష్టాల్లో నా తల్లి, తమ్ముడు గురుస్వామి నన్ను చూడాలని కన్ననూరు జైలుకు వచ్చారు. అప్పటికి షుమారు ఐదుసంవత్సరాలయింది. నన్ను చూచి తల్లిగారు చాలా ఆనందించింది. నేను ఆరోగ్యంగాను, బలంగాను ఉంటిని. దండాలు, బస్కీలు చేస్తూ వార్డర్లతో కుస్తీపట్టుతూ వుంటిని. అమెరికాకు వెళ్ళేప్పుడు పందిపౌనులు. ఇప్పుడు 135 పౌనులు బరువున్నాను. నన్ను చూచి, మా తల్లి ఆశ్చర్యపడింది. ఆమెదుఃఖం కొంతవరకు శాంతించింది. నా తమ్ముడు కుటుంబాన్ని పోషించుతానని, నేను ఆ విషయంలో దిగులుపడకూడదని ఎంతో ధైర్యంచెప్పాడు *

జైలులో వుండగా, అప్పట్లో పరిచయంలేని ఒక విద్యార్థి నాకు పుస్తకాలను తనమిత్రులవద్ద, ఇతర విద్యార్థులవద్ద పోగుచేసి నాకు పంపుచుండిరి. వారే ఇప్పుడు మైలాపూరులో ఛిల్డ్రన్ గార్డెన్ స్కూలు ప్రిన్సిపాలుగారైన శ్రీ వి. యన్. శర్మగారు. విడుదల తరువాత యిద్దరం ప్రాణస్నేహితుల మయ్యాము.

* నా తమ్మునికి కుటుంబాన్ని పోషించడం అప్పటికి అలవాటయింది; ఇప్పటికీ అలాగే మా అందరి సంసారాల కష్టాలోను ఆదుకుంటూనే వున్నాడు. పెద్దవాడిని నేను లేని లోపం పోగొట్టి నా బాధ్యతలను తానె నిర్వహించాడు.

## బిపిన్ బిహారీ గంగూలీ

లాహోరు జైలునుండి వచ్చిన ఒక సంవత్సరానికి నన్ను ఢిల్లీ జెయిలుకు మార్చారు. మరేదో కుట్రకేసు పెట్టనున్నారని ఊహించితిని. ఢిల్లీజైలులో ఈ సంశయం రూఢిపడింది. శిక్షపడని నాలాంటివారు వివిధరాష్ట్రాలలో వుండిరి. వారందరిని పోగుచేసి ఢిల్లీలో ఒకకేసు పెట్టాలనుకొన్నారట. మూడునెలలుంచారు. కేసు పెట్టనేలేదు. తిరిగి కన్ననూరుకు మార్చారు.

ఢిల్లీజైలులో నన్ను ఏకాంతంగా ఉంచారు. అలాగే బెంగాలునుండి బిపిన్ బిహారీ గంగూలీ అనే విప్లవకారుని మరొకచోట ఏకాంతంగా ఉంచారని తెలిసింది. మేమిద్దరం ఏదో ఉపాయంతో కలుసుకుంటూనేవుంటిమి. ఆయన సన్నగా, పొట్టిగా ఉంటాడు. పర్సనాలిటీలేదు. అయినప్పటికి మంచి మేధావి. ప్రపంచ యుద్ధ కాలంలో బెంగాలీ విప్లవకారుల ప్రయత్నాలనుగురించి ఎన్నో విషయాలు చెప్పారు. కలకత్తా పట్టుకొని బెంగాలురాష్ట్రాన్ని పట్టుకొని, సంతెనలన్నిటిని పడగొట్టి, ఇంగ్లీషువాళ్ళను బెంగాలులో లేకుండాచెయ్యాలని వారిప్లాను. "జయించగలుగుతారా? " అని అడిగాను. "జయించగలం. కాని నిలుపుకోలేము. మిగత రాష్ట్రాలలో విప్లవోద్యమాలు వృద్ధికి రాలా. అందువల్ల బ్రిటిష్‌ప్రభుత్వం ఆ రాష్ట్రాల్లో సైన్యాలను పోగుచేసి, బెంగాలును తిరిగి జయించుకోగలుగుతుంది "అని విచారం వెలిబుచ్చాడు. కలకత్తాకోటలో ఉన్న ఆయుధాలనుగురించి వివరాలుచెప్పగలిగాడు. కోటను పట్టుకొనుటకు మార్గాలను చెప్పాడు. బెంగాలు జైల్లో ఎక్కడ వుంచినా తప్పించుకోగలననికూడ చెప్పాడు. అందువల్లనే ఢిల్లీ జైలులో వుంచారనికూడా తెలుసునన్నాడు. కొన్ని

సంవత్సరముల తరువాత రౌలటు రిపోర్టును చదివాను. దానిలో కలకత్తా నగరాన్ని పట్టుకొనుటకు విప్లవకారులు వేసిన ప్లానులను వివరిస్తూ కలకత్తా కోటను పట్టుకొనేపనిని ఈ బిపిన్ బిహారీ గంగూలీకి ఇచ్చినట్లు చదివాను. తరువాత అతని సాహస కృత్యాలు సాగించుతూనే ఉన్నట్లు పత్రికలలో చదువుతూనే వుంటిని.

ఢిల్లీనుండి మళ్లీ కన్ననూరుకు తెచ్చారు. ఈ జైలు నాకు యిష్టంలేదు. ఖైదీల కష్టాలు నాకళ్లకు ప్రత్యక్ష మయ్యాయి. అన్యాయాలను చూస్తూ ఊరకుండలేను. పోరాడకతప్పదు. ఫలితమేమో అతిస్వల్పం. ఫలితాలకాశ పెట్టు కోకుండా పోట్లాడాలి.

చిదంబరం పిళ్లై, నీలకంఠ బ్రహ్మచారి

మనరాజధాని జైళ్లలో మార్పులు తెచ్చినది రాజకీయ ఖైదీలే. వరిస్థితులలో తెచ్చినది వి. ఒ. చిదంబరంపిళ్లై. ఈయన స్వదేశీ స్టీమిషిప్ నావిగేషన్ కంపెనీని తూత్తుకుడిలో స్థాపించి దేశసేవజేసిన నేరానికి జైలులో ఉండవలసివచ్చినది. వీరిని అన్యాయంగా శిక్షించిన కలెక్టర్ ఆష్‌ను కాల్చేశిన వారిలో ఒకరు నీలకంఠబ్రహ్మచారి.

1905సం॥రం ప్రాంతంలో జాతీయోద్యమము ప్రారంభమై రాజకీయఖైదీలు జైళ్లకు వెళ్ళడం ప్రారంభమైనది.అలాంటివారు జైలుకురాగానే గేటులోనే బట్టలను పూర్తిగా విప్పేసి,వారి గదులకు వారు చేరేవరకు బెత్తంతో కొట్టుతూ వెంటబడి తరిమే వాడుక.కన్ననూరు జెయిలరు ఫోన్సికాను గురించి అలా చెప్పుకొనుచుండిరి.నీలకంఠబ్రహ్మచారి ప్రతిజైలులోను దెబ్బకు దెబ్బకొట్టాడు.

ఆయనతో నూతనశకం ప్రారంభమయింది. జైళ్ళలో అప్పటినుండి రాజకీయ ఖైదీలను కొట్టడానికి సంశయించేవాళ్లు. అయితే చిదంబరంపిళ్ళై ఖైదీలందరిని సంఘటితపరచి పోరాటాలకు దింపాడు. బయటనుంచి సంస్కరణకొరకు పాటుపడుచుండిన శాసనసభ్యుడు కేశవపిళ్ళెగారు నిర్మాణరూపకంగా సంస్కరణలు చేయించాడు. అంతవరకు యిచ్చుచుండిన గోచీలకుతోడుగా చెడ్డీలు, బనీన్లు, మూరెడేసితుండుగుడ్డలు యిప్పించారు. నేలమీద పడుకొనుటకు బదులుగా ఒక గోనెపట్టా, ఒకగొంగడి యిప్పించారు. మట్టిచట్టి, ముంతలకుబదులు రేకుపళ్లెము, తగరంలోటా యిప్పించారు. జైలులో ప్రవేశించగానే స్త్రీలకు, పురుషులకు గుండు చేయించడం* మాన్పించారు. అయితే మెడలో పెద్ద ఇనుపకంటె పోలా.

కాలికి యినుపకడియం పోలేదు. 1920 ఉద్యమములో జెయిలుకు వెళ్లిన కాంగ్రెసువారికి ఈకడియాలు వేశాయి. 1915-

* తమప్రభుత్వాన్ని శాశ్వతంగా ఇండియాలో స్థాపించగోరిన బ్రిటిష్‌వారు ప్రజాసామాన్యాన్ని పాటించకపోవడం సహజమే. తమ ప్రభుత్వాన్ని వ్యతిరేకించేవారిని హడలగొట్టించుటకు జైళ్లలో భయంకరమైన పరిస్థితులను సృష్టించారు. "మానమర్యాదయుగలవారు" ఎన్నికష్టాలకైనా ఓర్చుకొనుచుండిరి గాని, జైళ్లకుపోవుటకు జడిసిపోయారు. దిక్కులేని రైతులు, కూలీలు, బీదలుమాత్రం జైళ్లకు పోకతప్పదు. అలాంటి ప్రభుత్వంలో ఈ విషమపరిస్థితులను మార్పించినవారు చిదంబరంపిళ్లె, నీలకంఠబ్రహ్మచారిగార్లు. వారు 1907 మొదలు 1912 సం॥ల ప్రాంతంలో జైళ్లలో వుండిరి. వారుండిన జైళ్లలో నేను 1916–19 వరకూ వుంటిని. కాని, 1907-12 లో శ్రీ హరిసర్వోత్తమరావుగారు వెల్లూరుజైలులో ఉండిరి. ఈ జైలులో నేను ఉండనందున వారు చేయించిన మార్పులు నాకు తెలియవు.

1919 వరకు నేను డెటిన్యూగా ఉంటిని. అందువల్ల నాకు ఈ బాధలు లేవు.

జైలులో పోరాటం

కన్ననూరు జైల్లో డాక్టరు తమ్మనసింగు స్థానంలో నారాయణపాయ్. (పేరుసరిగాజ్ఞాపకంలేదు.) అసిస్టెంటుడాక్టరు పాయ్ స్థానంలో గోవిందనాయరు వచ్చారు. ఖయిదీలకు మందుమాకులు లభించాయికాని, ఆహారంలో మార్పు తెచ్చుటకు జడిశారు. ఖైదీల పొట్టలుకొట్టే జైలరును మార్పించాలి; ఎలా? సంవత్సరానికి ఒకతడవ జైళ్ళ యిన్స్పెక్టరుజనరలు తనిఖీచేసివెళ్ళతాడు. అది ఒక లాంఛనంమాత్రమే. జైలుకు వెల్లవేయించుతారు. ఆ రెండు రోజులామాత్రం మలిచిన బియ్యం, కూరలు, పులుసు ఉంటై. ఇచ్చిన కొత్తగుడ్డలనుకూడా తిరిగి లాక్కుంటారు. (ఈ సాంప్రదాయం 1948 వరకూ మారలా.)

ఇన్స్పెక్టరుజనరలు దొరగారితో "జైలరు ఫోన్సికాసోమరి. అందువల్ల అందరం బాధపడుచున్నాము. అంతకంటే చురుకైన వ్యక్తి జైలరుపనికి లభించడా?" అని జైలుఅధికార్లందరిఎదుట అడిగాను.

"నీకు వ్యక్తిగతంగా ఏమైనా కంప్లైంట్లు ఉంటే చెప్పు" అన్నాడు దొరగారు.

"అలాగైతే ప్రత్యేకంగా మాట్లాడడం న్యాయంకదా?" అన్నాను.

జైలు అధికార్లు దూరంగా వెళ్లారా, జైలరును గురించి మాత్రమే వివరంగా చెప్పాను. నన్ను ఆ జైలులునుంచి మరొక

జైయిలుకు-ముఖ్యంగా ఆంధ్రదేశంలోని జైయిలుకు మార్చమని కోరాను. పదిరోజులకు ఫోనిసికాకు ట్రాన్సర్ అయింది; నాకేమో రాలేదు. ఫొన్సికా నావద్ద కొచ్చి "ఇకమీదట చురుగ్గా వుంటాను కన్ననూర్ జైయిలుకు తిరిగి రావడానికి ప్రయత్నిస్తాను. సహాయంచెయ్యవూ?" అని బ్రతిమలాడివెళ్ళాడు. జెయిళ్ళలో డబ్బు సంపాదించడం జమీందారీపద్ధతి మాదిరిగా చేసుకొన్న ఆఫీసర్లు ఎలాగైనా అక్కడే వుండాలని ప్రయత్నిస్తారు

ఫోన్సికా స్థానంలో జైలరుగా గురునాథయ్య (ర్)గారు వచ్చారు. వీరు చిత్తూరుజిల్లా తెలుగువారే. ఆక్టింగుగావచ్చారు. పై పై ఉద్యోగాలను సంపాదించాలి. ఏవిధంగా సంపాదించినా న్యాయమేననుకునే రాక్షసుల్లో ఇతను ఒకడు, అందుకోసం ఎంతైనా ప్రయాసపడేవాడు. జైయిలో ఎక్కడెక్కడ దేయే లోపా లున్నాయో, న న్నడిగి తెలుసుకొని ఫోన్సికాను అణగత్రొక్కేశాడు. సూపర్నెంటు షామియారుకు భయంవేసింది. రూల్సును తూ. చ. తప్పకుండా అన్నం, బట్టలు, మందులూ యిప్పిస్తూ జైలు ఉద్యోగస్తులను భయపెట్టాడు; ఖైదీలకు బాగా అనుకూలించింది. ఆయినా నేనూ కలసి "రాజ్యం" చేశాం కొంతకాలం.

కాని, మా ఇద్దరి త్రోవలు వేరయ్యాయి. పెద్ద ఉద్యోగాలు సంపాదించాలని తీర్మానించుకొన్న దురాశాపరుడు. గురునాథయ్యర్ నాకు ఒక కథ చెప్పాడు. అప్పన్ ఆక్టింగ్ జైలరుగా ఉంటూండగా ఒక కఠినమైన సూపర్నెంటు వున్నాడు. సూపర్నెంటును కొట్టమని కొందరు ఖయిదీలను ప్రోత్సహించాడు. వాళ్లు కొడుతూంటే అప్పను ఖైదీలనుకొట్టి సూపర్నెంటును రక్షించాడు.

తన కృతజ్ఞతను చూపుటకు సూపర్నెంటు అప్పను తనప్రాణాలను రక్షించిన మహానుభావుడని ఇన్‌స్పెక్టరు జనరలుకు టెలిగ్రాం యిచ్చాడు. పై అధికారులు మెచ్చుకొని, అప్పనును డెప్యూటీ సూపర్నెంటుగా నియమించారు. గురునాథయ్యరుకు అప్పన్ మార్గం బాగా నచ్చింది. "జైలు సర్వీసులో మరోమార్గంలే"దని విచారపడ్డాడు. నన్ను సహాయం చెయ్యమని కోరాడు. కొందరు ఖైదీలతో చెప్పితే చాలునన్నాడు. "సూపర్నెంటు షామియార్ రాక్షసుడు కాడు. ఈ విధంగా నేను సహాయం చెయ్యలే"నని ఖండితంగా చెప్పాను. నిరాశ చెందాడు. తాను నాకు చెప్పిన విషయాన్ని మరచిపొమ్మని కోరాడు. సరే నన్నాను. కాని, ఈ మోసగాడిని జాగ్రత్తగా కనిపెట్టి ఉండాలనుకున్నాను. తన ప్లానును మానేసే రకం కాడని అనుకొన్నాను. కాని. నాకు సూపర్నెంటుకు తగవులుపెట్టి, నాచేతనే కొట్టించే ప్లాను వేస్తాడని నేను తలచనేలేదు.

జైలులో నేను కొన్ని రూల్సును ఉల్లంఘించేవాడిని. కాగితాలు, ఉత్తరాలు, పుస్తకాలు, న్యూసు పేపర్లు, మనియార్డర్లు వగైరా కావలసినవాటిని బయటనుండి తెప్పించుకొంటూవచ్చా. ఇది జైలు ఆఫీసర్లందరికీ తెలుసు; పోస్టాఫీసులోకూడా తెలుసు. అయినప్పటికి నన్ను అడ్డుపెట్టలా.

ఇన్‌స్పెక్టరు జనరలు తనిఖీకి వచ్చేకాలం సమీపించింది. జైలులు పరిపాలనలో నేను కనిపెడ్తూవచ్చిన లోపాలన్నిటిని షుమారు ఇరవై పేజీల రిపోర్టు వ్రాశాను. ఆయన వచ్చినప్పుడు ఇవ్వాలనుకొన్నా. ఆ ఉదయాన ముందుగానే గురునాథయ్యరుకు చెప్పాను. ఆయన ఒక సలహా యిచ్చాడు. "కాగితాలు

ఎలావచ్చాయనే నేర మేర్పడుతుంది. జైలరు చేతకానివాడని నాకు రిమార్కు రాకూడదుగదా! కంప్లయింటు వ్రాసియివ్వటానికి కాగితాలు కావాలని అడుగు; ఇవ్వమంటాడు; ఇస్తాను; మరునాడు వచ్చి తీసుకెళ్తాను" అని సలహా యిచ్చాను. అలాగే జరిగింది. నింద తప్పించుకోడానికి యిచ్చిన సలహా నాకూడా నచ్చింది. అయినా చివరకు నిందను తప్పించుకోలేకపోయాడు. ఆయన యిచ్చినది రెండు కాగితాలు మాత్రమే; నా రిపోర్టు యిరవై పేజీలకు పైగా వుంది.

ఇన్స్పెక్టరుజనరలు, సూపర్నెంటు మాత్రమే చదువుకొని మడచపడి నా రిపోర్టును చింపేశారు. ఇన్స్పెక్టరుజనరల్ వెళ్ళిపోగానే సూపర్నెంటు జైలరును పిలిపించాడు. నాశనంచేస్తానన్నాడు. అయితే అయ్యరుగారు చేతకానివాడు కాదు. తనకూ, నాకూ ఏలాంటిస్నేహమూ లేదనీ, నా గది సోదాచేసి నిషేధవస్తువులను తెచ్చియిస్తాననీ, సూపర్నెంటు పంపయ్యను ఏమిచేసినా సహాయంచేస్తానని జైలరుగారు ప్రార్థించాడు. మధ్యాహ్నం 2 గంటలకు నా గది సోదాచేశాడు. ఏవో వున్నై. "వీటిని ఇక్కడే వదిలేసి వెళ్ళండి, నేనే నాశనం చేస్తాను" అని సలహా యిచ్చాను. నామాట లక్ష్యపెట్టలా. "నిప్పుతో చెలగాడుతున్నా"వని వార్నింగు యిచ్చాను. తలవంచుకొని వెళ్ళాడు.

నేనూ ఒకప్లాను వేసుకున్నాను. "ఉదయాన సూపర్నెంటూ, జైలరూ వస్తారు. నన్ను తిడతారు. సూపర్నెంటును నామీదికి అయ్యరు ఉసికొల్పుతాడు; అయినా నేను శాంతంగా వుండాలి. తరువాత పరిస్థితులనుబట్టి నడచుకోవాలనుకున్నాను.

గత రెండుసంవత్సరాలలో సూపర్నెంటు ఎన్నోసార్లు నాకు సౌకర్యాలు కల్గింప ప్రయత్నించాడు; ముఖ్యంగా ఇన్స్పెక్టరు జనరలు వచ్చేముందుగా రూల్సుప్రకారం యిచ్చినవంతా తీసుకొనుటకు సిద్ధమే. జైల్లో ఖైదీలందరికోసం పోట్లాడాలనే పాలసీ ప్రకారం ప్రవర్తిస్తున్నాను. మరునాడు ఇద్దరూ వచ్చినపుడు సూపర్నెంటు నన్ను "పాము" అనీ, "పాముపోసినా విషంగా మారిపోయిం"దనీ ఏమేమో అన్నాడు. జైలరు ఆయన్ను యింకా రెచ్చగొట్టాడు. సూపర్నెంటుమీద నేను దౌర్జన్యం చేస్తే జైలరు ఆయనను సహాయంచేసి ప్రమోషన్ సంపాదించుకోగలడు. అప్పటి కథ నాకు బాగా జ్ఞాపకముంది. కాబట్టి ఎన్ని తిట్టినా సహించాను. నన్ను ఒకగదిలో మూసివెయ్యమని సూపర్నెంటు ఆర్డరువేశాడు. కాని, అయ్యరుగారు కోతిపుండు బ్రహ్మాండం చేస్తాడనుకున్నాను. అంతే అయింది. డాక్టరు గోవిందన్నాయరు నన్నెలాగో కలుసుకొని ఒక్క మాటమాత్రం చెప్పి వెళ్లాడు: "ఎంతమాత్రం ఎదిరించొద్దు. కొట్టేందుకు అవకాశమియవద్దు" అని ఆయన హెచ్చరిక. అలాగే చేద్దామనుకొన్నా. కాని, ఆ సాయంత్రం ఒక గంట ముందే వెయ్యమంది ఖైదీలను బ్లాకుల్లో మూసేసి రోడ్డుమీద వార్డర్లను బారులుతీర్చి నిలబెట్టారు. ఛీఫ్‌వార్డరు, మరినలుగురు బలాఢ్యులు- నావల్ల జుల్మానాలు వేయించుకొన్నవారు- నావద్దకొచ్చి లేచి నడవమన్నారు. నేను లేవలా. మోసుకెళ్లారు; ఒంటరిగదిలో బంధించారు. నా శరీరంమీద వారు చెయ్యి వెయ్యడం అమర్యాదగా తోచింది. కసి తీర్చుకోవాలి! ఎవరిమీద? యింతకూ జైలరే కారణం! మూడోనాటి ఉదయం గురునాధయ్యర్‌గారు నన్ను వార్డర్లు లాగి యెత్తుకెళ్లారని

విని తాను విచారపడ్డానని మొసలి కన్నీళ్లు కార్చాడు. జైలరే గేటువద్ద గదిలోవుండి ఇవన్నీ చేయించాడని నాకు ముందే తెలిసింది. ఇతనికి బుద్ధిచెప్పే దెలాగా అని యోచించాను. ఏమీ తోచలా. "గదిలో కాలంగడపడం కష్టంగావుంది. యోగాభ్యాసాన్ని గురించి తాను నాకు రికమెండుచేసి తెప్పించియిచ్చిన పుస్తకాన్ని యిస్తే, యోగాభ్యాసంచేస్తా" నని చెప్పాను. సూపర్నెంటు ఒప్పుకోడన్నాడు. ఆయనకు తెలియకుండా మరునాడు ఆదివారంఉదయం తెచ్చిపెట్టమనికోరాను. 'సరే' నని వెళ్ళాడు. మర్నాడు వీడుచేసుకొని జైలరును శిక్షించాలి! చిరతరాలుగా జ్ఞాపకముండేలా చెయ్యాలి! ఎలా? ఈ ఆలోచనతో తలనొప్పి వచ్చింది.

## జైలరుకు దేహశుద్ధి

నా బ్లాకు వార్డరు గోవిందన్‌కు నాపైన చాలా గౌరవం. అతని అభిప్రాయాన్ని కనుక్కోవాలనుకొన్నాను. ప్రమోషను కావాలని ఆశ వున్నదని చెప్పాడు. అప్పుడు ప్లానును జ్ఞాపకముంచుకోమన్నాను నేను. జైలరును శిక్షించేందుకు అవకాశంచూస్తున్నాడు. ఆదేసమయంలో పరుగెత్తుకొచ్చి నన్ను కొట్టి, ప్రమోషనుసంపాదించుకొనుటకు అంగీకరించాడు. నేను కోరినరీతిగా మరునాడు ఉదయాన జైలరు నావద్దకు వచ్చేముందుగా, పళ్లు తోముకోటానికి తలుపుతెరచి నన్ను వదిలిపెట్టి, మరెక్కడో పనులుచేసుకొంటూ వెళ్లాడు. నేను వరండాలో ముఖంకడుక్కోవడం చూచి జైలరు నడకను తగ్గించాడని నాకు తోచింది.నేను లోపలికి వెళ్ళి, యినుపకమ్మీలతలుపును మూసినట్టు నటించాను. తలుపువద్దకు వచ్చి పుస్తకం యివ్వబోయాడు. బయటికొచ్చి తీసుకోవచ్చునా అని

అడిగాను. సరేననక తప్పలా. చేతితో పుస్తకం తీసుకొని కాలితో నడుంమీద తన్నాను. తాను ధైర్యశాలినని, కర్ర తిప్పడం తెలుసునని, కుస్తీ పట్టగలననీ నాతో ప్రగల్భాలుకొట్టేవాడు. ఖైదీలు ఎందరున్నా, గొర్రెలమందమీద తోడేలు దూకినట్టుగా, ఒక్కడే వారిపైనబడి కొట్టేవాడు.ఇప్పుడా ప్రగల్భాలు మాయమైపోయినై. "నిన్నిప్పుడే చంపిస్తాను చూడు" అన్నాడు. ఆయన్ని అవమానించాలనే నా ప్లాను; కాని, అవయవాలకు హానికలగాలనికాదు. తన బెత్తం ఝుళిపించగానే నా చెక్కుచెప్పును చేతికి తీసుకొని విసిరాను. ముఖంమీద తగిలి కళ్లజోడు పగిలింది. ముఖంమీద బొప్పికట్టింది. రెండో చెప్పు తీశా. "చంపేస్తాను" అని మళ్లీ బెదిరించాడు. చెప్పెత్తేంతకి కాళ్లకు బుద్ధిచెప్పాడు. వెంటబడి చెప్పు విసిరాను. వీపుమీద తగిలింది. వెనక్కి తిరిగి వచ్చాను. దగ్గరలో బొరకవుంది. తీసుకోబోతూండగా అలారం, ఈలలు వినబడినై. వార్డర్లు పరుగెత్తుకొస్తున్నారు; బయలు ప్రదేశం; అంతమందిలో పోట్లాడట మెలా? రక్షించుకోవాలి: నా గదిలోకి వెళ్లి తలుపువేసి గడియపెట్టాను. ఖైదీలు, వార్డర్లు గుంపులు గుంపులుగా నా గదివద్ద మూగారు.

నన్ను ఒంటరి గదిలో పెట్టకముందు ఉరితీయబడవలసిన వారి గదిలో పెట్టారు. ఆగదిలోకి పాములు వస్తూండేవి. మాగదులకు దాపునే అడవి వుంది. ఒకరాత్రి హెడ్ వార్డరు గస్తీకి వచ్చినపుడు నాగదిలో ఒకపాము దొరబడడం చూచాడు. నన్ను లేపాడు. గాఢనిద్రలోనుండి ఎలాగో లేచాను. అయితే తాళం తెరవగలవా అనడిగాను. తాళంచెవి లేదన్నాడు. "అయితే ఎందుకు లేపావు? పాము భయపడి మీదపడదూ?" అని

చెప్పి శాలువ గట్టిగా కప్పుకొని తిరిగి గాఢంగా నిద్రపోయాను. తాను బయట కనిపెట్టుకొని వుండి, పాము రాగానే చంపేసి వెళ్లాడు. మరునాడు దాన్ని సూపర్నెంటుకు, నాకు చూపించాడు. అప్పటి నుండి పడుకోటానికి ఒక వెదుళ్ల మంచం యిచ్చారు. దానికాళ్లు చాలా దృఢమైనవి. ఎప్పటి కే మవుసరమవుతుందోనని ఒక కాలిని తీసిపెట్టి ఉంచాను. ఇప్పుడది బాగా అనుకూలించింది. దాన్ని పుచ్చుకుని "నా గదిలోకి మొదట ప్రవేశించినవాడు చస్తా"డని బెదిరించాను.

ఖయిదీలను ఎందరినో తెచ్చారు; ముఖ్యంగా ఎట్టిటోపీల వాళ్లని (హత్యకేసుల్లో జన్మశిక్ష పడ్డవారిని) నన్ను కొట్టమని ప్రోత్సహించి, బెదిరించిచూచారు. వారు నాతో కలబడటానికి అంగీకరించలా. వార్డర్లు భయంతో సంశయించుతున్నారు. "లోపల కెళతారా లేదా" అని వారిని జెయిలరు బెదిరించాడు. "ధైర్యశాలివి, వీరుడవు, శూరుడవు, కుస్తీ చేయగలవు, కర్ర తిప్పగలవు, నీవే లోపలికి రారాదా" అన్నాను. ఖైదీయి నవ్వాడు. తన బెత్తంతో వారిని కొట్టాడు. ఈలోపల ఒకవార్డరు రావాలనుకుంటూ వుండడం గమనించా. మంచిబలశాలి. సోదమీ కేసులను ప్రోత్సహించాడని వానిమీద కేసుపెట్టి జుల్మానా వేయించాను. ఈవిషయం గ్రహించి నా మిత్రుడు గోపాలన్‌వైపు చూచాను. "అవకాశం పోగొట్టుకోవద్దు" అని నేను సూచించినట్టు గ్రహించాడు; ముందుకు వచ్చాడు. నేను అడ్డుపడినట్టు నటించాను; లోపలికి రాగలిగాడు; పోట్లాడినట్టు నటించి, క్రింద బోర్లపడ్డాను. నా వీపుమీద కూచుని కొట్టాడు; ఇతర వార్డర్లు కూడా కొట్టారు. జైలరు మాత్రం లోపలికి రాలేదు; కాని, "కొట్టండి" "తన్నండి"

ఆని ప్రోత్సహిస్తూనే వున్నాడు. నన్ను ఎంత కొట్టినా ఆయనకు సంతృప్తి కలుగలా. "పంచయ్య పలకడంలేదు! చచ్చిపొయ్యాడేమో?" నని వార్డర్లు అన్నారు. కొట్టడం చాలించారు. నా బట్టలను పూర్తిగా తీసేయించాడు. సామానులన్నింటిని తీసుకెళ్లారు. కక్కసు చట్టినైనా ఉంచలేదు. నా దగ్గరకు ఎవరూ రాకూడదు; మాట్లాడ కూడదు; నీళ్లుకూడా త్రాగటానికి యివ్వకూడదని ఉత్తర్వుచేశాడు. వరండాలోకి యినుపకమ్మలద్వారా నగ్నశరీరంతో ఉచ్చపొయ్యాలి; పోశాను. చాలా ఒప్పిక అయింది. రాత్రి అయింది. ఒక కాన్విక్టు వార్డరు- ఖూనీకేసులో జన్మశిక్ష పడిన ఒక బళ్లారి హరిజనుడు తాళం తనిఖీ చెయ్యడానికి వచ్చాడు. మంచినీళ్లు కావాలంటిని. ఎవ్వరికీ కనిపించకుండా వుండటానికి నా గది ముందటి లాంతరును దూరంగా తీసుకెళ్లి చీకటిలో దోసిటితో నీళ్లు త్రాగించి వెళ్లాడు.

జైలరుకు ఒకే కూతురు. కొడుకులు లేనేలేరు. నేను తన్నిననాడు కూతురికి శోభనం; దూరప్రదేశాలనుండి బంధువులు చాలామంది వచ్చారు. కంటిదగ్గిర దొప్పి, కళ్లజోడు పగలడం చూచారు; చాల పరాభవం జరిగింది. నా కోరికకూడా అదే. నా మనసు శాంతించింది.

నాకు రెండురోజులు ఒళ్లంతా నొప్పులుగావుంది. తరువాత మామూలే. బాగా కసరత్తుచేస్తున్నశరీర మయినందున ఓర్చుకోగలిగాను. *

* నా అనుభవాలనుబట్టి కొన్నిసందర్భాలలో శరీరకష్టాలు- ముఖ్యంగా నొప్పులు శరీరాన్ని అంతగా బాధించవనిన్నీ, మనసు ఒప్పితే శరీరం భరించగలదనీ నా భావం. శరీరానికి ఎంత నొప్పి తగిలినా

నామీద కేసు పెట్టాలి. నేను ఒక డెటిన్యూని. శిక్షపడిన ఖైదీనా కాదు; కాబట్టి ఇంత పెద్దకేసును మాజిస్ట్రేటు విచారించాలి కాని, జైలు సూపర్నెంటు విచారింపజాలడు. అలాంటి బహిరంగకేసుకు సూపర్నెంటు, జైలరు ఒప్పజాలరు. సూపర్నెంటు దొంగతనాలను ఎన్నో బయటపెట్టగలను. కాబట్టి కేసు బయటికి పోకుండా తానే ఏదో మసిపూసి మారేడుగాయ చెయ్యాలి. ఎలా చేశాడు?

రెండు రోజుల తరువాత నా బట్టలు, సామానులను యిచ్చి, సూపర్నెంటు ఆఫీసుకు తీసుకెళ్లారు. మేడమీద సూపర్నెంటు, జైలరు మాత్రమే ఉండిరి. రహస్యంగా ఏదో రాజీ పడాలని వారి ఉద్దేశమని తోచింది నాకు. సూపర్నెంటు 'జైలరును కొట్టావా?' అనడిగాడు.

నేను :- "కొట్టాను; తన్నాను; చెప్పుతోకూడా కొట్టాను"

సూ :- "ఎందుకు చేశావలా?"

నేను :- "కొట్టనక్కరలేని వానిని కొట్టినందుకు విచారపడుతున్నాను" (Sorry, the wrong man got the beating.)

సూ :- "అయితే నువ్వసలు కొట్టాలనుకున్న దెవరిని?"

నేను :- "నిన్ను"

---

నా కెంతో శాంతి, సంతోషము కలిగినవి. దెబ్బలవల్ల నొప్పిలేకపోయినా, కొందరు ఖయిదీలు అనవసరంగా భయపడేవారు, ఏడ్చేవారు, కొట్టవద్దని వార్డర్ల కాళ్లుపట్టుకొని బ్రతిమిలాడేవారు. ఇంతమాత్రానికి ఎందుకు ఇంత నీచంగా ప్రవర్తిస్తారా అనుకొనేవాడిని. స్వగౌరవం అనే గుణం వారి జీవితాల్లో అభివృద్ధికి రాలేదని భావించేవాడిని. *

సూపర్నెంటు ఉలిక్కిపడ్డాడు; కుర్చీలో నుంచి లేచి కూర్చున్నాడు. కలం పారేసి తల వంచుకొన్నాడు. "మేము నీకేమి హాని చేశాం చంచయ్యా? నా మర్యాదా పోయింది. జైలరు మంచి వంశంవాడు; ఆయన తరతరాల మానమర్యాదలు పోగొట్టావు! నీకు చెడ్డపేరు తెచ్చుకున్నావు. ఎందుకిలా చేశావు?" అన్నాడు షామియార్. జైలరు అందుకొని "బట్టలు తీసేసి పిర్రలమీద కొట్టాలి ( flog ) సార్!" అన్నాడు.

నేను :- "నీ భార్య వితంతువు కావడానికి సిద్ధపడిందా?" అన్నాను.

వారిద్దరూ కొంతసేపు ఏమీ మాట్లాడలేక పోయారు.

సూ :- "ఆయన్ను ఎందుకు కొట్టావు?"

నేను :- "ఉన్నది ఉన్నట్టు నిజం తెలుసుకోవడం ఇష్టమేనా?"

సూ :- "తప్పకుండా"

నేను :- "సత్యానికి నిలబడగలిగిన ధైర్యమున్నదా నీకు?"

సూ :- "ఉన్నది"

నేను :- "జైలరూ! నిజం చెప్పు" అన్నాను. జైలరు తబ్బిబ్బయ్యాడు. సూపర్నెంటు జైలరువైపు చూసి "ఏమయ్యా! చెప్పరాదూ" అన్నాడు. "నాకేమీ తెలియడంలేదు" అన్నాడు జైలరు.

అలాగయితే నేనే చెప్తానని, సూపర్నెంటును కొట్టించి తాను ప్రమోషన్ పొందటానికి నాకు చెప్పిన అప్పసుకథ, తాను కోరిన సహాయం, నేను నిరాకరించుట మొదలయిన గాథ చెప్పాను. జైలరుకు కాళ్లు ఒణికాయి. సూపర్నెంటుకు కోపం హెచ్చింది. "నీకు నమస్కారం చంచయ్యా! ఈ విషయాన్ని

బాగా ఆలోచిస్తాను. దయచేసి నీవు వెళ్లొచ్చు" అన్నాడు సూపరెంటు.

మర్నాడే జైలరుకు ట్రాన్స్ఫర్ అయింది. తిరిగి డెప్యూటీ జైలర్ అయ్యాడు. తాత్కాలికంగా నా కష్టాలు తగ్గాయి. అయితే అప్పుడవి కష్టాలుగానే తోచలేదు. చావుకు సిద్ధపడిన ఆకాలంలో ఇలాంటి కష్టాలు భోజనంలోకి అప్పడాల్లాగా ఉండేవి. వెయ్యి మంది ఖయిదీలకు సరైన అన్నమూ, బట్టలూ, మందులూ నావల్ల లభించాయి: అంతకంటే మరేం కావాలి నాకు?

అప్పటినుండి సూపరెంటు షామియార్ నాతో స్నేహానికి ప్రయత్నించాడు ఎన్నో పుస్తకాలు, పత్రికలు, ఫలహారాలు పంపే వాడు. ఇంగ్లీషువారు తమయిండ్లల్లో కొన్ని ముఖ్యగ్రంథాలను బీరువాల్లో అలంకారానికి పుంచుకుంటారు. (ముఖ్యంగా Reception హాలులో.) అలాంటి నాజూకు ఆంగ్లేయ సారస్వత సర్వస్వ సంపుటాలు తెచ్చి యిస్తూండేవాడు.

3-4 నెలలు ఇలా గడిచాయి. నా విషయంలో అతనికి భయం పోలా. వారానికి ఒకసారి ఇన్స్పెక్షన్‌రోజున నావద్ద కొచ్చి విచారించక తప్పదు కనీసం పదిమంది సిబ్బందితో వచ్చే వాడు. పది, పదిహేను అడుగులదూరంలో నిలబడేవాడు. నాకు యీ జైలులో విసుగుపుట్టింది. ఇతరులతో కలసి మాట్లాడే అవ కాశం యివ్వడంలేదు. తోడెవరూ లేరు. పీపుల్సుపార్కులో అడవిమృగంలా ఒంటరిగా ఉండాలి. ఆదివరకు ఖైదీలు వచ్చి తమ కష్టసుఖాలు చెప్పుకొనేవారు. నాకు చాలా పని వుండేది. అరపం, మళయాళం, కన్నడం నేర్పుకొనేవాడిని. ఇప్పు డా అవకాశాలు పోయినై. యుద్ధానికి వెళ్లుటకు నిరాకరించిన పఠాను

సిఫాయీలు యిద్దరు ఖైదీలుగా వుండిరి. ఒకరు బాగా చదివిన వాడు. అరబ్బీ, ఉరుదూ నాకు నేర్పాడు. నాచే ఖొరాన్ చదివించి ఉర్దూలో అర్థంచేప్పే వాడుక. ఇప్పుడు ఏకాంతవాసంతో విసు గెత్తింది. యుద్ధం ముగిసిపోయింది. ఆరుమాసాల్లో విడిచిపెడ తామని చేసిన శాసనాన్ని ఆరేసిమాసాలచొప్పున పొడిగిస్తున్నారు. మద్రాసురాజధానిలో నే నొక్కడినే రాజకీయ ఖైదీని; అయినా నన్ను విడుదలచెయ్యలేదు. మరొక జైలుకు వెళ్లటానికి ప్రయ త్నించాలనుకొని సూపర్నెంటును అడిగాను:-

నేను:- "నన్ను చూస్తే నీకు భయంగా వున్నది. నిన్ను గురించి నాకూ అలాగేవుంది. నన్ను యింకో జైలుకు మార్పించ రాదూ? లేకపోతే, నీవు యింకో జైలుకు మార్పించుకో రాదా?"

సూ:- "నిన్ను ఏకారణంతో మార్పించగలను? నీ ఆరోగ్యం బాగున్నది! నీ తూకం పెరుగుతూనేవుంది. అందువల్ల ప్రభుత్వం సమ్మతించదు."

నేను:- "అలాగైతే డాక్టరుగారిని పంపండి. ఏదో ఉపాయం కని పెట్టుతారని సూచించాను.

డాక్టరు నారాయణపాయ్‌గారు వచ్చారు. ఆయనకు నే నంటే చాలా యిష్టం. ఎన్నెన్నో యుద్ధసమాచారాలు చెపుతూం టాడు. ట్రాన్స్ఫరు చేయించుతానని చెప్పాడు. కొన్నాళ్లలో ఏకాంతవాసం లేకుండాచేస్తానన్నాడు. కోయంబత్తూరు జైలుకు మార్చారు. నాలాగే ఒకడెటినూ్య ఏకాంతంగా ఉన్నాడు. అతను టర్కీ దేశస్థుడు. యూరపియన్ ఖైదీలను ఉంచే బ్లాకులో ఉంచారు. రెండోభాగంలో నన్నుంచారు. విశాలమైన హాలు,

వరండాలు, స్నానంగది, వంటగది, చిన్నఆవరణా, కుర్చీలు బల్లలు, మంచాలతో ట్రావిలర్సు బంగాళా లాగున్నది.

కోయంబత్తూరు జైలులో

సాయంత్రం కోయంబత్తూరు సెంట్రల్ జైలుకు చేరాను. ఉదయాన సూపర్నెంటువద్దకు తీసుకెళ్లారు. "నా హిస్టరీటికెట్టు చదివే వుంటాడు; వొట్టి వ్యాదిననే విషయం గమనించివుంటాడను కొంటూ వెళ్లాను. సూపర్నెంటు ఇంగ్లీషువాడు. పొట్టిమనిషి. వృద్ధుడు. ఐ. యమ్. యస్. లో రిటైరై తిరిగి యుద్ధకాలంలో ఉద్యోగంలో చేరాడు. నన్ను చూడగానే "నీవు యువకుడివే:* మంచిది; నీవు సరిగా ప్రవర్తిస్తే నేను చాలా మంచి సూప ర్నెంటునని తెలుసుకుంటావు" అన్నాడు.

*నేను వయసుకంటె పదేళ్లు చిన్నవాడినిగా కనపడుతాను. కార ణం నాకు తెలియదు 1915—16లో డెన్హాము నన్ను సింగపూరు మిలి టరీ జైలులో విచారించినప్పుడు నా వయసు ఎంతని అడిగాడు. 25 సంవ త్సరాలని చెప్పాను. "నీకు అంత వయసుండదు. అబద్ధం చెపుతున్నా" వన్నాడు. నేను నవ్వి "నీ వలా మాట్లాడ రా" దంటిని. అప్పుడు నన్ను క్రాసు పరీక్ష చేశాడు. "చంచయ్యా నీవు చుట్టా, సిగరెట్టు త్రాగుతావా?" అన్నాడు. "లేదన్నాను" "సారా వగైరా త్రాగుతావా?" అంటే "రుచికూడా తెలియదు. కాఫీ-టీలు కూడా త్రాగ నంటిని. స్త్రీలతో సంపర్కం ఉందేవా?" అన్నాడు. లేదంటిని. "మరింకేం? అంత చిన్న వాడుగా కనపడడంలో చిత్ర మేముంది?" అన్నాడు.

కాని, అనంతరం వివాహం చేసుకొన్నాను; కాఫీ, టీలు త్రాగు తున్నాను. అయినా నా వయసుకంటె చిన్నవాడినిగా కనపడుతూనే ఉన్నాను. గాఢంగా నిద్రపొయ్యే అలవాటుంది. అందువల్లే ఇలా కను పడుతున్నా ననుకొంటాను.

చాలా సంతోషం; నమస్కారాలు. అయితే ఒకషరుతుకు నీవు ముందుగా ఒప్పుకోవాలి" అని నవ్వుతూ అన్నాను. ఆయన కూడ నవ్వుతూ "ఏమిటా షరతు?" అన్నాడు.

"నవలలను సమృద్ధిగా యివ్వాలి" అన్నాను. "సంతోషంగా యిస్తాను. తప్పకుండా యిస్తా" నన్నాడు.

### కుక్కకాటుకు చెప్పుదెబ్బ!

జైలరు గురునాథయ్యరును నేను తన్నిన సంగతి కోయంబత్తూరుజైలు జైలరు మెక్కార్నేకు ఖైదీలద్వారా తెలుస్తుందని, తగాదా పెట్టుకుంటాడేమోనని నా మనసులో అలజడిగానే వుంది. ముందుగా ఆలోచించాను. జైలరుతో చాలా రోజులు తగాదాలు పడుతూ ఉండకూడదని, పొడిగించుతూ పోతే ఓడుతానని, మెరుపులాగు తీరిపోతే నేనే జయిస్తాననీ తలిచాను. కష్టాలను నిమిషనిమిషమూ ఎదురు చూస్తూంటిని. వచ్చింది కూడాను.

యుద్ధానికి వెళ్లేందుకు నిరాకరించిన పంజాబీసైనికు డొక రొట్టెను తెచ్చి నా కిచ్చాడు. వానితో మాట్లాడకుండా, నా కెందుకు పంపారో తెలుసుకోకుండానే ఆ రొట్టెను తీసుకొన్నాను

వెంటనే వార్డరు వచ్చాడు. "జెయిలరు నిన్ను ఆఫీసుకు రమ్మంటున్నా" డని చెప్పాడు. రొట్టె నెందుకు పంపారో అర్థమైంది. తగాదా పెట్టుకొనుటకు ఏదో సాకు చూపించటానికి జైలరు వేసినయెత్తు!

తన ఆఫీసుగదిలో జైలరు ఒక్కడే కూర్చొనిఉన్నాడు. బయట ఒక వార్డరుమాత్రమే ఉన్నాడు. అవసరమైతే జైలరుతో చేతులుచేతులుకలుపుకోవచ్చు ననుకొన్నాను. జైలరు ఎత్తైనవాడు; బలశాలి; మధ్యవయసులో ఉన్నాడు; అందగాడు.

జైలరు:-"మిలిటరీఖైదీలతో సంబంధం పెట్టుకొన్నావా అప్పుడే? రొట్టెను తెప్పించుకొన్నావా లేదా?

నేను:- "అతనే రొట్టెను తెచ్చియిచ్చాడు. ఏదో పొరపాటు జరిగి వుంటుంది, దయచేసి సిపాయిని అడిగిచూడండి" అని సగౌరవంగా జవాబిచ్చాను.

జైలరు:- "నీవు నాకు ఆర్డర్లు యిస్తావా?"

నేను:- "మీరు అలా తలచినందుకు విచారపడుతున్నాను. మీరునన్ను సరిగా అర్థంచేసుకోలేదు."

జైలరు:- "నేను గురునాథయ్యర్‌లాంటి పిరికి బ్రాహ్మణ్ణి అనుకున్నావా? జాగ్రత్త!" అన్నాడు.

నేను:- ఏదురు చెప్పలా. నన్ను తిడతాడని, తాను తప్పులుచెయ్యడంతో నాకు గొడుకుతాడని, మోరల్‌స్ట్రెంగ్త్ పోతే సులభంగా జయించవచ్చునీ అనుకొని మారుచెప్పలా.

జైలరు:- "నేను ఐరిష్‌వాడను. నాలో యూరపియన్‌రక్తమున్నది సుమా! ఖబర్దార్! జ్ఞాపక ముంచుకో! నీ ఎముకలను పిండి చెయ్యగలను! కాళ్లకు, చేతులకు గొలుసులు, కడియాలు వెయ్యగలను. చీకటిగదిలో మూసి వెయ్యగలను" అన్నాడు. నేను పలకలేదు. వాగిందే వాగుతున్నాడు. నాలుక ముందుకు సాగడంలేదు. వాడికి మరేమీ తోచడంలేదు. అలసి పొయ్యాడనుకొన్నాను.

నేను:- "ఇంతేనా ప్రగల్భాలు, మరేమయినా వున్నాయా?" అని ప్రశ్నించా. జైలరు పలక్కుండా నావైపు చూస్తున్నాడు. నేను నవ్వి ఇలాగన్నాను "నేను చంపయ్యను. జైలరు గురునాథయ్యరును కొట్టిందీ, తన్నిందీ నేనే. నీకు ఇప్పటి

కైనా జ్ఞానోదయం అయిందా?" అన్నాను. బిత్తరపడి పోయాడు, కాని. నోరు తెరవలా.

"ఇండియాలో ప్రతివ్యక్తీ ఒక పురుగు అనీ, నీ యిష్టం వచ్చినట్టు తిట్టవచ్చుననీ అనుకొంటివా?" అన్నా మాట్లాడలా.

"నేనేమో చావడానికికూడా సిద్ధంగా వున్నాను. అయితే నీవో? నేను నీమెడను విరిచేస్తా ననుకొందాము! నీవేమి చేస్తా విప్పుడు?" అని అడిగాను. జైలరు పలకనేలేదు. భయపడిపోతున్నా డని నాకు తెలుసు. "నాకు కోపం వచ్చేలా ప్రవర్తించావు! అందుకు నీవు శిక్షార్హుడివి! అయితే, అంతమాత్రానికి నిన్ను చంపితే నీ భార్య, బిడ్డలు కష్టపడతారు. సరే! నీకు అయిదునిముషాలు టైమిస్తాను. నీ వీ లోపల నోరు తెరిచి మాట్లాడితే నిన్ను కొట్టక పోతే నేను చంపయ్యను కాదు" అని బెదిరించి నా చేతిగడియారం వైపు చూచాను. పిరికివెధవ! నోరు తెరవనేలేదు. అంతట "సరే! నీ ప్రవర్తన బాగానే వుంది. నీ తల వక్కలుచేయలేదని నాకు సంతోషంగానే వున్నది" అని నా గదికి నేను వెళ్ళి పోయాను.

ఉదయం 11 ఘం॥కు ఆ నాటకం జరిగింది. మధ్యాహ్నం వాడు నాగది ముందరి రోడ్డున వెళ్లాలి. వరండాలో కుర్చీ, బల్ల వేసుకుని, కాళ్లు బల్లమీద పెట్టుకొని ఏదో పాడుతూ కూచున్నా. వెంటనే యీ తగాదా ముగిసిపోవాలని, సరైన రాజీ కుదరాలని నా యోచన. ఎలా చెయ్యడం అనుకొంటూన్నా. తానూ రాజీకి రాక తప్పదు. తప్పంతా తనది. నా సాహసం వానికి తెలియదు. ఇప్పుడు తెలిసింది. అనుకొన్నట్టే వచ్చాడు. ఇనుపకటకటాలకు అవతల వైపున నిలబడి, ముసిముసినవ్వు నవ్వుతూ నన్ను పిలిచాడు.

నేను పొగరుబోతుతనం నటిస్తూ "ఏంకావాలి? చెప్పు, వినబడుతుందిలే" అన్నాను. కాదు, దయచేసి రావాలి" అని బ్రతిమలాడాడు.

"ఒక్కొక్కప్పుడు నాకు అకారణంగా కోపం వస్తుంది. నన్ను క్షమించవా!" అన్నాడు.

"అయితే నీవు సూపర్నెంటుమీదకూడా అప్పుడప్పుడు కోప్పడుతూంటావుగదూ?" అన్నాను. నవ్వాడు.

"సరే, నాకు అర్థమయింది. ఇప్పుడు నీకు ఏం కావాలి"

"ఎప్పుడైనా నీకో, నాకో ట్రాన్స్ఫరు కావచ్చు; మనం స్నేహితులుగా వుందాం" అన్నాడు.

"నీవు వాస్తవంగా అలా ఉద్దేశిస్తున్నావా?" అన్నాను.

"అవును" అన్నాడు. "సరే, నేను ధైర్యశాలిని కావచ్చు; అయినా చిల్లర మల్లర తగూలు నా కిష్టంలేదు" అన్నాను.

"ఇకమీదట నీకు ఏం కావాల్సినా నేను తప్పక యిస్తూంటాను. నీవు సూపర్నెంటును అడుగనవసరంలేదు" అని చేయికలిపి వెళ్లాడు. అలాగే తనమాటను నిలుపుకున్నాడు.

జైల్లో ఖయిదీలకు కావలసిన స్నేహితుడు డెప్యూటీ జైలరు. ఆయన వద్ద సామానులన్నీ వుంటాయి. ఆయన సహాయం అవసరం. డిప్టీజైలరు డిమాండే దొర చిల్లర దొంగతనాలు చాలా చేస్తాడు. పిరికిమనిషి. నాకు వంట చేసిపెట్టడానికి మద్రాసులో యమ్. యు. సి. క్లబ్బులో బట్లరుగావుండి దొంగతనంచేసిన ఖయిదీని నియమించారు. వంటలు, ఫలహారాలు రుచిగా చెయ్యగలసమర్థుడు. ఈ నా వంటమనిషి కోరినదంతా యిస్తూవచ్చాడు డిమాండే. అయితే, జెయిల్లో చాలామంది ఆశ్రి

తులు ఏర్పడ్డారు. పాటలు పాడేవారు, తబలా వాయించేవారు. 12-2 గం. మధ్య జైల్లో ఆఫీసర్లుండరు. అప్పుడు ఇలాంటివారు నా గదివద్దచేరి కులాసాగా కాలం గడిపేవారు. వారికి నేను ప్రతి దినమూ ఏదో ఒక బండారము చేయించి పెట్టడం అలవాటైంది. కొన్నినెలలతరువాత ఒకవీశ హల్వా చేయుటకు సామానులు తీసుకురమ్మన్నాను. డిప్యూటీజైలరు యివ్వలేదని పంటమనిషి నాకు రిపోర్టు చేశాడు. డిప్టీజైలరును పిలిపించాను. నేను "నువ్వేమీ నా కివ్వనక్కరలేదు. అయితే, ఇక మీదట నీ వేమీ దొంగిలించ కూడ"దన్నాను.

"నే నేమి దొంగిలించాను?" అన్నాడు. రేపు ఉదయం సూపర్నెంటుకు నీవు దొంగిలించి యింట్లో పెట్టుకొన్న సామాన్ల పట్టీ యిస్తాను. ఇక వెళ్లవచ్చును" అన్నాను. (జైళ్లలో దొంగిలించడం ఆఫీసర్లకు సర్వసామాన్యం)

"నేను ఎంతని హాస్పిటలు అక్కౌంటులో వ్రాసి మీకు యివ్వగలను?" అని గోజిగి, నా బట్లరును పిలుచుకెళ్లి అన్నీ యిచ్చి పంపాడు.

విడుదల

మొత్తం మీద కోయంబత్తూరు జైలులో ఆరునెల లుంటిని. నన్నుఅరెస్టుచేసి జెయిల్లో 4 సం॥ 6 నెల లుంచారు. అనగా ప్రపంచ యుద్ధం ముగిసిన 1 సం॥ 4 నెలలకు నన్ను 1919 డిసెంబరులో వదలిపెట్టారు. జెయిలరు మెక్కార్నె తనయింటికి తీసుకెళ్లి భార్యా బిడ్డలకు పరిచయంచేసి ఫలహారం. టీ యిచ్చారు.

"నీవు నాకు ఎంతో మేలుచేశావు? నేను మీ ఋణం ఎలా తీర్చగలను?" అన్నాను. "మేలుచేసినవారికే తిరిగి తీర్చడం

కష్టమే! నే నేదైనా చేసివుంటే నీవు ఇతరులకు చెయ్యి" అని సరియైన సలహా యిచ్చాడు.

ఆయన భార్యతో "నీ భర్త చాలా దుడుకుమనిషి! అయితే, మంచివాడు! బాగా చూచుకో" అని నవ్వాను.

అందు కామె "అవును! ఎంతో ప్రయత్నిస్తున్నాను. నీ సలహాకు నమస్కారాలు" అన్నది. అందరం నవ్వాము. సెలవు పుచ్చుకొని మద్రాసుకు వచ్చాను. జైలరు మెక్కార్న్ క్రమంగా సూపరెంటెంటు, ఇన్స్పెక్టరుజనరలు అయినాడని తెలిసింది. కాంగ్రెసు ఖైదీలతో జాగ్రత్తగా ప్రవర్తించాడని విన్నాను.

## కొత్త త్రోవ

కుట్రలు, హింసలు, దౌర్జన్యాలు, చంపుకోడాలు, సాయుధ పోరాటాలు, ఉరిశిక్షలు, అండమాన్లతోకూడిన గదర్‌పార్టీ ప్రపంచంలోనుండి అహింసా-సత్యాలతోకూడిన గాంధీజీ ప్రపంచంలోకి 1919 సం॥ డిసెంబరులో వచ్చాను. నా విధి నేమనుకోవాలి? సంతోషించనా? దుఃఖించనా? ఎలా సవరించుకోవడం?

"ఇంత కష్టపడ్డానుగదా! దేశాన్ని నేను ఏమి ఉద్ధరించాను" అనే సంశయం నన్ను బాధించుతూనేవుంది. బ్రిటిష్‌గవర్నమెంటు సాగిపోతూనేవున్నది. ఆంగ్లసామ్రాజ్యాన్ని గదరుపార్టీ నాశనం చెయ్యలేకపోయింది; వాస్తవమే! కాని, మేము జయించలేదా? విత్తనం నాటుతాము; చెట్టు మొలుస్తుంది; పెద్దదవుతుంది. పూలు, కాయలు, పండ్లు ఫలించకపోతుందా? అనుభవించకపోతామా? ఉరికంబాలు, అండమానుదీవులు, ఏకాంత కారాగృహాలు, చిత్రవిచిత్రహింసలకు ఎంతగురియైనా, సంపూర్ణ స్వరాజ్యమనే గమ్యస్థానాన్ని మేము మానుకోలేదు. మా త్యా

గాలు, సాహసాలు, ఎంతోమందిని దేశభక్తులుగా మార్చలేదా? సంపూర్ణస్వరాజ్యమనే గమ్యస్థానానికి సాగిపోవడంలేదా? యుద్ధ రంగంలో మొదటిశ్రేణివారు చచ్చిపోతే, వెనుకఉండే శ్రేణుల వారు ముందుకు దూకి విజయభేరి మ్రోగిస్తారు; విజయపతాకం ఎగురవేస్తారు.

1909 సం॥లో శ్రీ గోపాలకృష్ణగోఖలేగారి ఉపన్యాసం మద్రాసులో విక్టోరియా పబ్లిక్‌హాలుమైదానంలో విన్నాను. అప్పుడు నేను కాలేజివిద్యార్థిని. ఆయన నిర్బంధోచిత ప్రారంభ విద్యాబిల్లునుగురించి ఉపన్యసిస్తూ ఈలాగన్నారు- "ఈ నా బిల్లును బ్రిటిష్‌గవర్నమెంటు ఒప్పదు. బిల్లు ఓడిపోకతప్పదు. అయితే, ఎందుకీ ప్రయాస? వ్యర్థప్రయాస కాదా అని కొందరు ప్రశ్నించవచ్చు. ఈప్రశ్నలో ఒక పొరపాటున్నది. మాతరం దేశభక్తులం ఓడుతాం; జయమనే అదృష్టం మాతరం వారికి ఉండదు. అయితే, ఇలాంటి అపజయాలమూలంగానే దేశానికి మేము సేవచేయగలుగుతాం. రాబోయేతరంవారికి జయం కలుగ వచ్చు. కాలపరిస్థితులనుబట్టి ఫలితాలు కలుగుతాయి. మావిధిని మేము చేశామనేతృప్తి మాకు ఉన్నది" అన్నారు. నేను ఎన్నో ప్రయత్నాల్లో ఓడిపోయాను. ఈలాంటి ప్రతిసందర్భంలోను గోఖలేగారి బోధనుస్మరించి తృప్తిపడి ముందుకు సాగుతూంటాను.

1857 సం॥ స్వాతంత్ర్య పోరాటానికి, 1900-1920 బెంగాలీల టెరరిస్టుఉద్యమానికి, 1913-18 గదరుపార్టీ ఉద్యమానికి, 1920-46 కాంగ్రెసు ఉద్యమానికి—ఈ నాలుగింటికి సంబంధముంది. రాబోయేఉద్యమాలకూ వీటికీ కూడ సంబంధం ఉంటుంది. ఇది సహజం. స్వరాజ్యానికి, ప్రజారాజ్యానికి

ఒక్కొక్క ఉద్యమంతో ఒక్కొక్క మెట్టు ఎక్కుతూవచ్చాము. ప్రస్తుతం దేశంలో ఉండే రాజకీయ నిరాశానిస్పృహలవల్ల ఇంకా తీవ్రమైన రాజకీయ విప్లవపార్టీలు బయలుదేరుతున్నాయి. కార్మిక-కర్షకవర్గాలు రాజకీయ రంగంలోకి వచ్చాయి. సంపూర్ణస్వరాజ్యం వచ్చేవరకూ, ప్రజారాజ్యం ఏర్పడి ప్రతిభారతీయునికి కడుపునిండా అన్నం, కట్టుటకు బట్టలు, వుండడానికి ఇల్లు, విద్య, వైద్య, ఉద్యోగాల హామీ ఏర్పడేవరకు స్వరాజ్యరథం సాగిపోతూనే వుంటుంది. పార్టీలు మారవచ్చునుగాని, భారతీయులు తమ గమ్యస్థానము చేరేవరకు, ముందుపెట్టిన కాలును ముందుకు సాగిస్తూనే వుంటారు అనే దృఢవిశ్వాసం ఏర్పడడమే నాఅదృష్టం. మా గదరుపార్టీవారి ఆలోచనలలో చాలాలోపాలు ఉన్నాయి. ఏదో ఎనిమిది తొమ్మిదిమంది మి బర్మానుపట్టుకొనటానికి సాహసించామంటే మా ఆలోచనలలో ఎన్నిపొరపాట్లుండాలి! 1941 సం॥ లో ఈ గాధను వెల్లూరు జెయిలులో ఉండిన కాంగ్రెసు, కమ్యూనిష్టు డెటిన్యూలకు చెప్పగా ఆశ్చర్యపడ్డారు; కొందరు నవ్వారు; కొందరు హేళనచేశారుకూడా! చివరకు అందరూ గర్వపడ్డారు. అందరూ మా దేశభక్తిని, త్యాగాన్ని కొనియాడారు.

ఒకరు నాకు మేజరుటైటిల్ యివ్వాలన్నారు; అది చాలదు, జనరల్ అనే టైటిల్ యిస్తామన్నారు మరికొందరు; "మార్షల్ ఛన్" అని ఎవరో సూచన యిచ్చారు. అందరూ ఏకగ్రీవంగా ప్యాసుచేశారు. ఎందుకు నన్ను ఈలాగు హేళన చేస్తున్నారని నవ్వుతూ ప్రశ్నించాను. హేళన కాదన్నారు, కాని, వారు నామీద ఈ ప్రశ్నపరంపరలు కురిపించారు:-

(1) గదరుపార్టీవంటి విప్లవపార్టీలోకి ఎవరువచ్చినా చేర్చు కుంటూ వుంటిరి కదా? అలాగు ఎంతోమంది గూఢచార్లు చేరిపోయిరిగదా! జయం ఎలా వస్తుందనుకొన్నారు?

(2) సైన్యం తిరుగబడగానే స్వరాజ్యం వస్తుందా? ప్రజల సానుభూతి సహాయాలు అవసరంలేదా?

(3) 1857 సం॥లో స్వాతంత్ర్యయుద్ధంలో సైన్యం తిరుగబడ్డా ప్రజల సానుభూతి సహాయాలు లేనికారణంవల్ల అప జయం ఏర్పడలేదా?

(4) ప్రజల సానుభూతి సహాయాలు రావాలంటే వారికష్టాలు, సమస్యలు ఏమిటో తెలుసుకొని, ప్రజలను సమీకరణ చేసుకోవాలికదా? స్వరాజ్యం ప్రజారాజ్యంగా ఉంటుందని, ప్రజల సమస్యలు పరిష్కారమవుతాయని వారికి నమ్మకం ఏర్పడాలికదా? లేకపోతే స్వరాజ్యం ఏర్పడగలదా?

(5) ప్రజలను పీడించే జమీందార్లు, రాజులు, మహారాజులు, భూస్వామ్యజమానులు, పెట్టుబడిదార్లను విదేశీ ప్రభువులతో పాటు నాశనం చెయ్యకపోతే, ప్రజల సమస్యలను పరి ష్కారం చేస్తామనే హామీని నెరవేర్చగలమా?

(6) కార్మిక కర్షక వర్గాలు నిర్మాణయుక్తంగా స్వతంత్ర యుద్ధంలో చేరనియెడల అంతఃకలహాలు రక్తపాతమూ తప్పవే.

(7) రషియాలో లెనిన్ చేసినరీతిగా, కార్మిక కర్షక ప్రజా ప్రభుత్వం ఏర్పడనియెడల, ప్రజానీకానికి ఏమీ మేలు చేయజాలము. స్వరాజ్యం ఏర్పడినంతమాత్రాన ఏమి ఉపయోగము? ఇల్లు అలుకగానే పండుగ అగునా!

ఈలాగు ప్రశ్నపరంపరలు కురిపించిరి. "ఈప్రశ్నలలో ఎంతో సత్యం వున్నదని ఇప్పుడు నాకు బోధపడుచున్నది. కాని ఆకాలంలో మాకు ఈలాంటి సంశయాలు కలుగనే లేదు. ఇంత అజ్ఞానం ఉండినా, విదేశీప్రభుత్వాన్ని నాశనం చెయ్యాలి అనే ఆశయం తీవ్రంగావుంది. మాకు ద్వేషం అంతగా వుండేది. ఎలాగైనా ఆకాలంలో మద్రాసురాష్ట్రమంతటిలో నే నొక్కడినే గదరుపార్టీలోచేరి స్వరాజ్యంకొరకు ప్రయత్నించాననే సంతోషం, సంతృప్తి నాకు ఉన్నది. ఓడినా, గెలవడానికి మార్గం చూపించాము. స్వరాజ్య సంపాదనకు మాలాగే వేలు లక్షలు కోట్ల కొలది దేశభక్తులు ఏర్పడుచున్నారని, స్వరాజ్యం తప్పక లభించునని, నా చిన్నతనంలో కోరినకోర్కె నెరవేరుచున్నదని ప్రస్తుతం సంతోషదాయకంగా ఉండడం నా అదృష్టము కాదా?" అని వారికి సమాధానం చెప్పాను. "మార్షల్ ఛెనకు జై" అన్నారు. అదే చాలు నాకు.



# నేను - నా దేశం

## జాతీయోద్యమము సంఘ సంస్కారము

### మరో ప్రపంచం

1919 సం॥ డిశంబరులో ప్రభుత్వం నన్ను విడుదల చేసింది. అప్పటికి యుద్ధంముగిసి దాదాపు 1½ సంవత్సరం అయింది. అప్పుడు మద్రాసురాష్ట్రంలో రాజకీయఖైదీని నే నొక్కడనే. అయినా ప్రభుత్వం నన్ను వెంటనే విడుదల చెయ్యలా. నా విడుదలకోసం ప్రజ అనేక బహిరంగసభలు చేశారు. ఎన్నో తీర్మానాలు మహాజనులు పంపినమీదట ప్రభుత్వం నన్ను విడుదల చేసింది.

నేను 4½ సం॥లు జైళ్లలో వుంటిని. నా కారాగృహ వాసం అంతమయ్యేదాక దినవార పత్రికలు చదువలేదు. మతగ్రంధాలనుమాత్రమే చదువుకోనిచ్చారు. రాజనీతిశాస్త్రము, అర్థశాస్త్రములను, విదేశ విప్లవచరిత్రలు, విప్లవకారులజీవితచరిత్రలు, భారత రాజకీయములు మున్నగువానిని అసలే చదువనివ్వలేదు. ఇన్నెందుకు- ఈ 4½ సం॥లలోను నా విజ్ఞానతృష్ణను చల్లార్చటానికి అసలు అవకాశమే లేదన్నమాట. అలాంటప్పుడు నా బుద్ధివికాసం అరికట్టబడినదంటే అతిశయోక్తి కాదుగదా! అంతేగాదు, యుద్ధానికి సంబంధించిన విషయాలుకూడ చదువనందున నే నేదో అయోమయప్రపంచంలో అంతకాలం గడిపానన్నమాట. అందుచేత నే నా నాటి భారతజాతీయ రాజకీయాలకు అపరిచితుడనై పోయాను.

అయితే, అంతకాలం అంధకారంలో వున్నప్పటికీ అనేక అనుభవాలఫలితంగా బ్రిటిషుప్రభుత్వపు పైశాచికస్వరూపాన్ని స్పష్టంగా గ్రహించగలిగాను. ముఖ్యంగా పోలీసు, సి. ఐ. డి., జైలు, మిలిటరీ మున్నగు శాఖల్లోనికుట్లను చక్కగా గ్రహించాను. బెంగాలు టెరరిస్టుపార్టీవారి దేశభక్తి, త్యాగములవలన కలిగిన ఉత్తేజంవల్ల, గదర్‌పార్టీలో కలిగిన నా అనుభవంవల్లా నా మాతృభూమియందు ఉజ్వలదేశభక్తి, బ్రిటిష్‌సామ్రాజ్యంమీద ప్రబలద్వేషము ఏర్పడినై. మా జీవితంలో కనీస మొక తెల్ల సామ్రాజ్యవాదినైనా చంపలేపోతే మాజన్మ సఫలం కాదని అనుకునేవాళ్లం. స్వరాజ్యసంపాదనకోసం ప్రాణాన్ని త్యజించటానికి సర్వావస్థలలోనూ సిద్ధంగాఉండాలని భీష్మప్రతిజ్ఞ పట్టాము. పవిత్ర భారతభూమినుండి బ్రిటిషుప్రభుత్వ విషవృక్షాన్ని కూకటివ్రేళ్లతో పెరికివారవేసి, ఆ స్థానే పవిత్ర ప్రజారాజ్యమును స్థాపించాలనే ఆశయం దినదినాభివృద్ధిచెందుతూ నా హృదయంలో స్థిరావాసం ఏర్పరచుకొన్నది. ఈ విప్లవానికి హింస, అహింసామార్గాలన్నిటిలో ఈ మహత్కార్యాన్ని సాధించాలనే దృఢనిశ్చయం కలిగింది. కాని, ఈ కార్యసాధనకోసం, బ్రిటిషుసామ్రాజ్యంతో రాజీపడటమనే విషయం మాత్రం నా నిఘంటువులోనే లేదు.

ఇలాంటి వ్యక్తిని గాంధీ నాయకత్వంలోఉన్న కాంగ్రెసు రంగంలోకి తటాలున వచ్చాను. అప్పటి కాంగ్రెసు రాజకీయాలు, ఆశయాలు, మార్గాలు నా కెంతమాత్రం నచ్చలేదు. కారణ మేమంటే, కాంగ్రెసు స్వరాజ్య మనే మాటకు ఈవిధంగా నిర్వచనంచేసింది.

"మనదేశానికి రాజకీయస్వాతంత్ర్యాన్ని ఇవ్వటానికి బ్రిటిష్ప్రభుత్వం సమ్మతించే యెడల మనం బ్రిటిషుసామ్రాజ్యం లోనే చేరివుందాము. అది అలా అంగీకరించనిచో సామ్రాజ్యంతో పూర్తిగా తెగతెంపులు చేసుకొని విడిపోదాము"

ఇలాంటి ఆశయం నన్ను కాంగ్రెస్సునుండి దూరం చేసింది. అహింసావిధానంవల్ల పూర్ణస్వాతంత్ర్యం రాజాలదనీ, సామ్రాజ్యవాదంతో రాజీపడితే అధినివేశపరిపాలనకన్న అధికమేమీ లభించదనీ నా అభిప్రాయం. అందుచేత, పెరుగుతున్న కార్యక్రమాలు, సాయుధపోరాటాలు, విప్లవోద్యమాలు మున్నగువాటిని అణచివేయటానికి గాంధీగారు చేస్తున్న ప్రచారం, ప్రయత్నాలు నాకు నచ్చేవికావు.

అయితే, గాంధీగారి ఉద్యమములో కలిగిన ప్రజాందోళన, ప్రజారాజకీయ చైతన్యం భారతీయులందరినీ రాజకీయ రంగంలోకి తెచ్చుటమూలంగా ఏర్పడబోయే మహత్తరమైన విప్లవాంకురాలు మొలకలవాటిని అవగాహన చేసుకోలేకపోయాను. అంతేగాదు, పెడర్థం చేసుకున్నాను. అంటే, ఏ కొద్దిమందో సాయుధశిక్షితులగుదాము. గోరిల్లాయుద్ధం చేస్తేనే త్వరగా స్వరాజ్యం సంపాదించుకోవచ్చుననీ, కోట్లాదిప్రజలకు రాజకీయచైతన్యం కలుగజేసి వారిబలంతో స్వరాజ్యం సంపాదించటం అతి ప్రయాసకరమనీ, చాలాకాలం పడుతుందనీ భావించేవాడిని. కాబట్టే కాంగ్రెస్సులో చేరటానికి కెన్నిసార్లో ప్రయత్నించుతూ, మానివేస్తూ వుండేవాడిని. 1920నుండి1935వరకు నా జీవితంలో రాజకీయంగా ఒకవిధమైన స్తంభన ఏర్పడింది. కాని, రాజకీయంగా నా కెంత నిరాశ-నిస్పృహలు కలిగినా దేశస్వాతంత్ర్య తృష్ణ

అనేది కాంగ్రెస్ ఉద్యమంలో పాల్గొనే దేశభక్తులయందు నా కపారమైన ప్రేమ, గౌరవాలు కలిగించేది. అందుచేత, వారికి సర్వావస్థలలోను నా శక్తికొలది ఆర్థికసహాయం చేస్తుండేవాడిని. గాంధీతత్వంకోసం, కాంగ్రెసు ఉద్యమంకోసం తన జీవితాన్ని అర్పించి, అహర్నిశలు పాటుపడాలన్న ఆశయంతో శక్తికొలది పాటుపడుతున్న నా ప్రథమభార్య అన్నపూర్ణగారిని, ఆమె తదనంతరం నా రెండవభార్య సుభద్రగారిని నేను ఎంతో ప్రోత్సహిస్తూ వారికి సర్వవిధాలా సహాయపడేవాడిని. నా రెండవ భార్య సుభద్రమ్మగారికి గాంధీగారియందు, అహింసాతత్వంమీద అత్యంత భక్తిగౌరవాలున్నవి. అందుచేతనే వారు హరిజనసేవక సంఘానికి కార్యదర్శిగా వుండి. దాదాపు 12 సంవత్సరాలు సేవ చేసింది. అంతేగాదు; మా కుటుంబములో అందరికీ కాంగ్రెసు ఉద్యమంతో సంబంధాలున్నవి. 1920-21 ప్రాంతంలో మద్యపాననిషేధ సందర్భంలో నేను శ్రీమతి పొణకా కనకమ్మగారితో కలిసి గూడూరులో ప్రచారం చేస్తూండగా 144 సెక్షను జారీ చేయబడింది. అందుచేత నేను గూడూరునుండి వెళ్లిపోవలసివచ్చింది అప్పుడే విద్యార్థుల తిరుగుబాటుకు నాయకత్వం వహించిన నా కడపటి తమ్ముడు రంగయ్య లా స్టడీసు మానివేశాడు. నాలాగే నా తమ్ముడు రంగయ్యకూడా కుటుంబానికి ఉపయోగపడకుండా పోతాడని, కుటుంబభారాన్ని వహిస్తున్న నా పెద్ద తమ్ముడు గురుస్వామి రంగయ్య కొరక వృత్తిని కల్పించాలని నిశ్చయించుకొన్నాడు. కనిగిరిప్రాంతం ఖద్దరుఉత్పత్తికి ప్రసిద్ధి చెందింది. వీరు విదేశీవస్త్రవ్యాపారం మానేసి ఖద్దర్ఉత్పత్తికీ, కాంగ్రెస్సుకూ అనేకవిధాలుగా తోడ్పడ్డారు. ఇప్పటికీ ఆ వ్యాపారం

చేస్తూనే ఉన్నాము. ఇంతేగాదు, మా కుటుంబంలో నేను తక్కిన వారు 1929 సం॥నుండి నేటివరకు ఖద్దరు. స్వదేశీబట్టలనే వుపయోగించుతున్నాము. అయితే, ఇంతటిలో రాజకీయాలు వదలి ప్రజాభ్యుదయంకోసం పాటుపడకుండా నిరర్థకజీవితంగా కాలం గడపడం నాకు అసాధ్యమైనవిషయం. అందుచే నా శక్తికొలది వేరేమార్గాలతో సంఘశ్రేయస్సుకోసం పాటుపడ కృతనిశ్చయుడనయ్యాను.

సంఘంలో ఎన్నో లోపాలు కనబడేవి. అమానుష సాంఘికాచారాలు, మూఢవిశ్వాసాలపై నే నెంతో కోపంతో తిరుగుబాటు చేసేవాడిని. వాటి నిర్మూలనకు అనేక ఉద్యమాలను ప్రారంభించసాగితిని. స్వప్రయత్నంచే నూతనోద్యమాలను ప్రారంభించుటలో నాకు కొంతశక్తి వుందనే విషయాన్ని నే నెరుగుదును. ఆ శక్తిని వినియోగించి ప్రారంభించిన ఉద్యమాలలో కొన్నిటిని ఉదహరిస్తాను.

1. వంశపారంపర్యంగావుండే పడుపువృత్తి నిర్మూలన.
2. పౌరోహిత్యమును, మతాధిపతులను ధిక్కరించుట.
3. రజస్వలానంతర ప్రౌఢ వివాహములు చేయించుట.
4. వితంతు వివాహములు చేయించుట.
5. అనాథ శిశుసంరక్షణశాల.
6. పతిత యువతీజనోద్ధరణ.
7. స్త్రీ విద్య.
8. ఉచిత పఠన మందిరములు.
9. సాంస్కృతిక ఉద్యమాలు.
10. హాస్టల్సు.

11. తాలింఖానాలు.

12. హరిజనోద్యమము.

ఈవిధమైన సంఘసంస్కరణ లెంత ముఖ్యమయినా రాజకీయ స్వాతంత్ర్యం లేనిది ఏసంస్కరణకూడ చక్కగా నెరవేరదనే సత్యాన్ని నేను పదేపదే గ్రహించుతూనేవచ్చాను. కాని 1920–1935 మధ్య రాజకీయంగా పనిచేయుటందున నాలో నిరాశా నిస్పృహలు పొడచూపుతూవచ్చాయి. తత్ఫలితంగా అప్పుడప్పుడు భోగభాగ్యములవాంఛ, పేరు ప్రతిష్ఠలు సంపాదించాలన్న అభిలాష మొదలైనవి కలుగుతూవచ్చాయి. అయితే, అకస్మాత్తుగా మరల 1935 లో నా జీవితంలో గొప్పరాజకీయ పరివర్తన కలిగింది. ఆవిషయాలను గురించి రాబోయే ప్రకరణాలలో కొంత విపులంగా వ్రాస్తాను.

సభలూ - సన్మానాలు

తుదకు కోయంబత్తూరు జైలునుండి విముక్తుడనై మద్రాసునకు చేరాను. 7 సంవత్సరాలుగా మిత్రులు మొదలగు వారితో సన్నిహిత సంబంధము లేనందున ఇప్పుడు నా స్నేహితులెవరో నిర్ణయించుకోలేకపోయాను, పోలీసులు దేశభక్తులను హింసించుతున్న కాలమది. కాబట్టి, నాకు సానుభూతి చూపించిన వారికీ కష్టాలు రావచ్చును. నా కులంవారు నాతో కలువకపోవచ్చు. అందువల్ల నేను వై. యం. సి. ఎ.అనే భవనంలో బసఏర్పరచుకొని. శ్రీ సల్లా గురుస్వామిశెట్టిగారిని చూచుటకు వెళ్లితిని. ఆయన పేరుపడసిన అడ్వకేటు. నాయందు చాలా అభిమానం గలవారు. నన్ను చూడగానే కౌగిలించుకొని ఆదరించారు. టెలిఫోనుద్వారా స్నేహితులను ఆహ్వానించి ఒక గంటసేపటిలో

రెండువందలమందిని ప్రోగుచేశారు. నా గౌరవార్థం గొప్ప సభ చేయుటకు ఆహ్వానసంఘ మొకటి ఏర్పడినట్లు చెప్పుతూ, మేళ తాళములతో నన్ను గౌరవించుటకోసం చేసిన ఏర్పాట్లు వెంటనే జరగనందుకు విచారాన్ని వెలిబుచ్చారు. నేను మదరాసుకు ఏ రైల్లో వచ్చేదీ కోయంబత్తూరునుండి తంతి ఇచ్చాను; కాని, అది సకాలంలో చేరలేదు. నేను మద్రాసు చేరినతరువాత గాని తంతి చేరలేదు. నన్ను గౌరవించటానికి వచ్చిన బంధుమిత్రులకు వంటలు చేయించారు. ఒక బ్రాహ్మణుని పిలిపించి నాకు ప్రాయశ్చిత్తం చేయించటానికి ప్రయత్నాలు జరుగుతున్నట్లు గ్రహించాను. నాకు నచ్చలేదు. నా విముఖత్వాన్ని గ్రహించి "బ్రాహ్మణుడు కొద్దిగా నీమీద నీళ్లు చిలకరించటానికైనా అవకాశమి"మ్మని వారు నన్ను బతిమలాడసాగారు. కాని సమ్మతించనని ఖచ్చితంగా చెప్పివేశాను. పాపం! పెద్దలకెంతో విచారంకలిగింది. గాని, చివరకు అందరం కలిసే భోంచేశాము. నన్ను కులంలో కలుపుకున్నారు. నాకు ఉజ్వలమైన దేశభక్తి, త్యాగము ఉన్నవనీ, అపూర్వమైన ధైర్యసాహసాలు గలవాడననీ పొగడసాగారు. ముఖ్యంగా ఆంధ్రలోకం నన్ను చూచి గర్వించింది. ఆంధ్రపత్రిక నన్ను ప్రశంసించింది. శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారు ప్రతిదినము నన్ను గురించి వ్రాయించుతూ ప్రచారంచేశారు. ఆంధ్రదేశంలోని అనేక ప్రాంతాలనుండి ఆహ్వానాలు రాసాగాయి. నా సంతోషానికీ, ఉత్సాహానికీ మేర లేకపోయింది. నే పడ్డ అష్టకష్టాలను త్వరలో మరచిపోగలిగాను.

నా గౌరవార్థము బహిరంగసభ లెన్నో జరిగాయి. మొట్టమొదటి బహిరంగసభ మద్రాసులో సౌందర్య మహలులో

జరిగింది. కీ॥ శే॥ శ్రీ బి. ఎన్. శర్మగారు అధ్యక్షతవహించారు. మాంటేగు చెలమ్స్‌ఫర్డ్ సంస్కరణలను నిరాకరించాలనీ, పరిపూర్ణస్వాతంత్ర్యమే మన గమ్యస్థానమనీ నేను సభలో మాట్లాడాను. నా అభిప్రాయాలను అభ్యుదయభావాలను కలిగియున్న శ్రీ హరిసర్వోత్తమరావుగారు, శ్రీ పి. చంచయ్యగారు మున్నగువారు ప్రశంసించుతూ నన్ను ప్రోత్సహించారు. శ్రీ బి. ఎన్. శర్మగారు మాత్రం హర్షించలేదు. వారు అప్పుడే అమృతసర్ కాంగ్రెసు మహాసభనుండి వచ్చారు. ఆ కాంగ్రెసుసభలో జలియన్‌వాలాబాగ్ హత్యాకాండను జరిపిన వైస్రాయి చెలమ్స్‌ఫర్డ్‌ను మాత్రం ఆక్షేపంచకపోగా ఆ వైస్రాయిని చాలావరకు సమర్ధిస్తూ మాట్లాడిన జాతీయనాయకుడు వీ రొక్కరేనని తెలిసింది. అందువల్ల వీరు వైస్రాయి కార్యనిర్వాహకసభ్యుడుగా నియమింపబడుతారని గుసగుసలు బయలుదేరాయి. అలాంటి శర్మగారు నా ఉపన్యాసాన్ని బహిరంగంగా ఖండించలేదు. పైగా నేను తీవ్రంగా మాట్లాడలేదని వ్యాఖ్యానించారు.

కాని, వీరు సభ ముగిసినతరువాత "నీకు దేశీయరాజకీయాలు తెలియవు. కనీసం ఆరునెలలపాటు వాటినిగురించి మాట్లాడవద్దు. అప్పటికి రాజకీయాలను చక్కగాఅవగాహన చేసుకోగలవు. నీ మేలుకోరి చెప్తున్నాను" అని నాకు సలహా యిచ్చారు. "మీ సలహా అవసరమైనప్పుడు మీ వద్దకు వస్తానులెండి" అని తృణీకారంగా సమాధానం చెప్పాను

### కుల పిశాచం

ఆంధ్రదేశానికి రమ్మని అనేక ఆహ్వానాలు వచ్చాయి. ఆంధ్రదేశసంచారమునకు వెళ్ళకముందు నా జన్మస్థానమునకు

వెళ్ళి నా తల్లిని సందర్శించాలని నిశ్చయించుకొన్నాను. మా కుటుంబానికి పెద్దవారైన మాబావగారు (శ్రీ నీలిశెట్టి గురపయ్యగారు) మద్రాసుకు వచ్చి నన్ను కలుసుకొన్నారు. "కనిగిరి వైశ్య సంఘములో రెండుపార్టీ లున్నాయి. (దరిశవారి పార్టీ, గొంట్లావారి పార్టీ) ఈ గొంట్లావారిపార్టీ ఎక్కువ బలమైనది. నిన్ను కులంలోకి తీసుకొనుటకు సమ్మతించలేదు. అంతేకు దరిశవారిపార్టీ నిన్ను కులంలో చేర్చుకొనుటకు భయపడుతున్నది. కాబట్టి, నీవు ముందు కొన్నిపట్టణాలకు వెళ్ళి అక్కడి వైశ్య సంఘాలవారు నిన్ను కులంలో చేర్చుకొన్నతరువాత కనిగిరికి వస్తే ఎలాంటికష్టాలు వుండవు" అని మా బావగారు సలహా ఇచ్చారు. అతనికేమో నామీద అపరిమితప్రేమ ఉండుట నిశ్చయమే. అయితేనేం పూర్వాచారపరాయణుడూ, భయస్థుడు. "మొట్టమొదట నా మాతృస్థానమునకు వెళ్ళి, నా మాతృదేవిని సందర్శించటానికి నిశ్చయించుకున్నాను. అందుకు అక్కడ ప్రత్యేకంగా బస ఏర్పరచుకొంటాను. మీ రెవరూ భయపడనవసరం లేదు. నన్ను కులంలో చేర్చుకోనక్కరలేదని చెప్పాను. మా బావ కోపంతో వెళ్ళిపోయాడు.

ఆకాలంలో సంఘంలో సంఘసంస్కారణలు వెల్లువలా వస్తూంది. గొంట్లావారి కక్షిలోని యువకులూ, నేనూ ప్రాణమిత్రులము. వారిలో ముఖ్యులు శ్రీ సి. ఎస్. గుప్తగారు (చీమకుర్తిసుబ్బరాయగుప్తగారు. పోలీసు సబ్ఇన్స్పెక్టరు) శ్రీ గొంట్లా శ్రీరాములుగారు (కనిగిరిలో అడ్వకేటు) అభ్యుదయభావాలు గలవారు. నాకొరకెంతైనా త్యాగంచేస్తారని నాకు గట్టినమ్మకం. ఆ

కక్షి వీరిద్దరి నేమీ చేయజాలరన్నవిషయం కూడ నేనెరుగుదును.

నాకు కనిగిరిలో రాబోయే కష్టాలను ముందుగానే గ్రహించిన శ్రీగుప్తాగారు 15 రోజులు సెలవుతీసుకొని, నన్ను నెల్లూరులో కలుసుకొన్నారు. నాతో కలసి కనిగిరికి బయలుదేరారు. కనిగిరికి వెళ్లేమార్గంలో వున్న నెల్లూరు, కావలి, శింగరాయకొండ మొదలగుచోట్ల సభలు, సన్మానాలు, విందులు జరిగాయి. ఇవన్నీ నాకు కనిగిరిలో కలుగబొయ్యే కష్టాలను జయించుటకు ఉపయోగపడినై. కనిగిరి సరిహద్దుకు జేరి, ఊళ్లోకి ప్రవేశించగానే పురజనులు కొందరు చూచి మాఎద్దుబండిని ఆపివేశారు. నన్ను మేళతాళాలతో ఊరేగించి సన్మానం చేసేందుకు ఏర్పాట్లు చేయబడినాయనిచెప్పి, నన్ను తిరిగి ఊరిబెలుపలికి తీసుకెళ్ళారు. తరువాత పురజనులు మహోత్సాహంతో ఊరేగింపు జరిపారు. ఊరేగింపు మా ఇంటివైపుకు మళ్లగానే నా తల్లి ఎదురువచ్చి ఎంత బ్రతిమలాడినా వినక నన్ను ఇంటిలోకి తీసికెళ్లింది. "కులం పోతే పోనీ. నేను విచారపడను" అన్నది నా తల్లి. నా తమ్ముడు గురుస్వామి కూడా అలాగే అన్నాడు. అయితే కులంలో చేర్చుకోకూడదనే పార్టీ పట్టువల ఎక్కువఅయింది. అలాంటి సమయంలో నా మిత్రులు శ్రీ గుప్తాగారు, శ్రీ శ్రీరాములుగారు మాయింటికి భోజనసమయానికి వచ్చి వడ్డించమని మాతల్లిని ప్రాధేయపడ్డారు. మా తల్లి చాల అమాయకురాలు. ఎదురు కక్షివారు పెట్టే బాధలను తలచుకొని భోజనం పెట్టడానికి ఇష్టపడలా. అయితే, నా మిత్రులిరువురూ మాతల్లి బయటికి వెళ్ళి చెపితే కార్యభగం మవుతుందని, గుమ్మంతలుపు మూసివేసి, స్వయంగా వడ్డించుకొని భోంచేశారు. ఈవార్త వ్యాపించినా తేలుకుట్టిన దొంగలా

కిక్కురుమనకుండా ఊరుకున్నారు. వీరిలా చేసినందువల్ల నాకు మళ్లీ కులం వచ్చేసిందన్నమాట! ఒకప్పుడు శ్రీ టంగుటూరి ప్రకాశంగారు బారిస్టర్ అయి విదేశాన్నుండి వచ్చినప్పుడు ఒంగోలులో వారి మిత్రులు యిలాగే కులంలో చేర్చారని విద్యార్థిదశలో మేము విని ఉప్పొంగిపోయిన విషయం నాకు జ్ఞాపకంవచ్చింది. ఇలాంటి ఎత్తులతో యువకులు ఆకాలంలో కులపెద్దలను ఓడించుతూవచ్చారు.

'దేశభక్తే కారణం'

అటుతరువాత గుంటూరుకు వెళ్లాను. బ్రహ్మాండమైన ఊరేగింపులు, బహిరంగసభలు, సన్మానాలు, విందులు జరిగినవి. సభలలో పద్యాలు పాటలతో కొందరు తమ దేశభక్తి-ప్రేమలను నామీద కురిపించారు. మరికొందరు దేశభక్తులు (శ్రీ మద్ది రాధాకృష్ణయ్య, భాగవతుల సోమయాజిశర్మ మున్నగువారు) ఎంతో అనురాగాదరములతో నా ఆర్థికస్థితిగతులనుగురించి అడిగారు. 'నేను బీదవాడిని, నాకుటుంబాన్నుంచి ఆర్థికసహాయం రాజాలదు, నెలకు కనీసం 30 రూ. లకు తక్కువ లేకుండా వచ్చే ఉద్యోగం కావాలి" అని చెప్పుతూ, నేను అమెరికాలో వ్యవసాయశాస్త్రంలో పట్టభద్రుడనైన విషయాన్ని తెలియజేశాను. "ఇండియా ప్రభుత్వంవారు ఇంపీరియల్ అగ్రికల్చర్‌సర్వీసులో డిప్టీడైరెక్టర్లుగా 40 మందిని తీసుకుంటున్నారు. ప్రారంభంలోనే వారికి నెలకు 350 రూ. ల చొప్పున వేతనమిస్తూ ప్రతిసంవత్సరం రు. 50 ల చొ॥ 1000 ల జీతందాక ఎక్కువచేస్తారు. ఆతరువాత సంవత్సరానికి 100 రూ. చొప్పున 1500 రూ. లవరకు జీతాన్ని హెచ్చిస్తారు. కానీ, పరప్రభుత్వంక్రింద నౌకరీచేయటానికి నా

కెంతమాత్రం ఇష్టంలేదు. రు. 30 ల జీతంలో గుమాస్తా ఉద్యోగ మిప్పించితే చాలు" నని విన్నవించుకొన్నాను. కొందరువ్యక్తులు తమ ఎన్నికలకోసం నన్నుపయోగించుకోడానికి ప్రయత్నిస్తున్నారు అలా అమ్ముడుపోడాని కిష్టం లేదని చెప్పాను నన్ను సన్మానించే నిమిత్తం శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారి అధ్యక్షతను బహిరంగసభ జరుగుచుండగా నా మిత్రులు రు1116లు వసూలుచేసి నాకు బహుమతిచేశారు. ఈ డబ్బుతో నేను బెజవాడ, ఏలూరు, రాజమహేంద్రవరం, మచిలీపట్టణం. మొదలగు పట్టణాలకు ఆంధ్రులను ఉత్సాహపరచటానికి వెళ్లాను. ఆ ప్రాంతాల్లో నాకు ఊరేగింపులు, సభలు, సన్మానాలు, విందులు జరిపారు. ఆంధ్రనాయకులను సందర్శించాను. రైళ్ళలో ప్రయాణం చేస్తుండగా ప్రజలు ఎంతో అనురాగాదరణలు చూపెడుతూ,వారిలో వారు "మన చంచయ్యగారు" అనుకొంటూండేవారు. నామీద ప్రజలకున్నప్రేమకు నా దేశభక్తే కారణమని గ్రహించి ఆశ్చర్య పడేవాణ్ణి. ఆకాలంలో దేశభక్తికిగాను నాలాగు గౌరవింపబడిన వ్యక్తి ఆంధ్రదేశంలో యింకెవరూ లేరనుకుంటాను.

జట్కా పనికి ప్రయత్నం

నేను మద్రాసు చేరుకున్నాను. ఉదరపోషణార్థం ప్రయత్నాలు సాగించాను. కాని, ఫలితంమాత్రం పూజ్యం. ఊరూర ఊరేగింపులు, బహిరంగసభలు, విందులుచేసి నన్ను సన్మానించినా చివరకు నాకు గుమాస్తా ఉద్యోగ మివ్వడానికే ఎవరూ సాహసించలేని కారణం: అప్పట్లో ప్రభుత్వాగ్రహము, పోలీసుల భయము అంత తీవ్రంగా ఉండేవి. ప్రజ లప్పటి కింకనూ ధైర్య సాహసాలతో పరప్రభుత్వాన్ని ఎదిరించజాలనిస్థితిలో వున్నారు.

అందుచేత, నా ఉదరపోషణ అనేది ఒక గడ్డుసమస్య అయింది. నాచేతిలో మిగిలివున్న కొద్దిధనాన్ని నేనెంతో పొదుపుగా వాడాల్సినస్థితి ఏర్పడింది. అందువల్ల రోజూ హారిసన్ కంపెనీలో రొట్టెను కొనుక్కుతిని, కొళాయినీళ్లు త్రాగుతూ కొన్నివారాలు గడిపాను. అనాడున్న బ్రిటిషు పాలనావిధానంమీద, ఎన్నికల కోసం తహతహలాడే వ్యక్తులమీద నా కమిత అసహ్యం కలిగింది. ఇలాంటి వ్యక్తు లెందరో నాకు ఆర్థికంగా సహాయపడేందుకు సిద్ధంగావున్నారు. కాని, నాకున్న రాజకీయ భావస్వాతంత్ర్యానికిగాని, నా ఆచరణకుగాని వీరిసహాయం చాలా ప్రమాదకరం. పైగా రాజకీయంగా హేయమైన అవకాశవాదానికి వారితోనే సంపర్కం ఏర్పడుతుంది. అందుచేత వారిసహాయాన్ని తిరస్కరించాను. అసలు ఇతరుల ఆర్థికసహాయాన్నర్థించి జీవించటం ఆత్మగౌరవాన్ని చంపుకోటమేనని నా అభిప్రాయం. కొబట్టి. జట్కాబండి తోలుకొని స్వతంత్రంగా జీవించినా గౌరవప్రదమేనని నిశ్చయించుకొన్నాను. సామాన్యంగా మద్రాసులో జట్కాబళ్ళవాళ్లు స్వతంత్రంగా ఉంటారు. వీరికి గుఱ్ఱపుబండ్లను షాహుకార్లు అద్దెకిస్తుంటారు. ఆ వృత్తిని వెంటనే ప్రారంభించా లనుకుంటూండగానే ఒక ఉద్యోగం లభించింది.

## అ డ యా రు ఉ ద్యో గ ం - రా జీ నా మా

మద్రాసులో అడయారునందు అనీబిసెంటుగారి భారత జాతీయసర్వకళాశాల వుంది. వీరి ప్రియశిష్యుడు అరండేలుగారిని "న్యూఇండియా" దినపత్రిక ఆఫీసులో నేను కలుసుకొన్నప్పుడు అమెరికా విశ్వవిద్యాలయాల్లో గరపే విద్యావిధానము, విద్యార్థుల

జీవితాలనుగురించి వ్యాసాలను ఆ మపత్రికకు పంపమని కోరారు. అలాగే వ్రాసి పంపగా "న్యూయిండియా" లో ప్రచురించారు. విద్యావేత్త లనేకులు వాటిని ప్రశంసిస్తూ, ముఖ్యంగా కొన్నివిష యాల్లో ఆశ్చర్యాన్ని వెలిబుచ్చారు. గొప్ప భూస్వాముల కొమాళ్లు వ్యవసాయమును నవీనపద్ధతులలో నిర్వహించటాని కవసరమైన శిక్షణ పొందేందుకు అడయారు జాతీయ విశ్వవిద్యాలయంలో ఒకభాగంగా వ్యవసాయకళాశాలను స్థాపించియుండిరి. హైడీ కూపర్ అనే హాలెండుదేశీయుడు కళాశాలాధ్యక్షుడుగాను, విదే శాల్లో వ్యవసాయశాస్త్రంలో ప్రవీణుడై వచ్చిన ఒక బెంగాలీ ప్రొఫెసరుగాను పనిచేయుచుండిరి. ఈ ప్రొఫెసరుకు వేతనము రు. 300 లు. అయితే, ఈ విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్న ప్రొఫెసర్లకు వంపెరూపాయలకన్న ఎక్కువవేతనం లేదు. వంగ ప్రొఫెసరు రు 350 లు జీతంతో సర్కారుఉద్యోగం లభించగనే రాజీనామా ఇచ్చి వెళ్ళిపోయారు. ఆ ఉద్యోగాన్ని నా కిప్పించ టానికి నా మిత్రులు* శ్రీ వి. యన్. శర్మ పి. హెచ్. డి. గారు ప్రయత్నించారు. హైడీ కూపరుగారు అభ్యుదయభావాలు గలవారు. కాబట్టి నేను విప్లవవాది నని తెలిసికూడ నాకు ఆచార్య పదవి నివ్వటానికి ఆయన అంగీకరించాడు. నన్ను డాక్టర్ అనీ బిసెంటుగారివద్దకు తీసుకెళ్లారు. నన్ను లెక్చరరుగా తీసుకో దలచి నట్టు తెలిపి, ఆమెగా రిలా ప్రశ్నపరంపరను కురిపించారు:—

"నీవు విప్లవవాదివికదూ?"

---

* ఇప్పు డీయన ఛిల్డ్రిన్స్‌స్కూలు ప్రిన్సిపాలు.

"మిమ్మల్ని, అరండేల్‌గారిని, బ్రిటిషుప్రభుత్వం ఏ సెక్షన్ క్రింద డిటైన్ చేసిందో అలాగే నన్నూ నిర్బంధించింది" అన్నాను.

"నీకు విప్లవభావా లుండుట నిజమేనా?"

"నిజమే" నన్నాను.

"అలాగైతే నీవు విద్యార్థులతో కలసిమెలసివుంటే అసలు విశ్వవిద్యాలయానికే హాని సంభవించునేమో" నన్నారు.

"వ్యవసాయశాస్త్రమును గరపడానికే నాకు వేతన మిస్తారు గాని విప్లవరాజకీయాలు నేర్పడానికి కాదని నే నెరుగుదును" అన్నాను.

"అలా మాట ఇస్తావా?" అని అడిగారు. ఒప్పుకున్నాను. ఆమె నా మాట నమ్మి లెక్చరర్‌ఉద్యోగ మిచ్చారు. అయితే కొద్దికాలంలోనే రాజకీయంగా మాకు అభిప్రాయభేదం వచ్చింది. ఆకాలంలో బిసెంటుగారు మహాత్మాగాంధీగారిని అతితీవ్రంగా ఆక్షేపిస్తూ, హద్దూపద్దూలేకుండా తిడుతూ తన "న్యూయిండియా" దినపత్రికలో వ్రాయసాగింది. బిసెంటుగారు గాంధీగారి నీ విధంగా ఆక్షేపించటం, తిట్టటం చూచి, అడయారులో అనేకులకు ఆమెయం దయిష్టము, కోపము కలిగాయి. అట్టివారిలో నేను ముఖ్యుడిని. నే నెంతమాత్రం ఓర్చుకోలేకపోతిని. ఆమె కిచ్చిన మాట తప్పుతున్నాననేవిషయం తలచుకొని వెంటనే నా వుద్యోగానికి రాజీనామా ఇచ్చివేశాను. దేశభక్తి, అభిమానములు లేని వాతావరణాన్నుండి బయటపడినందుకు సంతోషించాను.

### వారి తోచలేదు

ఆ రెండుసంవత్సరాలకాలంలో, ప్రిన్సు ఆఫ్ వేల్సు, డ్యూక్ ఆఫ్ క్యనాట్ (జార్జి చక్రవర్తి కుమారుడు, పినతండ్రి)

మద్రాసుకు వచ్చినప్పుడు పోలీసులు నా వెంటబడ్డారు. ఇల్లువిడిచి పోకూడదని నోటీసు ఇచ్చారు. అందు కంగీకరించనన్నాను. అరెస్టుచేయటాని కిష్టంలేక ప్రభుత్వం సి. ఐ. డి. ని ప్రయోగించింది. దేశానికి సాయుధవిప్లవంవల్లనే విముక్తి కలుగుతుందన్నవిశ్వాస మున్నందున గాంధీగారిప్రచారం అనర్థకమని తోచింది నాకు. నా అభిప్రాయా లున్న వారికొఱకు ఆంధ్రదేశమంతటా గాలించి చూచాను. తుదకు శ్రీమతి పొణకా కనకమ్మగారిని, వారి యువక బృందమునుగూర్చి విన్నాను. యుద్ధకాలం (1914-1918)లో వీరు "పుదుచ్చేరి"నుంచి ఆయుధాలను సేకరించుచుండిరని వదంతివుండెను. శ్రీమతి కనకమ్మగారు నన్ను కలుసుకున్నారు. కలిసి పనిచేయుటకు ప్రయత్నించాము. కాని ఆమెశిష్యులు ఒక్కొక్కరే గాంధీశిష్యకోటిలో చేరిపోయారు. చివరకు ఆమెగారుసైతం అహింసాతత్వమును మనస్ఫూర్తిగా నమ్మి వారిలో చేరిపోయినారు. మా ఇరువురిమధ్య అభిప్రాయభేదమున్నను ఆమెగారి నిష్కపటస్వభావము, నిజాయితీలు గాంచి నా కత్యంత గౌరవము కలిగింది.

'ఆష్' హత్యకేసుకు సంబంధించిన నీలకంఠ బ్రహ్మచారి నన్నొకసారి కలుసుకున్నారు. ఆయుధాలను సరఫరాచేయగలనని నొక్కిచెప్పాడు కాని, సాయుధవిప్లవములో నమ్మకంగల దేశభక్తులుకూడా గాంధీజీ అహింసాపోరాటానికి అవకాశమిచ్చి చూడాలని నిశ్చయించుకున్నారు. అంచేత పెరరిజానికి, సాయుధవిప్లవానికి అవసరమైన వాతావరణం నశించిపోసాగింది. నా అభిప్రాయాలకనువైన వాతావరణం లేకపోవుటచే, గాంధీగారి ఉద్యమంవల్ల సంపూర్ణస్వరాజ్యం రాదనేదృఢాభిప్రాయం వున్నా

నే నేమీ చేయలేకపోయాను. క్రమంగా రాజకీయరంగానికే దూరమవుతూ వచ్చాను.

కాంగ్రెసులో చేరుటకు ప్రయత్నాలు, ఆటంకాలు

అహమ్మదాబాదు కాంగ్రెసు (1920-21)కు వెళ్లాను. లక్షలకొద్దీ ప్రజలు వచ్చారు. అంతమంది కాంగ్రెస్‌కు రావటం అదే మొదలన్నమాట. స్వరాజ్యసంపాదనకు గాంధీజీ గొప్ప మార్గాన్ని చూపుతారని నా నిరీక్షణ. "స్వరాజ్య" మంటే అర్థ మేమిటి? బ్రిటిషుసామ్రాజ్యంతో సంబంధంలేని పూర్ణస్వ రాజ్యమా? లేక బ్రిటిష్‌సామ్రాజ్యంలో అదివరకే వున్న అధిని వేశరాజ్యాల్లాగా అసంపూర్ణస్వరాజ్యమా? అనే విషయాన్ని నిర్ణ యించుటకు ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. నిష్కర్షగా నిర్వ చన చేయరాదనీ, అస్పష్టంగానే వుండాలనీ గాంధీజీ వాదన "నిష్కర్షగా తీర్మానించుట అవసరం, సంపూర్ణస్వరాజ్యమే కాంగ్రెసు గమ్యస్థానం" అని మౌలానా హజరత్ మోహినీగారు సవరణతెచ్చారు. తమ సవరణను చక్కగా సమర్థించుకొన్నారు. వీరి సవరణను బలపరచేవారిని వెతకాల్సివచ్చింది. కొంతసేపటికి శ్రీఆళ్వార్ అనే యువకుడు(బందరు)హజరత్ మోహినీగారిసవర ణను బలపరిచాడు. ఆ సవరణను గాంధీగారు వ్యతిరేకించి ఓడించి వేశారు. నాకు చాలా విచారం కలిగింది. 1857నుండి 1920సం॥ వరకు సంపూర్ణస్వరాజ్యసంపాదనకొరకు తమసర్వస్వాన్ని సమ ర్పించిన దేశభక్తులు, టెరరిస్టుసంఘాలు, గదర్‌పార్టీ ప్రజల ఎదుట పెట్టిన లక్ష్యాన్ని ఈనాడు గాంధీగారు ఎంత హీనస్థితికి తెచ్చారా అన్న దుఃఖం నా హృదయాన్ని పూర్తిగా క్రమ్ము కొన్నది.నేను మరల కాకినాడ కాంగ్రెస్‌మహాసభకు (1923-24)

వెళ్లాను. నా ప్రథమభార్య అన్నపూర్ణమ్మ వాలంటియర్‌గా పని చేసింది. విషయనిర్ణయసభలో స్వరాజ్యమనే మాటకు నిర్వచనం చేయుటనికి తర్కవితర్కాలు జరిగినవి. శ్రీ సేలం విజయ రాఘవాచారిగారు, శ్రీ యస్. శ్రీనివాసయ్యంగారు 'సంపూర్ణస్వ రాజ్యం' అని నిర్వచనం చేస్తూ తెచ్చిన తీర్మానమును శ్రీ మోతీ లాల్ నెహ్రూగారు తీవ్రంగా ఎదిరించారు. వారివాదన లోప భూయిష్టంగా కనపడింది. పై తీర్మానమును తెచ్చినవారిని శ్రీ మోతీలాల్ నెహ్రూగారు వ్యక్తిగతంగాకూడ ఆక్షేపించ సాగారు. "కాంగ్రెసు ఆదర్శాలకు, తీర్మానాలకూ వ్యతిరేకంగా కోర్టులలో న్యాయవాదవృత్తి నవలంబించి డబ్బు సంపాదించుతూ స్వాతంత్ర్యపోరాటరంగంలో దూకక తటస్థులుగా వుండి భోగ భాగ్యా లనుభవిస్తూ రాళ్లు రువ్వే వారి మాటలను పాటించాల్సిన అవసరం లేదు"అని హేళనచేశారు.

"చిన్నప్పటినుండి దేశసేవ చేస్తూ, దానితోపాటు డబ్బు గడించి దేశసేవ కర్పిస్తూవచ్చినందువనే ఈనాడు వృద్ధాప్యంలో కూడ సంపాదించి పొట్టపోసుకోవలసినగతి పట్టింది. అయితే శ్రీ మోతీలాల్‌నెహ్రూ విషయంలో అలా కాదు. వారు లక్షలు, కోట్లు గడించి విల్వచేసుకున్నారు. ప్రపంచ సౌఖ్యాలనుండి విర మించుకోవలసిన ముసలితనంలో దేశభక్తులైనా" రని శ్రీ ఆచా ర్లుగారు ఎత్తిపొడిచారు.

"మనం కోరేది సంపూర్ణస్వరాజ్యమా? అసంపూర్ణస్వరా జ్యమా? అనే విషయాన్ని తేల్చుకొని తీర్మానించుకోవాలిగాని, వ్యక్తిదూషణకు దిగటం చాలా అసభ్యమైనపని"యని శ్రీ అయ్యం గారు మందలించారు. మన గమ్యస్థాన మెప్పుడూ పరమోన్నతం

గానే వుండాలి కాని, ఆచరణలో మాత్రం సమయానుకూలంగా మార్చుకొంటూ వుండాలని శ్రీ శ్రీనివాసయ్యంగారు వాదించారు. వ్యక్తిదూషణలతో శ్రీ మోతీలాల్‌నెహ్రూగారు, శ్రీ విజయ రాఘవాచార్యులుగారు ఉద్రేకపూరితులై చివరకు చేతులు చేతు కలుపుకొనే స్థితికి వచ్చారు. ప్రెసిడెంటు మౌలానా మహమ్మదాలీ గారు వారిద్దరిని విడదీయాల్సి వచ్చింది. వారివైఖరిని, చిత్తవృత్తిని వీక్షిస్తున్న నాకు ఎంతవిచారం కలిగిందో వ్రాయలేను. మరొకసారి నిరాశా నిస్పృహాలు నా మనస్సు నావరించాయి.

మదరాసులో (1927–28) జరిగిన కాంగ్రెసుమహాసభకు కూడా హాజరైనాను. కాంగ్రెసు ఆదర్శాలు ఆశయాలతో సంతృప్తిచెందని కొందరు అతివాదులు ఇండియన్ రిపబ్లికన్ కాంగ్రెస్ అనే పేరుతో ఒకమహాసభను ప్రత్యేకంగా జరిపారు. "బ్రిటిషు సామ్రాజ్యంతో పూర్తిగా తెగతెంపులు చేసుకొని, రాజులు, మహారాజులు వుండని ప్రజాప్రభుత్వమే భారత రాజకీయపరమావధి యని తీర్మానిస్తూ ప్రబోధించారు. నా కీ ఆశయం ఎంతో ఆనందాన్ని కలుగజేసింది.

కాంగ్రెస్ ఆశయాలంటే అసంతృప్తి ఏర్పడినందున నా జీవితాన్ని కాంగ్రెసుకు అర్పించలేకపోయాను అయితే కాంగ్రెస్ తీర్మానాలనుమాత్రం తూ. చ. తప్పకుండ ఆచరణలో పెట్టుటకు ప్రయత్నిస్తూనే వుంటిని. ఖద్దరుబట్టలనుమాత్రమే ధరించేవాణ్ణి. కుటుంబంలో అందరము లభించినంతవరకు స్వదేశీవస్తువులనే ఉపయోగించేవాళ్ళం. కొన్ని అవసర వస్తువులు స్వదేశీవి లభించక పోతే బ్రిటిషుసామానులనుముట్టక వేరేదేశపుసామానులను కొనేవాణ్ణి. ఎంత నష్టం వచ్చినా కోర్టు కెక్కలేదు. ప్రతివాదిగా వెళ్లక

తప్పనపుడు "మధ్యవర్తితీర్పుకు ఒప్పుకొంటాము. బ్రిటిషువారి కోర్టులనుమాత్రం బహిష్కరించం" దని ఎదిరిపక్షంవారిని కోరే వాణ్ణి. 1920–21 లో ఇంపీరియల్ అగ్రికల్చరల్‌సర్వీసులో నెలకు రూ 1500 ల వరకు గడించుకోగల ఉన్నతోద్యోగం లభించే అవకాశం వచ్చింది. ఆ ఉద్యోగం ఇస్తాను, పరిగ్రహించవమని శ్రీ సర్. బి. యన్. శర్మగారు (వైస్రాయి కార్యనిర్వాహక కమిటీ సభ్యుడు) ఎంతో ప్రోత్సహించారుకాని, నేను సమ్మతించ లేదు. దినదినం ఆర్థికబాధలు అధికమవుతూనే వచ్చాయి జీవన్మరణ సమస్యగావుంది. అలాంటిసమయంలో (1921–22) నా శ్రేయోభిలాషి శ్రీ ముత్తా వెంకట సుబ్బారావుగారు మంత్రి శ్రీ కూర్మారెడ్డిగారి వద్దకు తీసుకువెళ్లారు. ప్రావిన్షియల్ అగ్రికల్చరల్ సర్వీసులో తక్షణమే వుద్యోగ మివ్వటానికి వారు సిద్ధపడిరి. ప్రభుత్వంక్రింద పనిచేయటానికేమో మనస్కరించుటలేదు. స్వతంత్రంగా సంపాదించుకొని జీవించటానికి దారీ తెన్నూ కనబడటం లేదు. నా హృదయంలో పోరాటమూ, చెలరేగిపోతున్నది. నా నిశ్చయాన్ని మరునాడు తెలుపుతానని మాత్రం చెప్పి వచ్చేశాను. చివరకు బ్రిటిషువారిమీది ద్వేషమే నెగ్గింది. ఉద్యోగంలో చేరుట మానివేశాను.

### ఉ ద్యో గ ము – రా జీ నా మా

1923–25 సం॥ వరకు ఎలాంటి ఉద్యోగమూ దొరకలేదు. ఒక వైపున కుటుంబనిర్వహణబాధ్యత మరొకవైపు ఆర్థికబాధలు, వీటిమధ్య నలిగిపోతున్నాను. అలాంటిసమయంలో విధిలేక ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ కంపెనీలో ఇన్స్పెక్టరుగా చేరాను. అది ప్రభుత్వానిదికాదు. గాని, బ్రిటిషువారిదే. అయితే,

నవీనపద్ధతులననుసరించి సమృద్ధిగా పండించే విదేశాలవలె, మన దేశంలో నయితం సమృద్ధిగా పండించుటకు రసాయనిక ఎరువులను ఉపయోగించి ఉత్పత్తికి తోడ్పడతాననే తృప్తిమాత్రం మిగిలిందన్నమాట. ఆర్థికబాధలను భరించలేని నేను ఏదోవిధంగా సరిపుచ్చుకొన్నానన్నమాటే. కాని, బాధమాత్రం నన్ను వదల్లేదు.

1930—31 నాటికి ఆ కంపెనీలో నెలకు రూ. 500 ల కన్న ఎక్కువగానే సంపాదించుచుంటిని. ఇంకా ఎక్కువగా అభివృద్ధి అయ్యే అవకాశాలున్నై. యూరోపియన్లకిచ్చే గ్రేడ్‌ప్రకారమే నాకూ జీతం, బత్తెం, పెన్షన్, శలవులు వగైరా ఇవ్వటానికి పైఅధికారులు కంపెనీకి శిఫారసు చేశారు. ఆర్థికంగా అదిరోహించేకాల మది. అట్లాంటప్పుడు నెల్లూరుజిల్లాలోని ఒక గ్రామానికి కెమికల్ ఎరువులను ఉపయోగించేపద్ధతిని నేర్పుటకు వెళ్ళటం తటస్థించింది. విదేశీవస్తుబహిష్కరణ ప్రచారం తీవ్రంగా సాగిపోతున్నది. వాలంటీర్లు నావద్దకు వచ్చి "బ్రిటిషువస్తువులను అమ్మించుట న్యాయమా?" అని నన్ను ప్రశ్నించారు. సిగ్గువేసింది. అదివరకే ఉన్న బాధ ఇనుమడించింది దీనికితోడు ఇన్స్పెక్టర్లకూ, పై ఉద్యోగులకూ మధ్య సంఘర్షణ జరుగుతూవచ్చినది. వారు, నేను అంతరం రాజీనామానిచ్చివేసినాము. అధికారులు కొంత లొంగి అనుకూలాలు చేశారు. 7 గురు ఇన్స్పెక్టర్లలో 5 గురు మరల ఉద్యోగాల్లో చేరిపోయారు. కాని, నేను, నా మిత్రుడు శ్రీ బి. రామకృష్ణగారు (బెంగుళూరు) మాత్రం యిక నా వుద్యోగాల్లో చేరలేదు.

### కాంగ్రెసు ఉద్యమం

ఆ కాలంలోనే విదేశవస్త్ర బహిష్కరణ సందర్భంలో

చల్లావారి షాపువద్ద పికెటింగు చేసినందుకు శ్రీ ఖాసా సుబ్బా రావుగారిపై పోలీసులు దారుణంగా లాఠీచార్జీ చేశారు. ఆయన బాపుబ్రతుకులమధ్య వున్నారని దినపత్రికలు ప్రచురించినవి. అప్పటికే స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన కుతూహల పడు తున్న నా రెండవభార్య సుభద్రమ్మ బ్రిటిషు ప్రభుత్వపు ఈ అమానుషత్వాన్ని చదివి, ఇంక ఓర్చుకోలేక వెంటనే తన ఉపాధ్యాయిని ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి, స్వాతంత్ర్య పోరా టంలో పాల్గొనుటకు నిశ్చయించుకొన్నది. మే మిద్దరం కలసి దేశసేవ చేయుటకు నిశ్చయించుకొనే వివాహం చేసుకున్నాము. మేము మొదట మద్రాసులో దేవాలయ ప్రవేశోద్యమంలో శ్రీ పాండురంగం మొదలగు మిత్రులతో కలసి పనిచేశాము. గాంధీ గారు యర్రవాడ జైలులో హరిజనులకొరకు సంయుక్త నియో జక వర్గాలకోసం నిరాహారదీక్షను పూనిన సమయంలో నేను, నా భార్య మద్రాసులో హరిజనులతో సహపంక్తిభోజనము లేర్పాటుచేసి గాంధీగారి ఉద్యమానికి తోడ్పడసాగాము. ఇంతలో హరిజన సేవక సంఘం స్థాపితమయింది. సుభద్రమ్మ హరిజన సేవకసంఘానికి సంయుక్త కార్యదర్శినిగా పనిచేయసాగింది. ఇప్పటికీ ఆమె ఆ ఉద్యమానికి శ్రద్ధతో పనిచేయుచున్నది. దిక్కు లేని హరిజన బాలికల కష్టాలను తొలగించలేక కంటనీరు పెట్టు కుంటూ ఉంటుంది.

1931-32 ప్రాంతంలో మద్రాసులో డాక్టర్ అచ్చమాంబ, శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి మున్నగువారు మా ఇంటి సమీపం లోనే వాలంటీర్ల శిబిరము నేర్పరచినపుడు ఆర్థికంగాను, యితర

విధాలా తోడ్పడ్డాను. నిషేధవాఙ్మయాన్ని డాక్టర్ అచ్చమాంబ గారు మా ఇంట్లో దాచేవారు.

1933-34 మాంటిసోరీ, మొదలగు నవీన విద్యావిధానాల్లో లేడీ వెల్లింగ్డన్‌కాలేజీలో లెక్చరర్‌గా నున్న మిస్ బ్యారీగారూ నా భార్య సుభద్రమ్మగారూ ప్రసిద్ధికెక్కారు. వీరిద్దరూ ఋషివాలీ స్కూలులోను, లేడీవిల్లింగ్డన్ ట్రెయినింగ్‌కాలేజీలోను మాంటిసోరీపద్ధతిని వృద్ధికి తెచ్చారు. మిస్ బ్యారీగారు ఉద్యోగాన్ని చాలించుకొని ఇంగ్లాండుకు వెళ్ళేముందు నా భార్యను ఆ డిపార్టుమెంటుకు సూపర్నెంటుగా పనిచేయమని బ్రతిమలాడిరి. లేడీవిల్లింగడన్‌కాలేజీ ప్రిన్సిపాలు మిస్ జిరార్డుగారుకూడా కోరారు. 'మా గాంధీజీని నిర్బంధించిన ప్రభుత్వనౌకరీ నేను చేయ'నన్నది సుభద్రమ్మ. ఆనరరీ డిగ్రీలు ఇప్పించుతామని ఎంతో ఆశపెట్టారు కాని. ఆమె సమ్మతించలేదు. చివరకు మిస్ బ్యారీ నావద్ద కొచ్చి నాభార్యను ఒప్పించమని బ్రతిమలాడింది. ప్రభుత్వవేతనం పుచ్చుకోకుండా ఉచితంగా సుభద్రమ్మగారు పనిచేయటానికి అవకాశమిస్తే నేను సమ్మతిస్తాను. ఆమెకూడ అంగీకరించుతుందని నా నమ్మకమని చెప్పాను. అందు కామె ప్రయత్నించారు. కాని, ప్రభుత్వంచే ఒప్పించలేకపోయినారు. ఇంతేకాదు, నేను విరివిగా డబ్బు సంపాదించుతూ కాంగ్రెసుసేవ చేసే మిత్రులకు వారి కుటుంబాలకు ద్రవ్యసహాయం చేసేవాణ్ణి. ప్రకాశంగారి 'స్వరాజ్య' పత్రిక ఆర్థికకష్టాలలో మునిగిపోయినపుడు ద్రవ్యరూపంగా సహాయపడ్డాను. శ్రీ ప్రకాశంపంతులుగారు ఎప్పుడు అడిగినా లేదనలేదు. ఈలాగున 1935 సం॥ వరకు కాంగ్రెసుకు ఏదో

విధంగా సేవ చేస్తూవచ్చాను. కాని, మనస్ఫూర్తిగా పనిచేయుటకు ఉత్సాహం కలుగలేదు.

ప్రజాఉద్యమంమాత్రం పెరిగిపోతూవచ్చింది. కాంగ్రెసు నాయకులు వేస్తూవచ్చిన అడ్డు పుడకలు ప్రజాఉద్యమ ప్రవాహంలో కొట్టుకుపోతూవచ్చాయి. ప్రజలతో కలసి రాజకీయంగా పనిచేయనందుకు విచారపడుతున్న నేను మళ్లీ 1935వ సం॥లో అత్యుత్సాహంతో రాజకీయ రంగంలో పనిచేయ ప్రారంభించాను. అయితే, ఆరోజులలో (1935 వరకు) కాంగ్రెసుకోసం నా కాలాన్ని పూర్తిగా వినియోగించి పనిచేయనందుకు నా మనోవైఖరి నెరుగని నా స్నేహితులు కొందరు అనేక విధాలుగా అనుకునేవారు. సంవత్సరాల కొలది జైళ్లలో అనేక విధాలుగా కష్టాలు పడినందున మెత్తబడ్డాననీ, వివాహం చేసుకొని కుటుంబ సౌకర్యాలకు అలవడి మరల జైలుకు వెళ్లుట కిష్టపడుటలేదనీ, దారిద్ర్యం ద్రవ్యసంపాదనకు పురికొల్పిందనీ అనుకునేవారు. నేను యేండ్ల తరబడి జైళ్లలో వున్న ఫలితంగా, నాకు రక్తవిరేచనాలు ఏర్పడినందున తిరిగి జైలు జీవితం గడపటానికి ఇష్టంలేదని మరికొందరనుకొనేవారు. నేను జైలునుండి రాగానే (1919) శ్రీహరిసర్వోత్తమరావుగారు బీదవానికి, ఆర్థికంగాపరాధీనులైన వారికి రాజకీయాలు చేసనే విషయం గుర్తించమని సలహానిస్తూ యిలా అన్నారు: "ఎన్నికలకోసమని నీ పేరు ప్రతిష్ఠలను ఉపయోగించి జయించటానికోసం అవకాశవాదులు ప్రయత్నిస్తారు. జాగ్రత! వారి వలలో పడబోకు. నీకా ఆస్తిపాస్తులులేవు. నీ జీవనాధారానికి కావలసినది సంపాదించుకొంటూ, నీ ఇష్టంవచ్చిన విధంగా, సంఘసేవమూలకంగా దేశసేవ చేసుకో. ఆర్థికంగా నీ

కాళ్ళమీద నీవు నిలబడక ఇతరులమీద ఆధారపడ్డావంటే నీ జీవితం, నీ శక్తులు, వృధా అయిపోతాయన్నవిషయం జ్ఞాపకముంచుకో. ఇది స్వానుభవం సుమా! అందేత నీకు సలహా నివ్వటానికి సాహసించాను" అని ఈ దేశభక్తుడు, సేవాదురంధరుడు, నిరాడంబరజీవి ఇచ్చిన సలహాను నేను మరచిపోలేదు. దాదాపు ముప్ఫదిసంవత్సరాలనుండి ఈ నాటివరకు వారి సలహా చాలా సమంజసంగానే కనిపిస్తున్నది.

కళావంతులవివాహాలు

నేను ప్రయత్నించిన సంఘసంస్కరణలలో మొట్టమొదటిది "కళావంతులస్త్రీలకు వివాహాలు చేయించటం. ఈ ప్రయత్నం తలవనితలంపుగా ఏర్పడ్డ ఒకసంఘటనగా గోచరించినా వీరి సంఘసంస్కరణవిషయంలో విద్యార్థిదశలోనే నాకు ఉన్నత భావాలు ఏర్పడుతూవచ్చాయి. నా విద్యార్థిదశలోనే శ్రీ వీరేశలింగంపంతులుగారి పుస్తకాలు, సంఘసంస్కరణదీక్ష నన్ను బాగా ఆకర్షించాయి. ఒంగోలు హైస్కూలులో నా సహాధ్యాయి అయిన శ్రీ నల్లమల్లి వరదరాజులుగారు బౌద్ధమతంలోని నైతికోన్నతినీ, సమాజానికి, సర్వమానవకళ్యాణానికీ సేవచేయడం విద్యుక్తధర్మమనీ నా హృదయంలో నాటారు. మద్రాసు పచ్చయప్పకాలేజీలో చదువుతున్నప్పుడు శ్రీ కె. వైకుంఠరామగారి సహవాసంచే బ్రహ్మసమాజంలోని అభ్యుదయభావములలోను, సంఘసంస్కరణలోను నా అభిరుచి పెంపొందసాగినది. కాని, విద్యార్థినైన నేను కార్యరూపంలో ఏమీ చేయలేకపోతిని. గదర్ పార్టీలో చేరిన తరువాతనే నా భావములను కార్యరూపమున పెట్టుటకు శక్తి సామర్థ్యాలు కలిగినవి.

నేను వైశ్యుణ్ణి. అందువల్ల కనిగిరిలో అనేకమంది వైశ్యులకూ వేశ్యలకూ గల సంబంధబాంధవ్యాలు నాకు తెలుసు. పాతవూరు అనే పేటలో (కనిగిరి) వేశ్యలు చాలామంది వుండేవారు. వారు సంగీతం, నాట్యం. నాటకపాత్రధారణలలో ప్రవేశమున్నవారు. కనిగిరి చుట్టుప్రక్కల 50 మైళ్ళ వరకు వున్న గ్రామాల్లో జరిగే వివాహాదిశుభకార్యములకు, దేవాలయాల్లో జరిగే ఉత్సవాలప్పుడు సంగీతం, భరతనాట్యాది వినోదగోష్టి జరపటానికి కనిగిరి కళావంతులను రప్పించేవారు. అయితే ఆ వృత్తివల్ల మాత్రమే వారిజీవనం గడవటం కష్టం. అంచేత వారు వంశపారంపర్యంగా శీలాన్ని అమ్ముకొని జీవించడం పరిపాటి అయింది. వివాహాలు వారికులంలో సాధ్యపడవు. వంశపారంపర్యంగా యీ నీచవృత్తిలో పుట్టి, పెరుగుతూ అధోగతిపాలవుతూ వచ్చారు. కనిగిరి కళావంతులపిల్లలు నన్ను అన్న, బావ, మామ, చిన్నాయన, అల్లుడు మొదలైన వరసలతో పిలిచేవారు. వారి కుటుంబాలకూ మా కుటుంబాలకూ పూర్వంనుంచీ లావాదేవీలుండేవి. కళావంతులసంస్కరణ యెంతో అవసరమని గుర్తించి విద్యార్థిదశలో ఏమీ చేయలేకపోతినే అని విచారపడేవాణ్ణి. వివాహాలకు, దేవుళ్ళ వుత్సవాలకు వచ్చి వేశ్యలు పాడటం, నాట్యం చేయటం ఎంతమాత్రం కూడదని వాదించేవాణ్ణి. విద్యార్థులు వాళ్ళనుగూర్చి నీచంగామాట్లాడినా, ప్రవర్తించినా వారి ధోరణిని ఖండించి "పాపం! వేశ్యలు నేటి సామాజికవ్యవస్థలోనున్న అవినీతి అక్రమాలకు బలియైనవారు కాబట్టి, వాళ్ళను నీచంగాచూడక జాలిచూపెట్టం" డని వాదించేవాడిని.

శ్రీమతి యామినీపూర్ణతిలకమ్మగారు

నేను కళావంతుల సంస్కరణోద్యమాన్ని తలవనితలంపుగా ప్రారంభించుట తటస్థించినదని లోగడ వ్రాశాను. నేను అడయారు జాతీయవిశ్వవిద్యాలయంలో వ్యవసాయశాస్త్రబోధకుడుగా ఉన్నప్పుడు శ్రీమతి తిలకమ్మగారిని పరిచయంచేస్తూ ఒకమిత్రుడు జాబు వ్రాశాడు. ఆమె ప్రసిద్ధికెక్కిన వ్యక్తి. గొప్ప ఉపన్యాసకురాలు. ఆంధ్రసాహిత్యంలో ఆరితేరిన మహిళామణి. శ్రీమతి తిలకమ్మగారు కళావంతుల కులంలో పుట్టి పెరిగి, ఆ కాలపు కట్టుబాట్లనే సంకెళ్ళను త్రెంచుకొని బయట పడ్డారు. వేలసంవత్సరాలుగా ఆ కులంలో కరుడుగట్టిన అవినీతిని కూకటివేళ్ళతో పెరికిపారవేయుటకు దీక్షవహించారు.

శ్రీమతి తిలకమ్మగారి పెద్దకొమార్తెకు క్షయవ్యాధి సంభవించింది. చికిత్స చేయించేందుకు కూతురిని మద్రాసుకు తీసుకు వచ్చారు. నా ఇంట్లో బస, భోజనాదులను ఏర్పరచి సహాయం చేయమని నా మిత్రుడు శ్రీ పి. హెచ్. గుప్తాగారు లేఖ వ్రాశారు. శ్రీమతి తిలకమ్మగారు వ్యాధిగ్రస్థురాలైన రామతిలకంతో నా ఇంట్లో వుండేవారు. ఆమెతో ఏవిషయం చర్చించినా చివరకు కళావంతులస్త్రీలకు వివాహాలు చేయించాలనే అభిప్రాయాన్ని ఆవేశంతో చెప్పేవారు. సరే అన్నంతమాత్రాన ఆమెగారికి తృప్తికలుగదు. 'వివాహాలుచేయించుదా'మని అనగానే నేనొక పిచ్చివాడనని సంశయించేది. అలా చేయటంఎంతకష్టమో, అసాధ్యమో ఆమెకు తెలుసు. అనుభవం లేకపోయినా గాంధీజీ ప్రజాఉద్యమంవల్ల యిలాంటి సంఘసంస్కరణలను నెరవేర్చగలమనే నమ్మకం ఏర్పడింది నాకు. నే నీ విధంగా చెప్పినప్పుడు



1922 సం॥న శ్రీ యామిని పూర్ణ తిలకమ్మగారు హిందూయువతి శరణాలయమును స్థాపించిన సందర్భమున ఆమె శరణాలయ బాలికలతో తీసుకొనినచిత్రము. ఆమె మధ్యలో కూర్చొని యున్నా

ఆమె తాను చేసిన ప్రయత్నాలు, పడినకష్టాలు చెప్పి దుఃఖించేది. కాలం మారిపోయిందనీ, ఆమె ఉద్దేశాలు నెరవేరేకాలం వచ్చిందనీ, గాంధీగారి ప్రజోద్యమవెల్లువలో సంఘంలోని రొచ్చు అంతా కొట్టుకు పోతుందనీ ఆమెకు నచ్చజెప్పవలసివచ్చినది.

కేవలం ఆవేశంవల్ల ఏమీ చేయజాలం. కార్యరంగంలో ప్రవేశించాలి, కాబట్టి ఈ సంస్కరణోద్యమాన్ని యెలా ప్రారంభించాలో ఆలోచించాలన్నాను. ఒక పత్రికను నడపాలని ఆమెగారన్నారు. అంతమాత్రం చాలదు; మహాసభ నొకదానిని ఏర్పాటు చేసి, కళావంతులు వివాహాలను పూనుకొనేలా చేయుట అవసరమని సలహా యిచ్చాను. అయితే ఆర్థికసహాయం లేనిదే ఆ కార్యకలాపం సులభసాధ్యం కాదనే సంశయం కలిగింది. ఆ బాధ్యతను నేను వహిస్తాననే నమ్మకం ఆమెకు కలిగించాను. చివరకు తిలకమ్మగారు తన యావచ్ఛక్తినీ, జీవితాన్నీ, ఈ ఉద్యమానికి అర్పించి పాటుపడ దీక్షవహించారు.

ఈ సంఘసంస్కరణోద్యమానికి సంబంధించిన మహాసభలు, పత్రిక, యువతీశరణాలయం, వివాహాలు, ఉపన్యాసాలు, ప్రయాణాలు మొదలైనవి ఆమె, తన పెద్దకూతురు రామతిలకంగార్లు నిర్వహించవల్సిందిగాను, అవసరమైన ఆర్థిక బాధ్యతలు నావనీ, కార్యభారమును విభజించుకొన్నాము. ప్రజలకు శ్రేయస్కరమనితోచిన కార్యాలకు ద్రవ్యసహాయమేగాక, అన్నిసహాయాలు చేస్తారనేనమ్మకం నాకు గదరు ఉద్యమములో ఏర్పడింది. అనేక ఉద్యమాల్లో సరియైన కార్యకర్తలు లేనందున ఉద్యమాలు నశించిపోతాయేగాని, ద్రవ్యంలేక అవి నశించవు.

గదరుపార్టీకార్యరంగంలో కార్యకలాపాన్ని ఎవరిసలహా, సహాయం లేకనే స్వప్రయత్నం, స్వశక్తి, ధైర్యసాహసాలపై ఆధారపడి సాగించవలసియుండెను. ఆ అనుభవంతోనే ప్రజలు సంఘసంస్కరణలకు సిద్ధంగా వున్నారనీ, అభ్యుదయోద్యమాలు ప్రజావుద్యమాలను స్థాపించితే జయప్రదంగా సాగిపోతాయనీ గ్రహించగలిగాను.

సంఘస్థాపన - ఉద్యమ వ్యాప్తి

ఇక కార్యారంభానికి నిశ్చయించుకొన్నాను. శ్రీమతి తిలకమ్మగారిచే గాంధీతత్వం, ఖద్దరుఉద్యమం, ఆంధ్రసాహిత్యం మున్నగు విషయాలనుగురించి మొట్టమొదట జాతీయవిశ్వవిద్యాలయంలో ఉపన్యాసాలిప్పించాను. యూనివర్సిటీలోను, అడయారు థియసాఫికల్ సొసైటీలోను శ్రీ తిలకమ్మగారియందు గౌరవాభిమానాలు కలిగినవి థియసాఫిస్టులు సంఘసంస్కరణాభిమానులు, కార్యశూరులు. వారి సహాయంతో ఎంతో ముందుకు పోగలమని నమ్మి, అడయారులో వారందరి సానుభూతితో కళావంతుల సంస్కరణసంఘాన్ని స్థాపించాము. ఈ సంఘస్థాపనకు ముందు ఆ కులానికి పేరు నిర్ణయించటం చాల కష్టమైంది. చివరకు కీ॥ శే॥ శ్రీ యం. వెంకట్రావుగారి సలహాప్రకారం "కళావంతు"లని నిర్ణయించుకొన్నాం. శ్రీ వెంకట్రావుగారు గొప్ప తత్వవేత్త, సంస్కృతాంధ్రభాషలలోనేగాక కర్ణాటక, ఇంగ్లీషుభాషలలో గొప్పపండితుడు. వీరిని ఈ సంఘానికి అధ్యక్షులుగాను, నేను కోశాధ్యక్షుడుగాను నియమించుకొన్నాము,

శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు సహాయం చేస్తామన్నారు. పై విషయాన్ని ఆంధ్రపత్రికలో ప్రచురించాము.

అభ్యుదయవాదులు కొందరు, కళావంతులకులంలోని ప్రముఖులు కొందరు తమతమ భావాలను ఆంధ్రపత్రికలో ప్రకటించసాగారు. నరసాపురంనుండి శ్రీ కాస్కర్ల ఈశ్వరుడుగారు, సికిందరాబాదు నుండి శ్రీ యస్. శ్యామారావుగారు, గుంటూరునుంచి శ్రీ మద్దెల ... ? మొదలగువారు సంఘానికి తోడ్పడుతామనికూడా వ్రాశారు. కళావంతుల కులస్థుడైన నా మిత్రుడు శ్రీ పి. జె. వెంకయ్యగారు (అగ్రికల్చరల్ ఇంజనీరు) కొంత ద్రవ్యసహాయం చేశారు. వీరి ద్రవ్యసహాయంతో ఈ ఉద్యమాన్ని ప్రారంభించగలిగాము. శ్రీమతి తిలకమ్మగారిని ఆంధ్రలో ప్రచారానికి పంపితిమి. నర్సా పురంలో ఒక కళావంతులయువతి తన పడుపువృత్తిని మానివేస్తున్నానని బహిరంగసభలో ఆమె తన చెల్లెలితోవచ్చి ప్రతిజ్ఞ పట్టి మేము స్థాపించిన "హిందూ యువతీశరణాలయంలో చేరిరి. వారిపోషణకు శ్రీ యర్రమిల్లి నారాయణమూర్తి పంతులు గారు ద్రవ్యసహాయం చేశారు. కొందరుతల్లులు తమ చిన్న పిల్లలను నూతనసంఘ వాతావరణంలో పెంచుదని మాకు ఒప్పచెప్పారు. శ్రీమతి తిలకమ్మగారు ప్రబోధించిన ప్రదేశాలలో అనేక మందిలో హృదయపరివర్తన కలిగింది. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు ఆంధ్రపత్రికలో ఎడతెగనిప్రచారం చేసి ఈ ఉద్యమాన్ని అభివృద్ధికి తెచ్చారు. మొదటిమహాసభలో ఈ ఉద్యమానికి సంబంధించిన పత్రికను పెట్టాలని తీర్మానించి, సంపాదకురాలుగా శ్రీమతి తిలకమ్మగారిని నియమించాము. ఆమె ఉపన్యాసా లివ్వటంలో ఆరితేరిన స్త్రీ. సంపాదకురాలుగా పత్రికను నిర్వహించడం ఆమె ఆశయాల్లో ఒకటి. అనాథశరణాలయాన్ని స్థాపించి, పిల్లలకు సుశిక్షణ నిచ్చి మంచివాతావరణంలో పెంచా

లన్న అభిలాష, యింకేమేమో చేయాలన్న ఆమె కోరికలు నానాటికి ఎక్కువవుతూవచ్చాయి. అయితే ఆర్థిక సహాయం కావాలి. కావలసిన ద్రవ్యాన్ని సంపాదించటాన్నిగూర్చిన భయం బాధించుతూ వచ్చింది. కాని, క్రమంగా అవసరమైన ద్రవ్యసహాయం లభించుతూ కార్యక్రమం సాగుతూనేవచ్చింది. ఆమె ఉన్నత భావాలు, కోరికలు నెరవేరుతూవచ్చాయి కళావంతులలో వివాహాలు పరిపాటి అయినాయి. 2-3 సం॥లలో ఈ ఉద్యమ నిర్వహణకు పోటీలు, కక్షలు ఏర్పడ్డాయి. సికిందరాబాదు, నర్సాపురం, గుంటూరు పట్టణాల్లో స్వతంత్ర సంస్థలు ఏర్పరచి, పోటీపడి వివాహాలు చేయించారు. ఆ కులనాయకులే స్వయంగా సంస్థలను నిర్వహించుకొనగలశక్తి ఏర్పడి, నా సహాయం అవసరంలేదని తోచగానే నేను విరమించుకున్నాను. అవసరం లేని సంస్థలో అంటిపెట్టుకొని ఉండడమనేది నా స్వభావమేకాదు.

ఇప్పుడు అలాంటి వివాహాలు పరిపాటే. కాని, ఆ వృత్తి నశించిందా? లేదు. సంఘంలో జరిగే సంస్కరణ సముద్రంలో ఒక బిందువు మాదిరిగా కనుపడుతుంది. అందుకు ఎన్నో కారణాలున్నాయని ఇప్పుడు గ్రహించాను. ముఖ్యకారణం ఆర్థికం. రెండవది: ఆ సంఘంయొక్క ప్రత్యేకలక్షణాలు. *

* ఈ ప్రత్యేక లక్షణాలనుగురించి నాకు తెలిసినది : కళావంతుల స్త్రీలు సంగీత సాహిత్యాలను, లలిత కళలను నేర్చుకుని ఇతర కులాల స్త్రీలకంటె నాజూకుగా ఉంటారు. వారి కులంలో పురుషులకు సాధారణంగా విద్యావివేకాలు గాని. నాజూకు గాని ఉండవు. వారి కులంలో తగిన భర్తలు లభించడమే దుస్తరం. అంతేకాదు. కళావంతుల దృక్పథంలో జాతిభేదాలు లేవు. ఏకులంలోవారైనా సంస్కృతి కలిగి, విశాలభావాలున్నవారిని

ముఖ్యమైన ఆర్థికకారణాన్ని గురించి ఒక ఉదాహరణ యిస్తాను. కీ॥ శే॥ బెజవాడ రామతిలకం సుప్రసిద్ధ సినిమాతార. ఆమెకు తల్లి, తండ్రి, ఒక "అక్క" వుండిరి. ఈ సంస్కరణోద్యమారంభంలో రామతిలకానికి యుక్తవయస్సు వచ్చింది. పడుపువృత్తికి దింపాలని తల్లిదండ్రులు ప్రయత్నాలు చేస్తున్నారు. రామతిలకం అందుకు సమ్మతించడంలేదు. శ్రీమంతులు మొదటి రాత్రికి యిస్తామన్న మొత్తాలు బాగా ఆకర్షించాయి తల్లిని. నాకీ విషయాలు బెజవాడలో మిత్రులద్వారా తెలిసి రామతిలకంతల్లిని కలుసుకొని కూతురుకి వివాహంచేయమని ఎంతో చెప్పిచూచాను. తల్లి "మా కులంలో కూతురే కొడుకులాగ సంపాదించి తల్లిదండ్రులను పోషించాలి. తల్లిదండ్రులము ముసలివాళ్ళమైనాము. ఇక రామతిలకమే మమ్ములను పోషించాలి. లేదా, ఆమెనుపెళ్ళి చేసుకున్నవారైనా మాకు నెలకు రు 30-0-0 లు మనోవర్తి యివ్వా" లని చెప్పింది. వరకట్నాలకు అలవాటుపడిన మనసంఘంలో అత్తమామలను అల్లుడు పోషించాలని అడగడం న్యాయంకాదని చెప్పాను. ఇంతకూ పర్యవసానమేమనగా, నెల కింత యని తన కూతురుని ఉంపుడుకత్తెగా వుంచుకోవచ్చు. అదే పెండ్లిగా భావించుకోవచ్చునని ఆమె వాదన. తన "అక్క" సంపాదించి పెడుతోంది కాబట్టి తనకు వివాహం చేయమని రామతిలకం ఎంతో బ్రతిమలాడినది. ఆ పిల్ల తనకూతురు కాదనీ, చిన్నప్పుడే కొని పెంచి, ఆవిడమూలంగా జీవించుతున్నామనీ, మరెంతో

---

వివాహం చేసుకొనుటకు ఆక్షేపణ వుండదు. కాని, ఇతర కులాలలో విశాలభావాలుగలవా రున్నా, సాంఘిక దూషణలకు వెరవని గుండెధైర్యం గలవారు అరుదు.

కాలం పోషించజాలదనీ, రామతిలకాన్ని వేశ్యావృత్తిలో దింపక తప్పదనీ చెప్పింది. అలాగే దించింది.

రామతిలకం మంచి పాటకత్తె. సినిమాలో నటించింది. చాలా డబ్బుగడించింది. ఆమెకు పడుపువృత్తితోపనిలేదు కాని, ఆమె చిన్నప్పటి కోరికప్రకారం వివాహసౌఖ్యం కుదరలేదు.

ఈ ఆర్థికవిషయం ఎంతప్రబలమైనదో వితంతూద్వాహాల సందర్భంలో వివరంగా వ్రాస్తాను. ఇలాంటి సంస్కరణవివాహాలు చేయించుతున్నకాలంలో నాకు తెలియనట్టిన్నీ, ఇప్పుడు నేను తెలుసుకొన్నవిషయం ఏమనగా, భూస్వామ్య యుగంలో అన్ని దేశాల్లోను వంశపారంపర్యంగా భోగంవృత్తి గలజాతులు, కులాలు ఏదోఒకరూపంలో వుంటూవచ్చాయి. ఈ రూపాలను పోగొట్టుటకు ఫ్యూడల్ మతాలు ఎంతో ప్రయత్నించాయి గాని, పోగొట్టజాలవు. ముఖ్యంగా ఇండియా, చైనా, జపాను లాంటి దేశాల్లో ఫ్యూడల్ నాగరికత వేలసంవత్సరాలుగా ఉన్నందున ఈ నీచవృత్తి ఒక కులంగా స్థిరపడిపోయింది. యంత్ర పారిశ్రామిక నాగరికత ఏర్పడిన తరువాతనే వేశ్యావృత్తిలో వంశ పరంపర్యంగావుండే పద్ధతి తొలగిపోతుంది. అయితే, ఈ నూతన సంఘంలో పడుపువృత్తి ఎన్నోరెట్లు పెరిగిపోవచ్చు. దీనిలో నిరుద్యోగమనేపెనుభూతం ఎంతోమంది స్త్రీలను పడుపువృత్తికి ఆహుతి చేస్తుంది. సోషలిజము ఏర్పడిన సంఘంలోమాత్రమే స్త్రీ తనదేహాన్ని, మానాన్ని అమ్ముకొని జీవించాల్సిన దౌర్భాగ్యం వుండదని, సోవియట్ రష్యాలో ఉండే పరిస్థితులనుగురించి వెబ్ దంపతులు, డీన్ ఆఫ్ కాంటర్‌బరీ మొదలైన పెద్దల గ్రంథాల వల్ల తెలుస్తోంది.

మేము ప్రారంభించిన ఈ ఉద్యమాన్నిగురించి ఎన్నో వివరాలు, ఎందరో సహాయం చేసినవారిపేర్లు ఇప్పుడు మరచి పోయాను. కాని, కొందరు నన్ను మరచిపోలేదు. ఇప్పుడు విప్లవవీరుడని ప్రసిద్ధిగాంచిన శ్రీ. సి. వి కె. రావుగారు (కాకినాడ) మంతెనవారిపాలెంలో వేసవి రాజకీయ పాఠశాలలో ఉపన్యాసకుడుగ, ఆచార్యుడుగఉండిరి. నేనూ ఒకటిరెండు ఉప న్యాసా లివ్వడానికి వెళ్లాను. ఈయన నన్ను పలుకరించలేదు. "ఆయన తెల్లదొర!" నేనూ పలుకరించలేదు. "నేను అమెరికన్ దొరను." దొరలకు మూడోవాడు పరిచయం చేయాలి. అయితే 1940-42లో మే మిద్దరం వెల్లూరు సెంట్రల్ జైలులో ఒకే గదియం దున్నాము. ఒకానొక సమయంలో పైవిషయాన్ని జ్ఞాప కానికి తేగా "చంచయ్యగారు! మిమ్మల్ని గురించి నాకు చిన్నప్పటి నుండి తెలుసు"నన్నారు. "ఎలా తెలుసు" నన్నాను. చిన్నప్పుడు గోచీ పెట్టుకొని కాకినాడ వీధుల్లో తిరిగే వయసులో వూరేగిం పులో "కళావంతుల సంఘానికి జై! తిలకమ్మగారికి జై! చంచయ్యగారికి జై! అని కేకలేస్తూ తిరిగామండి"అన్నారు.

## వైశ్యులలో సంస్కరణ

నేను పుట్టినది కోమటికులం. కొంతకాలానికి నా కులం వైశ్యకులమనీ, నేను ఆర్యవైశ్యుడననీ తెలిసికొంటిని. ముఖ్యంగా నా రాజకీయచర్యలు గదరుపార్టీలోను, సంఘసంస్కరణకార్యాలు వైశ్యకులంలోను జరిగాయి. గదరుపార్టీలో నా కేర్పడిన స్వశక్తి, స్వప్రయత్నం సంఘసంస్కరణరంగంలో ఉపయోగించాయి. అలాగే మరికొన్ని గుణాలుకూడ నా జీవితంలో ప్రతిరంగమందు కొంచంగానైనా నన్ను అనుసరిస్తూనేవున్నై.

వైశ్యులందు పురాతనసాంప్రదాయాలు, మూఢాచారాలు, అభివృద్ధినిరోధకశక్తులు అధికంగా ఉన్నాయి. ఈ కులంలో అభి వృద్ధిశక్తులను ప్రవేశపెట్టి, తద్వారా భారతభూమిపై జరుగుచుండే విప్లవకరమైన మార్పులను ఇష్టంతో తమ సంఘములో ప్రవేశ పెట్టుకొనేలా ప్రయత్నించడమే నా ఆశయం. ఈ సంఘానికి ఆంధ్రలో ఒక ముఖ్యస్థానమున్నది. ద్రవ్యము, వ్యాపారాలు వీరి చేతుల్లో ఉన్నై. బ్యాంకింగు, విదేశవ్యాపారం, పరిశ్రమలను అభివృద్ధిచెయ్యడం, చారిత్రకంగా వీరి విధి. వాస్తవంగా జాతీయ వాదాన్ని, స్వాతంత్ర్యోద్యమాన్ని పెంపొందించడంవల్ల దేశ సౌభాగ్యంలో ఎక్కువలాభం పొందేవారు వీరే. ఎంత మతో న్మాదం, మూఢాచారులు అభివృద్ధినిరోధకంగాఉండినా, భావిలో పరిస్థితులనుబట్టి అభివృద్ధికరమగు మార్పులను సంతోషంగా ఆహ్వానించవలసివుంటారు. అవీ, యిలాంటి మరెన్నో ఆలోచనలు నా బుర్రలో ఉండేవి.

అయితే, మన దేశంలో ఏర్పడిన ఒక దౌర్భాగ్యస్థితిని మరువకూడదు. కులతత్వం చివరకు "ఎవరికి వారే" అనేలా చీల్చి వేసింది. కలసి భోంచెయ్యకూడదనే ఆచారంతో చాలా అమానుషవర్తన ఏర్పడినందున ఏకులానికి ఆ కులమే, ఏ కుల సమస్యలు ఆ కులానివే అనుకునేలా మారిపోయాయి. నా ప్రయ త్నాలు గాంధీయుగంతో ప్రారంభం (1920) అయినాయి. వైశ్యులు ద్విజులే అయినా, సంఘంలో గౌరవం చాలా తక్కువే. "కోమటై పుట్టితే నేమీ మా గాంధి........" అని బహిరంగసభ లోను, ఊరేగింపులోను, వైశ్యులుకూడా కలిసి పాడేవారు.

1920 వరకు ఈ కులం చరిత్ర క్లుప్తంగా వ్రాస్తాను. నేను ఎలాంటిపరిస్థితుల్లో రంగంలోకి వచ్చింది, ఎలాంటి సమస్యలు పరిష్కారం కావలసివున్నదీ, నా జయాపజయాలనుగురించీ వ్రాస్తాను.

ఇండియాలో అన్నికులాల్లాగే వైశ్యకులంకూడ వైదిక బ్రాహ్మణుల ఆధిపత్యంక్రింద అణగిమణగివుంది. ఇది ఫ్యూడల్ నాగరికతాలక్షణం. ఈ లక్షణం మనదేశంలో కొన్ని వేల సంవత్సరాలుగా ఉన్నందున ఈ సాంఘిక మన లోపాలూ, బాధలూ కరుడుగట్టిపోయాయి. ప్రజ లీ సంకెళ్ళను త్రెంచుకొని బయట పడలేకపోతూవచ్చారు.

మనదేశంలో బ్రిటిషుప్రభుత్వం స్థిరపడి, యంత్రపరిశ్రమలు, శాస్త్రవిజ్ఞానము, హేతువాదము ఆరంభమై రాజా రామమోహనరాయిగారికృషి ఫలించి జాతీయంగా ఇతరదేశాలవలె ఇండియాకు గౌరవస్థానం కావాలనే కోరికలు, ప్రయత్నాలు ప్రారంభమైనాయి. వైశ్యసంఘం యీ భావాలను నేరుగా వినియోగించుటకు బదులుగా, మరొక విపరీతమార్గం తొక్కింది. ద్విజులమని, బ్రాహ్మణులతో సమానహక్కులు, సాంప్రదాయాలు, గౌరవమర్యాదలు ఉండాలని, తమ 'తక్కువతనం' నుండి బ్రాహ్మణులతో సమానంకావాలని, వైదికులు, పూజార్లు, శంకరపీఠాలతో హోరాహోరిగా పోట్లాడి స్వపరిపాలన (అటానమీ) నెలకొల్పుకున్నారు. స్వసంఘ పౌరోహితులను ఏర్పరచుకొన్నారు. వైదిక బ్రాహ్మణులతో పోటీపడి కట్టు, జుట్టు, బొట్టు విషయాల్లోనేగాక అన్య సాంప్రదాయాల్లోకూడ వైదికులకంటె ఎక్కువ అభివృద్ధి నిరోధకులయ్యారు. క్రొత్తదాసరి ప్రొద్దెరుగ దన్న సామెత

ప్రకారం జరిగింది. వితంతువులకు బోడి చేయించారు. మడి, ఆచారాలు, చూడరానితనం, అంటరానితనం అమానుషంగా పెరిగిపోతూ వచ్చాయి. విభూతి, నామం, తిరుచూర్ణం, గంధంచెక్కలు, జంధ్యాల వ్యాపారం అభివృద్ధిచెందినవి. వ్యక్తిఅభివృద్ధి, సంఘాభివృద్ధి, దేశాభివృద్ధి, మానవాభివృద్ధికి సంబంధించిన మూల సిద్ధాంతాలు తెలియనందున, గుడిద్వేషాలమూలంగా గోతిలో పడ్డారు. బ్రహ్మసమాజం నచ్చకపోయినా, కనీసము రామకృష్ణ పరమహంస, వివేకానందుల వేదాంతం, దయానందుని ఆర్య సమాజంవైపైనా తలెత్తి చూడలేదు మా పెద్దలు. అయితేనేం, దేశంలో అభివృద్ధిశక్తులు సంఘాన్ని ముందుకు నెట్టుతూవచ్చాయి. ఇష్టమున్నా లేకపోయినా ఆ ప్రవాహంలో ముందుకుపోవలసి వచ్చింది వైశ్యసంఘం.

1900 వరకు కులనాయకులకు వేదాలు, శాస్త్రాలేగాక ఆంగ్లవిద్యాధికులకుకూడా కళ్లు తలకు వెనుకవేపున ఉండేవి. నడకేమో ముందుకే: "వేదకాలము" "రామరాజ్యమూ" కావాలి; తెల్లవాళ్ళ దాస్యమూ చెయ్యాలనే పరస్పరవైరుధ్యాలు 1900 వరకూ కులనాయకుల్లో ఉంటూవచ్చాయి. తరువాత, ముందునడకకు ముందుచూపు తోడైంది. సంస్కృతం, వేదశాస్త్రాలకంటె ఇంగ్లీషుమాత్రమే వైశ్యసంఘాన్ని అభివృద్ధికితేగల దనే నిశ్చయానికి వచ్చారు. అంతకంటె శరణ్యం లేదని కీ॥ శే॥ శ్రీ సుంకు నారాయణస్వామిశెట్టిగారు ఆచరణలో పెట్టుటకు ప్రయత్నించారు.

వీరు అప్పటి కనుగుణ్యంగా ప్రబోధించుటకు "వైశ్య" పత్రికను స్థాపించి, ఇంగ్లీషువిద్యాధికులను సంఘటితపరుస్తూ సంఘాన్ని ముందుకు నెట్టుకుపోయారు. వైశ్యవిద్యార్థి గృహాలు,

విద్యార్థివేతనాలమూలంగా వకీళ్లు, డాక్టర్లు, టీచర్లు, ప్రభుత్వోద్యోగులు, ఇతర విద్యాధికుల సంఖ్యను పెంపొందించారు. వైదికుల, పూజారుల, శంకరపీఠాలవైపు చూడనైనా చూడలేదు. కాని, కొందరు "అదిగో తోదేలు" "ఇదిగో తోదేలు" అంటూ మహాసభల్లో తీర్మానాలద్వారా చచ్చినపామును కొడుతూనే వుండిరి. 1920 వరకు యీ రెండు పోకడలు వైశ్యసంఘంలో వుంటూవచ్చాయి.

1920 లో క్రొత్తపోకడలు ప్రారంభమైనాయి. గాంధీ యుగం ప్రారంభమై ప్రజలందరిని సంఘటితపరచి అతివేగంగా సంఘాన్ని పరుగెత్తించసాగారు. యువకులఉద్రేకాలు వృద్ధుల భయాలు ఢీకొనేవి. కులాలపెద్దలు గిద్దలవుచుండిరి.

వైశ్యసంఘంలో నూతనపోకడ - అంటే మూడవపోకడ ఏర్పడింది. గవర్నమెంటు ఉద్యోగాలు మానెయ్యాలని, స్వాతంత్ర్యపోరాటంలో వైశ్యకు వెళ్లాలనే తీవ్రభావం వైశ్యసంఘంలో కూడా ఆరంభమైంది.

విశాఖపట్టణంలో 1920-21లో ఆర్యవైశ్య మహాసభ జరిగింది. నేనూ వెళ్లాను. అధ్యక్షులు: బారిష్టరు ఆదినారాయణ శెట్టిగారు (సేలం) సెక్రటరీ: * శ్రీ సుంకు సుబ్రహ్మణ్యం శెట్టిగారు బి. ఎ., శ్రీ సొలసా బాపనయ్యగారు బి. ఏ. బి. యల్ గార్లతో కలిసి ప్రయాణంచేశాను. రాజమండ్రిస్టేషనులో లింగధారి వైశ్యకులనాయకులు మమ్మల్ని కలుసుకున్నారు. తమకు

*వీరు మద్రాసులో వైశ్యహాస్టలుకు వార్డెనుగాఉండిరి.

20) వైశ్యులలో ఆంగ్లేయ విద్యను వ్యాపింపచెయ్యాలని చాలా ప్రయాసపడినారు. నాలాంటి బీద విద్యార్థులను ఎంతో అభివృద్ధికితెచ్చిరి.

మిగతావైశ్యులతో తిరిగి (షుమారు 300 సం॥ తరువాత) సహా పంక్తిభోజనాలు అవసరమని కోరారు. లింగధారులకు సాంప్రదాయంప్రకారం సహపంక్తిభోజనం పెట్టకూడదనే పార్టీనాయకులు సామర్లకోట స్టేషనులో కలుసుకొని మార్పు చేయకూడదని గట్టిగా వాదించారు. సహపంక్తిభోజనానికి కార్యాచరణలో ఎలాంటి అభ్యంతరంలేని పై ముగ్గురు నాయకులు గోడమీది పిల్లివాటంగా "సహపంక్తిభోజనాలకు సమ్మతిస్తూ తీర్మానం ప్యాసుచేయిస్తాం. కాని, కాన్ఫరెన్సులో ఆచరణలో పెట్టడం సాధ్యంకా"దని చెప్పారు. ఆచరణలోపెట్టడం సాధ్యమేనని, కనీసం మేము నలుగురమూమాత్రం లింగధారివైశ్యుల ప్రత్యేక భోజనశాలలలో భోంచేద్దామనీ నే నెంత చెప్పినా వినుపించుకోలేదు. చివరకు నన్ను అతివాది అనీ, కాన్ఫరెన్సు నాశనం అవుననీ భయపెట్టసాగారు. నే కోరినప్రకారం కాన్ఫరెన్సులో ప్రయత్నించటానికి నాలో నేను నిశ్చయించుకున్నాను.

ఈ కాన్ఫరెన్సు నూతనపరిస్థితులలో జరుగుతున్నదని వ్రాశాను. మామూలుగా వుండే రాజభక్తి తీర్మానం ఉండకూడదని, సర్కారుఉద్యోగంలో (హైకోర్టుజడ్జీగా) శ్రీ ముత్తా వెంకటసుబ్బారావుగారు చేరకూడదనీ తీర్మానాలు ఉంటాయి. అందువల్ల, అంత వరకూ హాజరవుతున్న ప్రభుత్వోద్యోగులు, ధనికవర్తకులు జడిసి సభకు రాలేదు: విద్యావంతులు, గాంధీ శిష్యులైన యువకులు తండోపతండాలుగా వచ్చారు. వాలంటీర్లందరూ గాంధీ భక్తులే. వీరికి కెప్టెను కీ॥ శే॥ కె. యస్. గుప్తాగారు. ఆయన అతివాది, అభ్యుదయవాది, కార్యశూరుడు. శ్రీ పసుమర్తి వీరభద్రస్వామి బి. ఎ. గారు ఆహ్వానసంఘాధ్యక్షులు. సాధారణంగా

ఏదీ కలిగించుకోరు. నా పక్షం బలంగావుంటే మాతో ఉండగలరు. స్థానికంగా మూడోనాయకుడు శ్రీ వి. జె. గుప్తగారు. వీరు నోరుతెరచి గట్టిగా ఇదమిద్ధమని తగాదావిషయాల్లో ఒకపక్షం వహించలేదు. అప్పటికి రాజకీయరంగంలో పేరుప్రతిష్టలు ఉన్న వాడిని నేనే. వాలంటీర్లు నన్ను చూడాలని గుంపులుగుంపులుగా వచ్చారు. వారందరు తప్పక నా పక్షం వహిస్తారు; కాన్ఫరెన్సులో అభివృద్ధికరమైన తీర్మానాలను నేను ధైర్యంతో ప్రతిపాదించితే ప్యాసవడానికి అభ్యంతరముండదని నాకు విశ్వాసం ఏర్పడ్డది.

వెంటనే నా కార్యక్రమాన్ని ప్రారంభించాను. లింగధారి సెక్షనులో భోంచేశాను. వెంటనే (మహాసభ ప్రారంభించక ముందే) రెండుపార్టీలు ఏర్పడినై. లింగధారిని కానందున ఇతర వైశ్యులతో భోంచేయుటకు నాకు హక్కువున్నది. అయితే నేను వీరితో కలసి భోంచెయ్యకూడదని ప్రచారం ప్రారంభమైనది. కాని, వాలంటీర్లు, యువకులు నా పక్షం వహించారు; భోజనశాలకు నన్ను తీసుకెళ్లారు. మార్చి మార్చి రెండు భోజనశాలల్లోను భోంచేశాను. పని జరిగిపోయింది. ఇక మహాసభలో తీర్మానం ఎలాగూ నెగ్గుతుందని, ప్రతికక్షులు ఒక ఎత్తు ఎత్తారు. మహాసభకు వచ్చిన ఎనిమిదిమంది లింగధారులను సహపంక్తిభోజనశాలలో తంతామని ఒక్కొక్కరినే ప్రత్యేకంగా కలుసుకొని హెచ్చరించారు. ఆ ఎనిమిదిమంది భయపడి కొళ్ళకు బుద్ధిచెప్పేలాగుందని నాకు తెలిసింది. కాబట్టి, వారు పారిపోకుండా ఒక్కొక్కరికి ఇద్దరు బలమైనవాలంటీర్లను కాపలాపెట్టి, వారికి కష్టాలు రానివ్వనని హామీ యిచ్చాను. వాలంటీరుకెప్టెను కె. యస్. గుప్తా హనుమంతునిలాంటివాడు; చూచిరమ్మంటే తగలబెట్టి వస్తాడు.

"ప్రతిపక్షనాయకులు న్యాయంగా నడుచుకోకపోతే వారిప్రాణాలు దక్క"వన్నాడు. రాత్రి ఎనిమిదిగంటలకు తీర్మానం గెలవగానే ముగించి, ఎనిమిదిమంది లింగధారులను భోజనశాలకు తీసుకెళ్ళి భోంచేశాము. ప్రతిపక్షనాయకులు వేరేగదిలో భోంచేసి, మూటా ముల్లె కట్టుకుని వెళ్ళిపోయారు. ఈ విజయం మరికొన్ని సంఘ సంస్కార తీర్మానాలకు పురికొల్పింది. రజస్వలానంతర వివాహాలు, వితంతూద్వాహాలు చెయ్యవచ్చునని తీర్మానించాము.

ఈ కాన్ఫరెన్సులో వైశ్యసంఘానికి నూతననాయకులం ఏర్పడ్డాము. కె. యస్. గుప్త, అత్యం నరసింహమూర్తి, మాజేటి రామచంద్రరావు, నేనూ ఈ మార్పులకు కారణం. కాన్ఫరెన్సు పూర్తికాగానే మేము నలుగురము కలుసుకొని ఏకీభావానికి వచ్చాము. ప్రతి కాన్ఫరెన్సుకు ముందుగా మేము కలుసుకోవాలనీ, మేమందరం కలసి తీర్మానించుకొన్నప్రకారం పనిచెయ్యాలనీ, మాలాంటి అభిప్రాయాలుగల యువకులనుమాత్రమే మేము కలుపుకోవాలనీ, మా అభిప్రాయాలకు వ్యతిరేకంగా జరుగుతుందని తోచితే కాన్ఫరెన్సుల జరగకుండా భగ్నంచెయ్యాలనీ తీర్మానించుకొంటిమి. అలాగే నాటకం జయప్రదంగా నడిపాము. దీన్ని గురించి ముందు వివరంగా వ్రాస్తాను.

కొన్నితప్పులు నన్ను వెన్నంటుతూనేవచ్చాయి. టెరరిష్టు పంథా, గొరిల్లా పద్ధతులు చాలాకాలం నన్ను వదలిపెట్టలేదు. ఈ సభలో ఒక తప్పుచేశాను. సభకు వచ్చిన వృద్ధనాయకులలో శ్రీ శనగపల్లి రామస్వామిగుప్తాగారు ఒకరు. వీరు గొప్ప వక్త. ఆకాలంలో ప్రజలను ఆకర్షించగల సమర్థుడు. వితంతూద్వాహాలనుగురించిన తీర్మానాన్ని ఆయన ప్రతిఘటిస్తారని నిశ్చ

యంగా తెలిసింది, ముందుగానే ఆయన్ను "కొనెయ్యా"లని కొం దరుయువకులు ఆయనకు "వైశ్యరత్న" బిరుదు నిస్తామనీ, యువకులకు అడ్డుతగలవద్దనీ ఆశపెట్టి చూచారు. కాని, ఆయన సమ్మతించలేదు; తటస్థంగా ఉండటానికికూడ అంగీకరించలేదు. అప్పుడు నన్ను ఒప్పించమన్నారు మహాసభ ఒక పెద్ద నాటక శాలలో జరుగుతోంది. తెరచాటుకు గుప్తగారిని పిలిపించి ఎంతో చెప్పిచూచాను. ఉపయోగం లేకపోయింది. ఆ తీర్మానం పూర్తిఅయ్యేవరకూ ఆయన సభలోకి పోకుండా కుర్చీకి కట్టి వెయ్యమని వాలంటీర్లతో చెప్పాను; కట్టేస్తే గట్టిగా అరుస్తా నన్నాడు; నోటిలో గుడ్డ కుక్కుతానన్నాను; ముందే అరుస్తా నన్నాడు గుప్తాగారు. విధిలేక విడిచిపెట్టాము. కాని, సభలో గట్టిగా అడ్డుపడలేదు. వెంటనే "వైశ్యరత్న"అనే బిరుదును యిచ్చేశాము.

ఆంధ్రదేశంలో దేశభక్తులు "ఆంధ్రరత్న" బిరుదును శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారికి యిచ్చేముందే వైశ్య కులంలో "రత్న" అనే బిరుదును మా కులగౌరవానికి లోటులే కుండావుండాలనే ఉద్దేశ్యంతో ఒక "రత్నాన్ని" సృష్టించాము. వైశ్యకులాన్ని యిన్ఫీరియారిటీకాంప్లెక్సు బాధపెట్టుతున్నది, శ్రీ ముత్తా వెంకటసుబ్బారావుగారు హైకోర్టుజడ్జీ కావడంతో వైశ్యకులం చాలా బాగుపడ్డది; వారికితోడుగా శ్రీ సుందరం శెట్టిగారుకూడ హైకోర్టుజడ్జీ కావడంతో అలాంటి కాంప్లెక్సు చాలవరకు తగ్గింది. అందువల్ల వెనుకపడ్డ కులాలవారికి గొప్ప ఉద్యోగాలు, మంత్రిత్వాలు యిచ్చి, సంఘసేవకు అవకాశం యివ్వటంవల్ల త్వరలో ఆ కులాలనూ పైకి తీసుకురాగలమనీ,

అందువల్ల దేశం అభివృద్ధికి రాగలదనీ నా అభిప్రాయం. ఈ నా వాదనను విన్న బ్రాహ్మణకులాభిమానులు యోగ్యత ముఖ్యమని వాదించేవారు. ఇలా వాదులాడుతున్నంతవరకు కులతత్వ వాదం పోదనీ, జాతీయతత్వం వృద్ధికి రాజాలదనీ నా అభిప్రాయం.

అందువల్ల కొందరు నన్ను "కులతత్వవాది" అని నిందించారు. వాస్తవానికి జాతీయోద్యమానికి తోడ్పడడమే నా పని. దూరదృష్టిలేనివారు నా వుద్యమములోని అభ్యుదయాన్ని చూడలేకపోయారు.

విశాఖపట్టణం మహాసభ తరువాత 2, 3. సం॥ల వరకు కాన్ఫరెన్సుమాటే ఎవరూ ఎత్తలేదు. రజస్వలానంతర వివాహాలు, వితంతూద్వాహాలను గురించిన తీర్మానాలు పాతనాయకులను భయపెట్టేశాయి. ఎలాగైనా మహాసభను జరిపించాలనుకొని, గుంటూరు వెళ్ళి వైశ్యనాయకులలో ముఖ్యుడు- కులాన్ని ఒకప్పుడు వృద్ధికి తెచ్చిన శ్రీ మద్ది వెంకటసుబ్బయ్యగారి మూలంగా కాన్ఫరెన్సుకు ఏర్పాటుచేయించాను. అప్పట్లో గుంటూరు తీవ్రజాతీయవాదానికి, వైశ్యుల వైదికవాదస్తానికి ఆంధ్రలో ఆటపట్టు. ఈ చాదస్తానికి శ్రీ చీమకుర్తి బసవయ్యగారు ముఖ్యులు. మద్ది వెంకటసుబ్బయ్య, బసవయ్యగార్ల మనసులు ఆశయాలు, ఆత్మలు ఒకటే, అయితే, బసవయ్యగారు ఉపాయశాలి, ఎత్తులమీద ఎత్తులువేసి క్రిందపడినా తనదే జయమనే సాహసి. మద్ది వెంకటసుబ్బయ్యగారు సాహసి, పట్టుదలగలవాడు, విశాఖపట్టణంలో చేసిన సంఘసంస్కార తీర్మానాలను రద్దు చేయించుటకే గుంటూరులో మహాసభను ఏర్పాటు చేశామని

చాటించి, పూర్వాచార పరాయణులును, బ్రాహ్మణ ద్వేషులు, మూఢాభిప్రాయాలుగలవారిని రెచ్చగొట్టి సంఘసంస్కారప్రయత్నాలను భగ్నంచేయటానికి శ్రీ జనపయ్యగారు కృషిచేశారు. వేలమంది సొమ్మరెన్నుకు వచ్చేలా ప్రచారంచేసి జయించాడు. అంతేకాదు; అభ్యర్థులుగా తమతో ఏకీభవించే వేదాంతి శ్రీ గ్రంధి ....?గారిని కోయంబత్తూరునుంచి రప్పించారు. ఈ అభ్యర్థుడు లౌకికుడుకాడు: శక్తిసామర్థ్యాలు లేవు; రెండుపార్టీలవారు పోట్లాడుకొనేసభను నడిపించుకోగల సమర్థత ఏమాత్రం లేనివాడు. ఇదే ఆహ్వానసంఘం వారి ఏర్పాట్లలోని గొప్పలోపం.

పరిస్థితులు వడివడిగా మారిపోతూవచ్చాయి. గాంధీగారి ఉద్యమాలు బాగా బలపడుతున్నాయి. ఇంకా తీవ్రమైన మార్పులు రావడంలేదని యువకులలో అసంతృప్తి ప్రబలిపోతున్నది. సంఘసంస్కరణలకు అడ్డుతగిలేవారి పేరుప్రతిష్ఠలు సన్నగిలి పోతున్నాయి. దీనిని జనపయ్యగారు గ్రహించకపోవడమే రెండో లోపం.

విశాఖపట్టణంలో సంప్రదించుకున్న అతివాదులము, మరి కొందరు యువకనాయకులు ప్రత్యేకంగా కలుసుకొన్నాము. కొత్తవారిలో శ్రీ లింగమల్లు జగన్నాధంగారు (బందరు) శ్రీ శిఖాకొల్లు పట్టాభిరాములుగుప్తగారు (చీరాల) శ్రీ పూటుకూరి సుబ్బారావుగుప్తగారు (వేటపాలెం) శ్రీ కొత్త అచ్చయ్యశెట్టిగారు (కర్నూలు) శ్రీ గంధి సుబ్బరాయగుప్త శర్మగారు (గుంటూరు) వగైరా వున్నారు. గుంటూరులో అతివాదులైన శ్రీ మద్ది రాధాకృష్ణయ్యగారు స్థానికపరిస్థితులకు జడిసి దూరంగా వుండిపోయారు. అయితే, చాలామంది ఆంగ్లవిద్యాధికులు, అభ్యుదయ

ఖావాలుగలవారు పలు తావులనుండి వచ్చారు. వీరు సంఘసం
స్కరణలకు హాని రానివ్వరు; సైంధవుడిలాగా అడ్డుతగులుతారు.
మా ముఠా రహస్యంగా కలుసుకొని కొన్ని తీర్మానాలు చేసు
కొన్నాము. లింగధారులకు వెంటనే సహపంక్తి భోజనము పెట్టిం
చాము. వాలంటీర్ల కెప్టెన్ శ్రీ గుంటూరు నరసింహారావుగారు
బాగా సహాయపడ్డారు. వితంతూద్వాహాలను గురించిన తీర్మానం
ముఖ్యమైనది. చర్చలు పెరిగిపోయాయి. ఒక మహాసభలో చేయ
బడినతీర్మానాన్ని మరొక మహాసభలో అధికసంఖ్యాకులవోట్లతో
రద్దుచేయవచ్చునని మిత్రవాదులు న్యాయంగానే వాదించారు. సంఘ
నిబంధనలలో ఈ విషయాన్నిగురించి రూల్సు లేవు కాబట్టి,
నిబంధనలుచేసేవరకు మార్పుచేయకూడదని పక్షిల్లు అధర్మంగానే
మాతరఫున వాదించారు.

మా ముఠా వితంతూద్వాహాలనుగురించి సమర్థించుతూ
మహాసభలో నన్ను మాట్లాడమన్నారు. ఆ తీర్మానాన్ని రద్దుచేయ
టమే మంచిదని నా వాదన. ఆచరణలో పెట్టజాలనంతవరకు
వితంతువులమనసులను, హృదయాలను కలవరపెట్టినంతమాత్రాన
సంఘసేవ అనిపించుకోదనీ, ఆచరణలో పెట్టగలిగినవారికి మహా
సభ తీర్మానాలు అడ్డురావనీ నా వాదన. ఒకవిధంగా సమాధాన
పడ్డాము:- (1) తీర్మానాన్ని రద్దుచెయ్యనివ్వకూడదు. (2) రద్దు
అయ్యే పరిస్థితులు బలంగా వుంటే మహాసభ జరక్కుండా
చెయ్యాలి; (3) తరువాత మా ముఠావారు ఆ తీర్మానాన్ని ఆచర
ణలో పెట్టుటకు కార్యక్రమాన్ని ఏర్పాటుచెయ్యాలి.

అధ్యక్షుణ్ణి తొలగించి మాకు అనుకూలుడు, సమర్థుడు
అయిన వారిని ఎన్నుకోవడం అవసరంగా తోచింది. అధ్యక్షుడు

అప్పటికే ముతాదగావాలవల్ల తలనొప్పితో బాధపడుతున్నాడు. తలనొప్పివల్ల తా మిక మహాసభను నిర్వహించలేమనీ, తమస్థానే శ్రీ చల్లా గురుస్వామిశెట్టిగారి నియమించినట్టున్నూ వ్రాయించి శ్రీ గురుస్వామిశెట్టిగారిని అధ్యక్షుణ్ణి చేశాము. వ్యతిరేకులు అందుకు సమ్మతించలేదు. సభలో రెండుపార్టీలూ కొట్టుకోబో యారు. పోలీసులను పిలిపిస్తానని బెదిరించి చూసి, చివరకు మహా సభను ముగించారు శ్రీ గురుస్వామిశెట్టిగారు.

మేమే గెలిచాము; కాని, ఒక యువకనాయకుడు శ్రీ గోను గుంట్ల సుబ్రహ్మణ్యంగారు (గుడివాడ) మాతీర్మానానికి వ్యతి రేకంగా వెంటనే మరొక సభ పెట్టాడు; కాని, నిర్వహించుకోలేక మానేశాడు.

మా అతివాద కార్యవర్గం కలుసుకొన్నది. ఆ సమయానికి శ్రీ మద్ది వెంకట రంగయ్యగారు వచ్చారు. వారిని సాక్షిగా కూర్చోబెట్టి 1. వితంతూద్వాహాలు చేయించాల్సిందేనని, 2. వివా హితులకు కులబహిష్కారం వచ్చేయెడల మేమూ ఆ బహిష్కా రములను అనుభవించితీరాలనీ, 3. మా మా కుటుంబాలనుండి మమ్మల్ని తరిమివేసినా వెళ్ళిపోవలసిందేగాని జంకరాదనీ, (4) కార్యాచరణలోపెట్టగల ఏరికి వందయ్య కార్యదర్శిగా ఉండా లనీ తీర్మానించుకొని ప్రమాణాలుచేసుకొని వెళ్ళిపోయాము. నేను కార్యాచరణలో ఎలా పెట్టిందీ మరొకచోట వ్రాస్తాను.

ఈ గుంటూరు మహాసభలో నా పెదరిష్టుఅలవాటువల్ల ఒక దౌర్జన్యం జరిగింది. శ్రీ శంకరాచార్యులైన కల్యాణానందభారతి గారి ముఖ్యశిష్యుడు శ్రీ పాకయాజిమీద మేము పగ తీర్చుకొన్న సంఘటనే అది.

శ్రీ కల్యాణానందభారతి బి. ఎ. గుంటూరువారిసత్రంలో బసచేసి గీతోపన్యాసాలు యిచ్చుచుండిరి. (1923 లో కావచ్చు) గొప్ప విద్వాంసుడని, తార్కికుడనీ, వక్త అనీ, గొప్ప అందగాడనీ చెప్పి మిత్రులు నన్ను గీతాకాలక్షేపానికి తీసుకెళ్లారు. అప్పుడు గీతలోని ఒకశ్లోకం చదివి నాలుగుకులాలుమాత్రమే ఉన్నట్లు చెప్పి ఖండాంతరాలను హిందూసంఘములో చేర్చుటకు ప్రయత్నిస్తున్న నాయకులందరిని తిట్టారు. చివరకు గాంధీగారినికూడా తూలనాడారు. "వాడికి రిజిష్టరు నోటీసు యిచ్చాను; కాని, వాడు నాకు జవాబివ్వలేదు" అన్నారు. నేను తోకతొక్కినతాచులాగా లేచాను. "ప్రజలగౌరవం పొందిన నాయకులను తూలనాడినమాటలను ఉపసంహరించుకో" మన్నాను. అందు కాయన లక్ష్యపెట్టలేదు. "మాకు గీతోపన్యాసాలమీద ఎంత ఇష్టమున్నా, జాతీయ నాయకులను తూలనాడడం దేశభక్తులమైన సభికులము సహించలేము, వెంటనే ఉపసంహరించుకోవాల్సిందే" నని మళ్లీ చెప్పాను. తన ఉపన్యాసం నాకు నచ్చకపోతే వెళ్లిపోవచ్చునన్నాడు. "గుంటూరు పురజనుల దేశభక్తి ఎలాంటిదో అతనికి తెలియదనీ, నేను వెళ్ళిపోతే అందరూ వెళ్ళిపోతారనీ, వెంటనే తనతప్పును సవరించుకోమనీ" మరల సలహా యిచ్చాను. కాని, ఆయన వినిపించుకోలేదు. నేను బయటికి వచ్చాను. నాతో సభికులందరూ వచ్చారు. నాకు ఆశ్చర్యంవేసింది. ఇంతటితో చాలదని, ఆయనకు ఒకపాఠం నేర్పాలనుకొని వెంటనే ఒక కరపత్రం అచ్చువేయించాను. రెండువాక్యాలుమాత్రమే వ్రాశాను: "మహాత్మగాంధీ మొదలైన జాతీయనాయకులను తూలనాడి మాట్లాడే శంకరాచారి-కల్యాణానందభారతిగారి విషయంలో దేశభక్తులైన గుంటూరు

ప్రజలు తమ ధర్మమేమో నిర్ణయించుకోవాలి" అని వ్రాశాను. నా స్నేహితులు అచ్చువేయించి పంచిపెట్టారు. ఆనాడే నేనప్పుడు కాపురముంటున్న భీమవరానికి వెళ్ళిపోయాను.

ఇది పెద్ద తగాదాగా మారిపోయింది. కొందరు దేశ భక్తులు చీరాల వెళ్లి "ఆంధ్రరత్న" దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారికి రిపోర్టు చేశారు. వారు ఒక ఉపన్యాసానికి రహస్యంగా వెళ్లి ఒకమూల కూర్చుని పంపములనుసూర్చి తనశిష్యులచే ప్రశ్నలు వేయించి, సవాలుచేసి, ఇద్దరూ ఒక బహిరంగసభలో ఉపన్య సించేట్లు నిర్ణయించుకొన్నారు. ఆ సభ స్వామి బసచేసియున్న గుంటూరువారిసత్రంలోనే జరిగేలా ఉభయులు సమ్మతించారు.

ఆ సభకు ప్రజలు తిరునాలకువలె వచ్చారు. ఇంతమందిని చూడగానే స్వాములవారు జడిసి సత్రం లోపలిగదియలు బిగించు కొని బయటికి రావటానికి నిరాకరించాడు. ఆంధ్రరత్నం ఎంత హామీ యిచ్చినా స్వామికి ధైర్యం రాలేదు. ప్రజలు సత్రంమీద రాళ్లవర్షంకురిపించారు. సత్రంలోనుండి వెళ్లిపొమ్మని స్వామిని ఆజ్ఞాపించారు.

స్వామి అర్ధరాత్రివేళ తెనాలికి పారిపోయారు. దేశభక్తులు, పీఠాధిపతులను ద్వేషించేవారూ ఏకమై, తెనాలి వెళ్లి తరిమివేయిం చారు. అలాగే ఆయనవెంటబడి బాపట్ల, నెల్లూరుల నుండికూడా తరిమివేయించారు. వైశ్యయువకులు చాలా పట్టుదలతో పని చేశారని నా మిత్రులు తెలిపారు.

ఈ కారణంవల్ల శంకరాచారి శిష్యుడు శ్రీ పాకయాజి తమపత్రికలో నాలాంటివారి నందరిని అన్యాయంగా దూషించుతూ

నీచంగా వ్రాస్తూ ముఖ్యంగా నన్ను "చిత్తకార్తికుక్క" అని వ్రాయు చుండెను. ఈ వ్రాతలను నేను లక్ష్యపెట్టలేదు.

గుంటూరు ఆర్యవైశ్య మహాసభకు పత్రికాప్రతినిధిగా వచ్చాడు ఆ పాకయాజి మహాశయుడు. ఈయన సాహసానికి వైశ్యయువకబృందానికి కోపంవచ్చింది. వారికి ఏమిచెయ్యాలో తోచలేదు. వారిలో ముగ్గురు నాయకులు-వుప్పుటూరి పున్నారావు గారు, గుంటూరు నరసింహారావుగారు, జమిలి నమ్మాళ్వారుగారు ఆయన్ను తన్నించితే చూడాలని కుతూహలమున్నట్టు చెప్పారు నాతో. మహాసభలో తన్నించకూడదు. బయట తన్నించడంమంచి దని సలహాయిచ్చాను. ధైర్యంగల ముగ్గురు వాలంటీర్లను యిమ్మని వాలంటీర్లకెప్టెను శ్రీ గుంటూరు నరసింహారావుగారిని అడిగాను. వాలంటీర్లతో చెయ్యవలసిన పని చెప్పాను. ఒప్పుకున్నారు. ఎవరో బయట పిలుస్తున్నారని శ్రీ పాకయాజికి ఒక చీటీ యిచ్చారు; బయటకి రాగానే కొంతదూరం తీసికెళ్ళి కారణం చెప్పి కొట్టారు. ఒకటి రెండు కోమటిదెబ్బలకే బ్రాహ్మడు క్రింద పడ్డాడు. అంతలో ఒక కాపలావాడు కేకవేసేటప్పటికి వాలంటీర్లు పారిపోయి శిబిరంలో దాక్కున్నారు. శ్రీ పాకయాజి బెల్లంకొట్టిన రాయిలా ఏమీ జరుగనట్టే గౌరవం నిలబెట్టుకోవాలని నటిం చాడు. సభలోకి రాగానే 'ఎవరు కొట్టారు? ఎందుకు కొట్టా'రని అడిగాను. నోరు తెరపడే! చుట్టూ గుంపుగూడారు. "పాకయాజిని కొట్టాల్సిందే" నన్నారు. ఆయనను మళ్ళీ కొట్టకుండా నేను "రక్షించి" బయటికి తీసుకెళ్ళి, జట్కాలో ఎక్కించి, వాలంటీరును తోడిచ్చి "నేను దరిశి చెంచయ్యను; కొట్టించింది నేనే; నీ యిష్టం వచ్చినట్టు తిట్టి వ్రాసుకో" అనగానే వణికిపోయాడు.

మహాసభను గురించి వ్రాయడంలో నన్ను బాగా ప్రశంశించాడు. "ఎంత సుళువుగా కొట్టించావు!" అని నరసింహారావు వగైరా అన్నారు. ఇలాంటి పెరరిస్టుకార్యాలు అభివృద్ధినిరోధకుల మీద చాలాకాలం ప్రయోగిస్తూనే వచ్చాను.

## వి తం తు వి వా హా లు

ఆంధ్రదేశంలో అదివరకే వితంతువివాహాలు చేయించారు. శ్రీ వీరేశలింగంపంతులుగారు, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు సంస్థలను ఏర్పరచి, అనేకకష్టాలకు గురియై తమ ఉద్యమాలను సాగించారు. వారు ఎట్టిపరిస్థితులలో చేయించారో వివరాలు గ్రహించాను. వ్యక్తిగతంగా మాత్రమే చేయించారు. సంఘాన్నంతటిని తమ ఉద్యమానికి సమ్మతించేలా చెయ్యలేకపోయారు. మొండిధైర్యముగలిగి, గొప్ప సంస్కృతిగలవారుమాత్రమే అలాంటి వివాహాలు చేసుకొన్నారు. నా కాలంలో గాంధీగారి ప్రజావుద్యమం జోరుగా సాగిపోతోంది. రాజకీయచైతన్యం వృద్ధిచెందుతోంది. వితంతువివాహసమస్యను సంఘమంతటి సమస్యగా మార్చగలమనే నమ్మకం నాకు 1924—1925కే ఏర్పడింది. అది ఒక సంధియుగం. యువకులను ప్రత్యేకంగా సంఘటితపరచి వృద్ధులను ఓడించాల్సినకాలం. అలాగే చేశాను.

లోగడ సనాతనులకు ఒకే ఆయుధం - కులబహిష్కారం వుండేది. అయితే గాంధీయుగంలో ఈ ఆయుధానికి పదును పోయి తుప్పుపట్టింది. ఇక యువకులను సంఘటితపరచడంతో ఆధారపడి వున్నాయి జయాపజయాలు.

లోగడ శాస్త్రవాదనకు బలముండేది. కాని, గాంధీ యుగంలో జాతీయవాదానికి, చారిత్రకవాదాలకు బల మెక్కు వైంది.

ఈ విషయాలను మిత్రుడు శ్రీ ఉన్నవ లక్ష్మినారాయణ గారితో చెప్పాను. ఆయన ఒకవిషయాన్ని నొక్కిచెప్పారు. హిందూసంఘంలో కులాలమధ్య భోజన విషయంలో ఉన్నంత పట్టింపు కామానికికూడా లేదనీ, ఒక కులంవారు మరొక కులం వారితో కలసి బిడ్డలను కన్నప్పుడుకూడా రహస్యంగానైనా భోజనాలు కలిసిచెయ్యలేదనీ, సహపంక్తిభోజనాలు ప్రజామోదమైనప్పుడు వర్ణాంతరవివాహాలుకూడా జరుగుతాయనీ, ఆతర్వాత కులాలు నశించిపోతాయనీ చెప్పారు. గాంధీయుగంలో అప్పటికే సహపంక్తిభోజనాలు జైళ్ళలోను, సభలలోను ప్రజామోదమవుతున్నాయి.

ప్రభుత్వం కూడ అందు కనుకూలమైన శాసనంచేసింది. వితంతువివాహం చేసుకొన్నవారిని సంఘం శిక్షించినచో అట్టిచర్యలలో పాల్గొన్న ప్రతివ్యక్తికి ఆరునెలల కారావాసము, రు.1000ల జరిమానా విధించబడునని ఆ చట్టంలో ఉంది. బిడ్డలకు ఆస్తి హక్కులు ఉంటాయి. మిత్రుడు శ్రీ చింతగుంట సుబ్బయ్యశాస్త్రి గారు (బళ్ళారి) వితంతు వివాహాలకుగల శాస్త్రాధారాలను వ్రాసి యిచ్చిరి. వితంతూద్వాహాల చరిత్రనుగురించి శ్రీ కామరాజు హనుమంతరావుగారు(రాజమండ్రి) వ్రాసియిచ్చారు. అవి బాగా వుపయోగపడినై.

అంతవరకూ వైశ్యసంఘంలో వితంతువివాహాలు చేసుకొన్నవారు ముగ్గురుమాత్రమే. ఆ ముగ్గురిని సంఘం బహిరం



శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ



శ్రీ మద్ది రాధాకృష్ణయ్య

గంగా బహిష్కరించకపోయినా, ఆచరణలో స్వకులసంఘం బహిష్కరించినది. వారు ముగ్గురు:

1. శ్రీ నరసేపల్లి చన్నప్పశెట్టిగారు. (బళ్ళారి)
2. శ్రీ గరుడా హనుమంతరావుగారు. (మద్రాసు)
3. శ్రీ ముత్తా వెంకటసుబ్బారావుగారు. (మద్రాసు)

ఈ ముగ్గురిని కులంలో చేర్పించి సహపంక్తిభోజనాలు జరిపితే నా ఉద్యమం బలపడుతుందని, అంతవరకు క్రొత్తగా వితంతూద్వాహాలు చేయించకూడదనీ నిశ్చయించుకున్నాను. బళ్లారి వెళ్లి శ్రీ గుడుమూరు తిప్పమ్మప్పశెట్టిగారి సహాయంతో కొందరు వైశ్య ప్రముఖులు శ్రీ చన్నప్పశెట్టిగారితో కలసి భోంచేసేలా చేసితిని. వైశ్యసంఘం పట్టితిన్న పాములా మిన్నకున్నది, కాని, సంఘాన్ని కదల్చలేకపోయాను. కలిసి భోంచేసేవారికి సంఘబహిష్కారంకాని, మరే కష్టాలుకాని వుండవని తెలియగానే చన్నప్పగారికి బంధుమిత్రులు బాహాటంగా తమయింట్లలో భోజనం పెట్టసాగారు. ఇది బళ్ళారిలో మాత్రమే జరిగింది.

మద్రాసులో అలా కాదు. ఇక్కడ సంఘంలో చాదస్తం చాలా ఎక్కువ. సాంఘికంగాను, జాతీయంగాను చైతన్యం తక్కువ. ఇంగ్లీషుచదివిన వారిలోను, ద్రవ్యవంతులలోను మనకెందుకులే అన్న భావం జీర్ణించివుంది. ఇలాంటివారందరిని కలపడమూ, కార్యంనెరవేర్చడమూ సాధ్యంకాని పని. కాబట్టి ముందు ఇతరపట్టణాల్లో మార్పువస్తే తర్వాత మద్రాసు వైశ్యసంఘంలో అదే వస్తుంది.

తలవని తలంపుగా ఒక ఘటన జరిగింది. 1925 డిశెంబరులో థియసాఫికల్‌సొసైటీ జూబిలీ అడయారులో జరుగు

తుంటే నేను వెళ్ళాను. షుమారు 200 మంది వైశ్యులు వివిధ ప్రాంతాలనుండి వచ్చారు. వారంతా ఆ సొసైటీలో సభ్యులు. వారిలో సంఘసంస్కరణాభిలాష బాగావుంది. వారందరిని కలప పడం మరొకవిధంగాకూడా సులభమే. థియసాఫికల్‌సొసైటీ సభ్యులకు పెద్దపెద్దప్రభుత్వోద్యోగులపట్ల చాలాగౌరవము. హైకోర్టుజడ్జీ శ్రీ ముత్తా వెంకటసుబ్బారావుగారు,నేను ఒక విందుచేశాము. జయప్రదంగా జరిగింది. కాని, మద్రాసు వైశ్యసంఘంలో శ్రీ సామి వెంకటాచలంశెట్టిగారు ఒకరే వచ్చారు. వారికి కష్టాలు ప్రారంభించాయి. అయితే, వారికిబంధువు వైశ్యసంఘనాయకులు అయిన శ్రీ పొత్తూరు అయ్యన్నశెట్టిగారు రాబోవు కష్టాలను గుర్తించి ఏదో పెద్ద విందు చేసి, సామిని కూడా పిలిచి కలిపే శాడు. ఆ కాలంలో కులబహిష్కారం అంతగా బాధించేది.

వైశ్య యువకుల ముందంజ

అప్పుడే మరొక అనుకూలం జరిగింది. మద్రాసులో శ్రీ తుంపూడి భగవంతంగుప్తగారు వుండేవారు. ఆయన వైశ్యకులానికి ఎప్పుడూ ఏదో ఒక మేలు చేస్తూనేవున్నారు. వైశ్యయువజనమహాసభ జరుపనెంచి నా సలహా, సహాయం కోరారు. నా ఉద్యమాని కిది మంచి ప్రయోజనకారియని గ్రహించి సహకరించాను. దీనిసహాయంతో ఆర్యవైశ్యమహాసభను లొంగదీయవచ్చు. 30 సం॥లోపు గలవారినిమాత్రమే యువజనులుగా నిర్ణయించమని చెప్పి, ప్రథమ మహాసభకు అధ్యక్షుని పేరుకూడా నేను సూచించాను. కాని, నన్నే అధ్యక్షుడుగా ఉండమని కోరారు. నా వయస్సు 35 సం॥లని తెలిపాను. వారి నిబంధనలలో యువకుల వయసు 35 సం॥లుగా మార్చి నన్నే అధ్యక్షునిగా నిర్ణయించారు.

వితంతూద్వాహాల ఉద్యమానికి, ఇతర సంఘసంస్కరణలకు ఈ సంస్థ బాగా ఉపయోగపడింది. ఈ యువక సంఘం నా కష్టపరంపరలను దాటించి విపరీత వృద్ధులను నెట్టేసి వారి ఆట కట్టించింది.

ప్రథమ యువజన మహాసభకు షుమారు అయిదువందల మంది వచ్చారు. వైశ్యులలో సాంఘికంగా, రాజకీయంగా చైతన్యం కలిగిన విద్యార్థినులు, విద్యార్థులు, మధ్యతరగతి విద్యావంతులు, ధనిక వ్యాపారస్తులు, గొప్పవంశాలకు సంబంధించిన వారు పట్టణాలనుండి వచ్చారు. వితంతూద్వాహాలు, రజస్వలానంతరవివాహములు చేయింపవలసినదేనని, తాలింఖానాలు, గ్రంథాలయాలు, పఠనమందిరాలు ప్రతి పట్టణములోను స్థాపించాలని, హాస్టల్సును స్థాపించి బీద వైశ్యవిద్యార్థులకు విద్యార్థివేతనములను విరివిగా యిస్తూ వేలాదియువకులను హైస్కూళ్లకు, కాలేజీలకు పంపవలసిందని యువక మహాసభలో ఉత్సాహంతో తీర్మానాలు చేశారు. ఒక పత్రికనుకూడా స్థాపించారు. అంతేకాదు; వెంటనే కార్యాచరణలోపెట్టి, అంతవరకున్న సంఘబహిష్కారాలకు స్వస్తి చెప్పదలచి, శ్రీ ముత్తా వెంకట సుబ్బారావుగారికి, వారి భార్యకు మహాసభలో సహపంక్తిభోజనం పెట్టారు. అలాగే శ్రీ చన్నప్ప శెట్టిగారికి, శ్రీ హనుమంతరావుగారికి సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేశారు. ఈ ముగ్గురు మహాసభకు వచ్చిన వారందరికి విందులు చేశారు.

శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు 'ఆంధ్ర పత్రిక'లో ఈ విషయాలను పూర్తిగా ప్రచురించి ఈ ఉద్యమానికి తోడ్పడ్డారు.

ఇక ఆంధ్రదేశమంతటా వైశ్యయువకులను ముందుకు నెట్టి తమతమ పట్టణాలలో వుండే ఛాందసులను, మూర్ఖులను ఓడించుటకు పురికొల్పాలి. వైశ్యకులంలో జయించితే క్రమంగా కమ్మ, రెడ్డి, కంసాలి, నాయుడు, బ్రాహ్మణ మొదలగు కులాల్లో ఇలాగే జయించుట సులభం సంఘం పరిస్థితులను గ్రహించి ఏ కులానికి ఆ కులాన్ని ప్రత్యేకంగా సాంఘికవిషయాల్లో వృద్ధికి తేవలసిందేనని తెలిసిపోయింది. అలాగే చేశాను. ముందు వైశ్య కులంతో ప్రారంభించాను. ఇంత దీర్ఘంగా యోచించి, ఒక్కొక్క మెట్టు యెక్కుతూ, ఇక జయం తప్పదని నిర్ణయించుకొని, ప్రథమ వితంతువివాహం చేయించాను.

నే నప్పుడు (1924-26) గుంటూరులో వుంటున్నాను. ఏ ఉద్యోగమూ లేదు. సంఘసంస్కరణమనో, మరో ప్రజాహిత కార్యమో నిర్ణయించుకొని, ఉత్సాహంతో తీరికలేనట్టుగా పనిచేసే వాడిని. ఎటు చూచినా సంఘంలో తొలగించాల్సిన లోపాలు ఎన్నో ఎప్పుడూ నాకు ప్రత్యక్షమవుతూండేవి. నేను ప్రారంభించిన ఏ ఉద్యమముగాని ద్రవ్యసహాయం లేక ఆగిపోలేదు; కాని, నాకు ఉత్సాహం మందగించినప్పుడు నేనే మానివేసేవాడిని. ముఖ్యంగా ఇతరులు ముందుకొచ్చి పనిచేస్తూంటే నేను మానుకునేవాడను.

1900 సం॥ మొదలు వైశ్యకులాభివృద్ధి విషయంలో గుంటూరే ముఖ్యస్థానం. రాజకీయంగా, సాంఘికంగా అన్ని కులాలలోను 1900 సం॥ తరువాత గుంటూరుజిల్లా ముందంజ వేస్తూ వచ్చింది. అందుచే గుంటూరు వైశ్యుల తీర్మానమే ఆంధ్ర

వైశ్యసంఘమంతటికి తీర్మానంగా వుండేది. కాబట్టి గుంటూరులోనే వితంతువివాహోద్యమం ప్రారంభించాలి.

వైశ్యులలో మొదటి వితంతు వివాహం

మద్రాసులో జరిగిన వైశ్య యువక మహాసభ తీర్మానాలు ఆంధ్రపత్రికమూలంగా అన్ని ప్రాంతాల ప్రజలకు తెలిసినవి. ఒకనాడు ఒక బీదవృద్ధుడు తన 12 సం॥ల వయస్సుగల కూతురును, ఒక యువకుని వెంటపెట్టుకొని, బియ్యం, పప్పు వగైరా ఒక గోతంలో కట్టుకొని, మా యింటికి వచ్చాడు. చిత్తూరుజిల్లా వాయల్పాడుకు సమీపగ్రామం. తనబిడ్డ వితంతువు; వెంట వచ్చిన యువకుడు వివాహం చేసుకోటానికి సమ్మతించాడు. వాయల్పాడులో శ్రీ రఘునాధరెడ్డిగారు సలహా, ప్రోత్సాహాలిచ్చి నా వద్దకు పంపారు. శ్రీ రెడ్డిగారు రెడ్లలో వితంతువివాహాలను ఆదివరకే చేయించుతున్నట్లు అప్పుడు తెలిసింది నాకు.

అంత చిన్నపిల్లకు పునర్వివాహం చేయించుటకు నా మనసొప్పలేదు. మా కార్యాచరణసంఘసభ్యులను పిలిపించాను. వారిలో చాలమందికి ఈ వివాహం నచ్చలేదు. అయితే, నా తీర్మానానికి బద్ధులవుతామని ఏకగ్రీవంగా సమ్మతించారు. అంతట శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి సలహా నడిగాము. "శుభం. వచ్చిన కేసును చేయించితీరా"లని ఆయన దృఢాభిప్రాయము. "ఇంత చిన్నపిల్ల వివాహానికి సనాతనధర్మిష్ఠులైన గుంటూరు వైశ్యులు సమ్మతించరు; అష్టకష్టాలు పెడతారు. యువతుల, ప్రజల సానుభూతిని మనవైపుకు ఆకర్షించవచ్చు; వెంటనే చేయించండి" అని చక్కని సలహా యిచ్చారు. "బహిరంగంగా వివాహం చేయించమనీ, ఖర్చయ్యే 2-3 వందల రూపాయలు

గుంటూరులో తామే వసూలుచేసి యిప్పించుతా"మనీ ప్రోత్సహించారు. బళ్ళారి శ్రీ పరసేపల్లి చన్నప్పశెట్టిగారు శ్రీమంతుడు. ఈ ఉద్యమానికి ఖర్చుపెడతారు. ఆయనకు వ్రాశాను. తానే వచ్చి ఖర్చుపెట్టి, ఆర్థికబాధ్యత నాకు లేకుండా చేస్తానని వ్రాశారు. ఆయన రావడంతో అభివృద్ధినిరోధకులతో ఢీకొనేందుకు నాకు తీరిక ఏర్పడింది.

మొదటిఎత్తుతోనే వారిని వోడించాలనేఉద్దేశ్యంతో ఆహ్వాన పత్రికలో "అభినందనములతో" అనే శీర్షికక్రింద ఒక పెద్దపేర్ల పట్టీ వేశాను. (శ్రీ ముత్తా వెంకట సుబ్బారావు (హైకోర్టు జడ్జీ) గారితో ప్రారంభించి ఈ ఉద్యమానికి ఆక్షేపణచెయ్యని షుమారు 25 పేర్లు చేర్చాను. సనాతనులు భయపడిపోయారు. అయితే, గుంటూరులో శ్రీ చీమకుర్తి బాపయ్య, శ్రీ మద్ది వెంకట సుబ్బయ్యగార్లు భయపడేరకంకాదు. కరపత్రాలతో వాదం ప్రారంభమైంది. పెళ్లికి క్రితంనాడు వైశ్యుల బహిరంగసభ నొకదాన్ని యిద్దరు నాయకులు ఏర్పాటు చేశారు. వైశ్యులందరిని ఆహ్వానించారు. నేనుకూడ వెళ్లాను.

మార్గం మధ్యలో శ్రీ కీ॥ శే॥ మద్ది రాధాకృష్ణయ్యగారు (నా ముఖ్యమిత్రుడు, జైలుకువెళ్లిన దేశభక్తుడు. పరువు ప్రతిష్ఠలు గలవాడు) నాకు ఎదురుపడ్డాడు. "మీటింగుకు రారా?" అనడిగాను.

వచ్చి ఉపయోగముండదు. అయిదారువేలమంది వైశ్యులు ఇప్పటికే వచ్చారు. ధైర్యంచేసి ఒక్కరూ మనకు ఓటివ్వరు. వివాహానికి వచ్చినవారిని వెలివేసి బాధిస్తారు. సంవత్సరంక్రితం సంఘతీర్మానానికి వ్యతిరేకంగా ప్రవర్తించిన కొందరుధనాఢ్యులను

ఇంకా బాధపెట్టుతూనేవున్నారు. పరిస్థితులు మన కెంతమాత్రం అనుకూలంగాలేవు" అని నిరుత్సాహంగా మాట్లాడి నన్నుకూడా వెళ్ల వద్దన్నాడు.

వంటరిగానైనా ఎదిరించక తప్పదని చెప్పి వెళ్లబోయాను. నా చెయ్యిపట్టుకొని "నామీద కోపంగావున్నావు. కాని, నే నేమీ చెయ్యలేను" అని, మళ్ళీ మనసుమార్చుకొని "నీతోపాటు కులంలో వెలిపడి తృప్తిపడమంటావా? లేక దూరంగా వుండి చివరకు కష్టాలను తొలగించమంటావా?" అని ప్రశ్నించాడు.

"భయపడిపోయావు; కాబట్టి. దూరంగానేవుండి సహాయం చెయ్యం"డన్నాను.

"పెండ్లి పూర్తిఅయినతరువాత ఏమి చెయ్యమంటే అది చేస్తాను" అని వాగ్దానంచేశాడు.

## వ్య తి రే కు ల హ డా వు డి

వైశ్యకులం చాలా విచిత్రమైనకులం. "కోమటిదాటు, గొల్లదాటు" అనే సామెత ఆకాలంలో వాస్తవమే. "కోమటి పిరికి, కొట్టితే వురుకూ" అనేదికూడా యదార్థమే. ఈలాంటి పరిస్థితులు అప్పుడప్పుడే మారుతున్నాయి. శ్రీ మద్ది వెంకటసుబ్బయ్య గారి బంధువులు, యువకులు చాలమంది వివాహానికి వస్తారు. వ్యతిరేకుల ఆట కట్టిపోతుంది. దానితో చీమకుర్తిబసవయ్యగారు యుద్ధరంగం వదిలివేస్తారు; ఇదీ నా ఆలోచన. కాని, మిగిలిన పదివేలమంది వైశ్యులు నా ఆలోచనలో లేరు.

నా బలాబలాలు ఆలోచించుకొని మీటింగుకు హాజరయ్యాను. గుంటూరువారిసత్రం ఆవరణ క్రిక్కిరిసిపోయింది.

చోటు చాలక యిండ్లమీద, చెట్లపైన ఎక్కారు. శాస్త్రిలకు, సాంప్రదాయాలకు విరుద్ధమైనపని చెయ్యకూడదని ఉపన్యసించారు. బాలవితంతువయినా, రజస్వలకాకపోయినా పునర్వివాహం చేయించకూడదన్నారు. వృద్ధులు ఆగ్రహావేశులై వున్నారు. యువకుల ముఖాల్లో నిరుత్సాహం, నిస్సహాయత తాండవమాడుతున్నై.

సభను ఒక హాస్యనాటకంగా మార్చదలచి, మీ తీర్మానాన్ని నే వేమీ లక్ష్యపెట్టను; మీ సంఘం నన్నేమి చెయ్యగల" దని ప్రశ్నించాను. కులంలో వెలివేస్తామన్నారు. నాకు కులం పోయిందన్నాను. ఏడేళ్లు వైశ్యులయింట భోంచెయ్యలేదు. విదేశాల్లోను, జైళ్ళలోను అన్నిజాతులవారితో, మతాలవారితో, కులాలవారితో నా జీవితం గడిచింది. ఆవిధంగా పోని కులంవితంతూద్వాహం చేసుకొన్నవైశ్యులతో భోంచేసినంతమాత్రాన పో"దని హేళనచేశాను. వారితీర్మానం గుంటూరు వైశ్యలకుమాత్రమే అన్వయిస్తుందనీ, ఇతరులకు అన్వయించదనీ, ఇతరళ్లోట్ల అందరమూ పంక్తిభోజనం చెయ్యవచ్చుననీ వాదించాను.

శ్రీ మద్ది వెంకటసుబ్బయ్యగారేమో తబ్బిబ్బయ్యారుకాని "చెంచయ్యమాట వినవ"ద్దని సలహా యిచ్చాడు. రేపటి వివాహానికి రాబోయేది ఆయన బంధువులేననీ, యిచ్చి పుచ్చుకొనే ఇరువైపులవారు పాల్గొంటారనీ, జాగ్రత్తపడమనీ వెంకటసుబ్బయ్యగారిని బెదిరించాను. ఉపయోగపడలేదు. గుంటూరు వైశ్యయువకులు నా పక్షమేననీ, గుంటూరు వైశ్యసంఘాన్ని పార్టీలుగా చీల్చడం నా కిష్టంలేదనీ, వారెవరూ వివాహానికి రావలసిన అవసరంలేదనీ సలహాయిచ్చాను. వారితీర్మానాన్ని నే నొక్కడనే ఆక్షేపించాననీ, తీర్మానం ప్యాసయిందనీ అంగీకరించాను. "పదిహేను

రోజుల్లో ఆ తీర్మానానికి అంత్యక్రియ ు చేస్తా"నని చివరకు వార్నింగిచ్చాను. ఆవిధంగా సభ ముగిసింది.

సభకు శ్రీ చీమకుర్తి కుమారస్వామిగారు అధ్యక్షులు. నాకు చిరకాలమిత్రుడు. సభ పూర్తిఅయిందిగదా, యిక వెళ్దాం రమ్మని పిలిచాను. నా మాటలను అపార్థంచేసుకుని, భయపడ వద్దనీ,నన్ను జాగ్రత్తగా బయటకు తీసుకెళ్తా"ననీ అన్నాడు. "ధైర్యవంతులను నువ్వు చూచివుండవు; ఇప్పుడైనా చూడు" మని గుంపులో కలిశాను. "చంచయ్య," "చంచయ్య" అని అందరూ నిలబడి నాకు దారి యిచ్చారు. అప్పుడు నాకు వారు చూపిన గౌరవాన్ని చూచి, పునర్వివాహోద్యమము గుంటూరులో ముందుముందు జయిస్తుందనే నిశ్చయించుకున్నాను.

కార్యాచరణసంఘసభ్యులంతా వివాహానికి వచ్చారు. వారు తమలాంటి తీవ్రవాదులను, ధైర్యశాలురను వెంటతెచ్చారు. మద్దివారిబంధువులు - చీరాల పట్టాభిరాములుగుప్తగారు, ఏలూరు మాజేటి రామచంద్రరావుగారు వచ్చారు. వీరందరూ వెంకట సుబ్బయ్యగారి యింటికి వెళ్ళారు. వారిని చూడగానే ఆయన మేడమీదిగదిలోకి పోయి తలుపువేసుకున్నారు. తలుపు తెరవ వందున విసుగెత్తి తిరిగివచ్చారు. వారితో మాట్లాడటానికే వెంకటసుబ్బయ్యగారికి మనోధైర్యము లేకపోయింది.

వివాహానికి అనేకమంది వచ్చారు. అభివృద్ధికోరే అన్య కులాలవారుకూడ వచ్చి అభినందించారు. గుంటూరువైశ్యుల్లో నేరెళ్ళ సుబ్బారావుగారు, గ్రంధి సుబ్బరాయగుప్తగారుమాత్రం వచ్చారు. వారిని మాతో కలసి భోంచెయ్యనియ్యలేదు. బ్రతిమ

లాడి వారిని యిండ్లకు పంపివేశాను. లేనిచో వారికి కులంలో వెలి తప్పదు. కష్టాలకు ఓర్చుకోలేరు.

సాయంత్రానికి వూరేగింపు ప్రారంభించారు. ఇది నా కే మాత్రం యిష్టంలేదు. తగాదాలు వస్తాయి. సహపంక్తిభోజనాలు మాత్రమే ముఖ్యం. మేళం లేకుండా ఊరేగింపు బయలుదేరింది. ఒక అద్దెకారులో వధూవరులను ఎక్కించాము. వధువు వయసు పాతికసంవత్సరాలనీ, ముగ్గురు బిడ్డలు పుట్టి పోయారనీ, ఏవేవో పుకార్లు వేశారు వ్యతిరేకులు. ఈ పుకార్లను, మూఢాభిప్రాయాలను పోగొట్టాలనే ఆ ఊరేగింపు ఉద్దేశ్యం. వేనవేలప్రజలు గుంపులు గుంపులుగా (అన్నికులాలవారు) భూమిలోనుంచి పుట్టుకొస్తున్నారా అనేట్టు వచ్చారు. అరండలుపేటలో లాయరు మేడ నుండి వూరేగింపు బయలుదేరింది. జనం క్రిక్కిరిసినందున కారు అగ్రహారంవీధుల్లో పోవడానికి వీలుపడలేదు. చివరకు చౌత్రాకు వెళ్ళాము. ఆ నాలుగువీధులు వైశ్య లుండేవి. కారును మధ్యలో నిలిపి, వధువును నా భుజాలమీద కూర్చోబెట్టుకొని "ఎంతచిన్న పిల్లో చూడండి" అని చూచేవారికి జాలికలిగింప ప్రయత్నించాను. రోడ్డుపక్కలనున్న రాళ్లు, మట్టి విసరసాగారు కొందరు. అల్లరి పెద్దదయింది. రెండుపార్టీలుగా ఏర్పడి కొట్టుకొన్నారు. చాలా మంది వస్తాదులు, అన్నికులాలవారు మాకు అండగా నిలబడ్డారు, గుంపులలో జొరబడి కొట్టారు. ప్రజలు భయపడి ఇండ్లలోకి పారిపోయి తలుపులు బిగించుకొన్నారు. మా పార్టీవారికి దెబ్బలు తగల్లా. వస్తాదులు మొదలయినవారు మాకు అభయమిచ్చి వారి యిష్టప్రకారం ఊరేగింపు జరిపి చివరకు లాయరుమేడవద్ద వదిలారు.

మరునాడు టవున్‌లో విచారించగా షుమారు 32 మందికి దెబ్బలు తగిలినట్టు తెలిసింది. ఈ వివాహాన్ని గురించి వైశ్యుల్లో కొందరికి ముఖ్యంగా ప్లాటుఫారాలమీద వాగేవారికి భయంవేసింది. కొందరు బెజవాడకు పారిపోయారు. మరికొందరు ఊరిలో లేమని చెప్పుకున్నారు.

శ్రీ మద్ది వెంకటసుబ్బయ్యగారి బంధువులకు (వివాహానికి వచ్చినవారికి) వారితమ్ముడు శ్రీ రాధాకృష్ణయ్యగారు విందు చేశారు. వెంకటసుబ్బయ్యగారి యింటికి కూడా ఆ బంధువులు వెళ్ళారు. అక్కడ ఆయనతో ఏకీభవించినవా రెవరూ లేరు. తన యింట్లోనే ఏకాకియై ఆయన ఎంత బాధపడివుంటారో మీరే ఆలోచించండి.

గుంటూరులో వివిధజాతులవాళ్ళం, కులాలవాళ్ళము, అభ్యుదయ భావాలు కలవాళ్ళము, విందులో కలుసుకునేవాళ్ళం. ఒకసారి కొందరు తమాషాకు శ్రీ మద్ది రాధాకృష్ణయ్యకు ఇరుప్రక్కల హరిజనులను కూర్చోబెట్టారు. "వితంతు వివాహంలో భోంచేశావా?" అని ఎవరో అడిగారు. "లే"దన్నాడు శ్రీ రాధాకృష్ణయ్య. "ఎందువల్ల" అని మళ్ళీ అడిగారు. "కులంలో వెలివేస్తారని భయపడి వెళ్ళలే"దని రాధాకృష్ణయ్యగారు జవాబిచ్చారు. "ఇప్పుడు ఇరుప్రక్కల హరిజనులతో కూర్చున్నావే?" అన్నారు మరొకరు. "ఈలాంటి దానిని గురించి వైశ్యసంఘంలో తీర్మానమేమీ లే"దన్నారు రాధాకృష్ణయ్యగారు. అందరం నవ్వాము. ఇలా వున్నై సంఘంలోని నగ్న వైరుధ్యాలు.

పెళ్ళిలో తాంబూలాలు పుచ్చుకున్న గుంటూరు వైశ్యులిద్దరిని శిక్షించటానికి వైశ్యసంఘంవారు సభ నేర్పాటుచేశారు.

శ్రీ మద్ది వెంకటసుబ్బయ్యగారిని ముందుగానే కలుసుకొని "మీ తమ్ముణ్ణి కులబహిష్కారం చేయిస్తారా?" అని అడిగాను. తన భార్యాబిడ్డలవైపు చూచి సమాధానం చెప్పలేకపోయారు. "మీరు మీటింగుకు రాకుంటే బసవయ్యగారూ రా"రని సలహా యిచ్చాను. అలాగే వారిద్దరూ రాలేదు. అందువల్ల కొద్దిమందే మీటింగుకు వచ్చారు. నేనే అధ్యక్షుణ్ణి అయ్యాను. వివాహం చేయించినవారిని ప్రశంసిస్తూ తీర్మానించాము.

15 రోజులకు కొందరు యువకులు మా యింటికి వచ్చి, భోజనం పెట్టండని అడిగారు. నా ప్రథమభార్య అన్నపూర్ణమ్మ తాను వంటచేసి పెట్టజాలనన్నది. వచ్చినవారే వండుకొని భోం చేసి వెళ్ళారు. పెండ్లికి క్రితంనాడు వైశ్యసంఘం చేసిన తీర్మా నానికి అంత్యక్రియలు చేశామని భోంచేసివెళ్ళిన యువకులు ప్రక టించారు. "దొంగతిండి" అని కొంద రాక్షేపించారు. అప్పుడు యువకులు వైశ్య సంఘానికి యీ విషయాన్ని తెలుపుతూ 'ఏం చేస్తారో చెయ్యండి' అని రిజిష్టరు నోటీసు యిచ్చారు. వెంకట సుబ్బయ్యగారు దానిని నాకు చూపించి "చంచయ్యగారూ! ఏదో విధంగా మరచిపోకుండా మీ రీ నోటీసు నిప్పించవచ్చునా?" అని ప్రశ్నించారు. నా కేమీతెలియదనిచెప్పి, అయినా వారిని శిక్షించ మన్నాను. అలా చెయ్యడం తమకిష్టం లేదన్నారు. ఇలాంటి మార్పుకు మరొక కారణంవుంది.

శ్రీ శిఖాకొల్లు పట్టాభిరాములు గుప్తగారిని శిక్షించుటకు మద్ది వెంకటసుబ్బయ్య, చీమకుర్తి బసవయ్యగార్లు చీరాల వెళ్ళి సభ పెట్టించి ఏమేమో చెయ్యదలచారు. మీటింగు ప్రారంభ మయింది. సంఘనాయకులు గుప్తగారికి ఆప్తబంధువులు. వారేమో

మీటింగుకు రాలేదు. ఉప్పులేని పప్పులాగా మీటింగులో పసలేక పోయింది. సభారంభంలోనే తనపేరు ఎత్తిన వారు తన బూటు దెబ్బకు కాచుకొమ్మని బూటును చేత్తో పట్టుకొన్నారు పట్టాభి. మీటింగు ముగిసింది.

కాని, మద్ది వెంకటసుబ్బయ్యగారి కష్టపరంపర పూర్తి కాలేదు. ఇచ్చుకున్నవారి యిళ్ళకూ, పుచ్చుకొన్నవారి యిండ్లకు కూడా పోలేకపోయారు; బంధుత్వాలూ తెగత్రెంపులు చేసుకోలేక పొయ్యారు. భార్యాబిడ్డలే తనతో కలసిరారు. ఏం చేస్తారు? చివరకు లొంగిపోయారు. అయినా మాకు జయం లభించలా. ఇంత రామాయణం జరిగినా, వితంతు వివాహోద్యమంలో మాతో కలిసి వచ్చే వైశ్యులు గుంటూరులో లేకపోయారు. సంఘం వెనుకపడి వున్నదనీ, గాంధీగారి ఉద్యమము గుంటూరు వైశ్యులలో పాక లేదనీ, ఇతర పట్టణాలలో ప్రయత్నించి, కడపటికి గుంటూరులో జయించాలని నిశ్చయానికి వచ్చాము. ముందుగా గుంటూరులో చేసిన కృషిఅంతా వృధాఅయింది. ఏలూరు, బందరు, బెజవాడ, విశాఖపట్టణాలలో వితంతూద్వాహాలు చేయించి కృతకృత్యులం కావడానికి మూడు నాలుగు సంవత్సరాలు పట్టింది. ఈలోగా గుంటూరులో ఎంతోమంది ఆప్తబంధువులున్నా శుభాశుభ కార్యాలకు నన్ను, నాభార్యను పిలవనేలేదు. చాటుగా మాత్రమే నా భార్య అన్నపూర్ణమ్మను పిలుచుకెళ్లి శ్రీ గుంటూరు నరసింహారావుగారి తల్లి, భార్య, అక్కచెల్లెండ్రు ఎవరికీ తెలియకుండా తలుపులు వేసి, కాపలాయుండి, భోజనంపెట్టి పంపుతూండేవారు.

ఇలా 5 సంవత్సరాలు గడిచాయి. వైశ్యకులంలో వితంతూద్వాహాలు సర్వసామాన్యమైనాయి. అప్పుడు గుంటూరు

వైశ్యులే ఒక వితంతు వివాహాన్ని ఏర్పాటుచేసి నన్ను ఆహ్వానించారు. అప్పుడు నేను మద్రాసులో వుంటున్నాను. వివాహంలో నాకు పూలదండవేసి గౌరవించారు. మొదటి వివాహ సందర్భంలో రాళ్లు, మట్టి విసరికొట్టిన సంగతి జ్ఞాపకం చేశాను. అప్పు డొకరు పూలు తెచ్చి నామీద చల్లి "ఆ చేతులతోనే ఇప్పుడు పూలు చల్లుతున్నా"మన్నారు. అందరం ఆనందించాము. గుంటూరు వైశ్యులతోకూడ పంక్తిభోజనం జరిగింది.

అయినప్పటికి శ్రీ మద్ది వెంకటసుబ్బయ్యగారు కాలవాహిని కెదురు ఈదాలనే ప్రయత్నం మానలేదు. చీరాలలో నా మిత్రులు శిఖాకొల్లు పట్టాభిగారి యింటికి వెళ్ళాను. మద్దవారిమనుమరాలు ఆ యింటి కోడలు. శ్రీ వెంకటసుబ్బయ్యగారు కూడా వున్నారు. నాతోకలసి భోంచెయ్యరు. ఏంచెయ్యాలనేసమస్య ఇంటివారికి. వెంకటసుబ్బయ్యగారు భోంచేసినతరువాత నేను భోంచేస్తానని చెప్పాను. అందుకు వా రంగీకరించలేదు. వెంకటసుబ్బయ్యగారికే ఆఖరున భోజనం పెట్టారు.

## ఏలూరులో వైశ్య వితంతు వివాహం

తలవని తలంపుగా మిత్రులు శ్రీ మోతే నారాయణరావుగారు, నేనూ రైల్లో ఏలూరుకు కలిసి ప్రయాణంచేశాము. గుంటూరులో జరిగిన వితంతూద్వాహాన్నిగురించి ప్రస్తావించారు. ఎందుకు రాలేదన్నాను. ఏదో పనివుండి రాలేదన్నారు; ఏలూరు స్టేషనులో దిగినప్పుడు తమయింటికి రమ్మని ఆహ్వానించారు. నేను రానన్నాను: "అరణా లిస్తే హోటల్లో భోజనం పెడతారులెం" డన్నాను.

"గుంటూరులో జరిగిన వివాహానికి రానందుకు నీకు కోపంగావుంది. నిజానికి ఉండవలసిందే; అన్ని కష్టాలు వచ్చి నప్పుడు, నేను మీతో సహకరించకపోవడం మంచిపనికాదు. ముందు జరుగబోయే వితంతువివాహాన్ని ఏలూరులో చేయిస్తా" నని సమాధానపరచి నన్ను తనయింటికి తీసుకెళ్ళారు. నా ఆనం దానికి మేరలేకపోయింది. ఆనాడే శ్రీ మాజేటి రామచంద్రరావు, శ్రీ జవ్వాజి అప్పారావుగుప్త, శ్రీ చింతా సోమరాజు వగైరా మా పార్టీ యువకనాయకులను రప్పించి ఆలోచించి కార్యావరణకు ప్లానువేశాము. జరుగబోయే వితంతువివాహాన్ని ఏలూరులోని వైశ్యయువకులనందరిని సంఘటితపరచి, కట్టుదిట్టాలతో నారాయణరావుగారి నాయకత్వాన జరపాలని తీర్మానించుకున్నాము.

శ్రీ మద్ది వెంకటసుబ్బయ్యగారికి కలిగిన చిక్కులు, కష్టాలు తెలిసిపోయినందున ఏపట్టణంలో వివాహం చేయించినా అక్కడి వైశ్యసంఘనాయకుల ఆటకట్టించుటకు వారి కొడుకులనో అల్లుళ్ళనో, మనుమలనో, మా ఉద్యమంలోకి దింపడం అవసర మని తోచింది. శ్రీ మోతే నారాయణరావుగారు చేరడంతో శ్రీ గంగరాజుగారు మొదలైన వైశ్యనాయకుల ఆట కట్టింపగల మని ఆశించాము.

బళ్లారినుండి ఒక మిత్రుడొక యువతిని నావద్దకు పంపారు. ఆ వితంతువుకు వివాహం చేయించాలి. బళ్లారిలో గుమాస్తాగా వున్న ఒక గుంటూరు యువకునికి ఆమెకు ఏలూరులో వివాహం చేయించుటకు నిశ్చయించాము. నారాయణరావుగారు వ్యాపారనిమిత్తం కళ్ళికోటకు వెళ్లారు. పెండ్లిరోజుకు వస్తానని హామీ యిచ్చారు. శ్రీ మాజేటి రామచంద్రరావు వగైరాలు

వివాహం గొప్పగా చేయించాలని పెద్దపెద్ద ఏర్పాట్లు సాగించారు. శ్రీ గంగరాజు వగైరాలు ప్రతిఘటింప పూనుకున్నారు వారు శ్రీమంతులు. అనేకమంది వైశ్యులకు అప్పు సప్పులిచ్చి తమ పలుకుబడిలో వుంచుకున్నవారు. పగ సాధించాలంటే ఎవరినైనా చిక్కుల్లో పెట్టగలరు; అప్పుపత్రాలను కొని దివాలాతీయించగల సమర్థులు. అయినప్పటికి, ఈయనను లక్ష్యపెట్టని ధనికులు, వ్యాపారస్తులుకూడా ఏలూరులో వున్నారు.

గుంటూరులో నేర్చుకొన్న గుణపాఠంతో మేము బహిరంగసభలు మానేశాము. వివాహానికి రెండురోజులు ముందుగా శ్రీ గంగరాజుగారిపార్టీ వైశ్యుల సభ నొకదాన్ని పెట్టారు. ఆసభకు వచ్చినవారిలో ఎక్కువమంది మా పార్టీవారే. వృద్ధుల ఆట సాగలేదు. సభ మధ్యలో లేచిపోయి, శ్రీ గంగరాజుగారి మేడలో రహస్యంగా చేరి కుల బహిష్కారం చెయ్యడానికి తీర్మానించారు. తలవని తలంపుగా శ్రీరంగంగారి (బలభద్రపు రామకృష్ణయ్య) పార్టీవారు పూర్తిగా మాతోకలసి పనిచేయసాగారు. శ్రీ నారాయణరావుగారు లేనిసమయంలో శ్రీరంగంగారు నాయకత్వం వహించి ధైర్యసాహసాలతోనేగాక, అతి చాకచక్యంగా పనులు నిర్వహించారు. స్థానిక వైశ్యయువకులు మాతో కలసి పనిచేశారు. వృద్ధులలోకూడ కొందరు మా పక్షమే; స్త్రీలనేకమంది ముందుకు వచ్చి తోడ్పడ్డారు.

## వ రా ప హ ర ణ ం

పెండ్లికి ముందురోజున గంగరాజుగారు వరునికి రు 5000/లు లంచమిచ్చి, వేరే వివాహం ఏర్పాటుచేయడమే గాక, వరుణ్ణి

దాచిపెట్టేశారనే వదంతి తెలిసి ఇంటింటికివెళ్లి పేరంటానికి పిలుస్తున్న మాపార్టీ స్త్రీలు నిరుత్సాహపడి పిలుపులు మానేశారు. పెళ్ళిప్రయత్నాలు పూర్తిగా మానేస్తారని భయపడ్డాము. శ్రీరంగంగారే అధైర్యపడ్డారు "మా గంగరాజుగారి నడత మీకు తెలియదు. వరుణ్ణి తీసుకురం"డని నాకు వార్నింగు- ఆజ్ఞ యిచ్చారు. నా కేమీ తోచలేదు.

నూటికి నూరుపాళ్లు నేను చేసేది న్యాయమనీ, ఏం చెయ్యాలో తోచనప్పుడు, కార్యసాఫల్యానికి సాత్వికమార్గం కనబడనప్పుడు అప్రయత్నంగా నేను దౌర్జన్యానికి దిగుతాను. ఈ పద్ధతి నా రెండో స్వభావంగా ఏర్పడిపోయింది. గంగరాజుగారిని లొంగదీయటానికి దౌర్జన్య మార్గం మాత్రమే కనపడింది.

శ్రీ గంగరాజుగారికి నా యం దెంతోవాత్సల్యం, గౌరవం వుండేవి. నన్ను భోజనానికి ఆహ్వానించి తాను నాతో కూర్చుని అది, ఇది వడ్డించండని చెపుతూ, బాగా తినుమని నన్ను నిర్బంధించేవారు. అల్లుళ్ళకైనా అలాంటి మర్యాద చేసేవాడుకాదు. అలాంటి మేమిద్దరం రెండుపార్టీలకు నాయకులుగా పోట్లాడవలసిన సందర్భం ఏర్పడింది.

గంగరాజుగారు ఎంత ఐశ్వర్యవంతులైనా అతిభయస్థుడు. కానిస్టేబులు వచ్చి ఇన్స్పెక్టరుగారు పిలుస్తున్నారంటే వెళ్తారు. ఇనస్పెక్టరు తన యింటికి వస్తే కుర్చీలో కూర్చునేవరకు తాను నిలబడేవారు. అలాంటివారిని బెదరించడం సులభమేగదా!

వెంటనే గంగరాజుగారియింటికి వెళ్లాను. ప్రతికక్షులెందరో వున్నారక్కడ. ఎటూ చూడకుండా తిన్నగా గంగరాజుగారివద్దకు వెళ్ళగానే "కూర్చోండి" "కూర్చోండి" అని మర్యాద ప్రారంభిం

చారు. "మీతో ప్రత్యేకంగా మాట్లాడాలి; వరండాలోకి రం"డని దారితీశాను. "మీయందు నా కెంతో గౌరవమున్నదని మీకూ తెలుసు. వివాహ విషయంలో రెండుపార్టీలుగా చీలిపోయాము; మన మిద్దరమే రెండు పక్షాలకు నాయకులం. న్యాయంగా పోట్లాడు దాం! మా వరుణ్ణి దాచిపెట్టావు. అది న్యాయంకాదు" అన్నాను. "లేదు; లేదు. దాచిపెట్టలే"దన్నారు గంగరాజుగారు. "నా సంగతి తెలుసుకదా! నాలుగున్నర సంవత్సరాలు ఏడు జైళ్ళలోగడిపాను. జైలరునే తన్నాను. నాకు కోపంవచ్చి ఏమైనా చేస్తే ఏ ఆరుమా సాలో జైల్లో ఉండక తప్పదు. కాని, నీకో! తరతరాలుగా గౌరవం పోతుంది. మరి నీయిష్టం, ఆలోచించుకో" అని బెదరించాను. భయపడిపోయాడు. "దాయలేదు. ఇప్పుడే నీతో పంపుతా, తీసు కెళ్ళు"మన్నాడు. అలాకాదు, మాజేటి వారి ఇంటికి పంపమన్నాను. పరేనన్నారు. నేను మాజేటివారింటికి వెళ్ళి నా పార్టీవారిని కలుసు కొని, జరిగింది చెప్పాను. "అయ్యో! ఆ మోసగాని మాటలు నమ్మి వచ్చావా! వరుణ్ణో పంప"దని నిరుత్సాహ పడ్డారు. అంతలో వరుడు బండిలోనుండి దిగాడు. నా స్నేహితులు ఆశ్చర్యపడ్డారు. మరల ఉత్సాహంతో పని సాగించారు.

నారాయణరావుగారు మెయిలులో వస్తున్నామని మాకు టెలిగ్రాము యిచ్చారు. ఆయన్ను రానివ్వకుండా బెజవాడలోనే ఆపివెయ్యడానికి, ఆరాత్రే కొందరిని గంగరాజుగారు పంపుతు న్నట్టు మాకు తెలిసింది. అంతకంటే పెద్ద ప్లానును మా నాయ కుడు శ్రీరంగంగారు వేశారు. నారాయణరావుగారిని తెనాలిలోనే కలుసుకోమని మేము కొందరినిపంపాము. "గంగరాజుబాబాయి" గారితో ఎదుటపడి పోట్లాడడం నారాయణరావు గారికి ఎంత

మాత్రం యిష్టంలేదు. ఒకఉపాయం చెప్పారు:-"గంగరాజుగారి ఏజంట్లు చెప్పినట్లే బెజవాడలోనే ఉంటానని దిగేస్తాను. వారిని నమ్మించి ఏలూరు పంపేస్తాను. నేను ఉదయం ప్యాసెంజరులో బయలుదేరి వస్తాను. వట్లూరు స్టేషనుకు కారు పంపం"దని కబురంపారు. అలాగే చేశాం; కాని, కారులో తిన్నగా వివాహం జరిగే తావుకు రాకుండా, తన యింటికి వెళ్లారు రావుగారు.

వా రెంత ముందడుగు వేస్తారో: ఆయన తల్లి, భార్య అంత వెనుకకు లాగుతారు. పెళ్ళికి వెళ్లొద్దని నిర్బంధించారు. కూతుళ్ళకు వివాహాలు జరగవనీ, జరిగినా సరియైన సంబంధాలు కుదరవనీ, ఇతరుల గొడవలు తమకెందుకనీ చెప్పడమేగాక, పోనిచ్చేదిలేదని గుమ్మానికడ్డంగా భార్య కూర్చున్నారు. "గంగరాజుగారు వస్తున్నారు. ఇంటిదగ్గరే వుండమన్నా"రనే కబురు వెళ్లింది. వెంటనే ఒక్కదూకుతో గుమ్మం దాటి కారులో వివాహస్థలానికి వచ్చారు.

మా పార్టీవారికి ధైర్యం చిక్కింది. వివాహం జరుగుతూండగా గంగరాజుగారు వీధిలో కారులోనే వుండి నారాయణరావును రమ్మని కబురంపారు. "వివాహం పూర్తిచేయించి భోంచేసి వస్తా" నని చెప్పి పంపారు నారాయణరావుగారు.

వివాహం వైభవంగా జరిగింది. వేలమంది భోంచేశారు. వరునికి బహుమతులు చదివించారు. శ్రీ నారాయణరావుగారే రు. 116/- లతో ప్రారంభించారు; ల మొత్తం రు 1116-0-0 కు పైనే చదివించారు. సాయంత్రం ఊరేగింపులో వేలాది జనం పాల్గొన్నారు. ఉత్సాహం వెల్లివిరిసింది. రాత్రికి వధూవరులకు నిషేకం ఏర్పాటుచేసే విషయంలో "మా ఇంటో" "మాయింట్లో"

నని పోటీలు పడ్డారు! అప్పుడూ ఇప్పుడూకూడా వితంతు వివాహాల విషయంలో కుటుంబమంతా కలిసి ఉత్సాహంతో సహాయపడుతున్న శ్రీ జవ్వాజి అప్పారావుగుప్తగారి యింట్లో ఏర్పాటుకు ఏకగ్రీవంగా అంగీకరించాము. వధూవరులను పాన్పుమీదకూర్చోబెట్టినప్పుడు నారాయణరావుగారు 'బ్రహ్మవ్రాతఅంటారే! అ దెక్కడికి పోయింది ఇప్పుడు? మనవ్రాత మన చేతుల్లోనే ఉన్న"దని సమయస్ఫూర్తిగా మాట్లాడారు. అనేక మంది వధూవరులను ఆహ్వానించి విందులు చేసి బహుమతులిచ్చారు. ఈవిధంగా వివాహం దిగ్విజయంగా జరిగిపోయింది.

## ఎత్తుపై ఎత్తు

అయితే, మరునాడే వివాహంలో పాల్గొన్నవారిని బహిష్కరించేందుకు గంగరాజుగారు సభ నేర్పాటుచేశారు. వైశ్యులందరు రావలసిందని నోటీసులు పంపారు. అదే వారి పొరపాటు. మేమందరం ప్లాను వేసుకొని వెళ్ళాం. ఎవరెవ రెలా మాట్లాడాలో, ఏమి తీర్మానంచెయ్యాలో నిశ్చయించుకున్నాం. శ్రీ నారాయణరావుగారే అధ్యక్షుడుగా వుంటానికి సమ్మతించారు.

నారాయణరావుగారు సభకు రాగానే గంగరాజుగారు ప్రత్యేకంగామాట్లాడటానికి వరండాలోకి పిలిచారు నారాయణరావుగారిని. సభ పూర్తికాగానే కలుసుకుంటానని నారాయణరావుగారు జవాబు పంపారు. సభకు అధ్యక్షుడుగా ఉండుటకు ఎదురుకక్షి గంగరాజుగారిని, మేము నారాయణరావుగారిని ప్రతిపాదించాము. మేము పద్ధతిప్రకారం సెకెండుచేశాము; వారలా చెయ్యలా. రూల్సుప్రకారం నారాయణరావుగా రొక్కరే



శ్రీ పవార్ నారాయణరావు



శ్రీ జవ్వాజి అప్పారావుగుప్త

అభ్యర్థియని చెప్పి కుర్చీలో కూర్చోబెట్టాము. గంగరాజుగారి ముఠా లేచిపొయ్యారు. మేము గెలిచాం.

గెలిస్తే ఏం ప్రయోజనం? ఏలూరు వైశ్యసంఘంలో రెండు పార్టీలు ఏర్పడినై. అయినవాళ్లెన్నాళ్లు విడిపోయిఉండగలరు? శుభాశుభకార్యాలలో పిలుపులు మానేసుకున్నారు. వంటకోమట్లు, నీళ్ళ కోమట్లు భయపడ్డారు. సంస్కారప్రియుల యిండ్లలో పని చేయటం మానేశారు. క్రొత్తవారిని తెచ్చుకోవాల్సివచ్చింది. మాజేటి రామచంద్రరావులాంటివారు కూడ మంచినీళ్లబిందెలు మోసుకోకతప్పలేదు. రెండుపార్టీలకు విసుగెత్తింది; 6 నెలలకు కలసిపోయారు. కాని, అందరూ వితంతూద్వాహాలకు సమ్మతించనే లేదు. అయితే, గుంటూరుకంటే ముందుకు వెళ్ళాము.

ఈ ఏలూరు వివాహంలోకూడ మామీద దౌర్జన్యంచేయుటకు ప్రయత్నించారు. వివాహంజరిగేటప్పుడు, ఊరేగింపులోను శ్రీ వుస్తాద్ పాపోలు వీరవెంకయ్యగారు నావెంట వుండేవారు. శ్రీ జవ్వాది అప్పారావుగారియింటిలో పాన్పు జరిగినతర్వాత విందులో ఆ నాయుడుగారూ వున్నాడు. ఉస్తాద్‌గారిచర్య నచ్చక "నా వెంటపడడానికి కారణమేమని" కోపంతో అడిగాను. అప్పుడందరిఎదుట ఏలూరులో మా పార్టీయువకులు తన శిష్యులనీ, గంగరాజుగారి ప్రోద్బలంతో మరో తాలింఖానాలోని రౌడీలు నన్ను కొట్టడానికి చూస్తున్నట్లు తెలిసి నాకు బాడీగార్డుగా వుంటున్నామనీ చెప్పారు. ఇది విని అందరూ ఆయన్ను అభినందించారు. నాకు ఆశ్చర్యంకలిగింది.

## ఉద్యమ వ్యాప్తి

ఆరుమాసాలలో బందరు, విశాఖపట్టణాలలో ఏ ఆటంకాలు లేకుండా ప్రజాఉద్యమంగా మారిపోయినది. ఏలూరులో మరొక వివాహంకూడ చేయించాము. కొందరువైశ్యులు పంక్తిభోజనానికి వచ్చారు. సంఘం ఎవరినీ ఆక్షేపించలేదు. ఈవిధంగా జయించాము. వివాహాలు చురుకుగానే జరిగిపోయాయి. రెండుమూడుసంవత్సరాలలో ఎవరింటిలోవారే మామూలువివాహాల్లాగ జరుపుకోసాగారు. కష్టాలు తొలగిపోగానే శ్రీమంతులుకూడ వితంతువివాహాలు ప్రారంభించారు. వారు రంగంలోకి రాగానే కట్నాలు, బేరాలు ప్రారంభమైనాయి. ప్రస్తుతం ఏలూరులో ప్రతి వైశ్య కుటుంబంలోను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పునర్వివాహంతో సంబంధం లేనివారే అరుదు.

ఇప్పుడు ఇతరులు మానేసినా, శ్రీ జవ్వాజి అప్పారావు గుప్తగారు, వారికుటుంబము తమ విద్యుక్తధర్మాన్ని నెరవేర్చుకుంటూనే వున్నారు. ఎందరో అనాధలు (అన్నికులాలవారు) వీరి సహాయం పొందుతున్నారు. వారిని నేనెంతో అభినందించుతున్నాను. ఇలాంటివారి వల్ల ప్రతిచోట ఆ ఉద్యమము ముందుకు పోతూనేవున్నది.

## కె. యస్. గుప్తగారి ఎదురుదెబ్బ

గుంటూరు, ఏలూరు పట్టణాలలో మేము జయించజాలనందుకు శ్రీ కె. యస్. గుప్తగారు మమ్మలను ఖండించాడు. తాను చేసి చూపుతానని, మూడవ వితంతూద్వాహాన్ని విశాఖపట్టణంలో చేయించాడు. ఇంటింటికి పోయి తాను, తనభార్య పిలిచి

వివాహానికి రాని వైశ్యుల్ని కులబహిష్కారం చేయించుతానని వీధుల్లో బహిరంగంగా హెచ్చరించాడు. వివాహానికి అయిదారు కుటుంబాలవారు రాలేదు. మరునాడు వారు గుప్తగారింటికి వెళ్ళి, రానందుకు క్షమాపణకోరి, ముందు జరగబోయేవివాహాన్ని తమ ఖర్చుతో చేయించుతామని మాట యిచ్చి వెళ్లారు. సంఘంలో ప్రజామోదంతో ప్రధమ వితంతూద్వాహం విశాఖపట్టణంలో జరిగింది. శ్రీ కందుకూరి వీరేశలింగంగారు ప్రారంభించిన యాభై సంవత్సరాలకు ఆయన ఉద్దేశ్యం ఫలించింది. తదాది ఆ జిల్లాలో నిరాటంకంగా ఎన్నో జరిగిపోతున్నాయి.

బందరులో

బందరులో వితంతు వివాహాన్ని జయప్రదంగా ప్రజామోదంతో చేయించగలనని శ్రీ యం. ఎల్. ఎన్. గుప్తగారు మా కమిటీతో చెప్పి అవకాశం సంపాదించుకొన్నారు. గుంటూరులో వలెనే బందరు వైశ్యులు వైదిక బ్రాహ్మణులతో ఎన్నోతరాలుగా పోటీపడి వైదిక సాంప్రదాయాలలో ఊరిపోయారు; వైశ్య వితంతువులకు వెంట్రుకలు తీయించడం బందరులో ప్రారంభమై గుంటూరుకు పాకింది. బందరులో జయించడం కష్టమని తలచి ఆ పట్టణానికి అవకాశం ఇవ్వకుండానే ఇతర పట్టణాలకు యిస్తూ వచ్చాను. అయితే, బందరులో యువకులతో పోట్లాడుటకు సనాతనులకు గుండెధైర్యం లేదని వివాహకాలమందు నాకు తెలిసింది. చుట్టుపట్ల గ్రామాలనుండి షుమారు పదివేలమంది వచ్చి వివాహం చూచి ఆనందించారు. అయిదువేలమంది దాకా సహపంక్తి భోజనం చేశారు. డబ్బు వసూలుచెయ్యకనే ఇన్నివేలమందికిభోజనాలు పెట్టారు. ఏవస్తువు లేకపోయినా వాలంటీర్లు ఎడ్లబండిని బజారుకు

తీసుకెళ్ళి అడిగీ అడుగకముందే వైశ్యవర్తకులు, ఇతరవర్తకులు బందీనింపేశేవారు. ఈ సంస్కరణ ప్రజామోదంపొందినదనుటకు ఏలాంటి సందేహం లేదని రూఢి అయింది.

ఇప్పుడు బందరులోనే వైశ్యులలో షుమారు అరవై కాపు రాలవారు వితంతువివాహం చేసుకొన్నవా రున్నారు. ఎలాంటి అరమర లేకుండా కలిసిపోయారు. శ్రీ యమ్. లక్ష్మినారాయణ గుప్తగారు ఇప్పటికీ ఉత్సాహంతో వివాహాలు చేయిస్తూ, ఆ కుటుం బాలవారి కష్టసుఖాలను తండ్రిలాగ విచారించుతూనే వున్నారు. ఇలాంటివారు ఉండడం వల్లనే, సంఘసంస్కరణోద్యమాలు జయప్రదంగా జరుగుతున్నాయి. అలాంటివారే అన్నికులాలలోను అందరి ఆమోదం పొందుచున్నారు.

ఇంకా అనేకం

ఆంధ్రదేశమంతటా ఇంతజరిగిన తరువాత మరల గుంటూ రులో వివాహం చేయించాము. కాని గుంటూరువైశ్యులు ఒక్కరూ రాలేదు. చీరాలనుంచి ఒక్కరు మాత్రం వచ్చి, తాంబూలం మాత్రమే తీసుకొని వెళ్ళారు. భోంచేయుటకు సమ్మతించనే లేదు. కాబట్టి గుంటూరులో మరొకసారి ఓడిపోయాము. వైశ్యకులం మీద వైదికబ్రాహ్మల ఆధిపత్యం పోయినా, వారి స్థాన మాత్ర మించిన వైదిక వైశ్యులు కాలప్రవాహానికి ఎదురీదుచునే వుండిరి. ఎందరో వైశ్యవర్తకులు గుంటూరులో ఉన్నారు. ఆచరణలో ఒక్క రైనా సహాయపడలేదు. వివాహమనగానే పరారయ్యేవారు.

అయినప్పటికి, అప్పటికే ఉద్యమసందర్భంలో మా యిం టికి వచ్చివెళ్లేవారిసంఖ్య హెచ్చిపోయింది. నేను గుంటూరు బ్రాడీపేటలో కాపురముంటున్నాను. మా యిల్లు తెలియనివారు

ఆ వీధిలో ఎందరి నెంత శ్రమపెట్టారోగాని, ఒకనాటిరాత్రి మా గోడమీద ఎవరో "వెధవముండలపెళ్ళిళ్లు చేయించే దరిశి చంచయ్యగారి యిల్లు యిదే" నని వ్రాశారు.

దానినిబట్టి నే నెంత చెడ్డపేరు పొందానో తెలుసుకున్నాను. ఆ యింట్లో కాపురమున్నంతవరకు గోడమీద అలాగే ఉండనిచ్చాను. చెడ్డపేరు నా కెప్పుడూ ఉంటూనేవుంది.

ఉద్యమము ప్రారంభించిన మూడుసంవత్సరాలకు (1928 సం॥లో) బెజవాడ వితంతువు (శ్రీ దోమా వెంకటస్వామిగుప్తగారి మరదలు)కు ఏలూరులో వివాహం చేయించాము. ఎవరైనా వితంతువు వివాహం చేసుకోదలచి రాగానే, ఉత్సాహంగలవారు తమ యింటికి తీసుకెళ్ళి, తమ పెంపుడుబిడ్డగా భావించి, వివాహం చేయించడం బాగుంటుందని నిశ్చయించుకున్నాం. సంతుల్లేని శ్రీ తుంపూడి భగవంతంగుప్తగారు ఆమెను తన పెంపుడుబిడ్డగా చూచుకొనుచుండిరి. ఎంతో ప్రేమతో ఆ బిడ్డకు సహాయంచేశారు. అయితే, ఆయనభార్య సమ్మతించలేదు; నల్లమందు తిని చావుకు సిద్ధమైనది. డాక్టర్లసహాయంతో బాగుచేయించి, తన ఉద్దేశ్యాన్ని ఎంతమాత్రం మానుకొనుటలేదని భార్యతో గట్టిగా చెప్పారు. ముగ్గురు కొడుకులు, కోడళ్లు గుప్తగారిపక్షం వహించారు. తన భార్య సహాయం లేనందున, శ్రీ మోతే నారాయణరావుగారితోడ్పాటుతో ఏలూరులో వివాహం చేయించారు. వివాహానికి గుప్తగారు తన భార్యను పిలువకుండా వధువు వగైరాలతో కలిసి ఏలూరు వచ్చారు. గుప్తగారిభార్య మనసుమార్చుకొని, తానూ పెండ్లికి వచ్చారు. పెండ్లిలో పీటలమీదకూడ కూర్చుని చేయించింది.

వధువు తలిదండ్రులు బెజవాడ రైలుస్టేషనులో కూతురును చూడటానికి వచ్చి, బండికదిలినందున వివాహానికి రావలసి వచ్చింది. బెజవాడలో వారికి కులబహిష్కారం జరుగుననీ, మాకు సహాయంచేసే వైశ్యు లుండరనీ మేము గ్రహించి స్వంతతల్లి దండ్రులను వివాహానికి రావద్దని ముందే సలహా యిచ్చాము. వచ్చినాక సహపంక్తిభోజనం చెయ్యకుండా జాగ్రత్తపడమనికూడా వారిని హెచ్చరించాము; కాని ఆ ఉత్సాహంలో వారుకూడా భోంచేశారు. బెజవాడకు తిరిగి వెళ్ళగానే వారిని శిక్షించుటకు ఛాందసులు ప్రయత్నించారు. నే నప్పుడు బెజవాడలోనే కాపుర ముంటున్నాను. నేను అనుకోనివిధంగా బెజవాడవైశ్యయువకులు తమపెద్దల నెదిరించి వారి ఆటకట్టించారు. ఈ సందర్భంలో శ్రీ అన్నవరపు సుబ్బారావుగుప్తగారు చాలా ప్రయాసపడ్డారు. శ్రీ చుండూరి వెంకటరెడ్డి, వారిసోదరులు, శ్రీ చిట్టూరి రామ కృష్ణయ్యగారు పాటుపడినారు. దానితో బెజవాడలో ఉద్యమం కొంత బలపడింది.

ఈవిధంగా మూడుసంవత్సరాలపాటు వైశ్యసంఘనాయకు లతో పోరాడుతూవచ్చాం. ప్రారంభించినఐదేండ్లకు (1930) గుం టూరువైశ్యులే ఒకవివాహ న్నేర్పాటుచేసి, నన్నాహ్వానించి "రాళ్లు వేసినచేతులతో పూలువేశారు." అప్పటికే అన్నిచోట్ల వందలాదిగా వితంతువివాహాలు అన్నికులాలలో జరిగాయి. ఎవరింటిలో వారు వైశ్యులు, కమ్మవారు మాత్రమే చేయించుతూవచ్చారు. అయినా ఒక వితంతుశరణాలయం అవసరమనితోచింది.

### వి తం తు శ ర ణా ల య స్థా ప న

నేను 1930 లో మద్రాసులో కాపురంపెట్టాను. శ్రీ ముత్తా



శ్రీ యేటూరి వెంకట సుబ్బయ్యశెట్టి

వెంకటసుబ్బారావుగారు, శ్రీ తుంపూడి భగవంతం గుప్తగారు, నేను కలసి మద్రాసులో ఒక వితంతుశరణాలయాన్ని స్థాపించాము. అన్నికులాల వితంతువులకు ఆశ్రయం యిచ్చాము. 4-5 సం॥లు బాగా జరిగిపోయింది. అంతట కొన్ని కారణాలవల్ల, ముఖ్యంగా నిర్వహించలేక మానేశాము. తరువాత నర్సాపురంలో నా మిత్రుడు శ్రీ అద్దేపల్లి సర్వాశెట్టిగారు జయప్రదంగా ఒక శరణాలయాన్ని నిర్వహించడమేగాక, ఆంధ్రదేశంలో నర్సాపురమే ఆ ఉద్యమానికి ముఖ్యకేంద్రంగా వృద్ధికి తెచ్చారు.

ఇతర కులాలలో వితంతు వివాహోద్యమము బలపడిన వివరాలకు ముందు ఈ ఉద్యమానికి తోడ్పడిన వైశ్య ప్రముఖులను గురించి వ్రాస్తాను.

## వైశ్య సంస్కర్తలు

శ్రీ యేటూరి వెంకటసుబ్బయ్యగారిది కడపజిల్లా వేంపల్లి గ్రామం. వారు నాతో కాలేజిలో చదువుకున్నారు. ఈయన వధువులను రాయలసీమనుండి తెచ్చేవారు. ఆ వితంతువులకు సర్కార్ జిల్లాలలో వివాహాలు చేయించుచుంటిమి. శ్రీ వెంకటసుబ్బయ్యగా రెందరినో తెచ్చి ఉద్యమాన్ని జయప్రదం చేయించారు. క్రమంగా రాయలసీమలోనే వివాహాలు జరిపించుతూవచ్చారు. వితంతువు లే కులానికి చెందినా తలిదండ్రులను ఒప్పించి, సహాయం చేసేవారు.

శ్రీ సి. యస్. గుప్తగారు (నెల్లూరు) నా బాల్యస్నేహితుడు. తన పోలీసు సర్కిల్ ఇన్స్పెక్టర్ హోదాను వితంతూద్వాహాలకు ఉపయోగించేవారు. ఇప్పటికీ వివాహాలు చేయించు

తూనే వున్నారు. వీరినిగురించి ఒకమంచి కథ ఉన్నది. మే మొక వితంతువును మేనమామలపద్దనుండి రహస్యంగా తప్పించి మద్రాసుకు తీసుకురావలసివచ్చింది. ఆ గ్రామం ఈ పోలీసు యిన్స్పెక్టర్‌గారి రేంజిలోది. పిల్లను తప్పించుకొని తీసుకొచ్చే పని నాయనకు పప్పగించాము. ఆ ప్రయత్నం సందర్భంలో ఆమెను ప్రేమించి తానే వివాహం చేసికొన్నారు. ఈ దంపతు లిప్పుడు ఇంటినిండా బిడ్డలతో, పెన్షను అనుభవిస్తూ సుఖంగా ఉన్నారు.

బందరులో శ్రీ లింగమల్లు జగన్నాథంగారు మా ఉద్యమా రంభంలో కార్యదర్శిగా వుండి ఉత్సాహంతో నాకు కుడిభుజంగా పనిచేయుచుండిరి. ఒక వితంతువు వివాహం చేసుకోదలచి, తన మారుతల్లిపద్దనుండి తప్పించమని ప్రార్థించినది. ఆ పనిని నిర్వ హించుటకు శ్రీ జగన్నాథంగారిని పంపాను. ఆ ప్రయత్నాల సంద ర్భంలో ఆమెఆయన్నే తన్ను వివాహం చేసుకోడానికి ఒప్పించింది. అయితే వివాహం జరగలేదు. వధువు మనసు మార్చుకొన్నది. ఆ దుఃఖంతో ఆయన చనిపోయారు. వారి మరణంతో నాకు వుద్యమనిర్వహణ చాల కష్టమయింది.

శ్రీ కె. కృష్ణరావుగారు ఆంధ్ర యూనివర్సిటీ ఆఫీసులో మేనేజరు. ఆయన కష్టమైన పనులు చేయుటకు సిద్ధపడేవారు. తల్లిదండ్రులపద్దనుండి రహస్యంగా వితంతువులను తప్పించడ మంటే కృష్ణరావుగారికి చాలా యిష్టం. అపాయాన్ని లెక్కచేసే వారుకాదు.

ప్రొద్దుటూరువాస్తవ్యులు శ్రీ కొప్పరపు సుబ్బయ్యగారు ఆ జిల్లా వైశ్య నాయకులు. ఈ ఉద్యమానికి తమ పలుకుబడి

నుపయోగించారు. ప్రత్యక్షంగావచ్చి సహాయంచెయ్యలేదు; కాని, ఆ జిల్లాలో వితంతువివాహం చేసుకొన్న వారికి ఎలాగో కుల బహిష్కారం లేకుండా సహపంక్తిభోజనాలు పెట్టించి, కష్టాలను తొలగించుతూవచ్చారు.

వైశ్యులలో ఇప్పుడు వయస్సుకు సంబంధించిన ఆటంకాలు కాని, బిడ్డలున్నారనేఆటంకాలు గాని, పునర్వివాహవిషయంలో సంఘసంబంధమైన బాధలుగాని ఎంతమాత్రం లేవు. శ్రీ కందుకూరి వీరేశలింగంగారిఉద్దేశ్యం వైశ్యసంఘములో పూర్తిగా నెరవేరింది.

అమెరికాలో నే నొక విచిత్రవివాహం చూచాను. వధూవరులు 70 సం॥ల కంటె అధికవయస్కులు. ఇద్దరికి పూర్వవివాహాలవల్ల మునిమనుమలు, మనుమరాండ్రు ఉన్నారు. ఆ అవ్వ, తాతలు నాకు పొరుగునవుండే పరిచితులే. వివాహం చేసుకొన్నందుకు వారిని చాలమంది అభినందించారు. వారిలో నే నొకడిని. వా రెందుకు వివాహం చేసుకున్నారో చెప్పమన్నాను. వారు "చిన్నప్పుడు బ్రతుకుతెరువుకోసం ఇంగ్లాండువదలి ఆస్ట్రేలియాకు వెళ్లాం. అక్కడే పరిచయమై ప్రేమించుకొన్నాం; కాని, ఆర్థిక బాధలవల్ల వివాహం చేసుకోజాలకపోతిమి. తర్వాత దేశదేశాలు తిరగడంలో విడిపోయాము. 45 సం॥ల తరువాత అమెరికాలో కలుసుకున్నాము. అప్పటికే మాకు పెళ్ళిళ్ళయి మనుమలు, మనుమరాండ్రు కలిగారు. ఇద్దరము విధవలమే. బిడ్డల యిండ్లలో వుంటున్నాం. కాలక్షేపానికి యిద్దరం తఱుచుగాకలుసుకుంటూండే వాళ్లము. అయితే, ఈ దేశంలో బిడ్డలవద్ద ఉండటం, స్వగృహంలో మేము పెద్దలుగా ఉండలేకపోవడం మా సాంప్రదాయానికి విరు

ర్ధం. కాబట్టి, మేమిద్దరం కలసి ప్రత్యేకంగా కాపురంపెట్టనిశ్చ యించుకొని 'చర్చికి వెళ్లివచ్చా"మని చెప్పి నవ్వారు. నాకూ నవ్వు వచ్చింది. కాని, దీర్ఘాలోచనలో పడ్డాను. వయసుకు తగిన సౌఖ్యాలు ఉంటాయని, వయసుకుతగిన స్నేహితులు ఎంతో అవ సరమని. బిడ్డలను కనడానికేగాక జతకొరకుకూడా పెళ్ళి అవ సరమేనని, వివాహానికి వధూవరులే వయసును నిర్ణయించు కోవాలనీ నాకు తోచింది. ఇప్పటికీ నా అభిప్రాయం అదే.

కమ్మవారిలో వితంతు వివాహాలు

1927-29 సంవత్సరాలలో నేను బెజవాడలో వుంటూ వుండగా శ్రీ కోవెలమూడి గోపాలకృష్ణయ్య చౌదరి గారికి (అడ్వకేటు) నాకు స్నేహమేర్పడినది. వైశ్యకులంలో వితంతూ ద్వాహాలు జోరుగా సాగిపోతున్నాయి. నా కమ్మమిత్రులకు అది చాలా ఆశ్చర్యంగా వుంది. వా రిష్టపడినా తమకులంలో చేయించ లేదు. నేను చేయించగలిగినందున వారికి నాయందు గౌరవం ఏర్పడింది. శ్రీ కోవెలమూడి గోపాలకృష్ణయ్యచౌదరిగారు కమ్మవారిలో ఒక వితంతువుకు వివాహం చేయించడంలో సహా యం చెయ్యమన్నారు.

కైకలూరుతాలూకా వరహాపట్నం గ్రామవాసి శ్రీ కామి నేని పట్టాభిరామయ్యగారు కమ్మవారు. గొప్ప భూస్వామి. వారి కుమార్తె బాలవితంతువు. ఆమెకు పునర్వివాహం చేయించమని శ్రీ కో॥ గో॥ కృష్ణయ్యగారు నన్ను ప్రోత్సహించారు.

కమ్మవారిలో నాకు పలుకుబడి లేదనీ, పట్టాభిరామయ్య గారితో నాకు పరిచయంలేదనీ, ఆపని సాధ్యంకాదనీ నే నెంత చెప్పినా వినక "ఆ గ్రామం వెళ్ళండి; పట్టాభిరామయ్యను కలుసు

కోండి; ఆ బిడ్డ అందమైనది; చూస్తే తప్పకుండా వివాహం చేయించుతా" వని ఎంతో ప్రోత్సహించారు. ఈ ప్రోత్సాహం కంటె అన్నికులాల్లోను ఈ సంస్కరణను ప్రవేశపెట్టాలి, ముఖ్యంగా కమ్మవారిలో ప్రవేశపెట్టితే ఆంధ్రదేశమంతటా చేయించామనే తృప్తి ఉంటుంది, లేనిచో స్వకులాభిమాని అనే నిందకూడ వస్తుందన్నఆలోచన నన్ను పురికొల్పుతుండేది. కమ్మ వారిలో "వైశ్యుల కున్న ధైర్యసాహసాలు మనకు లేకపోయెనే" అన్న చింత ఉన్నట్టు గ్రహించాను. శ్రీ కామినేని పట్టాభిరామయ్యగారిని కలుసుకొనుటకు వెళ్లాను. వారితో నేను వచ్చిన పనినిగురించి చెప్పాను.

ఆయన దుఃఖించి కండ్లనీరు పెట్టారేగాని, నోరు తెరచి ఒక్కమాట మాట్లాడలేదు. కుమార్తెను చూపించనేలేదు. ఆయన దుఃఖాన్ని చూచి తగిన వరుడు లభించితే సమ్మతించుననీ, భయపడితే మిత్రుడు గోపాలకృష్ణయ్యగారే ఆ బిడ్డను పెంచుకొని వివాహం చేయించగలడనీ నిశ్చయించుకున్నాను.

అయితే వరుణ్ణి సంపాదించడం ఎలా? గోపాలకృష్ణయ్యగారికి కూడా అది పెద్ద చిక్కుగానే తోచింది. వధూవరులు కుదరకముందే ఆ వివాహాన్ని యెలా జయప్రదం చెయ్యాలా అనే యోచన నన్ను బాధించసాగింది. అసాధ్యమైనపనులను సాధ్యం చెయ్యాలనే కోరిక మనందరిలోను వుంటుంది. నాలోనూ ఉంది. కాలం అలాంటిది. కాలాన్ని ఉపయోగించుకోవాలని నా యోచన.

అప్పుడు "ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీసు" అనే కంపెనీ తరఫున రసాయినిక ఎరువులను వేయించి, ఉపయోగపడునని చూపుటకు ఇన్స్పెక్టరుగా పని చేస్తున్నాను. ఆంధ్రలో

నా యిష్టంవచ్చిన చోటుకు ప్రయాణంచేయుటకు కంపెనీవారు అవకాశమిచ్చారు. అనకాపల్లిలోని వ్యవసాయపరిశోధనకేంద్రాన్ని చూడడానికి వెళ్లాను. నాకు పరిచయంలేని ఆంధ్రయువకుడు అక్కడ అసిస్టెంటు మేనేజరుగా వున్నాడు. నన్ను తన యింటికి భోజనానికి ఆహ్వానించాడు. తాను ఉన్నవవారి శిష్యుడననీ, నన్ను ఎరుగుదుననీ చెప్పాడు. అతనిపేరు దాసరి బాపయ్య. బి. యస్.సి. కమ్మవారు; జన్మస్థానం గుంటూరుజిల్లా బ్రాహ్మణకోడూరు.

భోజనానంతరం కొన్ని గంటలు గడిపినతరువాత శ్రీ పట్టాభిరామయ్యగారి పుత్రికకు తగిన వరుడని తోచి, ఆయనతో ప్రస్తావించాను. తన కాక్షేపణ లేదనీ, తన్ను చిన్నతనంనుండి పెంచుకొన్న అక్కగారు (బాలవితంతువు) తనకు మాతృతుల్యులనీ, ఆమెను ఒప్పించవమనీ, బాధ్యతను నామీద వేశారు. ఆమె నా ఎదుటికి రాదు; ఘోషా! ఆమెతో ఎలా మాట్లాడాలో నాకు తోచ లేదని బాపయ్యతో అన్నాను. "ఫరవాలేదు, మాట్లాడవచ్చు"నని నాకు ధైర్యం చెప్పి, తాను ఆఫీసుకు వెళ్ళాడు. బాలవితంతువుల కష్టాలు ఆమెకు స్వయంగా తెలిసినందున నేను ఎక్కువగా బోధించవలసిన అవసరం లేకపోయింది. అయితే, ఈ ఉద్యమానికి తనతమ్ముడినేత్యాగంచెయ్యమని ఆమెనుఒప్పించడం మొదట్లో కష్టమైనా, చివరకు ఒప్పుకొన్నది. నేను బాపయ్యను కలుసుకొన్న 24 గంటలలో సరియైనవరుడు లభించాడు! ఆ పిల్లను బాపయ్యగారుచూచి సమ్మతించేవరకు వివాహవిషయమై పిల్ల కెంతమాత్రం తెలుపకూడదని నా వుద్దేశ్యం. ఈస్థితిలో వుండగానే శ్రీ కోవెలమూడి గోపాలకృష్ణయ్యగారు మరణించారు. నే నిక రెక్కలుపోయిన పక్షిలాగా అపస్థపడ్డాను.

భోగట్టా చెయ్యగా శ్రీ మాగంటి బాపినీడుగారి పెద్దక్క శ్రీ మాణిక్యాంబగారి కూతురు పట్టాభిరామయ్యగారి మరదలేనని, ఆమె ఈ బిడ్డను పెంచుకొన్నదనీ తెలిసింది. మాణిక్యాంబగారిని కలుసుకొని ఈ విషయమంతా చెప్పాను. ఆమె పిడుగులాంటి మనిషి; ధైర్యసాహసాలున్నమనిషి. ఆమెకూ యిలాంటి అభిప్రాయాలే వున్నై. కాబట్టి నా కృషి సులభంగా ఫలిస్తుందని ఎంతో సంతోషించాను; మాణిక్యాంబగారు ఆ గ్రామం వెళ్ళి పిల్లను, పిల్ల తల్లిని, పినతల్లిని ఒప్పించి, తేదీ నిర్ణయించి, బాపయ్యను పంపమని వ్రాసినారు. ఈ విషయాన్ని వారు మగవారికి తెలుపనేలేదు. బాపయ్యను పంపాను. పిల్ల, పిల్లవాడు ఒప్పుకున్నారు. ప్రమాణాలు చేసి, దండలు మార్చుకొన్నారు. పెద్దలు ముగ్గురు అనగా స్త్రీలు మాత్రమే ఆశీర్వదించి, బాపయ్యను పెండ్లికి తయారు కమ్మని ఆశపెట్టారు. అంతవరకు పట్టాభిరామయ్యగారికీ, ఆయన తమ్మునికీ తెలుపనేలేదు. చివరకు పట్టాభిరామయ్యగారిని కూడ ఒప్పించారు. తేదీ నిర్ణయమే కొరవ.

## కమ్మనాయకుని అడ్డు

పట్టాభిరామయ్యగారు రాజకీయాలలో అంటే పవర్‌పాలిటిక్సులో గుడివాడ కమ్మనాయకుని అనుచరుడు. తన బిడ్డ పునర్వివాహవిషయంలో తమ నాయకుని సలహా కోరాడు. నాయకుని జవాబు నాకు తెలియదు. బాపయ్య వివాహం తప్పక జరుగుతుందని నమ్మి పట్టాభిరామయ్యగారిని "మామ" అనీ, ఆయన కుమార్తెను "ప్రేయసి" "భార్య" అనీ ఉత్తరాలలో వ్రాసేవాడు.

వారిద్దరికీ ప్రేమ వృద్ధిఅవుతూవచ్చింది. త్వరగా వివాహం జరగాలని ఇద్దరూ తీర్మానించుకొన్నారు. కాని, కొంతకాలానికి "మామగారు" ప్రత్యుత్తరాలు మానేశారు. బాపయ్యగారికిదుఃఖం, క్రోధము పెరిగిపోతూవున్నాయి

ఈ లోగా మరొకవత్తిడి వచ్చింది. బాపయ్య అన్నగారు జైపూరు ఎస్టేటులో అసిస్టెంటు దివాను; ఈ వివాహాన్ని మాన్పించమని దివానుగారు అసిస్టెంటు దివానుగారితో గట్టిగా చెప్పడం ప్రారంభించారట. గుడివాడ కమ్మనాయకుడుగారు ఈ యెత్తు వేశారని బాపయ్య తలిచాడు. ఆయనను చంపి కసి తీర్చుకోవాలనుకొన్నాడు! బెజవాడలో నా యింటికి వచ్చాడు. ఒక కత్తిని చూపించాడు. చంపుతానని చెప్పాడు. అంతపనీ చేస్తాడనే నాకు తోచింది.

నాకు కావలసింది హత్యలుకాదు. బాపయ్యకు, ఆ అమ్మాయికి వివాహం చేయించడం, తద్వారా కమ్మవారిలో ఆంధ్రదేశంలో ఈ సంస్కరణ జయప్రదమయ్యేలా చేయుటే నా కర్తవ్యం, అదీగాక మరణశిక్షకు తగినంత నేరం కమ్మనాయకుడు చెయ్యలేదని నా తలంపు. ఆయన తన మనసు మార్చుకోకపోతే పరాభవం చెయ్యడం మాత్రమే న్యాయమని నా భావం. తుదకు బాపయ్య నాతో ఏకీభవించాడు. నేను చెప్పినట్లే చేస్తానని ప్రమాణం చేశాడు. కత్తిని మా యింట్లో పెట్టి బందరు వెళ్ళాము.

కమ్మనాయకుని ఎత్తులు ముందుగా తెలియనిదే లాభంలేదు

కాబట్టి, బాగా భోగట్టా తెలుసుకోవాలనుకున్నాను. అప్పుడు కమ్మ సంఘాధ్యక్షులు శ్రీ కొమ్మారెడ్డి పట్టాభిరామయ్యగారు పవర్ పాలిటిక్సు ఎరుగనివారనీ, ఆయనద్వారా నిజం తెలుసుకోవచ్చనీ ఎవరో సలహాయిచ్చారు.

శ్రీ కొమ్మారెడ్డి పట్టాభిరామయ్యగారు మమ్మలను మర్యాదచేసి నిర్మొగమాటంగా ఉన్నది ఉన్నట్లు చెప్పారు. గుడివాడ కమ్మనాయకుని పార్టీలో వధువుతండ్రి చాల ముఖ్యమైన వారని, ఆయన్ను పార్టీలోనుండి పోగొట్టుకోరనీ, బాపయ్య అన్న గారిమీద తెచ్చిన ఒత్తిడి ద్వారా వివాహాన్ని ఆపలేకపోయారనీ, అందువల్ల మరో ఎత్తు ఎత్తారనీ చెప్పారు. వివాహం చేయించుతానని పట్టాభిరామయ్యగారికి మాట యిచ్చి, చేయించకుండా కాలయాపన చేసేందుకు ప్లాను వేశారట. "వివాహం చేయదలచితే ఏ అనామకుడికోగాక, ఒక అడ్వొకేటుకు యిచ్చి పెళ్లిచేసి గుడివాడలోనో, బందరులోనో ప్రాక్టీసుపెట్టించి డిస్ట్రిక్టు మునసబు ఉద్యోగం యిప్పించడం మంచి"దని నాయకుడు తన అనుచరునికి సలహా ఇచ్చారు. బాపయ్యకివ్వడం మానెయ్యమన్నారు. ఇకనేం బాపయ్యను మానేశారు. అయితే అడ్వొకేటు లభించాలిగా! చిత్తూరు జిల్లాలో లభిస్తాడని పుకారు పుట్టించారు. వరాన్వేషణకని ఎవరినో పంపారట. ఇదంతా వివాహం జరగకుండా గడపడానికేనని రూఢిగా శ్రీ కొమ్మారెడ్డిగారు చెప్పేశారు తానిలా చెప్పినట్లు తనపేరును వెల్లడించవద్దని కోరారు. అలాగే చేశాము.

అంతట మేము దీర్ఘంగా ఆలోచించి ఒకప్లాను వేసు

కొన్నాము. "నాయకుడిని" ప్రత్యేకంగా కలుసుకొని ఆయన నేరాన్ని ఒప్పించాలి. బాపయ్య వివాహం వెంటనే చేయించడానికి సమ్మతింపజేయాలి; అలా అంగీకరించకపోతే మేము బాగా పరాభవించాలి. అందుకు కనీసం ఆరుమాసాల జైలుశిక్షకు మే మిద్దరం సిద్ధపడాలి. ఇదీ మా ప్లాను.

నాయకుడిగారి యింటికి వెళ్ళాము. మేడమీద వరండాలో జనం గుంపులుగుంపులుగా వున్నారు. ఇదంతా రానున్న స్థానిక సంస్థల ఎన్నికల హడావుడి. మాతో ప్రత్యేకంగా మాట్లాడేందుకు నాయకుడిని ఒప్పించాము. అందరిని బయటికి పంపారు. గదిలో ముగ్గురంమాత్రమే వున్నాం. అప్పుడు బాపయ్య మాట్లాడ కూడదు. నే నొక్కడినే మాట్లాడాను.

నాయకుడుగారు తమ నేరాన్ని ఒప్పుకోలా. మాకు తెలిసిన విషయాలన్నీ పూసగ్రుచ్చినట్లు చెప్పగానే ఆయన నిర్ఘాంత పోయాడు. కొంచెంసేపు ఆలోచనలో పడ్డారు. తలయెత్తిచూచి నవ్వారు. "ఆ పిల్ల నిచ్చి బాపయ్యకు వివాహం చేయిస్తా" నన్నారు. అయితే "రెండుమాసాల తరువాత ఎప్పుడైనా సరే చేయిస్తా" నన్నారు. "కాదు, వెంటనే చెయ్యా"లన్నాను. "పరిస్థితులు అనుకూలంగా లే" వన్నారు. "ఎన్నికలేనా కారణం?" మన్నాను. "అవు" నని నవ్వారు. చేతిలో చెయ్యి వేయించుకొని వచ్చాము.

ఆయన తు-చ-తప్పకుండాచేశారు; గాని కష్టాలుతప్పలేదు. నీరూరినట్లు కష్టాలు వస్తూనే వున్నాయి. బెజవాడలో కమ్మవిద్యార్థి హాస్టలులో వివాహానికి ఏర్పాట్లు చేశాము. బెజవాడ పత్రికు

లైన శ్రీ ఎర్నేని లక్ష్మీనారాయణచౌదరిగారు అన్ని ఏర్పాట్లు చేయించారు. ఆంధ్రదేశమంతటా కమ్మవారిలో ప్రచారం జరిగింది. పధువుతరఫువారు శ్రీ లక్ష్మీనారాయణగారి యింటిలో దిగారు; వరుని వైపువారు మా యింటిలో. రెండిండ్లలోని స్త్రీలు పురుషులం కలసి బంధుమిత్రులను వివాహానికి ఆహ్వానించాము. సంస్కరణాభిలాషు లెందరో ఆంధ్రదేశమంతటినుండి వచ్చి మా యింట్లో దిగారు. పాలపర్తివారు, తెలికచర్లవారు, మంత్రవాది వారు, జవ్వాజివారు, మలపాకవారు, యామనీవారు షుమారు 50 మంది వచ్చారు. బాపయ్య తల్లి, అక్క, అన్నగారు కూడా మా యింట్లోనే దిగారు.

వీరందరూ రావడం నాకెంతో ఆనందంగావుంది. అయితే అది కొన్ని నిముషాలుమాత్రమే. బాపయ్యతల్లిగారు నావద్దకు వచ్చి "నే నెందుకు వచ్చానో తెలుసా? పెళ్ళి చేయించడానికి కాదు! చెడగొట్టడానికే వచ్చాను. నా కొడుకుని నాశనం చెయ్యడానికి పూనుకున్నావా చంచయ్యగారూ?" అని ఉగ్రురాలై కేకలు వేసింది. నాకేమీ తోచలా. తమాషా చేసి చూద్దామని "అమ్మా! నే నలా చేస్తానా? ఈ పెళ్ళికి కారకుడు యీ బ్రాహ్మడే" నని నా మిత్రుడు శ్రీ మంత్రవాది వెంకటరత్నంగారివైపు కన్ను కొట్టాను. "బ్రాహ్మణమంత్రాంగమా!" అన్నది. ఆయన మీదికి దూకింది; జుట్టు లంకించుకొని చెయ్యెత్తింది. కొట్టింది కూడాను. భారీ మనిషి; బలశాలి. మేమందరం ఆమెను లాగేసి, ఒక గదిలో వేసి తాళం వేశాము.

బాపయ్యగారిని సలహా అడిగాము. తనతల్లి పెండ్లికి రావలసిందేనని ఖండితంగా చెప్పాడు. అప్పుడు అంటే పెండ్లికి ముం

దురోజున వచ్చిన కమ్మనాయకులను కలుసుకొని, ఆమె మనసు మార్చమని చెప్పాను; ముఖ్యంగా బ్రాహ్మణకోడూరువారిని పంపాము. కొంతవరకు శాంతించింది. మరునాడు పెండ్లివేళకు ఆమెను విడిచిపెట్టాము.

పెండ్లికి అయిదారువేలమంది కమ్మవారు వచ్చారు. స్థానిక పెద్దలెందరో వచ్చారు. దూరపట్టణాలనుండికూడా వచ్చారు. సహపంక్తిభోజనాలు చేశారు. వితంతు వివాహాలు చేసుకోవచ్చుననీ, సంఘ ఆక్షేపణ లేదనీ కమ్మవారొక్క వివాహంతోనే తీర్మానించారు. శ్రీ అడుసుమల్లివారు ఒక ప్రకటనచేశారు. ఇక జరుగబోయే ప్రతివివాహానికి రు 250 ల చొప్పున మొదటి దజను పెండ్లిండ్లకు బహూకరిస్తానని ఆ సభలో అందరికి ఉత్సాహం కలిగేలా మాట్లాడారు.

శ్రీ అడుసుమల్లివారితో కలసి, శ్రీ జాగర్లమూడివారు కూడ నడుం బిగించి వడ్డించడం ప్రారంభించారు. ఏమి ఎత్తు వేస్తున్నారోనని మేము సంశయించి, యిద్దరిని అందరితో కలిసి భోంచెయ్యమని బ్రతిమలాడాము. రెండవ పంక్తిలో కూర్చుంటామన్నారు. ఈ లోగా శ్రీ జాగర్లమూడివారు మాయమైపోయారు.

బాపయ్యతల్లిగారు చాలా సంతోషించారు. వెళ్లేటప్పుడు నాకు నమస్కారం చేసి నవ్వింది. కృతజ్ఞతాపూర్వకంగా చూస్తూ వెళ్ళింది. ఆ చూపు ఇప్పటికీ నాకు జ్ఞాపకమే.

తరువాత కమ్మ సంఘంలో వివాహాలు వెంటవెంటనే జరిగాయి. వీరేశలింగంగారు నాటిన విత్తనం యాభై ఏండ్లకు పెద్ద వృక్షమై ఆంధ్రదేశంలో అనాథ స్త్రీలకు ఆశ్రయమిచ్చింది.

ఇదంతా చూడకుండానే మిత్రుడు శ్రీ కోవెలమూడి గోపాల కృష్ణయ్యగారు చనిపోయినందుకు విచారపడ్డాను.

ఇక్కడ మరొకవిషయం చెప్పాలి. కమ్మవారిలో మొదటి వితంతూద్వాహం అంతకుముందే జరిగింది. ఆ వివాహం చేసు కున్నది నా మిత్రులు డాక్టరు మూల్పూరి రంగయ్యగారు, వారి సతీమణి చుక్కమ్మగారు. ఇది రహస్యంగానే జరిగింది. ప్రజా మోదంతో, కమ్మసంఘం సమ్మతితో జరిగిన ప్రథమ వివాహం బాపయ్యగారిదే.

బాపయ్యగారు నన్ను కలుసుకున్నప్పుడు "మామగారూ" అనీ, ఆయన బిడ్డలు "తాతగారూ" అనీ పిలుస్తుంటే నా కెంతో ఆనందంగా ఉండేది.

## విశ్వబ్రాహ్మణులలో వితంతు వివాహం

వైశ్యులలో, కమ్మవారిలో, బ్రాహ్మణులలోను వితంతు వివాహాలు సర్వసామాన్యమైనాయి. కాబట్టి తతిమ్మా కులాలలో తమంతట తామే చేయించుకుంటారని నమ్మాను. కాని అలా జరుగుటలేదు. ఏ కులానికి ఆకులం ప్రత్యేకసంఘం; ఏ కులానికి ఆ కులం కట్టుబాట్లూ, నాయకులూ వేరు. హిందూసంఘం ఎంత హీనస్థితికి వచ్చిందో చూడాలంటే విశ్వబ్రాహ్మణుల్లో సంస్కరణలు చేయించి చూడాలి. ఈ సంఘంలోని అధోగతి ముందుగా తెలిసి వుంటే వారిలో వితంతు వివాహము చేయించటానికి సాహసించి యుండను. తెలియక ప్రారంభించి విపరీతమైన కష్ట పరంపర లను ఎదుర్కోవలసి వచ్చింది. పూర్తిఅయ్యేలోగా తలప్రాణం తోకకొచ్చింది.

ఈ ఉద్యమం అప్రయత్నంగానే ప్రారంభమైనది. గుంటూరులో రెండవ వితంతూద్వాహ సమయంలో శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు ఉపన్యసించారు. ఆమె వెంట అందమైన బట్టలతో, ఒంటినిండా నగలతో, అలంకరించుకొన్న 10 సంవత్సరముల బాలిక ఉన్నది. ఆ బిడ్డను చూపించి "వితంతు" వని చెప్పారు. సభికులందరు విచారపడినారు.

ఆబిడ్డ విశ్వబ్రాహ్మణులు-పెడన వాస్తవ్యులు శ్రీకొండిపర్తి చంద్రకాంతముగారి తనయ. ఆయన బట్టల వర్తకుడు; ధనికుడు. ఆ బిడ్డ ఒక్కతే ఆయనకు సంతానం. కొంతకాలానికి పిల్ల తండ్రిని రప్పించి మాట్లాడాను. పునర్వివాహానికి సమ్మతించారు.. తనదగ్గరి బంధువర్గంలోనే వరుడు లభిస్తాడనీ, తానే నిర్ణయించగలననీ చెప్పారు. ఎంత ధనాన్నైనా ఖర్చుచేయుటకు సిద్ధమైనారు. కాని, ఈ వివాహాలకు దబ్బెందుకు? కులంలో కలిసివచ్చే సంస్కారప్రియులు కావాలి. రజస్వల కాకముందే పునర్వివాహం చేయించమని కోరారు. నా కిష్టంలేకపోయినా, ఆ సంఘపరిస్థితుల్లో అది కూడ గొప్ప కార్యంగానే తోచింది. ఇతర సంఘాల్లోకూడ "రెడ్డొచ్చె మొదలెట్టు"మన్నట్టుగా వుంది. మొట్టమొదట రజస్వల కాని వితంతువుకే పెళ్ళిచెయ్యాలనేవారు. తరువాత రజస్వల అయినా భర్తతో కాపురం చెయ్యకూడదు; మూడోమెట్టు భర్తతో కాపురం చేసినా, బిడ్డను కని వుండకూడదు; ఆఖరున బిడ్డలుగల వితంతువైనా సరేనన్నారు. విశ్వబ్రాహ్మణులలోను అలాగే మొదటిమెట్టుతో ప్రారంభమైంది.

అయితే, విశ్వబ్రాహ్మణ సంఘంతో నాకు పరిచయం లేదు. వారిలో నాకు స్నేహితులా లేరు, కాబట్టి, ఆ సంఘంలో

పనిచేయుటకు నాకు శక్తిచాలదని కొంతకాలం వూరుకున్నాను. కాని, పిల్లకంద్రి త్వరపడుతున్నందున కార్యభారం వహించాల్సి వచ్చింది.

ఈ పరిస్థితుల్లో విశ్వబ్రాహ్మణ సంఘంలో ప్రసిద్ధికెక్కిన శ్రీ గానాల రామమూర్తిగారినీ, శ్రీ పెదప్రోలు సూర్యనారాయణ రావుగారిని (1928-30 సం॥ మధ్య) కలుసుకొన్నాను. వారు సహాయం చేస్తామన్నారు. ఒక ప్లాను వేసుకున్నాము.

మా ఉద్యమానికి అనుకూలురను, ప్రతికూలురను వేరు చెయ్యాలి. కరపత్రాలద్వారా ఆ సంఘాన్ని రెండు ముక్కలు చేశాము. "ఆంధ్రరాష్ట్ర విశ్వబ్రాహ్మణ సంఘసంస్కరణ మహాసభను" మా యింట్లో పెట్టి అనుకూలురను సమావేశపరిచాము. అయితే, అధ్యక్షులుగా ఉండటానికి వారిలో ఒక్కరూ అంగీకరించరైరి. ధైర్యసాహసాలుగల శ్రీ సూర్యనారాయణరావుగారు దూరంగావుండిమాత్రమే సహాయం చెయ్యదలచారు. కాబట్టి శ్రీ మోతే నారాయణరావుగారు అధ్యక్షుడుగాను, నేను కార్యదర్శిగాను నాటకం నడిపాము.

మహాసభకు షుమారు 50 మంది వచ్చారు. వారిలో గొప్ప పండితులు, శాస్త్రజ్ఞులు, వేదాలు శాస్త్రాలు బాగా వల్లించగలవారూ వచ్చారు. వైదిక బ్రాహ్మణ సభలా ఉంది; ఏది చర్చించబోయినా సంగతి సందర్భం లేకుండా శాస్త్రచర్చగా మార్చేవారు. వింతతూద్వాహాలు శాస్త్ర సమ్మోదమేనని తమ పాండిత్యాన్ని వెల్లడించుటకు ప్రయత్నించారు. చివరకు నిర్వాహక సంఘాన్ని ఏర్పాటుచెయ్యాల్సివచ్చింది. ఎవరూ ఉండనంటారే! కొందరిని ఒప్పించగానే హాజరైన యాభై మందీ కూడ దాంట్లో ఉండా

లన్నారు. వైదికులను వైశ్యులను సంస్కరించటమే సులభమని పించింది.

కొంతకాలానికి పెదనలో పిల్లతండ్రిగారి యింటిలోనే వివాహానికి ఏర్పాట్లు చేశాము. బెజవాడనుంచి నేను నా భార్య అన్నపూర్ణమ్మ, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు. శ్రీ డాక్టరు గోవిందరాజులుగారు వివాహానికి బయల్దేరి వెళ్లాము. సాయంత్రం 7 గంటలకు పెదన స్టేషనులో దిగాము. మమ్మ ఆహ్వానించడానికి ఎవరూ రాలేదు. స్టేషను మాష్టరును అడిగితే వివాహం సంగతే తనకు తెలియదన్నాడు. సామాను మోయుటకు కూలీలైనా లేరు. శ్రీ కాళేశ్వరరావు పంతులుగారు సామాను మొయ్యలేరు. అన్నపూర్ణమ్మగారి చంకలో చంటిబిడ్డ వుంది. మా అందరి సామాను డాక్టరుగారు నెత్తిని, బుజాలమీద వేసు కొన్నారు. వారి ఉత్సాహం చూచి నాకు సిగ్గేసి, నేనూ కొంత సామా నెత్తుకున్నాను. ఊళ్లోకి వెళ్లుతుండగా దారిలో ఒక ఒంటెద్దుబండి, లాంతరులతో వధువుతండ్రి ఎదురయ్యారు.

తన ముగ్గురు అన్నగార్లలో ఒకరు పెళ్ళికి సమ్మతించ లేదట; సమిష్టికుటుంబం కావడంవల్ల ఎదిరించలేక- ఎన్నిలక్షల ఆస్థి వుంటేనేం?—వివాహం మానేశామన్నాడు. ఆయన, ఆయన భార్య వివాహం చేయించటానికి సిద్ధమేనట. అయితే, బంధువులు కలిసిరానందున నిరుత్సాహపడ్డారట. మేము భోంచేసి పడుకొనే ముందు "కాళేశ్వరరావు పంతులుగారూ! ఏదైనా ఎత్తువేసి చూడండి!" అని చెప్పాను. రాత్రి రెండు గంటలప్పుడు బాజాలు వినబడ్డాయి. నిద్రనుండి లేచాను. పంతులుగారు సమర్థులని నాకు తెలుసు అన్నదమ్ములందరిని పంతులుగారు ఒప్పించారు. పెళ్ళి

జరుగుతుంది. బంధుమిత్రులను పిలుచుకొనిరావటానికి కార్లు, లారీలు బందరు వగైరా చోట్లకు వెళ్ళాయన్నారు. 2-3 వందల మంది విశ్వబ్రాహ్మణులు వచ్చారు. ముందుగానే ఏర్పాట్లు సవ్యంగా జరిగివుంటే 5-6 వందలమంది వచ్చివుండేవారట. తెల్లవారుఝామున 4 గంటలకు వివాహం జరుగుతూండగా మరో వివాహానికి వధూవరుల ఏర్పాటు జరిగిందనే శుభవార్తను ప్రకటించారు. సంతోషంగా తెల్లవారింది.

పెండ్లికి వచ్చిన బంధువుల్లో ఒక్కొక్క స్త్రీ ఒక్కొక పొయ్యి ముట్టించారు. ఆ కులంలో సహపంక్తి భోజనాల సాంప్రదాయం లేదట. మాకుమాత్రం బ్రాహ్మలచేత వండించారు. వారితో కలసి భోంచెయ్యాలని మేము పట్టుపట్టాము. కాని వధూవరులలోనైనా కలసి భోంచేయడానికి వల్లకాదన్నారు. శ్రీ పెదప్రోలు సూర్యనారాయణగారి అవస్థ ఏమని చెప్పను! ఆయనకు భార్యలేదు; విశ్వబ్రాహ్మలు భోజనం పెట్టరు; పెట్టినా ఆయన తినకూడదట! మాతోనూ కలసి భోంచెయ్యడు. మిఠాయి కొని తెచ్చుకొని కాలం గడిపారు. కంసాలిపెళ్ళికి ఇంటినిండా పొయ్యిలే నన్న సామెత తెలిసిపోయింది. ఇండియాలో అలాంటి సంఘమున్నదని నా కంతవరకూ తెలియదు. ఆ కులానికి విమోచనం చాలా కష్టమని తోచింది. ఆ తరువాత విశ్వబ్రాహ్మణులలో చాలా వివాహాలు జరిగాయి. కొన్ని సందర్భాల్లో దెబ్బలాటలు, కేసులు జరిగినా సంస్కరణోద్యమము బలపడుతూ వచ్చింది.

### ఓటమి

ఒకటి రెండు వివాహాల విషయంలో బాగా ఓడిపోయాను. ముఖ్యంగా ఒక కేసును గురించి వ్రాస్తాను. బెజవాడలో శ్రీ ఆర్.

యల్. యస్. శాస్త్రిగా రుండేవారు. వారు నా స్నేహితులు. వారికీ, వారి భార్యకూ వితంతువివాహాల పట్ల అభిమాన మేర్పడింది.

వారి ప్రక్కయింట్లో ఒక బాల వితంతువు ఉన్నది. 16 సం॥ల వయస్సు. వివాహం చేయించమని శాస్త్రిగారినీ, వారి భార్యనూ అడిగింది. ఆవిడకు ఒక అన్నగారు, తల్లిదండ్రులు వున్నారు. అన్న తన వివాహానికి తప్పక ఒప్పుకుంటాడని ఆ పిల్ల కెంతో నమ్మకం. ఆ వయసులో గార్డియను సమ్మతిలేకుండా పెళ్లి చేసుకోడానికి చట్టం ఒప్పదు. కాబట్టి తన అన్నగారితో మాట్లాడి చూడమని సలహా యిచ్చాము. మరునాడు శాస్త్రి దంపతులు ఏడుస్తూ మా యింటికి వచ్చారు. వారి దుఃఖానికి కారణం యిది: ఆ బాలవితంతువు అన్నగారితో చెప్పగా చెల్లెలిని కోప్పడి తిట్టాడట; తల్లిదండ్రులకు రిపోర్టు చేశాడట; అందరూ కలసి పిల్లను బాగా కొట్టారట; వంటయింట్లో వేసి మూసేశారట; పాపం! ఏడుస్తున్నదట; ఎలా రక్షించడం? ఆమెను కలుసుకోడానికి సాధ్యపడ లేదు. సంగతి సందర్భాలు తెలుసుకోటానికైనా వీల్లేకుండా తల్లిదండ్రులు కాపలా కాస్తున్నారు.

ఆ పిల్లను రక్షించేందుకు మార్గం తోచక, నా శక్తిహీనతకు విచారపడ్డాను. గుంటూరు వెళ్లి మిత్రుడు తెలికచర్ల రామమూర్తి గారితో చెప్పాను. ఆయన కాలేజీలో టీచరు. ఇద్దరం కలిసి మా మిత్రుడు శ్రీ కె. కల్యాణస్వామి (సబ్‌జడ్జి) గారి వద్దకు వెళ్ళి చట్టంలో ఏమున్నదో చెప్పండని కోరాము. ఆ పిల్లను తల్లిదండ్రుల యింటినుండి లేవదీసుకొచ్చి వివాహం చేయించాలి. వయసు చాలనందున, ఆ పిల్ల స్వతంత్రించి చేసుకో కూడదు. కాబట్టి, ఆమెకు సహాయం చేసేవారికి కనీసం ఆరునెలల శిక్ష

తప్పదు. అయితే కోర్టులో యీ విషయాలను బయటపెట్టి బాగా ప్రచారం చేసుకోవచ్చు. సాహసించండని జడ్జీగారు ప్రోత్సహించారు. నా మిత్రుడు శ్రీ తెలికచర్ల రామమూర్తిగారు జైలుకు సిద్ధపడ్డారు; నాతో బెజవాడకు వచ్చారు. శాస్త్రి దంపతుల సహాయంతో ప్రయత్నించాము. రాత్రింబగళ్లు ఆ యింటిచుట్టూ వీధుల్లో తిరిగాను. మూడురోజులు ప్రయాసపడినా ఫలితం లేనందున విసుగెత్తి మానేశాను.

ఆ పిల్లకు తల బోడిచేయించారు. పునర్వివాహంకంటె వ్యభిచారమే మేలన్నారు. పాపం! చెడిపోయింది! మూడేళ్లు గడిచాయి. ఒకనాడు శాస్త్రిగారు నన్ను తమ యింటికి తీసుకెళ్లి ఆమెను పరిచయంచేశారు. వివాహానికి సహాయం చేస్తానని చెప్పాను. ఆమె నిరాకరించింది. కారణ మడిగాను. 'పెళ్లి చేసుకోవాలనుకొన్నందుకే అన్ని కష్టాలు వస్తే, మరి వివాహం చేసుకొన్నతరువాత ఇంకెన్ని కష్టా లుంటాయో! నాకు పెళ్లొద్ద'ని ఖండితంగా చెప్పేసింది. రామమూర్తిగారి త్యాగం, దంపతుల దుఃఖం నాకు జ్ఞప్తికొస్తూండేవి.

ఇదే బ్రాహ్మణసంఘంలో నేను వితంతూద్వాహం చేయించడానికి చేసిన మొదటి ప్రయత్నం. ఇప్పుడు వారిలో ఎనెన్నో జరిగిపోతూవున్నాయి. కాని, ఆ సంఘాన్ని ఒకటిగా చేయడం ఎవరికీ సాధ్యంకాని పనియని తలిచాను. ఆ కులంలో ఉద్యమ రూపంగా నే నేమీ చేయలేదు. నావద్దకు వచ్చిన వితంతువులకు మాత్రం పెళ్లిళ్లు చేయించుచుంటిని. 1930 తరువాత మద్రాసులో మేము స్థాపించిన వితంతు శరణాలయానికి వచ్చి సహాయం పొందిన స్త్రీలలో ఎక్కువమంది బ్రాహ్మలే.

నేను చేయించిన వివాహాల్లో కొన్ని జయప్రదం కాలేదు; అయితే అవి చాలా తక్కువే ననుకోండి. వాటినిగురించి, ఈ ఉద్యమంలో కలిగిన కొన్ని అనుభవాలను గురించి 1932లో 'భారతి'లో రెండు వ్యాసాలు వ్రాసి ప్రకటించాను.

ఇంట గెలవాలి!

నేను చేస్తున్న సంఘ సంస్కరణలు నా జన్మస్థానము కనిగిరిలో మా కులపెద్దల కెంతమాత్రం యిష్టంలేదు. ముఖ్యంగా నా బావగారు (శ్రీ నీలిశెట్టి గురవయ్యగారు) ఇతర బంధుమిత్రులకు యిష్టంలేదు.

కనిగిరి తాలూకా వైశ్యులు కడుబీదలు. వారు కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాలలో నీళ్ళు మోసి, వంటలు చేసి, చిల్లర వ్యాపారాలు చేసి, బట్టల మూటల వ్యాపారాలవల్ల కొద్దో గొప్పో సంపాదించుకొచ్చి స్వగ్రామాల్లో కుటుంబ పోషణ చేసుకుంటారు. ఏటేటా ఇలాగే కష్టపడుతుంటారు. అట్టివారు తిరిగి కనిగిరి వెళ్లినప్పుడు హోటళ్లలోకూడ భోజనంపెట్టటం మానేశారు. వారు వితంతూద్వాహములలో పాల్గొనకపోయినా, వ్యతిరేకంగా పనిచేసినాకూడ ఆ డెల్టా జిల్లాలనుండి వచ్చినంత మాత్రాన కులబహిష్కారం చేశేవారు. ఇది ఘోరమైన శిక్ష! కొందరు నాతో మొరపెట్టుకున్నారు. నేను కనిగిరికి వెళ్లి "మెరెంత" అని ధిక్కరించి, సవరించి రావాలి. అందుకోసం పనిపెట్టుకుని వెళ్లాను.

ఆ వూళ్ళో నా చెల్లెండ్రు ఇద్దరున్నారు. పెద్దబావగారు ఛాందసులు. చిన్నబావగారు లౌకికుడు. పెద్దబావగారు 1920 మొదలు 1930 వరకు నాతో సహపంక్తిభోజనం మానేశారు.

చిన్నబావగారి యింటికే వెళ్ళాను. పెద్దవారు చిన్నవారితో "చంచన్నకు భోజనం పెట్టావా, వెలేస్తారు. ముందుగా పెద్దశెట్టిగారి ఉత్తరువు తీసుకో! జాగ్రత్త!" అని పిరికిమందు పోశారు. పెద్దశెట్టిని అడిగితే తా నేమీ చెప్పలేనన్నాడు. నేను ఈ కష్టాలు వస్తాయని గ్రహించే, అపక్వాహారాలు దండిగా తీసుకెళ్ళాను. నా చెల్లెలు ధైర్యశాలి; భోంచెయ్యాలిసిందేనని నిర్బంధంచేసింది; "కులంలో వెలివేస్తే జుల్మానా చెల్లించుకొని మళ్ళీ కులంలో చేరవచ్చు" నని వాదించింది. మా చిన్నబావ అంగీకరించక తప్పలా: నే నెంత చెప్పినా నా చెల్లెలు ఒప్పుకోలేదు. మరి భోంచేశాను.

కుల పెద్దను పిలిపించాను; కాని, ఆయన రాలేదు. భయపడిపోయాడు. కులపెద్దల యిండ్లలో జరిగే గుసగుసలు యువకులు నాతో చెప్తూవచ్చారు. యువకులందరూ నా కనుకూలురే. సాయంత్రం ఒక బహిరంగసభ నేర్పాటుచేశారు వైశ్య సంఘనాయకులు.

అప్పుడొక చిన్న అల్లరి చేశాను. ఒకప్పు డొకచోట వితంతు వివాహం చేసుకొన్నవారిని బహిరంగంగా బహిష్కరించినందుకు కోర్టులో కేసు నడిచింది. బహిష్కరించినవారికి కారావాసము, జుల్మానా విధింపబడ్డాయి. ఆ తీర్పును కరపత్రాలుగా అచ్చువేయించి వుంచాను. వాటి నా మీటింగుకు వచ్చేవారికి పంచిపెట్టారు నా శిష్యబృందం. పెద్దలు చదువుకొని భయపడి సభకే రాలేదు. యువకులుమాత్రమే వచ్చారు. వితంతు వివాహాలు చేయించినందుకు నన్ను అభినందించుతూ తీర్మానించారు. మరునాటి ఉదయం పెద్దశెట్టిగారు నన్ను కలుసుకొని, ఇక

మీదట ఎవరినిగాని బహిష్కరించమని హామీ యిచ్చారు. 24 గంటలలో పని పూర్తయిపోయింది. ఇది 1930 లో జరిగింది. ఇప్పుడా తాలూకాలో ఎవరింటిలో వారే వితంతు వివాహాలు చేస్తున్నారు.

పర్యావలోకనం

మా ఇంట్లో వధువు లెందరో వుంటూండేవారు. నా భార్య అన్నపూర్ణమ్మ వారి నెంతో ప్రేమగా చూచుకొనేది. ఇలాంటి సంఘసేవ చెయ్యాలన్న ఆశతోనే ఆమె నన్ను వివాహం చేసుకొన్నది. సంఘసంస్కరణోద్యమాలంటే ఆమె కెంతో సంతోషం. వధువులతో ఆమె చాలా చనువుగా వుండేవి; వారు వరుసలతో పిలుచుకొనేవారు. ఆ అమ్మాయిలు నాతోకూడ తమ కష్టసుఖాలను చెప్పుకొనేవారు. ఆ పిల్లలను తమాషాగా "ఎందుకమ్మా! మళ్ళీ వివాహం చేసుకోవాలనే పట్టుదల నీకు?" అని అడిగేవాడిని. వారు ఉన్నది ఉన్నట్టుగానే జవాబిచ్చేవారు. వారి వారి కోరికలు విచిత్రంగా వుండేవి. ఒకామె వయస్సు 16 సం॥లు. అమాయికురాలు. ఆమె "అందరికీ ఎందుకో నాకూ అందుకే" నన్నది. ఇంకా "నా తోటివాళ్లు పూలు, నగలు, బొట్టు పెట్టుకొంటూంటే, నాకు లేకపోయెనే అని విచారంగా ఉన్న" దన్నది. "ఇవన్నీ నువ్వు పెట్టుకోటానికి సంఘం సమ్మతించితే, వివాహం మానేస్తావా?" అన్నాను. నవ్వింది. మరొకావిడ "ఒకబిడ్డను కనాలని, ముద్దాడుతూ పెంచుకోవాలని కోరిక ఉందండీ" అన్నది. ఇలాంటి కోరికలను మన ఛాందసులు గ్రహించలేరు గదా!

వితంతువులు చాలమంది వివాహాలు చేసుకోవడంలేదు. అందుకు ముఖ్యంగా ఒక కారణం తెలిసింది. వివాహాలకు ఆర్థిక

పరిస్థితులకు దగ్గర సంబంధం వుంది. వివాహం నిమిత్తం నాదగ్గరకు వచ్చిన వారిలో బాగా భాగ్యవంతులుగాని, నిరుపేదలుగాని లేరనే చెప్పవచ్చు. మధ్యతరగతిలో పుట్టి పెరిగి, పేదవారైన తలిదండ్రులు తమ వితంతుబిడ్డలను పోషించలేక, బిడ్డలచే నౌకరీ చేయించుటకు యిష్టపడనివారే పెండ్లికి సమ్మతించుతూ వచ్చారు, భర్త ఆస్తి సంక్రమించిన వితంతువుకు పునర్వివాహం జరగడం అసంభవంగా వుండేది. పెండ్లి చేసుకుంటే ఆస్తి పోతుందని పెద్దవారి భయం. అలాంటి ఆస్తి ననుభవించేవారు విధవ కుమార్తెల చేతుల్లో ఏ పురాణాలో, శాస్త్రాలో పెట్టి, పాతివ్రత్యాన్ని గురించి హరికథలు చెప్పించి, కాశీ రామేశ్వరయాత్రలకు పంపి, పునర్వివాహంమీద యిష్టం కలుగకుండా చేస్తారు. చాల బీదవారై, కాయకష్టంవల్ల జీవించే తల్లిదండ్రులు తమ వితంతు కుమార్తెలచే పనులు చేయించి, వారి సంపాదనతో జీవయాత్ర సాగిస్తూ తమ బ్రతుకుదెరువు పోతుందేమోనని పునర్వివాహాలకు అడ్డుపడుతుంటారు.

సంఘంలో ఆక్షేపణేమీ లేకపోయినా, ఆర్థికంగా ఆటంకాలుండడంవల్లను, ఆ విషయంలో చట్టం అనుకూలంగా లేనందునా చాలమంది వితంతువులు వివాహం చేసుకోవడంలేదు. విద్యావంతులైన వరులు వివాహాల ద్వారా ఆస్తి సంపాదించాలని రెండిటికి ముడిపెట్టటం కూడా నాకు బాగా తెలుసు. కాబట్టి, నా ప్రయత్నం ఎంత ఫలించినా, ఈ ఉద్యమం వల్ల మేలు పొందినవారు కొద్దిమందే ననక తప్పదు. పారిశ్రామిక నాగరికతతోను, సోషలిజంతోను మనసంఘంలో ఆ మార్పులు రాగలవే గాని,

ఇప్పుడుండే జమీందారీ సాంప్రదాయాలు, ఫ్యూడల్ సంఘం ఉన్నంతవరకు ఆటంకాలు వుంటూనే వుంటాయి.

1924లో ప్రారంభించి 1930 వరకు ఈ వితంతూద్వాహోద్యమాన్ని ఎంతో ఉత్సాహంతో నిర్వహించాను. ఆటంకాలు, కష్టాలు పోయి, నా మిత్రులనేకమంది స్వయంగా చేయించగలిగారు. అందువల్ల నా బాధ్యత తగ్గింది. ఇక నా దృష్టి ఇతర సంస్కరణలమీదికి మళ్లినది. భ్రూణహత్యలను నివారించి శిశువులను కాపాడాలనే ఉద్యమం ప్రారంభించాను. వితంతు వివాహోద్యమంలో పాల్గొనడం తగించాను.

భార్యల సహాయంలేందే స్త్రీల ఉద్యమాలను పురుషులమెంత శ్రమపడినా జయప్రదం చెయ్యలేము. నా ప్రథమ భార్య అన్నపూర్ణమ్మకు స్త్రీ ఉద్యమాలయందు ఎంతో ఉత్సాహముండేది. ఎందరో స్త్రీలు మా యింట్లో ఉండేవారు. వారందరిని ప్రేమతో ఆదరించేది అన్నపూర్ణ. వారు అన్నపూర్ణమ్మను ఎంతో ప్రేమించేవారు. జయాపజయాలు, ఫలితాలు మా యిద్దరివీని. 1931 సం॥లో అన్నపూర్ణమ్మ హఠాత్తుగా చనిపోయినది. అప్పుడు మా అనుభవాలను గురించి 'భారతి'లో రెండు వ్యాసాలు వ్రాసి ప్రకటించాను.

## వితంతుశరణాలయ స్థాపన

భూతదయగలవారికి ప్రతి సంఘంలోను ఎంతో కుళ్లు కనపడుతుంది; ముఖ్యంగా మన దేశంలో- మన సంఘంలో మరీ ఎక్కువ. అమానుషకార్యాలు కూడ సాంప్రదాయబలిమివల్ల సరైనవిగానే కనపడుతాయి ప్రజాసామాన్యానికి. బాల వితంతువుల కష్టాలైతేనేమి, వంశపారంపర్యా వచ్చే వ్యభిచారవృత్తి అయితే

నేమి, అంటరానివనమైతేనేమి చిన్నప్పటినుండి అలవాటు కావ డంవల్ల వాటిలోని అవినీతి స్ఫురించక మనము వాటి నిర్మూల నకు పూనుకోము.

1927-28 ప్రాంతాలలో నేను బెజవాడలో వుంటూండగా శ్రీ తుర్లపాటి వెంకటేశ్వరరావుగారు, వారి భార్య శ్రీ రాజేశ్వ రమ్మగారు, నేను, నా భార్య అన్నపూర్ణమ్మ గార్లకు గాఢమైత్రి ఏర్పడింది. సాంఘిక విషయాల్లో మా అందరి అభిప్రాయాలు కలిసేవి. ముఖ్యంగా స్త్రీల కష్టాలను తొలగించుటలోను, స్త్రీల అంతస్తును వృద్ధిపరచుటలోను మేమందరం కలసి పనిచేస్తూండే వాళ్ళం. శ్రీ వెంకటేశ్వరరావుగారు, నేను విదేశాల్లో ఉన్నతమైన నాగరికతకు అలవాటుపడ్డవాళ్ళము. మా భార్యలను అభివృద్ధికి తెచ్చి దేశసేవ, సంఘసేవ చేయగల సామర్ధ్యం వచ్చేలా ప్రయ త్నించాము. అఖిలభారత మహిళా సంఘాలలో పాల్గొనుట, స్త్రీలకు క్లబ్బును స్థాపించి, మధ్యతరగతి విద్యావతుల సమస్య లను పరిష్కరించుట బెజవాడలో రాజేశ్వరమ్మ, అన్నపూర్ణమ్మ గార్లకు దినచర్య అయింది. వారిద్దరికి మేము వెనుకనుండి సహా యం చేస్తూ, సంఘంలో ముందుకు నెట్టుకుపోతూవచ్చాము. వారు తరచుగా కలుసుకొని పనిచేయవలసిన సందర్భంఏర్పడింది.

ఒకరోజున వారిద్దరు రైవస్ కాలువ గట్టున షికారు వెళ్లారు, కొంత సేపటికి ఏడుస్తూ నావద్దకు వచ్చారు. వారి దుఃఖానికి అంతం కనపడలేదు. "ఎవరో శిశువునుకనగానే గొంతు నులిమి చంపి, కాలువగట్టున పారవేశారు. ఆ మృతశిశువును కాకులు, గద్దలు తింటూండగా చూచి దుఃఖం భరించలేక ఏడుస్తూ వచ్చారు. ఎవరోవితంతువు ఆపని చేసివుంటుందని, వారినమ్మకం

"ఎలా ఈ పాపాన్ని అరికట్టడం?" అని వారి ఆవేదన. సాధ్యమే నని నేను సలహా యిచ్చాను. వారి దుఃఖం కొంతవరకు శమించింది. గర్భవతులైన వితంతువులు రహస్యంగా ప్రసవించుటకు, బిడ్డలను యిచ్చివేయుటకు ఒక సంస్థను స్థాపించవచ్చు. తద్వారా వారి కష్టాలను తొలగించగలమని వివరంగా చెప్పాను. ఆ సంస్థను తాను నిర్వహించుతానని శ్రీ రాజేశ్వరమ్మగారు ప్రమాణం చేశారు. ఆర్థికంగా నేను సహాయపడతానన్నాను. ఆ రాత్రికే మేము నలుగురము, అడ్వొకేటు శ్రీ రాజేశ్వరరావుగారు కూడ కలుసుకున్నాము. సంస్థను నిర్వహించుటకు అవసరమైన నియమావళిని తయారు చేశాము. వెంటనే తాత్కాలికంగా శ్రీ తుర్లపాటివారి ఆవరణలోవుండే చిన్న ఇంట్లో వితంతు శరణాలయాన్ని స్థాపించాము. రాజేశ్వరమ్మగారు సూపర్నెంటు, నేను ప్రెసిడెంటు, మిగిలిన ముగ్గురు నిర్వాహకసంఘసభ్యులు. మేము వెంటనే ఇతరుల సహాయాన్ని తీసుకోలేదు. 'ఆంధ్రపత్రిక'లో ప్రచురించాము. శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు సనాతనులైనా దయాదాక్షిణ్యరాసి. బాగా ప్రచారం జరిగింది. వెంటనే ఒకరిద్దరు గర్భిణీస్త్రీలు వచ్చారు. వారిపేర్లు గాని, చిరునామాలు కాని, తెలుసుకోకూడదనిన్నీ, తెలిస్తే రహస్యంగా వుంచాలనీ తీర్మానించుకున్నాం. ఖర్చు అంతా రాజేశ్వరమ్మగారే భరించారు. ఆవిధంగా షుమారు అరవై మందికి వుపయోగపడింది. బెజవాడలోని స్త్రీ డాక్టర్లు-ముఖ్యంగా చలంగారి వదినెగారు డాక్టరు రంగనాయకమ్మగారు సహాయం చేశారు. మా సంస్థలో బిడ్డలను పెంచుటకు తగిన ఏర్పాట్లు చెయ్యలేకపోయాము. అయితే, బిడ్డలులేని తల్లిదండ్రులు ఎప్పటికప్పుడే పిల్లల నిమ్మని వచ్చేవారు.

పి ల్ల లు కా వా లి!

మనదేశంలో వేశ్యావృత్తిలో వుండేవారు సాధారణంగా ఆడపిల్లలను కొని, వారిని తమవృత్తిలో దించి, అవిధంగా ధన మార్జించి జీవించుతారు. మా శరణాలయంలోని శిశువులను అలాంటివారి హస్తగతం కాకుండా జాగ్రత్తపడవలసివచ్చింది. రాజేశ్వరమ్మగారికో, వెంకటేశ్వరరావుగారికో బాగా పరిచయ మున్నవారికి మాత్రమే శిశువులను యిచ్చారు. భుక్తికి లోటులేని వారికి, అనాధ శిశువులను పెంచుకొని, ఆ విధంగా తమకు బిడ్డలు లేని లోటును పూర్తిచేసుకొన గోరిన వారికే యిచ్చారు. శిశువులకు గిరాకీ ఎక్కువగానే వున్నది. ముందుగానే రాజేశ్వరమ్మగారితో చెప్పుకొని, బ్రతిమలాడి ఒప్పించుకొని వెళ్లేవారు. శరణాలయాన్ని స్థాపించేటప్పుడు అలాంటి డిమాండు మన సంఘంలో ఉందన్న విషయం మాకు తెలియనే తెలియదు. ఈ అనుభవం మా కెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. అలాంటి శిశువు లిప్పుడు 10 సం॥ ల నుండి 20 సం॥ ల వయసు గలవారు 60 మంది బెజవాడలో పెరుగుతున్నారు.

ఒకబిడ్డను శ్రీ రాజేశ్వరమ్మగారే పెంచుకొన్నారు. ఆ బిడ్డ పేరే ఆ సంస్థకు పెట్టాము. కాని, ఆ బిడ్డ పసితనంలోనే చని పోయింది. నేను మద్రాసుకు వచ్చిన తరువాత నా రెండవ భార్య సుభద్రమ్మగారు ఈ ఉద్యమాన్ని అతిసమర్థతతో ఉత్సాహంగా నిర్వహించింది. బెజవాడ ప్రాంతంలోని స్త్రీలు తమ రహస్యం దాగదనే భయంతో అక్కడి సంస్థలో చేరుటకు యిష్టపడేవారు కాదు. అట్టివారికి మద్రాసులో సుభద్రమ్మగారు వసతి కల్పించారు. ఈ విషయంలో, ఉపాధ్యాయిని మిసెస్ పీటర్సుగారు ఎంతో

తోడ్పడ్డారు.అనాధ స్త్రీలకు సహాయం చేయుటకు ఆమెగా రెన్నడూ నిరాకరించలేదు. అలాంటి పిల్లలను అమిత ప్రేమతో పెంచు కొన్న మహాతల్లి ఆమె.

ఏనుగ వెళ్తూంటే....

మాకీ ఉద్యమ సందర్భంలో సంఘం అడ్డురాలేదు, కొందరు వ్యక్తులు హేళన చేశేవారు. వారి అంటిస్తు మాకు తెలుసు. వారివి సంకుచిత హృదయాలు; సాంప్రదాయాలకు లొంగి పోయిన వ్యక్తుల శుష్కవాదనలను మేము లక్ష్యపెట్టలేదు. ఏనుగులు వెళ్లుతూంటే కుక్కలు మొరగవూ! ఈ విషయంలో మా అందరికంటే హేళనకు, విమర్శకు గురియైనవారు రాజేశ్వరమ్మ గారు. శిశువులను ముద్దాడి, పెంచి, పెద్దచేసిన దయార్ద్ర హృద యంగల ఆ తల్లి పై కష్టాలను లక్ష్యపెట్టనేలేదు.

సన్మార్గానికి

ఈ సమస్య అంతటితో అంతం కాలేదు. పతిత స్త్రీల జీవి తాలను బాగుచెయ్యడం ఎలాగు? మళ్లీ అలాంటి తప్పులు చెయ్య నివ్వకూడదు. చదువుకొని. జీవనాధారమును సంపాదించుకోగలిగి, తమకాళ్లమీద తాము నిలబడి, వివాహంచేసుకొని సంఘంలో గౌరవంగా జీవించేలా చెయ్యాలి. ఇది చాలా కష్టమైనపనే. అయినా నేను, మరికొందరు కలసి అందుకు పూనుకున్నాము.

అభ్యుదయవాదులు,సంస్థలవల్ల ఎంతో సహాయం లభించింది. సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారు, వారి సతీమణి ఆండాళమ్మ గారు తమ సేవాసదనంలో మేము పంపినవారందరికి ఖర్చులన్ని టిని తామే భరించి వృద్ధికితెచ్చారు. మిసెస్ పీటర్సు తన మాంటి సోరి స్కూలులో ఆశ్రయమిచ్చినది. డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు

తన అవ్వాయిహోంలో కొందరికి సహాయం చేశారు. రాజమండ్రి నాళం రామలింగయ్యగారి సంస్కృత కళాశాల ప్రిన్సిపాలు బత్తుల కామాక్షమ్మగారి సానుభూతితో కొందరు వృద్ధికివచ్చారు. కొందరు టీచర్లుగను, మరికొందరు నర్సులుగను, కొందరు విద్వాంసులు, ఉభయభాషా ప్రవీణులు, సంగీత శాస్త్రజ్ఞులుగాను తయారైనారు. ఉద్యోగాలలో చేరి, గౌరవంగా జీవిస్తూ, వివాహాలు చేసుకొని భర్తలతోను, బిడ్డలతోను సుఖంగా వుంటున్నారు.

ఆ కాలంలోనే మద్రాసులో అఖిలభారత మహిళాసంఘం వారి సహాయంతో ఒక రక్షణ గృహము స్థాపించబడినది. దానిని ముఖ్యంగా శ్రీ ముత్తు లక్ష్మిరెడ్డిగారు, శ్రీ అమ్ము స్వామినాధన్ గారు, నా భార్య సుభద్రమ్మగారు చాలా ఉత్సాహంతో కొన్ని సంవత్సరాలపాటు నిర్వహించారు.

అయితే మావద్ద సహాయం పొందినవారందరు బాగుపడ్డారా? లేదు. కొద్దిమంది బాగుపడనేలేదు*

*మా అందరిశక్తికి లొంగని ఒకామెను గురించి వ్రాయటం సమంజసమనుకుంటాను. ఒక హిందూస్త్రీ ఒక ముసల్మానుయింట్లో బాధపడుతున్నదనీ, ఆమెను రక్షించమనీ నా మిత్రులు కోరారు. సరేనని ఆ యింటికి వెళ్ళాను "లోపలికి పోవద్దు, చంపేస్తాడేమో" నని మిత్రులు నివారించారు. నేను లోపలికెళ్ళి యిద్దరితోను మాట్లాడాను. ఇద్దరూ వివాహం చేసుకొని సుఖంగా ఉండమని బోధించాను. ఆవిడ ఒప్పుకోలా. నాతో వచ్చి చదువుకొని బాగుపడతానని బ్రతిమలాడింది. అతను వదిలిపెట్టటానికి సమ్మతించలేదు. పోలీసు డెప్యూటీ సూపర్నెంటు సహాయంతో ఆమెను తీసుకెళ్ళి బెజవాడలో నా ప్రథమభార్య అన్నపూర్ణమ్మకు ఒప్పగించి తమాషాకు "నీ గట్టితనం చూస్తాను, ఈవిడను బాగుచెయ్యి!" అన్నాను. "తప్పకుండా బాగవుతుంది" అని ధీమాగా జవాబు చెప్పినది. కొన్ని వారా

పునర్వివాహం కొరకు నా వద్దకు వచ్చిన వితంతు బాలిక లను చదివించుతూ వచ్చాము. భర్తచే విడిచిపెట్టబడిన వారిని కూడ చదివించాము. ఒక బాలిక అక్షరాభ్యాసంనుంచి యల్. యమ్. పి. చదివి డాక్టరు అయ్యేవరకు సహాయం పొందుతూనే వుంది. తలను బోడిచేయించుటకు ప్రయత్నాలు జరుగుచుండగా తప్పించుకొనివచ్చిన స్త్రీ విద్వాన్ అయి, హైస్కూలులోపండితు రాలైనది. నైజాములో ఒక బీదతల్లి తన బాలవితంతు బిడ్డల నిద్దర్ని పరమత సంఘానికి యిచ్చివేస్తుండగా చూచి సహించలేక నా మిత్రుడు శ్రీ పోడూరి కనకరాజుగారు వారిద్దరిని నా వద్దకు పంపారు. ఒకామె గుంటూరులో ఉన్నప లక్ష్మీనారాయణగారి సహాయంతో వృద్ధికి వచ్చి, టీచరుగా పనిచేయుచున్నది. రెండో బిడ్డ తన తల్లిని చూచుటకు నిజామాబాదుకు వెళ్లి రౌడీలకు చిక్కింది. ఆమెను తప్పించేందుకు చేసిన ప్రయత్నాలన్నీ వృధా అయ్యాయి. మరెందరినిగురించైనా వ్రాయవచ్చు. ఇలాంటి సంఘ

లకు అన్నపూర్ణ "ఆ స్త్రీ నా బోధవల్ల బాగుపడుతుందనే నమ్మకం ఎంత మాత్రం లేదు. పైగా ఆవిడబోధవల్ల నేనే చెడిపోతానేమోనని భయంగా వుంది. ఆమె విషయం ఎలా ఉన్నా మీ భార్య విషయంలో జాగ్రత్తపడం" డని చమత్కారంగా రిపోర్టుపంపింది.

ఆ స్త్రీ కథ విపులంగా ఒక ఉత్తరంలో శ్రీ ముత్తా వెంకటసుబ్బా రావుగారి భార్యకువ్రాసి, "మీ సామర్థ్యాన్ని పరీక్షించటానికి మీవద్దకు పంపు తా"నని స్నేహపూర్వకంగా వ్రాశాను. ఆమె అంగీకరించి, తన సేవాసద నంలో చేర్చుకొని ఎంతో ప్రయత్నించిరి. కాని, ఆమెకూ సాధ్యంకాలేదు. తీసుకెళ్ళమని నాకు వ్రాయకముందే తన ముసల్మాను ప్రియునివద్దకు చేరిపోయింది ఆ పడుచు. మే మందరం ఎంతో వ్యసన పడ్డాము! కాని ఏం ప్రయోజనము ?

సేవ చేయదలచిన వారికి ఎన్నో అవకాశాలున్నాయి. ఎందరో అనాథస్త్రీలు సహాయం పొంది, తమ జీవితాలను సంస్కరించుకొనుటకు తయారుగా వుంటారు.

సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారి సతీమణి ఆండాళమ్మగారు తన సేవాసదనంలో ఇలాంటి స్త్రీలను పోషించుటేగాక, మాతృప్రేమతో వారిని వృద్ధికి తెచ్చుచుండెను. కొందరిని సరియైన శిక్షణలో పెట్టుట చాల కష్టమయ్యేది. అలాంటివారి తప్పులను పదేపదే క్షమిస్తూ ఎంతో ఓపిక, ప్రేమ చూపి అభివృద్ధికి తెచ్చారు. ముఖ్యంగా ఓకపిల్ల విషయంలో ఆమె దయార్ద్రహృదయాన్ని కనిపెట్టి "ఏమమ్మా! ఇంత ఓపికతో పనిచేస్తున్నావు? నీ అభిప్రాయమేమిః" టని ప్రశ్నించాను. "స్త్రీలను ఒక వయసులో క్రమశిక్షణలో పెట్టగలిగితే వారిజీవితమంతా ఒక రాజబాటలాగా పోతుంది తల్లిదండ్రుల అజ్ఞానంవల్లగాని, అజాగ్రత్తవల్లగాని ఒక స్త్రీ జీవితం పాడైతే, ఆమెను నిందించి ప్రయోజనమేమిటి? మనం కొంత ఓపిక చూపితే, బాగుపడుతుం"దని చెప్పినది. అలాగే జయించుతూ వచ్చింది.

## మాతో అన్యోన్య బాంధవ్యం

1930—31 లో ఆరుగురికి పైగా అలాంటివారు మద్రాసు సేవాసదనంలో చదువుతున్నారు. వారు ఆదివారాలలో మా యింటికి వస్తుండేవారు. నా ప్రథమభార్యకు వారికి మధ్య చాలా అనురాగమేర్పడింది. మా చిన్నయిల్లు నిండుగా వుండేది. నా భార్య హఠాత్తుగా చనిపోవుటతో ఆ పిల్లలు ఎంతో దుఃఖించారు. ఆ తరువాత కూడ మామూలుగా ఆదివారాల్లో వస్తూవుండేవారు. ఒక ఆది

వారంనాడు అన్నపూర్ణమ్మ బట్టలు, పెట్టెలు వగైరా సామాను లను నా అనుమతి లేకుండానే తమలో తాము పంపకం ప్రారం భించారు. నాకు నవ్వొచ్చింది. పంపకాలు కుదరక నన్ను తీర్మా నించమన్నారు. రెండు ట్రంకుపెట్టెలలో ఒకటి పెద్దది; ఒకటి చిన్నది. ఎవరు దేనిని తీసుకోవాలి? ఇద్దరూ పెద్దదే కావాలని వాదించుకొన్నారు. సమాధానం కుదరక నన్ను తీర్మానించ మన్నారు. ఎవరికి ఎలాంటి హక్కులున్నాయో చెప్పమన్నాను. ఇద్దరిలో ఒకరు ముందుగా అన్నపూర్ణమ్మవద్దకు చేరుకున్నందున అవిదే పెద్దచెల్లెలు, పెద్దభాగస్థురాలు; కాబట్టి, తనకు పెద్దపెట్టె నిమ్మన్నది. ఈ వాదన నాకుకూడా న్యాయంగానే తోచి, అలాగే తీర్పుయిచ్చాను. ఈ దిక్కులేని స్త్రీల-సంఘం వేలుపెట్టి చూపిస్తూ హింసించుతున్న స్త్రీలు ఎంత అన్యోన్యంగా మా కుటుంబంలో కలిసి మెలిసి వుండేవారో పై విషయాన్నిబట్టి తెలుసుకోవచ్చు.

శ్రీమతి రాజేశ్వరమ్మగారు జబ్బుపడి బెజవాడలో ఉద్య మాన్ని సాగించజాలకపోయింది. సంస్థ క్షీణించి పోయింది. అయితేనేం? ఈ విషయంలో ఆమెగారే మార్గదర్శిని.

## శ్రీమతి దవిశి సుభద్రమ్మ

ఈ ఉద్యమము మద్రాసులో సాగుటకు నాభార్య సుభద్రమ్మే కారణం. ఈమె యిలాంటి సంస్కరణలను మాకంటె ముందుగా ప్రారంభించి వ్యక్తిగతంగా నిర్వహిస్తూవచ్చారు. 1918 సం॥ నుండి మధ్యతరగతి స్త్రీల కష్టాలు తన కష్టాలుగా ఎంచి తానే భోజనము పెట్టి, బస యిచ్చి వృద్ధికి తెస్తూవుండేవారు. కొం దరు టీచర్లుగాను, నర్సులుగాను వృద్ధికి వచ్చారు. ఏ అనాథ

స్త్రీ గాని తన కష్టాలను ఆమెతో చెప్పుకొని, సహాయం పొంద కుండా వెళ్లలేదు*.

పరులసహాయం కావలసివచ్చినప్పుడు తాను స్వయంగా పిల్లలను వెంటేసుకొని, తన పలుకుబడిని పూర్తిగా వినియోగించి సాధించుకొస్తుంది. ఆమె స్వయంగా ఇలాంటి పనులన్నిటిని నెరవేర్చగల సమర్థురాలు. అందువల్ల నేను ఆ పనులు చూచుకోవాల్సిన అవసరం లేకపోయింది. ఇప్పటికీ అలాంటిస్త్రీలు వస్తూనే వుంటారు: వారి కష్టాలు, గాధలతో సుభద్రమ్మగారి కండ్లు సాధారణంగా నీరు కార్చుతూంటాయి. వీధుల్లో, మీటింగులలో, సినిమాలలో "అమ్మా" అని హఠాత్తుగా వచ్చి చుట్టేస్తుంటారు. అలాంటి ఘట్టాలు మామూలవడంవల్ల నా కిప్పుడు ఆశ్చర్యం కలిగించవు. స్త్రీలేకాదు; కుర్రవాళ్ళు కూడా వచ్చి "అమ్మా! ఎంతకాలమయింది మిమ్ము చూచి!" అంటూంటారు. వారు తమ పసితనంలో ఆమెవద్ద చదువుకుంటూ, ఆమె ప్రేమకు పాత్రులైనవారే. ఇలాంటి ప్రేమఘట్టాలు, గాథలు ఈ ముసలితనంలో మా కెంతో ఆనందంగా వుంటున్నాయి. సంస్కరణలవిషయంలో ఆమెయే ఒక పూర్తి సంస్థ అనవచ్చు; మద్రాసులో అనేక సంస్థలను, సంస్కరణాభిలాషులను ఆమె వినియోగ పెట్టుకోగలుగు

---

*నే నీ ఘట్టల వ్రాస్తూవుండగా సుభద్రమ్మ ఒంస్త్రీకి ఉత్తరం వ్రాస్తున్నది. ఆ స్త్రీ తన భర్తను ఇద్దరు బిడ్డలను విడిచిపెట్టి. ఒకరితో వెళ్ళిపోయింది. భర్తకు ఆమెయం దమిత ప్రేమ. తా నామెను తిరిగి స్వీకరించాలనే ఉద్దేశ్యం. లేనిచో తాను, తన బిడ్డలేగాక, ఆమె మరీ అధోగతి పాలవుతుందని ఆయన అభిప్రాయం. నా భార్యవద్దకు వచ్చి, తన భార్యకు సుభద్రమ్మగారిచే ఉత్తరం వ్రాయించుచున్నారు.

చున్నది. ఆమెను గురించి నే నెక్కువగా వ్రాయడం బాగుండదు. నా భార్య కావడంచేత నేను అతిశయోక్తులు వ్రాశానని ఆమె నెరుగనివారు అనుకోవచ్చును.

## రష్యా సాధన

సంఘంలో ఉండే కుళ్లను శక్తికొలది తగ్గించటానికి మా శక్తికొలది ప్రయత్నించాము. ఇలాంటి వ్యక్తిగత ప్రయత్నాలు వేనవేలమంది చేసినా తరుగనన్ని లోట్లు మన సమాజంలో వున్నాయి. ప్రభుత్వం మాత్రమే సంస్కరణలమూలంగా సంఘంలోని లోటుపాటులను పూర్తిగా తొలగించగలదు. ప్రభుత్వవిధానం సంఘసంస్కరణలకు అనుకూలంగా ఉండనంత కాలము వ్యక్తులు సవరించగలిగినది సముద్రంలో ఒక నీటిబొట్టులాగానే ఉంటుంది. ఈ సత్యాన్ని స్వానుభవంద్వారానేగాక, సోవియట్ రష్యానుగురించి వెబ్ దంపతులు, డీన్ ఆఫ్ కాంటర్బరీ వంటి గొప్ప గ్రంథకర్తల రచనలవల్ల ఈసత్యం తెలుసుకోగలిగాను. నేటి రష్యాలో స్త్రీలకు ఘోషాలేదు. పడుపువృత్తిలేదు, బహుభార్యాత్వం లేదు; భర్తలేకుండా కలిగిన బిడ్డలకు న్యాయ చట్టాలవల్ల యిబ్బందులు లేవు. అందరికీ చదువు, ఉద్యోగాలు ఉన్నై. పడుపువృత్తిలో వున్నవారిని ప్రభుత్వమే సంస్కరించి, యితర వృత్తివిద్యలు నేర్పించి, ఉద్యోగాలిచ్చి వృద్ధికి తెచ్చారు. స్త్రీలు పురుషులతో సమానహక్కులు కలిగి సుఖించే అవకాశం సోవియట్ రష్యాలోమాత్రమే వున్నట్లు చదివి, తెలుసుకోవడమే నేను కమ్యూనిస్టుగా మారిపోవుటకు ముఖ్యకారణ మనుకుంటాను.

"స్త్రీల అభిమానివి" అని కొందరు నన్ను నిందించారు. అవును, నే నందుకు గర్వపడతానుకూడాను.

## తాలింఖానాలు

అమెరికావెళ్ళే స్టీమర్లమీదను, జపానులోను జపానీయుల ధైర్యసాహసాలను, దేశభక్తిని చూచాను. బెంగాలులో టెర రిష్టుల తాలింఖానాలనుగురించి లాహిరీ మొదలైనవారి ద్వారా తెలుసుకొన్నాను. అటు తరువాత దేశమంతటా తాలింఖానాలు స్థాపించాలని గొంతెమ్మకోర్కెలు 1914-15లో కలిగాయి నాకు. అమెరికాలో వున్నప్పుడు (1913-15) వివిధదేశాలలో వుండే తాలింఖానాలు, జిమ్నేజియములకు సంబంధించిన సంస్థలను గురించిన వివరాలను బాగా తెలుసుకున్నాను.

జపానులోనిఉద్యమం ఉత్తమమైనదిగా తోచింది. నేను రెండవసారి (1915లో) జపానుకు వెళ్ళినప్పుడు ఒక వారం రోజులు వారి తాలింఖానాలను పరిశీలించి, వారు దేశమంతటా ఎలా స్థాపించి, నిర్వహించుతున్నదీ-ముఖ్యవివరాలను తెలుసుకున్నాను. 35 సం॥ల అనంతరం ఇప్పుడుకూడా ఆ పద్ధతి మన దేశానికి ఉపయోగపడునని నా నమ్మకము. జపానులోని ఆ వుద్యమ స్వరూపం ఎలాగుంటుందో కొంత ఉదహరిస్తాను.

## జపానులో వ్యాయామము

అఖిల జపాను వ్యాయామ ఉద్యమములో ప్రతి జపానీయుడు సభ్యుడుగా చేరవచ్చు. ప్రవేశరుసుముఒక యెన్ (1-8-0 అప్పుడు) చెల్లించాలి. దేశభక్తివల్ల కోట్లరూపాయలు ప్రోగైనవి. సభ్యులు తమ జీవితంలో ఎప్పుడైనాసరే, ఆ సంస్థకు సంబంధించిన తాలింఖానాలలో రెండేళ్లపాటు నేర్చుకోవచ్చును. నేర్చుకొనేటప్పుడు స్థానికతాలింఖానాకు ప్రతినెల చందా యివ్వాలి. పెద్ద నగరాలలో ఉదయం గం. 5 మొదలు రాత్రి 10 వరకు తాలిం

ఖానాలు తెరచి వుంటాయి. మెంబర్లు తమ అనుకూల సమయంలో వెళ్ళి నేర్చుకుంటారు. రోజుకు ఒక గంటమాత్రమే నేర్పుతారు.

ఆత్మరక్షణ విద్యలు-అనగా జిజిట్సు, బాక్సింగు, కుస్తీ, కత్తి సాములలో ఏ రెండింటినైనా నేర్చుకోవచ్చు. తాలింఖానాలో ఆవిరి స్నానపుగదులు, వేడినీళ్ళ గదులు. ఈత కొట్టుటకు తటాకాలు వగైరా ఉండడమేగాక, తువ్వాళ్లు సబ్బులు వగైరా సౌకర్యాలు కూడ ఉంటాయి. ఆపరణ పూలమొక్కలతో అందంగా ఉంటుంది.

స్థానికంగా మొదలుకొని కేంద్రంవరకూ జపానుదేశమంతటా పందాలు, పోటీలు ప్రతిసంవత్సరం నిర్ణీతసమయాల్లో జరుగుతూంటాయి. ఆఖరుపోటీలుమాత్రం పండుగరోజుల్లో జరుగుతూంటాయి. వీటివల్ల సంస్థకు చాలా ధనం చేకూరుతుంది.

ఆ పోటీలలో గెలిచినవారిని బోధకులుగా నియమించి, కేంద్రమే బాగా తరిఫీదుయిచ్చి, వివిధప్రదేశాలకు పంపుతుంది. ఈవిధంగా దేశీయులందరికి ఆటలయందు ఉత్సాహం కలిగేలాగు (Sports-minded) చేస్తారు.

వ్యాయామవిద్యలను నేర్చుకొన్నవారికి ఆ విద్య తెలియని నలుగురైదుగురిని ఓడించగలమనే ధైర్యము, నమ్మకము కల్గుతాయి. జపాను తూర్పుదేశాల్లో ఒకటి. పశ్చిమదేశాలవారు తూర్పుదేశాలవారిని చాల చులకనగా చూస్తారు. సాధారణంగా నావికులు, సైనికులు చాల పొగరుబోతుతనంగా ప్రవర్తించుతారు. అలాంటివాళ్ళను పోలీసులు స్త్రీలు కూడ తమ జిజిట్సు తరిఫీదువల్ల ఒక్కొక్కరు యిద్దరుముగ్గురిని గెంటివేస్తుంటారు. మనదేశానికి ముఖ్యంగా రేవుపట్టణాల్లో ఇలాంటి తరిఫీదు చాలా అవసరం;

## "పోకిరి పాళ్ళా"కు దేహశుద్ధి

నేనీ ఉద్యమాన్ని మనదేశంలో ప్రారంభించలేక పోయాను. అయినప్పటికి పెద్ద పరియత్నం, ప్రయాస లేకుండానే నా సలహాలు విని కార్యరూపంలో పెట్టే వైశ్యసంఘంలో కొన్ని తాలింఖానాలను ఏర్పరచాను. ఈ విషయంలో ప్రొద్దుటూరు శ్రీ కొప్పరపు వెంకట సుబ్బయ్యగారితో కలసి పని చేశాను. రాయలసీమలో ఎక్కువగా పని జరిగింది. ప్రొఫెసర్ బి. వి. నాథ్ అను విప్రుని నియమించి, తాలింఖానాలను వృద్ధికి తెచ్చాము.

ఈ సందర్భంలో కావలిలో 1923 సం॥లో స్థాపించిన తాలింఖానా కథను వ్రాస్తాను. అప్పుడు నా చిన్నతమ్మునికి కావలిలో వివాహం జరిగింది. ఆ సందర్భంలో కావలి వచ్చిన నా పెద్ద తమ్ముడు గురుస్వామి చెంబు తీసుకొని బహిర్భూమికి వెళ్ళాడు. అతను కసరత్తుచేసి, హిందూ ముసల్మాను తగాదాలలో లాఠీలతో తీర్మానం చేసుకోవలెననే సిద్ధాంతంగల యువకులలో ఒకడు. చిన్నతనంలో లాఠీని తలక్రింద పెట్టుకొని నిద్రించేవాడు. అలాంటివానిని బసకు తిరిగి వచ్చుచుండగా ఒక రౌడీ నిష్కారణంగా కొట్టాడు. గురుస్వామి తన చెంబుతో బదులు చెప్పాడు. కాని, రౌడీ కొట్టిన దెబ్బలతో చాల బాధపడుతున్నాడు. మా బంధువులందరూ ఈ విషయాన్ని నాకుమాత్రం తెలియకుండా, ఒక దినమంతా రహస్యంగా వుంచారు. మరునాడు నాకు కారణం తెలియగానే, ఆ రౌడీని శిక్షించాలని బయలుదేరాను. బంధువులందరూ ఆ రౌడీ జోలికి పోవద్దని నాకు అడ్డం వచ్చారు, కారణంకూడా చెప్పారు. ఆ రౌడీ పేరు "పోకిరి పాళ్ళా" అట!

వానిని చూస్తే కాపలిలో అందరూ భయపడతారట. పోలీసులు కూడ వాని జోలికి పోరట. స్త్రీలమీద రాళ్లు వేస్తాడేమోనని "పెద్దమనుషులు" వానిజోలికి పోరు. ప్రతి అంగడికి నెలకు కొంత లంచం చందాగా తప్పకుండా సమర్పించుకొంటూంటారు. అలాంటి రాక్షసుడితో తగాదా పెట్టుకోకూడదని, నా శ్రేయస్సు కోరిన బంధువులు, స్నేహితులు సలహాయిచ్చారు. అలాంటి వాడినే శిక్షించి ఆ పట్టణ ప్రజల కష్టం తొలగించాలని నాకు ఉత్సాహం ఎక్కువైంది.

ఆరోజుల్లో నేను బయటికి వెళ్లేటప్పుడు నా చేతిలో మామూలుగా పేముబెత్తం ఉంటూండేది. "పోకిరిపాళ్చా" యింటికి వెళ్లాను. ముసల్మానులందరు నామీద పడతారని స్నేహితులు నాకు అడ్డంపచ్చారు. ముసల్మానులు అలా చెయ్యరనీ, మంచిపనులకు వారి సహాయం కూడ లభిస్తుందనీ నా నమ్మకం. తీరా వెళ్తే వాడు యింట్లో లేడు.

బజార్లో ఒక వంతెనమీద కూర్చుని ఉన్నట్టు తెలిసింది. అక్కడికి వెళ్ళాను. నా వెంట కొందరు మిత్రులుకూడ వున్నారు. వారిలో నాకు సహాయపడగలిగినవారు ఒక్కరే—శ్రీ మిట్టనొడ్డి రాజా నరసింగరావుగారు. ఆయన ఒక వస్తాదు; బలశాలి; "ఆ రౌడి నామీద పడితే ఏం చేస్తా"వని అడిగాను. "చితుక తన్నుతా" నన్నాడు. "నే నొక్కణ్ణే వాడిపని పడతాను. మీ రెవ్వరూ వాడిని కొట్టకూడదు. రాజా! నువ్వు వాడి వెనుక నిలబడివుండు. వాడు నా మీదికి చెయ్యెత్తితే చేతులను వెనుకకు విరిచివెయ్యి" అని ముందుగా సలహా యిచ్చాను. ఒక పని చేసే

ముందుగా జయించుటకుగాను ఏదో ఒకప్లాను వేసుకోవడం నాకు అలవాటు.

పోకిరి పాశ్చా వంతెనమీద కూర్చొని వున్నాడు. వానితో మరికొందరున్నారు. వాళ్లు వాడి ముఠావారై వుంటారని నాకు పిరికిమందు పోయ్యాలని నా వెంటవచ్చినవారు అన్నారు. ఎంత మాత్రం వార్నింగు యివ్వకుండానే హఠాత్తుగా నా బెత్తంతో పాశ్చాను కొట్టసాగాను. రౌడీ బిత్తరపడిపోయాడు. "రాస్కెల్! పోలీస్‌స్టేషన్‌కు నడువు" మన్నాను. చెయ్యెత్తలేకపోయ్యాడు. కంఠ్లలో భయము, కోపమూ తాండవమాడుతున్నాయి. నా బెత్తం ఫెళ్‌ఫెళ్ మని వాగుతూనేవుంది. వాడి శిష్యులు మాయమై పోయారు. గుంపుకూడింది. గుంపులోనుండి ఎవరో "ఆయన దరిశి చంచయ్యగారురా! చంపుతాడు, కాళ్లు పట్టుకోరా!" అని ఉర్దూలో అన్నారు. నా కాళ్ళు పట్టుకున్నాడు. మరి వదలడే! బాగా భయపడిపోయాడు. చుట్టూచేరి చూస్తున్న జనం ఆశ్చర్యచకితు లయ్యారు. వారిలో చాలామంది నెలనెలకూ లంచమిచ్చితన్నులు తప్పించుకొనుచున్న పెద్దమనుష్యులు!

వారి కొక ఉపన్యాసం యిచ్చాను. "ఒక తాలింఖానా పెట్టుకోండి. ఇలాంటి రౌడీలకు కావలిలో స్థానం లేకుండా చెయ్యండి" అని చెప్పాను. ప్రజలకు నా సలహా నచ్చింది. ముఖ్యంగా బాధపడుతున్నది వైశ్యులు. "కోమటి పిరికి" అనే సామెత నిజంకాదని నిరూపించమని పౌరుషం వచ్చేట్లు మాట్లాడాను. అందరూ బాగున్నదని సమ్మతించారు. విరాళాలు యివ్వమన్నాను; వెంటనే యిచ్చారు. ఒకరు (పెండాల నారాయణ అని నాకు జ్ఞాపకం) ఖాళీస్థలం యిచ్చారు. నేర్పుటకు ఎవరినైనా

నన్నే ఏర్పాటు చెయ్యమని కోరారు. తానే ఆరునెలలకు అయ్యే ఖర్చు అంతాకూడ భరించుతానని ముందుకువచ్చారు. నా మిత్రుడు శ్రీ రాజా నరసింగరావుగారిని గురువుగా ఉండమని కోరాను; ఆయన తక్షణం ఒప్పుకొన్నారు.

మరునాడే తాలింఖానా ప్రారంభమయింది. పోకిరి పాళ్ళా క్రితంనాడే మాయమైపోయాడు. వాడు మళ్ళీ కావలిలో కన్పించ లేదు. యువకులు బాగా ఆరితేరారు. వైశ్యులచే స్థాపించబడిన తాలింఖానాలలో అన్ని కులాలవారు, మతాలవారు, ముఖ్యంగా నాయుళ్లు, ముసల్మానులు చేరుటకు అవకాశమిమ్మని ఎన్నాళ్ళో సలహా యిస్తూ వచ్చాను. వైశ్యుల్లో వైశ్యులు పోటీలు పెట్టు కొన్నంతమాత్రాన ప్రయోజన ముండదనీ, ఇతరులతో పోటీ పెట్టుకోవలసిందని నే నిచ్చిన సలహా వారి బుర్రలోకి ఎక్కనే లేదు. రాజకీయాలతో సంబంధం లేకుండా కులాలు, మతాల వారీగా ఏర్పడిన యిలాంటి సంస్థలు చివరకు హిందూ ముస ల్మాను తగాదాలకే ఉపయోగపడుతూ రావడం చూచి తలవంచు కొంటూండేవాడిని.

## వైశ్యులలో స్త్రీ విద్య

వైశ్యులు జీవనోపాధికి సులభంగా సంపాదించుకొం టారు. కాని వారిలో- పుష్కలంగా ధనమున్నవారిలో సయితము విజ్ఞాన-వికాసాలు, సంస్కృతి చాల తక్కువ. ఒక గొప్ప ఆంధ్ర కవి "కోమటై పుట్టితే నేమీ మా గాంధి" అని వ్రాశారు. అంత చులకనై పోవుటకు కారణాలున్నాయి.

స్త్రీలలో చదువుసంధ్యలు చాల తక్కువ. శ్రీ బాపినీడు గారు అమెరికానుండి వచ్చిన కొత్తలో మ్యాజిక్ లాంతర్ల లెక్చె

ర్లిచ్చేవారు. ఆ ఉపన్యాసాల్లో స్త్రీవిద్య ముఖ్యమైనది. ఆంధ్ర స్త్రీలలో బి. ఏ. ప్యాసయిన వారు ప్రతి చిన్నకులంలోను ఉన్నారని ఫొటోలద్వారా నిరూపించుతూ, వైశ్యసంఘాన్ని గురించి ఒక్కరూ లేరని బ్లాంక్ స్లయిడు చూపించేవారట! ఆయన ఆవిధంగా ఆ కులాన్ని, సంఘాన్ని గురించి పరిహాసం చేసి పౌరుషం వచ్చేలా చేసేవారట. చివరకు ఈ పరిహాసంవల్ల నాకే పౌరుషం వచ్చి ఆలోటు తీర్చాను.

వైశ్యులు అతి భయస్థులు; కులాచారాలకు దాసులు. స్త్రీ విద్య వారికి పనికిరాదు. రజస్వలానంతర వివాహం చేయించే సాంప్రదాయం లేకపోవడం, కులబహిష్కారం చేయిస్తారనే భయం, కులకట్టుబాటు నూటికి నూరుపాళ్ళు జీర్ణించివుంది. ఆ స్థితిలో మరెవరినో సాహసించమని బోధించుటలో అర్థమే లేదు. కాబట్టి, నా యింటిలోనే 1925 సం॥లో ప్రారంభం చేశాను. నా ప్రథమభార్య అన్నపూర్ణమ్మ చెల్లెలు సుబ్బమ్మను చదివించాను.

వితంతువివాహాలు పరిపాటి అవడంతో కులకట్టుబాట్లు నశించాయి. అందుచే రజస్వలానంతర వివాహాలుకూడా పరిపాటి అవుతూవచ్చాయి. అంతటితో మా అత్తగారికి భయాలు పోయినై. చదువు సాంతంగా సాగిపోయింది. వైశ్యసంఘంలో సుబ్బమ్మే మొదటి యింటర్, బి. ఎ. ఎల్. టి, ఎమ్. ఎ. యల్. టి. లలో వరుసగా ప్రథమస్థానాన్ని సంపాదించినది. తరువాతనే వివాహం చేసుకొన్నది.

సుబ్బమ్మను చదివించుటకు ముందు మరొక రిద్దరిని చదివించటం ప్రారంభించాను. నన్ను వివాహమాడిన తరువాత చదువు

మీద అన్నపూర్ణమ్మకు శ్రద్ధలేకపోయింది. అంటే స్కూళ్ళ చదువు మానేసింది. రెండవవారు బళ్ళారి రుక్మిణి. ఈవిడకు 8 సం॥ల వయసులో వివాహమైనది. ఆ తరువాత భర్త ఏమయ్యాడో తెలియదు. 12-13 సం॥ల వయసులో నేనే అక్షరాభ్యాసం చేయించి, చదివించాను. చాలామంది కోరిన సహాయం చేస్తూవచ్చారు. చివరకు యల్. యం. పి. ప్యాసయినది. సుబ్బమ్మ, రుక్మిణిగార్ల విద్యావిషయంలో ద్రవ్యసహాయం చాల వరకు లభించినది. కాని, నా కుటుంబపోషణకే సరిగా ఆర్థిక స్తోమతులేనికాలంలో, నగలు, సామానులు అమ్ముకొని జీవించే కష్టకాలంలో కూడ సుబ్బమ్మ, రుక్మిణిల చదువులకు సహాయం చేస్తూనేవున్నాను. ఎలాగైతేనేమి? బాపినీడుగారి ప్రబోధం ఫలించి నా పంతం గెలిచింది. నేను ప్రారంభించిన 25 సం॥ల తరువాతకూడ ధనవంతమైన వైశ్యసంఘంలో సంవత్సరానికి ఒక్క బి. ఎ. కాని, ఒక్క డాక్టరుగాని తయారుకావడంలేదు. ఆ సంఘం యిప్పటికీ విద్యలోను, విజ్ఞాన వికాసాల్లోను ఇతర కులాలకు వెనుకపడి ఉన్నదనుటలో సందేహం లేదు.

## వైశ్యులలో విద్యావ్యాప్తి

ఇక పురుషుల విషయం. 1912 వరకు దిక్కులేని బీద వాళ్లు ఇంగ్లీషు చదువుకొని ఉద్యోగం చేసుకోవాలనిన్ని, ద్రవ్యవంతులకు చదువు అవసరం లేదనే భావం ముఖ్యంగా వైశ్యులలో వుండేది. ఆరోజుల్లో వైశ్య హాస్టలులో వున్నవారు చాల మంది నాలాంటి బీద విద్యార్థులే. కన్యకా పరమేశ్వరీ దేవాలయం వారు విద్యార్థి వేతనాలు యిచ్చేవారు. ఆవిధంగా సహాయం పొంది

చదువుకొనుచున్న నాలాంటి బీదవారిని కొంత న్యూనతగానే చూచేవారు.

1925 సం॥ నాటికి ద్రవ్యవంతులు కూడా చదవటం ప్రారంభించారు. వైశ్య యువజన మహాసభ తీర్మానాలను ఆచ రణలో పెట్టుటకు కాలం అనుకూలంగానే వుంది. హైస్కూలు వుండే ప్రతి పట్టణంలోను బీదవిద్యార్థులకు ఉచితంగా అన్ని ఖర్చులు సంఘమే భరించి చదివించాలని అనేక పట్టణాలలో ప్రబోధం చేశాను; సహాయం లభించిందికూడాను. అయితే, ఈ విషయంలో కూడా వృద్ధ సనాతనులు అడ్డువచ్చారు. వృద్ధులు ఒక పార్టీగాను, యింగ్లీషు చదివి, పురోగాములైన తమ బిడ్డలు మరొక పార్టీగాను ఏర్పడి, తగాదాలు జరిగాయి; చివరకు యువ కులే జయించారు. ఈ సందర్భంలో అప్పటి కష్టాలను నిరూ పించే ఒక ఉదాహరణను వ్రాస్తాను.

బెజవాడ బాగా అభివృద్ధి చెందుతున్న పట్టణము. వైశ్య సంఘంవారు ధర్మాలనే పేరుతో సం॥కు ఒక లక్షరూపాయలు వసూలు చేసి "ధర్మకార్యాలకు" వినియోగించుచుండిరి. పెద్ద సత్రం, ఒక హైస్కూలు కూడ నిర్వహించుచుండిరి. కాని అం దులో వైశ్య విద్యార్థులు మాత్రం లేరు. ఈలోటును తీర్చమని ఒక ఉచిత హాస్టలు పెట్టించండని, శ్రీ చుండూరు వెంకటరెడ్డి గారిని, వారి అన్నగారిని, శ్రీ చిట్టూరు రామకృష్ణయ్యగారిని రెడ్డిగారి ఆఫీసులో అందరూ వున్నప్పుడు అడిగాను. అప్పుడు మాకు క్రింది సంభాషణ జరిగింది.

"వైశ్యులు చదవరండి"

"వృధా ప్రయాసండి"

"మా సత్రాల్లో ధారాళంగా సహాయం చెయ్యగలమండి"

"విద్యార్థులను పంపండి; తప్పక చదివించుతాం"

"ఇంతమంది, అంతమంది అని షరతు అవసరంలేదండి. ఎంతమంది వచ్చినాసరేనండి" అని సంశయాలతో ముగ్గురూ మాట్లాడారు.

"తప్పక పంపుతా" నన్నాను.

"మీరు పంపలేరు" అని ఆ ముగ్గురూ అన్నారు.

"సరే; ఎవరు గెలుస్తారో చూద్దాం" అని నవ్వి వెళ్ళాను.

యువకుల పత్రిక "వాసవి"లో ప్రచురించాను. శ్రీచిట్టూరు రామకృష్ణయ్యగారి అడ్రసుకు దరఖాస్తులు పెట్టుకోమని ప్రచురించాను.

అప్పుడు (1924-26) నేను గుంటూరులో వుంటున్నాను. ఒకనాటిరాత్రి శ్రీ రామకృష్ణయ్యగారు నన్ను నిద్రలేపి "ఇప్పటికే ముప్పై అప్లికేషన్లు వచ్చాయి. వీరికి మాత్రమే సహాయం చేసినా సం॥కి రు 6000/లు కావాలిగదా? ఇవి చాలు. ఇక అర్జీలు పంపవద్దని వ్రాయండని బ్రతిమలాడారు. అలాగే చేశాను.

వారు భయపడటం నాకు వింతగా ఉంది. సంఘంలో రు 6000/లు తీర్మానించే సమయానికి నన్ను రమ్మని నా మిత్రులు ఆహ్వానించారు. వెళ్లాను.

ఆ మీటింగులో రెండు పార్టీలున్నై. యువకులందరూ ఒక పార్టీ; ఛాందసులైన వృద్ధులు ఒకపార్టీ. "సత్రం మొదలైన ధర్మసంస్థలను స్థాపించే సమయంలో 'బ్రాహ్మణులకు, గోవులకు' మాత్రమే ఖర్చుపెట్టాలని ప్రమాణం చేసుకొన్నాము; ఇప్పుడు బీద వైశ్య విద్యార్థులకోసం ఎలా ఖర్చుపెట్టగలము?

సాధ్యం కా'దని ప్రెసిడెంటుగారైన శ్రీ........వెంకటరత్నం గారు అడ్డుపడినారు. శ్రీ చుండూరు వెంకటరెడ్డిగారి మతావారు (యువకులు) "మేము చీలిపోయి ప్రత్యేకంగా సంఘం పెట్టుకొంటాము. మా పార్టీలో షుమారు 12 రైసుమిల్లులు చేర్తాయి. సంవత్సరానికి నలభై వేలరూపాయలు ధర్మాలక్రింద వసూలవుతా" యని బెదిరించారు. సనాతనులు జంకి సంవత్సరానికి రు 6000/- లచొప్పున వైశ్య హాస్టలుకు శాంక్షన్ చేశారు.

అయితే, ఆ పెద్దల మనసులో ఒక దురుద్దేశమున్నట్టు అప్పుడు గ్రహించలేకపోయాము. హాస్టలు మేనేజరుగా ఒక చెడ్డవానిని నియమించి, విద్యార్థుల్లో తగవులు పెంచి, పేనాకత్తులతో పొడుచుకొనేలాగుచేసి, విద్యార్థులను తుంటరులని ఆరోపించి హాస్టలును మూసివేయుటకు ప్రయత్నించారు. కాని, సనాతనులు తమ దురాలోచనలు ఫలించేకాలం గతించిపోయిందని గ్రహించలేదు. శ్రీ రెడ్డిగారు, రామకృష్ణయ్యగారు, అన్నవరపు సుబ్బారావుగారు, అద్దేపల్లివారు సమర్థులైనందున, యువకులలో రాజకీయ చైతన్యం ప్రబలుచున్నందున తమ కర్తవ్యాన్ని నెరవేర్చుకుంటూవచ్చారు.

ఏ సత్కార్యం చెయ్యదలచినా సంఘపెద్దలు సైంధవుడిలా అడ్డుపడుతూనే ఉన్నారు. యువకుల చైతన్యాన్నిబట్టీ, కార్యశూరత్వాన్ననుసరించీ ఫలితాలు కలిగాయేగాని, ఏ మార్పు తనంతటదే రాలేదు. మానవప్రయత్నం అవసరమని గ్రహించనంతవరకు, దైవంమీద, ఖర్మమీద మూఢనమ్మకాలు ఉన్నంతవరకు, త్యాగానికి, కష్టాన్ని అనుభవించేందుకు సిద్ధపడనంతవరకు మన

సనాతన "సాంప్రదాయాలు" వాటంతటవే నశించవు; సంఘము ముందుకు పోజాలదు.

గుంటూరు యువకులలో గొప్ప వక్తలున్నారు. వారికి భాషా జ్ఞానమూ, వాగ్ధాటి బాగా వుండేవి. అయితే, వారిలో ఒక లోపం ఉండేది. మెజారిటీ పక్షం తరఫున మాట్లాడి, చప్పట్లు కొట్టించుకొని, గొప్పవాళ్ళమని బజార్లలో రొమ్ము విరుచుకొని తిరిగేవారు. నూతనసంఘ నిర్మాణంకొరకు కష్టాలు పడవలసి వచ్చినప్పుడు యిండ్లలో దాక్కొనేవారు; లేదా వూళ్ళో లేకుండా పారిపోయి ముఖం తప్పించేవారు. అందువల్ల 1920 మొదలు 1930 వరకు గుంటూరు యువజన నాయకులు ఒక్క అడుగైనా ముందుకు వేయలేకపోయారు.

ధనాభిలాషేగాని విద్యాభిలాష లేదు.

వైశ్య విద్యార్థి వసతి గృహాలెన్నో ఏర్పడినాయి. వందల మంది చదువుతున్నారు. ఎందరో బి. ఏ. ప్యాసవుతున్నారు. యింజనీర్లుగా, డాక్టర్లుగా, వకీళ్లుగా, టీచర్లుగా, సర్కారు ఉద్యోగస్తులుగా ఉంటున్నారు. కాని, ఇంకనూ విజ్ఞాన వికాసాలలో, సంస్కృతిలో వెనుకపడే వున్నారు. ఆంధ్రదేశంలో వుండే సాహిత్య పరిషత్తులలోగాని, నాటక పరిషత్తులలోగాని, సంగీత పరిషత్తులలోగాని, రచయితల సంఘాలలోగాని, ఆటపాటల సంఘాల్లో గాని గాలించి వెతికినా వైశ్యులు కనపడరు. వీరికి విజ్ఞాన వికాసాలలో, సంస్కృతిలో ఏమాత్రం అభిలాష లేక పోవడం శోచనీయం. ఆంధ్రదేశంలోనే వీరి స్థానం యిలాగుంటే భారతదేశంలోను, అంతర్జాతీయంగాను వీరి స్థానాన్ని తలచ నక్కరయేలేదు.

1946 మే నెలలో పెదపూడి గ్రామంలో అభ్యుదయ రచయితల సంఘం నడిపిన స్కూలుకు ఒక్క వైశ్యవిద్యార్థీ రాలేదు. ఆ సందర్భంలో తయారైన 'అభ్యుదయ' సంచికలను మద్రాసులో నాకు తెలిసినవారివద్దకు తీసుకెళ్ళి అమ్ముతున్నాను. ఒక్క వైశ్యునికైనా అమ్మాలని నా మిత్రులవద్దకు వెళ్ళాను. రవీంద్రనాథ టాగూరుగారి శాంతినికేతనంలో చదివిన గుప్తా గారికి యివ్వగా "రూపాయి దండుగే; నే నేమో చదువను; మా యింటిలోకూడ మరెవరూ చదువరు; క్షమించండి చంచయ్యగారూ!" అని కొననేలేదు. వైశ్యులు ఎంతో ధనం సంపాదించుచున్నారు! ప్రజలసొమ్ము వారి హస్తగత మవుతోంది. వారేమో అధిక భాగ్యవంతులవుతూంటే, ప్రజలు మరీ బీదలవుచున్నారు. ధనార్జనయందు తాపత్రయమే కాని, సంస్కారమందు కోరికే కనపడదు వైశ్యుల్లో.

వైశ్యవిద్యార్థులకు ప్రత్యేక హాస్టల్సు వుండడం మొదట బాగానే వుండివుండవచ్చును; కాని, ప్రత్యేక కులసంబంధమైన హాస్టల్సు చాలా అభివృద్ధి నిరోధకంగా మారిపోతూ వచ్చాయి. అన్ని కులాలవారు కలిసి చదవడం, కులద్వేషాలు రూపుమాపడం, జాతీయతను పెంపొందించటం, అంతర్జాతీయంగా అభివృద్ధి చెందుతున్న మానవాభ్యుదయ విషయాలను గ్రహించడం అవసరం కాదా? వైశ్యహాస్టల్సులో అన్ని కులాలవారిని, అన్ని మతాలవారిని చేర్చుకోవడం వైశ్యులకే శ్రేయస్కరము.

హ రి జ న సే వ

నేను పూనుకొని చేసిన సంఘ సంస్కరణలలో హరిజన సేవకూడా ఒకటి. గాంధిజీ పూనా జైలులో నిరశన వ్రతం

ప్రారంభించి, హరిజనులకు మేలు చెయ్యాలని ప్రయత్నించుచు తున్న సమయంలో నా ద్వితీయభార్య సుభద్రమ్మగారు ఆ వుద్యమములో చేరిపోయిరి. ఆమెతో నేనుకూడా కలసి పనిచేశాను. ఆమె చాల ఉత్సాహంతో తీవ్రంగా పనిచేయుచుండెను. ఆకాలంలో హరిజనులకు దేవాలయ ప్రవేశహక్కు ఉండాలని శ్రీ యమ్. కె. పాండురంగం గారు మద్రాసులో ఒక చిన్న బ్రాహ్మణేతర దేవాలయం వద్ద నిరశనవ్రతం ప్రారంభించారు. ఆయన కాంగ్రెసువాది; ఎన్నోతడవలు జైళ్ళలో ఉండి, దెబ్బలకు గురి అయినవారు. ఆయన భార్య కూడ అలాంటిదే. ఆయన చంగల్పట్టు జిల్లా కాంగ్రెసు సంఘానికి కొంతకాలం కార్యదర్శి. గొప్ప హఠయోగి; బలశాలి; 14 రోజులు నీళ్ళుమాత్రమే తాగుతూ దేవాలయం ఎదుట ఎండలో ఉదయం మొదలు సాయంత్రం 5 ఘంటలవరకు మౌనవ్రతంతో సత్యాగ్రహం సాగించారు. ఆ రోజుల్లో నాలాంటి సానుభూతిపరులం ధర్మకర్తలను కలుసుకొని, సభలు జరిపి కార్యం సాధించుదామనుకొన్నాము. కాని "ధర్మకర్తలు" సమ్మతించలేదు. చివరకు దేవాలయం తలుపులు మాత్రం తెరిచారు; దేవుణ్ణి దర్శించటానికి సమ్మతించారు. ఆ విధంగా పాండురంగం గారిని శాంతపరచి, సత్యాగ్రహం మానేలాగు చేసి, ఆయన ప్రాణాలు కాపాడగలిగామే కాని, హరిజనులకు మేలు చెయ్యలేకపోయాము.

హరిజనులతో సహపంక్తి భోజనాలు ముఖ్యమని నా వుద్దేశ్యం. అందుకు ఏర్పాటు చేశాను. హరిజనులు వంటలుచేసి వడ్డించడం, కలసి భోంచేయుటకు యిష్టపడిన వారు పూటకు రూపాయి యిచ్చి ముందే టిక్కెట్టుకొనేలా ఏర్పాటు చేశాము. వారంలో

ఒకపూట మాత్రమే వందమందికి ఏర్పాటు చేశాము. సమిష్టి భోజనంరోజున చాలా ముందుగానే టిక్కెట్లు ఖర్చయిపోతూ వచ్చాయి.

అటుతరువాత గాంధీగారు హరిజన సేవక సంఘాన్ని స్థాపించారు. మద్రాసులో ఆ సంఘానికి నా భార్య సుభద్రమ్మ గారు కార్యదర్శినిగా ప్రప్రథమంనుంచి పనిచేశారు. అది వృద్ధికి రాసాగింది. సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ కార్యదర్శిగారైన వి. వెంకటసుబ్బయ్యగారు, నా భార్య సంయుక్త కార్యదర్శులు గాను, దివాన్ బహదూర్ వి. భాష్యంఅయ్యంగారు అధ్యక్షులుగాను వుండిస్త్రీలకు ఒకటి, పురుషులకు మరొకటి హాస్టల్సు పెట్టారు. మందులు వగైరా ఏర్పాటు చేశారు. విద్యార్థులకు భోజన వసతి వగైరా ఉచితమే. పురుషులహాస్టలుకు కొంతకాలం శ్రీ బి యస్. మూర్తి (P. M.) గారు వార్డెనుగాను, టీచర్లుగాను ఉన్నారు. అందరూ కలసి హృదయపూర్వకంగా చెయ్యగలిగినంతా చేశారు.

### ఫలితం మాత్రం శూన్యం

అయితే, చేసినదేమిటి? ఫలిత మేమిటి? ఏమీ లేదు! ఆ కొద్దిమంది పిల్లలకు ఉన్నత విద్య చెప్పించగలిగారా? లేదు. వారి ఆర్థిక పరిస్థితులు మారి ముఖ్యంగా ఒక్కరికైనా దరిద్రం పోయిందా? లేదు. మరి జరిగిందేమిటి?

హిందువుల పండుగలలో హరిజనులుకూడా హాస్టలులో పండుగ చేసుకొనేలా ప్రచారం జరపడం, వారు ఎలాగైనా హిందూసంఘంలో కలిసి వుండుటకు ప్రోత్సాహించడం కాంగ్రెసు వల్ల వారి కష్టాలన్నీ అంతరించి సుఖపడగలరని ఆశపెట్టడం, వారి ఆర్థిక సమస్యలుగాని, రాజకీయసమస్యలనుగాని, విద్యా

సమస్యలనుగాని ఎంతమాత్రం పరిష్కారం చెయ్యజాలక పోవడం, దేవాలయ ప్రవేశంతో వారి కష్టాలన్నీ నశించిపోతాయని ప్రచారం చేయడం-యిదీ జరిగినది. హరిజనులలో ఆశాభంగం కలిగి రెండు పార్టీలుగా విడిపోయి, శ్రీ బి. యస్. మూర్తిగారిని తరిమివేయుటకు ప్రయత్నించింది ఒక పార్టీ. ఎంతో పనిచెయ్యాలని గంపెడంత ఆశ పెట్టుకొన్న సుభద్రమ్మగారికి 1935 సం॥ నాటికే విసుగు పుట్టింది. ఈ హరిజన సేవక సంఘంవల్ల హరిజనుల కష్టాలు నశించజాలవనే తీర్మానానికి వచ్చారు సుభద్రమ్మగారు. అయితే, ఎలా తొలగగలవా అనే నిర్మాణయుక్తమైన పరిష్కారాన్ని మే మప్పటికి గ్రహించలేకపోయాము. ఆర్థిక కారణం ముఖ్యమని మాకు తోచనేలేదు. ఏమీ చేయజాలక పోయినా, ఆ సంఘం తోక పట్టుకొనే ఉంది సుభద్రమ్మ. ప్రభుత్వం, లేబరు డిపార్టుమెంటు సహాయంతో వారు జోక్యం కలుగజేసుకుంటూ వచ్చారు. రూథర్‌ఫర్డు హాస్టల్సులో రంగుకాగితాల తోరణాలను చూచి, అవి కాంగ్రెసు జండాలోని రంగులని రూథర్‌ఫర్డు ఆక్షేపించగా సుభద్రమ్మకు చాలా కోపం వచ్చింది. ప్రభుత్వ సహాయం లేకపోతే హాస్టలును మూసివెయ్యాల్సి వస్తుందని భయపడిన పెద్దలు జోక్యం కలిగించుకొని, రూథర్‌ఫర్డ్‌కు సంజాయిషీ చెప్పుకొని వారి ఆగ్రహానికి గురికాకుండా తప్పించుకొన్నారు.

1940లో నన్ను జైలులో నిర్బంధించడంతో సుభద్రమ్మగారి రాజకీయాలు ఎలాగున్నా, హరిజనసేవాసంఘంలో ఆమె సంయుక్తకార్యదర్శిగా ఉండడం ప్రభుత్వానికి అపాయకరంగా తోచింది. వారి భయాలను కనిపెట్టి సుభద్రమ్మ రాజీనామా

యిచ్చింది. శ్రీ వి. వెంకటసుబ్బయ్యగారి మరణంతో వారి ఆత్మ తోపాటు ఆ సంఘం ఆత్మకూడా పరలోకానికి వెళ్ళింది. తర్వాత సంఘం శవసదృశమయింది.

అప్పట్లో సుభద్రమ్మగారి ఆశాభంగం చూస్తే, నాకు చాలా విచారం కలిగేది. ఆమె ఋషివాలి స్కూలులో టీచరుగా వుంది. ఆకాలంలో నవీనవిద్యాపద్ధతు లవలంబించడంలో ఆమె నిపుణరా లని ప్రసిద్ధిపొందినది. ఇండియాలో అన్నిప్రదేశాలనుండి బాల బాలికల మానసికశాస్త్రముసు (Child psychology), విద్యా విధానంలో నూతనపద్ధతులను నేర్చుకొనుటకు పట్టభద్రులు ఆమె వద్దకు వచ్చుచుండిరి. 1931లో శ్రీ ఖాసా సుబ్బారావుగారిని చెల్లారామ్ విదేశీబట్టలషావువద్ద పికెటింగుచేయుచుండగా పోలీసులు కొట్టి, బట్టలూడదీసి, వీధిలోకి లాగి, చిత్రహింసలుపెట్టిన విషయాన్ని వార్తాపత్రికలలో చదివి ఆమె తన ఉద్యోగానికి రాజీనామా నిచ్చి, దేశసేవ చెయ్యాలని నిశ్చయించుకొన్నారు. ఈహరిజనసేవవల్ల దిక్కులేని అధమాధములకు ఎంతో సేవ చెయ్యగలుగుదునని గంపెడంత ఆశతో ప్రారంభించి, నాలుగేండ్లలోనే (1935) ఏమిచెయ్యాలో తోచక బాధపడుతూండేది.

### దోపిడీవ్యవస్థ పోతేనే మోక్షం

ఆ స్థితిలో (1935) డాక్టర్ షెర్వుడ్ యడ్డీగారు సోవియట్ రషియానుగురించి వ్రాసిన గ్రంథము తలవనితలంపుగా లభించినది; యిద్దరమూ చదివాము. సోవియట్ రషియాలో కలిగిన మార్పులు మమ్మల్ని ఆకర్షించాయి. మా హృదయాలలో ఆశారేఖ వుదయించింది. కులాలు పూర్తిగా నశించినప్పుడే పంచమ కులం సైతం నశించుతుంది; హిందూసంఘంలో కులాలు ఉన్నం

తకాలం హరిజనులకు మోక్షం కలుగదు. వ్యక్తిపరమైన ఆస్తి ఉన్నంతవరకు ధనికులుండితీరుతారు. అప్పుడు బీదలు కూడా ఉండకతప్పదు; అట్టిసంఘంలో అస్పృశ్యులు, అనాధులు, ఛండాలురుగా అణగదొక్కబడ్డ పంచములకు దారిద్ర్యం తప్పదు. ఆర్థికంగా ముందు బాగుపడాలి; వారు దున్ని పండించే భూములు వారి స్వంతంకావాలి; దానితో సాంఘికంగా, రాజకీయంగా బాగుపడగల్గుతారు. ఆర్థికంగా న్యాయంజరిగే సంఘమేర్పడు వరకు, సంఘంలో దరిద్రు లుండకతప్పదు.

ఆమెను 1943 సం॥లో హరిజన సేవక సంఘంలోకి తీసుకున్నారు. కాని చెయ్యగలిగిన దేమిటి? ఏమీలేదు. అయినప్పటికి, నన్ను తిరిగి 1947, 1948 లో జైలులో పెట్టడంతో ఆమెకు యీ సంఘం మళ్ళీ దూరమైపోయింది. అయితే అందుకు చింతించవలసిన పనేమీ లేదులెండి.

1941 సం॥లో ఆర్థికంగా హార్బరు కార్మికులకు సహాయం చెయ్యగలమనే ఆశతో హార్బరు వర్కర్ల యూనియనులో ఉపాధ్యాయురాలుగా చేరింది; వారిలో చాలమంది హరిజనులు.

నే నేమో కార్పొరేషన్ వర్కర్ల యూనియనులో కోశాధికారిగా చేరాను. దానిలో షుమారు 4000 హరిజనులు నీచాతినీచమైన, అశుభ్రమైన పని చేస్తున్నారు.

మాయిల్లు కులాల కలగూరగంప!

తరతరాలుగా మన తాతలు, తండ్రులు హరిజనులకు చేస్తున్న అన్యాయాన్ని, పాపాన్ని పోగొట్టుకొనుటకు, ఆత్మసంతృప్తి కొరకు ఉడుతాభక్తిని హరిజనుల బిడ్డను పెంచుకొందామని ఆశించాము. కాని, ఆర్థిక కష్టాలు అడ్డుతగులుతూ వచ్చాయి.

చివరకు నా మిత్రుడు శ్రీ నంబూరి శ్రీనివాసరావుగారు జైల్లో వుండగా ఆయన ప్రియసోదరి పరిపూర్ణను మా యింట్లో కొంత కాలం ఉంచుకొని చదివించాము. ఆ బిడ్డ చాల చురుకైనది. సంగీతం, సాహిత్యం, అభినయాల్లో గట్టిది. బాగా ఉపన్యసించేది. తన క్లాసులో మొదటిది. బాగా చొరవ చేసుకొని, కష్టాలను జయించి ముందుకు పోగల అసాధారణ శక్తిగల వ్యక్తి.*

---

సేవాసదనంలో వర్గవిభజన

* మద్రాసు సేవాసదనంలో పరిపూర్ణను చేర్చాము. అది బాలికల హైస్కూలు. శ్రీ ముత్తా వెంకటసుబ్బారావుగారు, ఆయన భార్య స్థాపించారు. స్వంత ధనంతో పోషించుతున్నారు. బీద బాలికలకు ఉచితంగానే భోజనము, వసతి మొదలయిన సౌకర్యాలు కల్పించి చదివించారు నష్టాన్ని లెక్కచేసేవారు కాదు 1942—3లో నేను పరిపూర్ణను చేర్చుకొనగోరగా ఉచితంగానే చేర్చుకొన్నారు. 5-6 సంవత్సరాల వరకు ఆర్థిక చిక్కులు లేకుండా పరిపూర్ణ చదువు సాగుతుందనుకున్నాను.

చేరిన 48 ఘంటలలో పరిపూర్ణ తిరిగి వచ్చేసి, ఆ సదనంలో చదవడానికి యిష్టంలేదని ఖండితంగా చెప్పేసింది, కారణ మడిగాను. విద్యార్థుల్లో రెండుమూడు తరగతు లున్నాయనీ, తమ ఖర్చులను భరించేవారు మొదటి తరగతివారనీ, ఉచితంగా చదువుకొనేవారు అధమ తరగతివారనీ మూడోతరగతివారు పై తరగతులవారికి వంటలు చేయడం. గదులు తుడవడం వగైరా సేవలు చేస్తుండాలనీ; ఆ వాతావరణంలో తాను చదువు కోదలచలేదనీ చెప్పింది.

మరొక విషయాన్ని గురించికూడా చెప్పింది. తాను సదనంలో చేరేటప్పుడు పళ్ళెం తీసుకెళ్ళ లేదు. ఆమె స్వంతడబ్బుతో కొనిపెట్టమని కొంతడబ్బు జమకట్టాము. కొనేవరకు విస్తళ్ళలో పెట్టండని చెప్పాము. అయితే, అలా చెయ్యక, కలిపిన ముద్దలు దోసిట్లో వేశారట రెండు

రోజులూ. కాబట్టి పరిపూర్ణ తిరిగి రావటానికి సరియైన కారణేలే వున్నాయి.

పరిపూర్ణను పంపండని శ్రీ ఆండాళమ్మగారు నాకు వ్రాశారు. కారణాలను తెలుపక, సదనంలో చదువుకొనుటకు పరిపూర్ణకు యిష్టంలేదని వ్రాశాను. ఆండాళమ్మగారు మా యింటికి వచ్చి కారణాలను తెలుసుకొని, ఇక అలాంటి కష్టాలు లేకుండా ప్రత్యేక ఏర్పాట్లు చేస్తాననీ, పరిపూర్ణను రమ్మని కోరింది. కాని సదనంలో అలాంటి తరగతు లున్నంత కాలము తాను రాజాలనని పరిపూర్ణ ఖండితంగా చెప్పింది.

అప్పుడు ఆండాళమ్మగారు "చంచయ్యగారూ! మీరూ, మీ భార్య మా సదనంతో సంబంధం వదలుకున్నారు. ఏడేళ్ళుగా చదువుకొనుటకు ఒక్కరినీ పంపరైతిరి. ఇప్పుడు పరిపూర్ణను పంపారని సంతోషించితే యిలాగయిం"దని విచారం వెలిబుచ్చారు.

1935 సం॥లో ఇలాంటి తరగతులను ప్రవేశపెట్టారని తెలియగానే నేనూ, నా భార్య ఆ పద్ధతిని ఖండించుతూ శ్రీ వెంకటసుబ్బారావు గారికి, వారి భార్య ఆండాళమ్మ గారికి వ్రాశాము. కాని వారు మానలేదు. మానసికంగాను, నైతిక దృష్టిలోను విద్యాలయాల్లో ఇలాంటివి ఎంత మాత్రం ఉండకూడదనీ, అడయారులోను, ఋషివాలి స్కూలులోను ప్రిన్సిపాలు జి. వి. సుబ్బారావుగారు ఏ ఆదర్శాలతో తన స్కూలును నిర్వహించుచుండిరో తెల్పుతూ వ్రాశాను. కాని, మా సలహా వారికి నచ్చలేదు. అప్పటినుండి విద్యార్థినులను ఆ సదనానికి మేము పంపలేదు; వారి సహాయం తీసుకోవడం మానివేశాము.

ఏడు సంవత్సరాలు ఆ సదనంలో ఏలాంటి ఏర్పాట్లున్నది తెలియక పరిపూర్ణను ప్రవేశపెట్టాము. తరువాత పరిపూర్ణను మాయింట్లోనే ఉంచుకొని స్వామి రామకృష్ణ శారదా విద్యాలయం (త్యాగరాయ నగరం)లో చదివించాము.

మా యింట్లో వివిధ కులాలవాళ్ళం ఉన్నాం. నా దొక కులం; నా భార్యది మరొకటి. నా బిడ్డలు కులమతాలతో సంబంధం లేకుండా పెరిగారు. వంటకత్తెది మరొక కులం. నా తాలూకు బంధువుల్లో నా బావగారు మొన్నమొన్నటివరకు నాతో సహపంక్తి భోజనానికి యిష్టపడేవారుకాదు.

నా భార్య పినతల్లిగారిది వైదిక బ్రాహ్మణ కులం. వృత్తి పౌరోహిత్యం. గొప్ప భూస్వామి. ఆమెకు సంతానం లేదు. అప్పుడప్పుడు మా యింటికి రాకతప్పదు. తాను పెంచి పెద్దచేసిన సుభద్రమ్మమీద పంచప్రాణాలు. మా యింటికి వచ్చినప్పుడు "పంచమ" బాలిక పరిపూర్ణ ప్రత్యక్షమయింది. అప్పుడు సుభద్రమ్మ తన పినతల్లితో "ఈ పరిపూర్ణ నా బిడ్డ; మిగతా బిడ్డలెలాగో ఈబిడ్డకూడా నాకు అలాగే. ఈ బిడ్డతో కలసి భోంచేయటానికి ఒప్పుకోవాలి; లేదా హోటలునుంచి తెప్పించుతాను. వేరే భోంచెయ్యా"లని ఖచ్చితంగా చెప్పింది.

ఆమె ఒకటి రెండురోజులు హోటలు భోజనం భోంచేసింది. ఈలోపల పరిపూర్ణ శుభ్రత, సంగీతం, సాహిత్యాలు. చురుకుతనం, సంస్కారము ఆమె నాకర్షించాయి. పరిపూర్ణకు తలదువ్వి, పూలు పెట్టడంతో ప్రారంభించి పుండ్లకు మందు వెయ్యడమేగాక, చివరకు కలసి భోంచెయ్యడం వరకూ వచ్చింది. "మన బిడ్డలకంటే ఆ బిడ్డలో ఏమీ లోపం లేదే!" అని ఆశ్చర్యపడింది. స్వగ్రామానికి తిరిగి వెళ్ళేముందు మా స్వంతబిడ్డలతో సమానంగా పరిపూర్ణకు బహుమతులిచ్చింది. "పరిపూర్ణకు నా ముద్దులు చెప్పం"డని ఉత్తరాల్లో వ్రాస్తుండేవారు.

కాలం మారిపోతోంది. ఈ పరిస్థితులను ఉపయోగించుక వాలి. లేకపోతే సంఘం మారటానికి చాలాకాలంపడుతుంది. తెలిసివుండి అలా జరుగనివ్వకూడదు,

భుక్తి కొరకు ఉద్యోగాలు

1919 డిశంబరులో జైలునుండి విడుదల అయ్యాను. నేను ఆస్తిపరుణ్ణికాదు. సంపాదించుకొని జీవించాలి అని ఇదివరకే చెప్పాను. నేను చదువుకొన్నది వ్యవసాయవిద్య. అమెరికాలో చదువుకొన్నాను. స్వయంగా వ్యవసాయంచేయడానికి భూములు గాని, ధనంగాని లేవు. నౌకరీచేసి బ్రతకాలి. బ్రిటిష్ప్రభుత్వో ద్యోగాలు సిద్ధంగానే వున్నై. ఇంపీరియల్ వ్యవసాయశాఖలో మంచి జీతాలే యిస్తారు. నెలకు రు. 350–50–1000; ఆ తరు వాత రు. 1000–100–1500ల జీతం. (నాతో చదువుకొన్నవారు వుద్యోగాలలో చేరారు. రూ. 1500ల కంటె ఎక్కువజీతాలే సంపాదించారు.) ఆ నాలుగున్నరసంవత్సరాలలో బ్రిటిషుసా మ్రాజ్య నిజస్వరూపం నా అనుభవంలోకి వచ్చింది. ఆ అన్యాయా లను, అకృత్యాలను, అమానుషత్వాన్ని నాశనంచేయడమే నా విధి. అలాంటి ప్రభుత్వసేవ చేసి నిలబెట్టడం నాకు తగనిపని. అప్పట్లో ప్రయివేటు ఉద్యోగాలు అప్పుడప్పుడే ఆరంభమౌతు న్నాయి. నే నా సంధికాలంలో ఉన్నాను. ఏడు ఉద్యోగాలు చేశాను, ఏడుసార్లు రాజీనామా పెట్టాను. నెలకు 150 మొదలు రూ. 1000-0-0 వరకు సంపాదించాను. 1920 మొదలు 1940లో మరల రెండోప్రపంచ యుద్ధకాలంలో జైల్లో పెట్టేవరకు 20సం వత్సరాలలో 17 సంవత్సరాలు ఉద్యోగాలు చేశాను. లక్షరూపా యలు ఆర్జించాను. రు. 80000 లలో 50000 రూ.లు మా కుటుం

టానికి ఖర్చయివుంటుంది. భుక్తికి లేక ఉద్యోగంలో చేరడం, బాగా సంపాదించడం, రెండుమూడేళ్ళలో విసుగెత్తడం, యజమానులతో దెబ్బలాడడం, రాజీనామా పెట్టడం జరిగింది. ఒక్కొక్కప్పుడు నాకు యజమానులతో—అనగా లిమిటెడ్ కంపెనీలతో 20సం॥ల అగ్రిమెంటు వుండేది. అయినా మానివేశేవాణ్ణి. ఒక్కొక్కప్పుడు అలా మానెయ్యడంతో నా కెంతో నష్టపరిహారం రావలసివుండేది. కోర్టుకు వెళ్ళకపోతే రాదు. నేను 1920 సం॥లోనే కోర్టుకు పోకూడదని దీక్షపూనాను. అంచేత, వాదిగా నే నెన్నడూ కోర్టుకు వెళ్ళలేదు. ప్రతివాదిగామాత్రం వెళ్ళక తప్పలా. క్లుప్తంగా నా ఆర్థికచరిత్ర వివరాలు కొన్ని వ్రాస్తాను.

(1) 1920 లో అడయారులో నేషనల్ యూనివర్శిటీ వుంది. అనీబిసెంటమ్మగారు దాని స్థాపకులు. అందులో అగ్రికల్చరల్ కాలేజి కూడ వుంది. జమీందార్లు, భూస్వాముల బిడ్డలకు తమ విశాలమైన భూములను, ఎస్టేటులను నవీన పద్ధతుల్లో వ్యవసాయం చేయుటకు తర్ఫీదు నివ్వడం ఆ కాలేజీ ఉద్దేశం. అందులో నేను లెక్చరర్‌గా చేరాను. కాలేజీలో రోజుకు ఒకటి రెండు గంటలు మాత్రమే నాకు పని. అక్కడి ప్రొఫెసర్లు దేశసేవకులు. జీతం నెలకు వందరూపాయలు మాత్రమే; ఇంటి వసతి ఉచితం; నేను అప్పుచేసి అమెరికాలో చదివాను. కాబట్టి ఆ అప్పును తీర్చటానికి నెలకు పాతిక రూపాయలు అదనంగా నాకుమాత్రమే ఇచ్చేవారు. నేను క్లాసులలో ఇచ్చే ఉపన్యాసాలను తెలుగులోకి అనువదించి ప్రతివారం ఆంధ్రపత్రికకు పంపేవాణ్ణి. అందుకు ప్రతిఫలంగా ఆంధ్రపత్రికవారు నాకు నెలకు షుమారు రు 30 లు యిచ్చేవారు. తెలుగులో వ్యవసాయ శాస్త్రమును

వ్రాయుటకు సాహసించినవారిలో నేనే మొదటివాణ్ణి. వ్యవసాయ శాఖోద్యోగులు ఆ వ్యాసములను కత్తిరించి, పుస్తకరూపంగా తయారుచేసుకొనేవారు. ప్రతి వ్యాసం చివర "వ్యవసాయ సంబంధ విషయాలను గూర్చి సలహాలు కోరేవారికి ఉచితంగా సమాధానాలు వ్రాస్తా"నని ముగించేవాడిని. ఆవిధంగా ఆంధ్ర దేశంలో వ్యవసాయ విషయాల్లో నేనే నిపుణుణ్ణి అయ్యాను. 'చెట్లు లేని చోట ఆముదంచెట్టే మహావృక్షం' అనే సామెత నాకు బాగా అన్వయించింది. విప్లవకారుడనుకొంటూవచ్చిన చంచయ్యాసు అప్పటినుండి 'వ్యవసాయ శాస్త్రజ్ఞుడు' అనసాగారు. అడయారులో దివ్యజ్ఞాన సమాజానికి సంబంధించినవారు మంచి సంస్కృతి గల వారు. సంఘసేవయందు-ముఖ్యంగా విద్యావ్యాప్తి చేయుటలోను, సంఘ సంస్కరణలలోను ముందంజవేసినవారు. అందువల్ల అడయారులో మానవసేవ, జీవకారుణ్య వాతావరణం బాగా ఉండేది. అట్టివారితో రెండు సంవత్సరాలు ఎంతో ఆనందంగా కాలం గడిచిపోయింది. నే నా కాలేజి విడిచిపెట్టడానికి ముఖ్యకారణం అనీబిసెంటమ్మగారి రాజకీయాలతో ఏకీభవించలేకపోవడమే. గాంధీగారి ప్రజా ఉద్యమము, సత్యాగ్రహోద్యమము దేశాన్ని నిద్రనుంచి మేల్కొల్పాయి. ప్రజలను రాజకీయంగా ఎంతో ముందుకు తీసుకువెళ్లాయి. రాజకీయాలను ప్రజలలోకి తీసుకెళ్ళడం, ప్రజల్లో రాజకీయ చైతన్యం కలుగచేయడ మనేవి అనీబిసెంటమ్మకు నచ్చలేదు. గాంధీగారిని ఆమెతన "న్యూ ఇండియా" పత్రికలో నిశితంగా విమర్శించడమేగాక దూషించ నారంభించింది. నేను గాంధీగారితో రెండు విషయాలలో మాత్రం-అనగా అధినివేశ, అహింసావాదముల విషయంలో ఏకీభవించలేక

దూరంగా వుండిపోయాను. కాని ఆయన్ను దూషించడం, వారికి అడ్డుపడడం, వారికి హానిచేయమని బ్రిటిష ప్రభుత్వాన్ని రెచ్చ గొట్టడం నా కెంతమాత్రం నచ్చలేదు. సహించలేకపోయాను. అసలు అడయారు రాజకీయ వాతావరణమే నచ్చలేదు. అంచేత వెంటనే నా ఉద్యోగానికి నీళ్లు వదిలాను. అయితే ఉద్యోగం లేకపోతే ఉదరపోషణకు మార్గమేమిటి ? వేరే ఉద్యోగం కోసం వెతకాల్సివచ్చింది. అదీగాక 1921 సం॥లో అన్నపూర్ణమ్మను వివాహంచేసుకొన్నాను. మరి భార్యను పోషించాల్సిన బాధ్యత కూడా ఏర్పడింది.

నర్సాపురం కంపెనీ నాటకం

నేను అడయారు జాతీయకళాశాలలో లెక్చరర్‌గా వున్నప్పుడు నర్సాపురంలోని "సర్కార్స్ అగ్రికల్చరల్ డెవలప్‌మెంటు కార్పొరేషన్ లిమిటెడ్" వారికి వ్యవసాయసంబంధమైన సలహాలిచ్చి రు. 100 ల ఫీజు, ప్రయాణఖర్చులు పుచ్చుకొన్నాను. ప్రథమ ప్రపంచయుద్ధకాలంలో అధికోత్పత్తికోసం బంజరుభూములను దరఖాస్తుమీద యిస్తూవచ్చారు. పెన్షన్‌పుచ్చుకొన్న ప్రభుత్వోద్యోగులు కొందరు, గొప్పఅధికార్లు కొందరు, మరికొందరు విద్యాధికులుకలసి 1500 ఎకరాలభూమిని భీమవరంవద్ద గొల్లవానిదిబ్బగ్రామంలో దరఖాస్తుతో సంపాదించి నర్సాపురంలో "సర్కార్స్ అగ్రికల్చరల్ డెవలప్‌మెంటు కార్పొరేషన్ లిమిటెడ్" అనే పేరుతో కంపెనీని స్థాపించుకొన్నారు. వారిలో రిటైరైన ఒక జిల్లా ఫారెస్టు ఆఫీసరు, ఒక సబ్‌డివిజనల్ ఆఫీసరు, ఆ ప్రాంతాలలో వ్యవసాయంలో ఆరితేరిన భూస్వాములుకూడా ఆ లిమిటెడ్ కంపెనీలో వున్నారు. కాని, ఆ భూమిలో వున్న లోపాలను

యెలా సరిదిద్దాలో వారికి తెలియలేదు. భూములు సారవంతమై నవే. వరి బాగా పండగలదన్న విషయంమాత్రం వారికి తెలుసు. నవంబరు, డిశంబరుమాసాలలో—పంటలు తయారైనకాలంలో కొల్లేటి ములకలను తప్పించడ మెలాగని అడిగారు. భూముల చుట్టూ నాలుగడుగులఎత్తున కట్టవేసుకోమన్నాను. ఆ భూముల ప్రక్కగా పారే యనమదుర్రులో ఒక్కొక్కప్పుడు భూమట్టం కంటె నాలుగడుగులు క్రిందికి దిగిపోతుంది. 1500 యకరాలకు నీరు తోడటం ఎలాగన్నది రెండోసమస్య. అంతఎత్తుకే అనుకూలించే ఇంజన్లు, పంపులను మలబారులో ఉపయోగించడం నే నెరుగుదును. ఆ ఇంజన్ల నుపయోగించమని సలహాయిచ్చాను. అప్పట్లో ధాన్యంధరలు పెరిగివున్నందున, నీటిని పంపింగ్ చేసి, లాభసాటిగానే వరివ్యవసాయం చేయవచ్చునని నిరూపించాను. అప్పటికే నేను నిరుద్యోగిగా వున్నాను. ఆ విషయం తెలిసి వారు నన్ను తమ కంపెనీలో చేరి ప్లానులు, ఎస్టిమేట్లు తయారు చేసిపెట్టమన్నారు. అలాగే ఇచ్చాను.వారికి నా శక్తిసామర్థ్యాల్లోను, ప్రవర్తనలయందు నమ్మకమేర్పడి నన్నే మేనేజింగ్ డైరెక్టరును చేశారు. అవసరమైన రు. 60000 ల మూలధనాన్ని వాటాలు అమ్మి పోగుచెయ్యమన్నారు. ఒప్పుకున్నాను. నేను కోరిన ప్రకారం 25 సం॥ ల వరకు నన్ను మేనేజింగు డైరెక్టరుగా ఉంచుటకు అగ్రిమెంటు వ్రాసియిచ్చారు. జీతాలు, కమీషన్లు మొదలైన షరతులను నాకు అనుకూలంగా వ్రాయించుకున్నాను. అవసరమైన మూలధనం అతిసులభంగా వచ్చిపడింది. ఆ పంపింగ్‌స్కీముమీద అంత నమ్మకం కలిగిందన్నమాట. మాగాని ఎకరం రూ 40లకే లభి

స్తుందని నమ్మక మేర్పడగానే దురాశాపరులు కొందరు వాటాదా ర్లుగాను, డైరెక్టర్లుగాను చేరారు. ప్లాన్లు, ఎస్టిమేట్లు, మూలధనం వగైరా లభించినతరువాత నాకు వ్రాసియిచ్చిన అగ్రిమెంటులో టెక్నికల్‌గా లోప మున్నదనీ, కాబట్టి చెల్లదనీ చెప్పి నన్ను వెళ్లి పొమ్మన్నారు.

ఆకాలంలో ముఖ్యంగా 1900 మొదలుకొని ఆంధ్రదే శంలో ఏర్పడ్డ లిమిటెడ్ కంపెనీలు-జ్యూట్ మిల్లు, బట్టలమిల్లు, పేపరుమిల్లు, పొగాకు కంపెనీలు, మొదలైనవాటిలో తగాదాలు ఏర్పడి, చివరకు ఆ పరిశ్రమలే మంటుపడేవి. ఫలితంగా మన పారిశ్రామికాభివృద్ధికి ప్రతికూల పరిస్థితు లేర్పడేవి. ఆంధ్రలో ధనంకూడ చాల తక్కువగా ఉండేది. అప్పు కావలసినవారు ఆస్తులను తాకట్టుపెట్టి నెల 1కి నూటికి రు 1-0-6 వడ్డీ యిచ్చే వారు. అంతకంటె పెద్దలాభం పరిశ్రమలలో లభించటం కష్టం. అందువల్ల మూలధనం లభించడం కష్టంగా వుండేది. నాలాంటి వాడు నూటికి నూరు లాభం చూపించగలిగితేనే మూలధనం లభిం చేది. కొందరు దురాశాపరులు, కోర్టు వ్యవహారాలకు అలవాటు పడినవారు కంపెనీల సొమ్మును దిగమ్రింగి లక్షాధికార్లు కావా లని ఆశపడేవారు. ఆవిధంగా దిగమ్రింగటానికి ఉపాయం చెప్పమని వకీళ్ళను అడిగేవారు. కొన్ని సంవత్సరాలు నష్టము వచ్చేలా చేసినా, లేక లీగల్‌గా పేచీయిపెట్టి, కోర్టులకు లాగి, పరిశ్రమలు నడవకుండా చేసినా అనేకమంది వాటాదార్లు భయ పడి తమ వాటాలను చౌకగా అమ్మివేస్తారనీ, చౌకగా అనేక వాటాలను కొన్నతరువాత కంపెనీని జయప్రదంగా నడుపవచ్చు ననీ కొందరు వకీళ్ళు తమ పార్టీలకు సలహాలిచ్చేవారు. ఇలాంటి

అంటురోగం గుంటూరులో పుట్టి, ఆంధ్రలో అన్ని పట్టణాలకు ప్రాకిపోయింది. అలాంటి అంటు జాడ్యమే మా నర్సాపురం కంపెనీకి కూడ సోకింది. అయితే ముందు నన్ను తరిమివెయ్యాలి గదా! పుస్తకాలు, అక్కౌంట్లు, బ్యాంకు అక్కౌంటులు, సర్వమూ నా చేతిలోనుంచి లాక్కోవడ మెలాగా అనేదే సమస్య! నేనేమో సులభంగా ఊరికే ఇవ్వను. ఆరునెలలకాలం పనిచేసి పెట్టాను. నా ఖర్చులకు రూ 600లకు మించి పుచ్చుకోలేదు. కాబట్టి వాళ్లు పోలీస్ సర్కిలు ఇన్స్పెక్టరు శ్రీ మాధవరావుగారి వద్దకు వెళ్ళి, నన్ను మోసవుచ్చేందుకు ప్రయత్నించారు. కాని, ఆయన సమ్మతించలేదు. ఒంటరిగా కనబడితే కొడతానేమోనని వాళ్ళు సందుగొందుల్లోకి తప్పుకొనేవారు. ఏడెనిమిదిమంది కలిసి నా ఆఫీసుకు వచ్చి రికార్డు వగైరా తీసుకొనుటకు ప్రయత్నించారు. లోపలికి వస్తే శాస్తి తప్పదని హెచ్చరించాను. కాళ్ళకు బుద్ధిచెప్పారు. తుదకు నా ఆరుమాసాల సేవకు రూ 3500లు యిస్తామని రాజీ బేరానికి వచ్చారు. ఆ రూ 3500 లకు వాటాలు ఇమ్మన్నాను. ఇవ్వక తప్పలేదు. (ఇప్పుడు వాటి విలువ రు 40000 లు) అంతే గాదు, మరి రెండు సం॥ల పాటు కంపెనీలో వుండి పనులన్నీ పూర్తి చేయించి వెళ్ళమనీ, ఎక్కువజీత మిస్తామనీ, బ్రతిమలాడారు. ఒక సంవత్సరం మాత్రమే వుంటానని మాట ఇచ్చి పనులు పూర్తిచేసి వెళ్ళిపోయాను. కూలీలకు, గుమాస్తాలకు జీతాలు ధారాళంగా ఇస్తూవచ్చానని కంపెనీవారు నన్ను ఆక్షేపించేవారు.

## ప్రభుత్వంవారి చెరువుమీద అలుక

ఆ ఉద్యోగం వదలివెళ్ళినతరువాత మూడేళ్ళదాకా నాకు

మరో ఉద్యోగం దొరకలా. ఎన్నో బంజరుభూములకు పంపింగ్ తో వరి పండించుటకు మంజూరు చెయ్యమని దరఖాస్తులుపెట్టాను. గవర్నమెంటుకు ఎన్నో వేలరూపాయలలాభం యేటేటా వస్తుం దని నిరూపించాను. నా పూర్వ రాజకీయచరిత్ర కారణంగా నా దర ఖాస్తులను రెవిన్యూఆఫీసర్లు త్రోసివేస్తూ వచ్చారు. రూథర్ ఫర్డ్ లాంటి కలెక్టర్లు రాజకీయకారణాలవల్లనే ఇవ్వడంలేదని స్వయంగా చెప్పేవారు. ఆ నా డున్న బంజరుభూముల్లో చాలభాగం ఈనాటికీ బంజర్లుగానే ఉన్నాయి.

## దొరలకొలువు వద్దు

1925లో ఇంపీరియల్ కెమికల్సు కంపెనీవారు లండను లోని తమఫ్యాక్టరీలలో తయారయ్యే సల్ఫేట్ అమోనియా మొద లైన ఎరువులను ఇండియాలో అమ్మనారంభించారు. మద్రాసులో షావాలీసు కంపెనీకి ఏజన్సీ ఇచ్చారు. ఆంధ్రదేశానికి నన్ను ఇన్స్పెక్టరుగా నియమించారు. షావాలీసు కంపెనీ తరఫున పైర్లు, పండ్లచెట్లు మొదలగు అన్ని పంటలకు, భూములకు ఆ యెరువు లను వేసి, పరీక్షించి మంచి లాభకారియని నిరూపించినతరువాత ఆ ఎరువులను అమ్ముటకు ప్రతిపట్టణములోను ఏజంట్లను నియ మించాము. ఆదిలో పెద్దషాహుకార్లు ఏజన్సీలను నిరాకరించారు. విద్యావంతులైన పేదవర్తకులు ఏజన్సీలు తీసుకున్నారు. ఒకటి రెండు సంవత్సరాలతరువాత మంచి లాభాలు వస్తాయనే ఆశతో. మొదట నష్టపడినా వారు చాల శ్రమపడి ఆ ఎరువులకు మంచి పేరు సంపాదించారు. లాభాలు రాబోయేసమయంలో ఈ కంపెనీ

ఒక మోసంచేసింది. అసలుకంపెనీయే (ఇంపీరియల్ కెమికల్సు) స్వంతంగా ఇండియాలో వ్యాపారం ప్రారంభించి మమ్మల్ని తమ కంపెనీలోనికే నేరుగా మార్చి తమ అధీనంలోపెట్టుకోవడమే గాక, షావాలీసుకంపెనీని మామూలు వ్యాపారం చేసుకోనిచ్చారు. అంచేత, మేము తిరిగి ప్రతిపట్టణంలోను క్రొత్తఏజంట్లను నియమించాల్సివచ్చింది. మేము పూర్వం నియమించినవారికి పోటీగా వ్యాపారం జరిపించాలికదా; అప్పటికి ఎరువులకు మంచిపేరు వచ్చింది. కాబట్టి విరివిగా ఖర్చవుతుందనీ, మంచిలాభాలు వస్తాయనీ నమ్మకం ఎర్పడినందువల్ల గొప్ప ధనవంతులగు వ్యాపారస్తులు ఏజన్సీలు పుచ్చుకొన్నారు. అరువుగాకూడ అమ్మగలిగారు. మొదటిఏజెంట్ల వ్యాపారం తగ్గిపోయింది. ఏలూరులో శ్రీ కలగర రామస్వామిగారు ఈ సందర్భంలో నష్టపడితే, మాజేటివారు లాభం పొందారు. అనేకపట్టణాలలో ఈవిధంగానే జరిగింది. భుక్తి కొరకు ఉద్యోగంచెయ్యడం, ఉద్యోగంతో మోసాలు, అన్యాయం చేసి యజమానులకు, పెట్టుబడిదారులకు దోచిపెట్టడం నా దిన చర్యగా మారిపోతూవచ్చింది. ఇంతగా దోచిపెట్టినందువల్ల నే నేమైనా బాగుపడ్డానా? నన్నూ కంపెనీవాళ్లు మోసంచేశారు. ఆరంభంలో రు 150 లు జీతం, అమ్మినబస్తా 1కి రెండణాలకమీషను ఇచ్చేట్టు షరతులున్నవి. మొదటిసంవత్సరంలో రు 300లు వచ్చినవి. మూడోసంవత్సరంలో కమీషన్ క్రిందనే ముప్పైవేల రూపాయలు రావాలి. అయితే వాళ్లు కమీషనును బోనసుగా మార్చి సున్న చుట్టారు. జీతం నెలకు రు. 350లకు పెంచారు. అయినా నేను సమ్మతించలేదు. యూరోపియనులపట్టీలో చేర్చుకొని వారికిచ్చిన

జీతాలు, బేటాలు, పెన్షన్లు, శెలవులు వగైరా ఇస్తామని ఆశపెట్టారు. ప్రయాణఖర్చులు, నౌకరు వగైరం ధారాళంగానే ఇచ్చారు. నెలకు 25 రోజులు ప్రయాణాల్లో వుండేట్లుచేశారు. నా ఆరోగ్యం చెడిపోనారంభించింది. మద్రాసురాష్ట్రంలో మొత్తం ఏడుగురు ఇన్స్పెక్టర్లు, 40 మంది ప్రచారకులు వున్నారు. కాని, నాకు మాత్రమే ఎక్కువసౌకర్యాలుకలిగించి, మంచిజీతం,నౌకర్లువగైరా ఇచ్చారు. నన్ను చాలా గౌరవించేవారు. అలా గౌరవింపచేసుకోవడం నాకు తెలుసు, కాని మిగతవారికి చాలాకష్టాలువుంటూవచ్చాయి. అంచేత, వారు సమ్మెచేశారు. ఆ సమ్మెకు నన్ను నాయకత్వం వహించమని కోరగా ఒప్పుకొన్నాను. మా కోర్కెలను సాధించాము. తిరిగి ఉద్యోగాలలో చేరాలి; కాని, నేనూ, నా మిత్రుడు శ్రీ రామకృష్ణగారూ మాత్రం నిరాకరించాము. 1930-31సం.లో ఈ సంఘటన జరిగింది. విదేశవస్తుబహిష్కారం మరల ప్రారంభమైంది. విదేశవస్తువుల నమ్మటకు మా కిద్దరకీ మనస్కరించలేదు. అంచేత వుద్యోగాల్లో చేరలేదు. మరల నిరుద్యోగసమస్య యెదుర్కొన్నది. భుక్తికొరకు మళ్లీ ప్రయత్నం చెయ్యాల్సివచ్చింది.

## ఇన్సూరెన్సు కంపెనీలు

యూరపియన్ కంపెనీలో నౌకరీ చేసిన తరువాత ఇండియన్ కంపెనీలో ఉద్యోగం చేయడం పెనంలోనుంచి పొయ్యిలో పడ్డట్టు తోచింది. గుంటూరులో నేను, నా మిత్రులు కలసి జయభారతి ఇన్సూరెన్సు కంపెనీని స్థాపించాము. ఆ వ్యాపారంలో నా కెంతమాత్రం అనుభవంలేదు. కాని అలాంటి కంపెనీని

నాలాంటివాడు సులభంగా నిర్వహించవచ్చునని మిత్రులు నన్ను ప్రోత్సహించారు. నా భుక్తికి ఏదో ఒక ఉద్యోగం చేయక తప్పదు. కాబట్టి, మేనేజింగ్ డైరెక్టరుగా ఉండ గానికి సమ్మతించాను. నెలకు రు 150 ల జీతంతోనే ప్రారంభమైనా నెలకు వెయ్యి రూపాయలు కమీషన్లతో సహా లభిస్తూవచ్చింది. డైరెక్టర్లు బాగా సంపాదించగలిగారు. మరి ఇన్సూరెన్సు చేసుకొన్నవారో? అనేకులు మోసపోయారు; నష్టపడ్డారు; ఈ విషయం నాకు రెండేళ్ళలో తెలిసిపోయింది. ఇక అందులో వుండకూడదనుకున్నాను. కంపెనీతో 25 సంగల అగ్రిమెంటు వుంది. చివరకు డైరెక్టర్లను ఒప్పించి దానిలోనుండి బయటపడ్డాను.

మోసపు ఇన్సూరెన్సు **మాని**వేసి, శాస్త్రీయమైన ఇన్సూరెన్సు చేయుటకు విజయలక్ష్మి ఇన్సూరెన్సు కంపెనీని పెట్టాను. 'జయభారతి'లో లాభాలు పొంది నామీద నమ్మకం కలిగినవారందరూ ఈ క్రొత్త కంపెనీలో చేరారు. దీనిలోకూడ నాకు 25 సంగల అగ్రిమెంటు రిజిష్టరు చేసి ఇచ్చారు. నెలకు జీతం రు 500—750లు, తరువాత వెయ్యి రూపాయల వరకు గ్రేడు ఏర్పాటు చేశారు. ఇదిగాక కమీషను కూడా ఇవ్వాలి. వ్యాపారం బాగా సాగింది. కంపెనీ మంచి వృద్ధికి వస్తుందనే నమ్మకం కలిగింది. లక్షలు, కోట్ల రూపాయలు కంపెనీలో నిలువ అయ్యే సూచనలు కనబడ్డాయి. ఆ ద్రవ్యంతో ఆంధ్రదేశంలో బ్యాంకులు, పరిశ్రమలు వగైరా స్థాపించాలన్న అభిలాష, స్థాపించగలమనే ధైర్యం కలిగాయి. దానితో దురాశాపరులకు నిద్ర పట్టలేదు. నేను కంపెనీలో ఉన్నంతవరకు వారి ఆటలు సాగవు. అందువల్ల నన్ను సాగనంపారు.

గుంటూరు పత్రికలకు కంపెనీ అక్కు బాగా తెలుసు. కొన్ని కంపెనీలు గుంటూరులో అదివరకే నాశనమైనవి. నా అగ్రిమెంటును అగ్నిపాలుచేశారు. నా ఈ "మిత్రుల" వలలో చిక్కి జైల్లోను, ఏ క్రిమినల్ కేసులోను పడకుండా తప్పించు కొన్నందుకు సంతోషించిన నా శ్రేయోభిలాషులు నన్నభినందించారు. ఎంతో అభివృద్ధికి వస్తూవున్న కంపెనీ రసం పీల్చి పిప్పి చేసి, అధోగతికి తెచ్చారు.

## పెట్టుబడివారిప్యూహంనుండి విముక్తి

ఆకాలంలో అనగా 1935 సంవత్సరం నాటికి నేను పెట్టుబడిదారుడను, ధనవంతుడను కావడానికి అనుభవము, అనుకూల పరిస్థితులు ఉన్నాయి. ఒక బ్యాంకును పెట్టడానికి ప్లాను వేశాను. 12 లక్షల మూలధనం అవసరమని శ్రీ సామి వెంకటాచలం శెట్టిగారు సలహా యిచ్చారు. అరవ జిల్లాలలోని 12 వైశ్య బ్యాంకులవారు ఆ 12 లక్షల మూలధనాన్ని ఇచ్చి మద్రాసులో వైశ్య సెంట్రల్ బ్యాంకును స్థాపించుటకు అంగీకరించారు. కరూరులో వైశ్య బ్యాంకును జయప్రదంగా వృద్ధికి తెచ్చిన శ్రీ వెంకట్రామ శెట్టిగారు, శ్రీ సామి వెంకటాచలం శెట్టిగారు కలసి ఒకరు చైర్మన్‌గానూ, మరొకరు మేనేజింగు డైరెక్టరుగానూ నిర్వహించేటట్లు ఏర్పాటు చేశాను. అందుకు అవసరమైన సంఘ నిబంధనలు, మెమోరాండము వగైరా పత్రములు-వీటన్నిటినీ పూర్తిచేసి ప్రారంభించనున్న సమయంలోనే విజయలక్ష్మి ఇన్సూరెన్సు కంపెనీనుండి నేను తప్పుకోవలసి వచ్చింది. దానితో పెట్టుబడిదార్లు నాకు చేసిన అన్యాయాలవల్ల,

అసలు పెట్టుబడిదారీ విధానం మీదనే నాకు ద్వేషము, ఆగ్రహం కలిగాయి. నే నంతవరకూ కలలుగంటూవున్న గొంతెమ్మకోర్కెలమీద అసహ్యం కలుగ నారంభించినది. ఇక వాటిజోలికి పోకూడదనే నిశ్చయం ఏర్పడ సాగింది.

అప్పట్లో నిత్యమూ వకీళ్ళతో ఆలోచించుతూ, ఎత్తుకు పై ఎత్తు వెతుకుతూవుండాల్సివచ్చింది. మోసానికి ప్రతి మోసం చేయడానికి ఆలోచించాలంటే నా కమిత ఆవేదన కలిగేది. గాఢ నిద్ర అరుదై పోతూవచ్చింది. తల బరువెక్కేది. దేహబలం క్షీణించేది. ఇలాంటి దురాశలూ, దురాలోచనలూ మానుకోవడంతో నాకు మనశ్శాంతి కలిగింది; మరల గాఢనిద్రపట్టడసాగి, ఆరోగ్యమూ, బలమూ కలుగసాగాయి. కాపిటలిష్టును కావాలనీ, ఆస్తిపాస్తులు సంపాదించాలనే వాంఛ 1935 తో అంతమయింది.



# నేనూ - నా దేశము

## సామ్యవాద దశ

## 1935—1949

### వెనుదిరిగి చూస్తే

1935 సంవత్సరంలోగా అనేక ఉద్యమాలలో పనిచేశాను. అలాగే సుభద్రమ్మగారుకూడా పనిచేశారు. అన్నిటిలోను అసంతృప్తే కలిగింది. జయం లేకపోవడమే కాదు! ఇకమీదట ఏమి చెయ్యాలో తోచలేదు.

స్వరాజ్యసంపాదనకు గదరుపార్టీల్లో 1913లో చేరి పని చేశాను. బ్రిటిష్ గవర్నమెంటు సాగిపోతూనేవచ్చింది. కాంగ్రెసుతో నాకు విసుగుపుట్టింది. అహింసతో సంపూర్ణస్వరాజ్యం ఎప్పటికీ రాజాలదు. పాలకులు నైతికంగా ఓడిపోయినతరువాత, పాలితులు వారిని గెంటివెయ్యాలి; హింసతోనైనా అలా చేయకపోతే సంపూర్ణస్వరాజ్యం ఎలా ఏర్పడుతుంది?

ఊరకే ఉండలేక శక్తిసామర్థ్యాలను సంఘసంస్కరణల వైపుకు మరల్చి, ఎన్నో ఉద్యమాలు నడిపాను. ఒక్కటీ పూర్తిగా జయప్రదంకాలేదు. భోగంవృత్తిలో ఉండేవారు ఏ కొద్దిమంది మాత్రమో వివాహాలు చేసుకుంటున్నారు. మిగిలినవారికి సంఘంలోని ఆర్థికపరిస్థితులు అడ్డువస్తున్నాయి. వితంతూద్వాహాలు

ధారాళంగా జరుగకపోవుటకు కూడ ఆర్థికవిధానమే ఆటంకం. ఈ కాలంలో సనాతనసంప్రదాయాలు కాని, ప్రజాభిప్రాయాలు కాని సంఘసంస్కరణలకు అడ్డురావడంలేదు. కులకట్టుబాట్లూ లేవు, వితంతువులు గర్భవతులై, శిశువులనుచంపుటకు తాము స్వతంత్రంగా జీవించుటకు శక్తిలేకపోవుటే ముఖ్యకారణం, మాతృప్రేమ లేక కాదు. హరిజనులవిషయంలో ముఖ్యంగా ఆర్థికకష్టాలే వారి అభివృద్ధికి నిరోధకమవుతున్నాయి. తరువాత రెండో ఆటంకము రాజకీయమైనది, కాబట్టే ప్రభుత్వంలోను, పరిపాలనలోను వారికి స్థానం లేకపోవడం. సంఘనిర్మాణం ఇలాగే ఉన్నంత వరకూ పరిస్థితుల్లో గొప్పమార్పులు రావాలవు.

పరిశ్రమలు, బ్యాంకింగు, ఇన్సూరెన్సు వగైరాలను అభివృద్ధికితేవడం దేశానికి మంచిపని ప్రయత్నించేకాలంలో నే నొక స్వార్థపరుణ్ణిగా మారిపోతూవచ్చాను. నేను ఎటు వెళ్లినా చరిదోప కనుపడ లేదు.

నిర్మాణయుక్తంగా సంఘంలో ఏంచెయ్యాలో నాకు తోచడంలేదు, ఆశాభంగము, అజ్ఞానము, అంధకారంమాత్రమే నాలో నిండివున్నై. జీవితంమీద విసుగుపుట్టింది. సంఘంమీద, రాజకీయపార్టీలమీద, నాయకులమీద—అందరిపైన విసుగుపుట్టింది. ఏమీ తోచక యంత్రంలాగా కాలం గడుపుతూవచ్చాను.

రష్యానుగురించి షెర్‌వుడ్ ఎడ్డీ

1935లో మద్రాసు కాస్మాపాలిటన్ క్లబ్బులో మెంబరుగా వున్నాను. అక్కడి వాతావరణం నాకు నరిపోలేదు. అధికారవాంఛ, దురాశ, పదవీవ్యామోహం మొదలైన దుష్టపిశాచాలతో కూడిన వాతావరణం అది. నా వ్యాపారాలను వృద్ధిలోకితెచ్చుకో

నుటకు, ఇంకనూ గొప్పవ్యాపారాలు చేయుటకు ఆ క్లబ్బు మెంబర్లతో పరిచయము, స్నేహము అవసరమైనాయి. అందుకే నే నందులో చేరాను.

దానిలో ఒక లైబ్రరీ ఉన్నది. కాని ఉత్తమ గ్రంథాలు సాధారణంగా వుండవు. ఒకప్పుడు అప్రయత్నంగా ఒక పుస్తకం లభించింది. దాని రచయిత డాక్టర్ షెర్‌వుడ్ ఎడ్డీగారు; అంత ర్జాతీయ వై. యమ్. సి. ఎ. లకు కార్యదర్శి; గొప్ప ఉపన్యాస కుడు. ఆయన తనరచనలు (The Challenge of Russia & Russia To-day)లో సోవియట్ రష్యాలో జరుగుచున్న మార్పులను గురించి వ్రాశారు. కిరస్తానీ పాదిరీ రష్యాలోని నవీన సోషలిస్టు ప్రభుత్వాన్ని సహించలేడుగదా! ఏమేమి తిట్టిపుం టాడో తెలుసుకోవాలనే కుతూహలంతో ఆ పుస్తకాన్ని చది వాను. నే ననుకొన్నది ఒకటి, జరిగింది మరొకటి. ఆ దేశంలో జరిగిన అనేక విప్లవాత్మక పరిణామాలను ఆయన ప్రశంసిం చారు. తన మతస్థాపకుడు క్రీస్తు కోరిన కోరికలనేకము అక్కడ నెరవేరాయి. దారిద్ర్యం పోయింది; అందరికి పనులున్నాయి; అందరికీ విద్య వుంది. స్త్రీలకు పురుషులతో సమాన హక్కు లున్నాయి. ఘోషా పద్ధతి నిర్మూలింపబడింది. వేశ్యావృత్తిని నాశనం చేశారు; వితంతువులు వివాహమాడవచ్చు; ప్రతి స్త్రీకి తల్లి అవడానికి హక్కు వుంది; వ్యక్తిపరమైన ఆస్తులు పోయి ఉమ్మడి ఆస్తిపద్ధతి ఏర్పడింది; అందువల్ల కార్మికులు, కర్షకులు రాజ్యపాలకులయ్యారు. సేద్యంచేసేవానిదే భూమి; కష్టం చెయ్యని తిండిదొంగలకు స్థానంలేదు; అట్టివారికి వోటుహక్కు లేదు. ప్రమాదకరమైన మతద్వేషాలు, సనాతన సాంప్రదాయాలు,

కులాలు, వర్గాలు, వారి కలహాలు నశించిపోయాయి. ప్రజారాజ్యం ఏర్పడింది; పద్దెనిమిదేండ్ల వయసు వచ్చిన స్త్రీ పురుషు లంద రికి ఓటు హక్కు వచ్చింది; ప్రజలే తమ రాజ్యాంగనిర్మాణం చేసుకుంటారు; రాజులు, ప్రభువులు, జమీందారులు, భూస్వా ములు, షాహుకార్లు, పెట్టుబడిదారులు, వడ్డీ వ్యాపారస్తులు నశించారు.

## మాలో మార్పు

ఇలాంటి ఆశ్చర్యకరమైన విషయాలను ఆ పుస్తకంలో చదివాను: నా భార్యకూడా చదివింది. ఇద్దరం ఆలోచించాము. ప్రపంచమంతటా-మనదేశంలోకూడా అందరూ సుఖంగా వుండేం దుకు మార్గం వున్నదనే ఆశ కలిగింది మాకు. రష్యాలో మాదిరి సోషలిస్టు ప్రభుత్వం మనదేశంలో కూడా ఏర్పడినప్పుడే మన ప్రజానీకం సుఖంగాను. సంస్కారంతోను జీవించగలుగుతారు. అలాంటి ప్రభుత్వాలు ప్రపంచంలోని ప్రతి దేశంలో ఏర్పడి మానవజాతికి శాంతి, సౌఖ్యము, సౌభాగ్యము, సంస్కృతి కలుగు తాయనే విశ్వాసము, ఆశ మా యిద్దరికీ కలిగాయి. ఇకమీదట నిర్మాణయుక్తంగా జీవితయాత్ర గడుపగలమనే యోచనలు విక సించాయి. 1936 నుండి మా జీవితాలు మారిపోగలిగాయి. మొదట కాంగ్రెసు సోషలిస్టులుగాను, 1940 నుండి కమ్యూని స్టులుగాను మారిపోతూవచ్చాము. నాలో కలుగుతూవచ్చిన ఆ మార్పులను గురించి వ్రాస్తాను.

విజయలక్ష్మి ఇన్సూరెన్సు కంపెనీతో సంబంధాలు 1935 లో వదలుకోవడంతో నా ఆర్థిక పరిస్థితి హఠాత్తుగా మరల అతి నికృష్టంగా తయారైనది. అయితే కుటుంబపోషణ కోసం ఏదో

ఒక ఉద్యోగం చెయ్యాలి. ఇన్నూరెన్ను కంపెనీలలో సులభంగా ఉద్యోగాలు లభించేవి. గొప్ప ఉద్యోగిని కావాలనీ, శ్రీమంతు డను కావాలనే ఆశలను మానేశాను. ఒక చిన్న ఉద్యోగం సంపా దించుకొని విశాఖపట్టణంలో వుంటున్నాను. విజయలక్ష్మి కంపె నీలో నుంచి నన్ను తొలగించిన ముఖ్యవ్యక్తి ధనస్వామి నన్ను మళ్లీ కంపెనీలో చేరమని మూడు నాలుగుసార్లు వచ్చి బ్రతిమ లాడారు. అయినా నేను సమ్మతించలేదు.

1936 నుంచి 1940 వరకు ఆర్థికంగా యిబ్బంది పడు తున్నా ఏదోవిధంగా జీవయాత్ర సాగిపోతోంది. నా భార్యకూ నా అభిప్రాయాలే ఉండడం నా గొప్ప అదృష్టం. ఆమె నాకంటె కూడా ముందంజ వేయడానికి ప్రయత్నించేది. నాకు మార్గదర్శి నిగా ఉండేది. కాబట్టి జీవితయాత్ర సుఖంగానే జరిగిపోతూ వచ్చింది. మాకు అభిప్రాయ భేదాలు లేవనికాదు నా భావం; ఎన్నో ఏర్పడుతూ వచ్చేవి. అయితే, తర్కించి జీవితానుభవంలో సత్యాన్ని తెలుసుకుంటూ, మా అభిప్రాయభేదాలను సవరించు కుంటూ, నైతిక దృష్టితో కాలం గడుపుతూవచ్చాము. అలాగే ఇకమీదట కూడ జీవితయాత్ర గడచిపోతుం దని మా నమ్మకం.

## చంద్ర రా జే శ్వ ర రా వు

1936 సం॥లో విశాఖపట్టణంలో వుండగా, చంద్ర రాజే శ్వరరావుగారు మాతో పరిచయం చేసుకొని ఆయన ఒక సహా యంకోరారు. అప్పుడే ఆయన కాశీవిశ్వవిద్యాలయం వదలిపెట్టి విశాఖపట్టణంలో మెడికల్ కాలేజీలో విద్యార్థిగా చేరారు. ఇంటివద్ద నుండి డబ్బుతెప్పించుకొని, విద్యార్థుల్లోను, కార్మికులలోను సంఘాలు పెట్టి పనిచేస్తున్నారు. ఆయన వయసులో చాల చిన్న

వారు. వారితో మరికొందరుకూడ కలిసి పనిచేసేవారు. అందరూ యువకులే.సంఘంలో కొద్దోగొప్పో పేరుప్రఖ్యాతులుగల పెద్దవారు వారి సంఘాలకు ప్రెసిడెంటుగాను, వైసుప్రెసిడెంటుగాను అవసరమయ్యారు. ఆ స్థానాల్లో నన్నూ, నా భార్యనూ ఉండమని కోరారు. మేము అభ్యుదయ భావాలు కలవారమని తెలుసుకొని అడిగారట. మేము సంతోషంగా అంగీకరించాము. ఆ సంఘాల్లో మేము చేసిన సేవ చాల స్వల్పము. అయినప్పటికి ఆయన మాకు చేసిన సహాయం చాలా గొప్పది,

ఫ్రెడరిక్ ఎంగెల్సుగారి "యాంటి డహరింగ్"* అనే గ్రంథాన్ని చదివి మాకు విపులంగా బోధించసాగారు. సోషలిజంలో నమ్మకం కలిగించడానికి ప్రయాసపడ్డారు. మాకు ఎన్ని సంశయాలుతీర్చినా, యింకా ఎన్నో కొత్తవి కలుగుతుండేవి. నూతిలో నీళ్ళను తోడివేస్తే, మరల ఊరినట్టుగా కలిగేవి మాకు సందేహాలు. అయితే, ఆయన ఎంతో ఓపిక గల మనిషి. జవహర్‌లాల్ నెహ్రూగారి గ్రంథాలు, గాంధీగారి వేదాంతాలూ, కాంగ్రెసు చరిత్ర వగైరా ఇండియాకు సంబంధించిన రాజకీయగ్రంథాలను సోషలిస్టుదృక్పథంతో విమర్శించేవారు. అప్పుడు రాజేశ్వరరావుగారి అభిప్రాయాలు యిలాగుండేవి:

(1) ప్రస్తుతం (1935-6) కాంగ్రెసు ఒక విప్లవసంస్థ. స్వరాజ్యసంపాదన. పారిశ్రామికాభివృద్ధి, పెట్టుబడిదారీవర్గ సంస్థాపన

* సుభద్రమ్మగారు ప్రప్రథమంగా తర్జుమాచేసినది ఈ "యాంటి డహరింగు"లోని "సోషలిజము; చారిత్రకము-శాస్త్రీయము" అనేదే. ఆకాలంలో ఆ గ్రంథాన్ని గవర్నమెంటు నిషేధించింది. ఆంధ్రరాష్ట్రంలో రాజకీయపురోగాములకు అది పెట్టుబుక్కుగా ఉపయోగపడింది,

కాంగ్రెసు ఆశయాలు. కాంగ్రెసులో అనేక వర్గాలున్నాయి. ముఖ్యమైనవర్గం: మిల్లుయజమానులు, పెట్టుబడిదారులు. ఖామందులు. ఆ వర్గానికి నాయకులేమో మధ్యతరగతి విద్యాధికులు. ఈ మధ్యతరగతి విద్యాధికులవర్గమే ఇండియాలో ప్రధాన విప్లవ వర్గం.

(2) అయితే, పెట్టుబడిదారీవర్గం తమ కున్నదానిని పోగొట్టుకొనుటకు యిష్టపడరు. బ్రిటిష్‌సామ్రాజ్యం చాలా బలంగా వుంది. ఈ పెట్టుబడిదార్లతో ఇండియన్ పెట్టుబడిదార్లు కలిసి వ్యాపారంచేస్తున్నారు; పెద్దభాగస్తులు బ్రిటిష్ వర్తకులే. అందువల్ల బ్రిటిష్ పెట్టుబడిదారీవర్గంతో పూర్తిగా త్రెంచివేసుకోటానికి అవసరమైన సాయుధపోరాటానికి ఇండియన్ పెట్టుబడిదారులు సమ్మతించడంలేదు.

కాంగ్రెసులో జమీందారు లున్నారు. వారిలో కొందరు పెట్టుబడిదార్లయ్యారు. పెట్టుబడిదార్లలో కొందరు జమీందారులయ్యారు. వారికూడా స్వరాజ్యం కావాలి; కాని, సాయుధ విప్లవానికి యిష్టపడరు.

సాయుధ విప్లవానికి రైతుల, కార్మికుల నిర్మాణయుక్తమైన పోరాటం అవసరం. దానివల్లనే జయం కలుగగలదు. అయితే, ఇలాంటి వర్గాలు తమ బలాన్ని తెలుసుకున్నప్పుడు హనుమంతుడిలా చూచి రమ్మంటే కాల్చి వచ్చినట్టు, రష్యాలో మాదిరిగా సోషలిస్టు ప్రభుత్వాన్ని స్థాపించుతారేమో? కాబట్టి సాయుధ పోరాటాన్ని హింస అనీ, పాపమనీ బోధిస్తారు. అయినప్పటికీ ప్రజానీకం తమవెనుక నున్నారని చూపించి, బ్రిటిష్ సామ్రాజ్యవాదులను బెదరించి సాధ్యమైనంత రాజ్యాధికారాన్ని

గుంజుకోవాలనేది వారి ఆశయం. సంపూర్ణ స్వారాజ్యం రాకపోతే ఆ వర్గంవారు విచారపడతారే గాని, దానికోసం తెగించి పోరాడరు.

ఈ వర్గ పోరాటాలను, అవకతవకలను, యీ పరస్పర విరుద్ధ శక్తులను, భావాలను, పార్టీలను బాగా గ్రహించి, వీరందరినీ కలుపుకొని ఒకే సంస్థలో పనిచేయించడం అసాధ్యమైన పని; ఈ అసాధ్యమైన పనినే సాధ్యంచేశారు గాంధీజీ. అందువల్లనే ఆయన ఏకైక భారత నాయకుడు కాగలిగారు. ఆయన చనిపోతే ఎక్కువగా నష్టపడేది బ్రిటిష్ ప్రభుత్వమేనని సామ్రాజ్యవాదులకు తెలుసు. ఈ వేదాంతాన్నే గాంధీయిజం అంటారు.

అలాగే జవహర్‌లాల్‌లో కూడ ఈ పరస్పర వైరుధ్యాలు ఎన్నెన్నో సందర్భాలలో విశదంకాగలవు. ఈయన పురోగామి; గాంధీగారిని విమర్శించి చెండాడిన మేధావి; అయితే, చివరకు గాంధీగారి వాదానికి తాళం వేస్తారు.

ఈ రాజకీయ ప్రవాహ సుడిగుండాల్లోనుంచి గాంధీగారు మాత్రమే తప్పించుకొని గట్టుకు చేరగలడని నెహ్రూగారు నమ్మినందున ఆయన తీర్మానానికి బద్ధుడైపోతున్నాడు.

(3) సంపూర్ణ స్వరాజ్యం కావాలనేవారుకూడ కాంగ్రెసులో ఉన్నారు. వారు కార్మికులను, కర్షకులను నిర్మాణయుక్తంగా సంఘటితపరుస్తున్నారు. ఒకవేళ సోషలిస్టు ప్రభుత్వం ఏర్పడితే, తతిమ్మావారిలాగా వీరు విచారపడరు. కార్మిక కర్షక రాజ్య స్థాపన వారికి యిష్టమే.

(4) పై రెండు పరస్పర విరుద్ధమైన వర్గాలు కాంగ్రెసులో ఉన్నాయి. మధ్యకక్షీ మరొకటున్నది. ఇది అన్నిటికంటె మిక్కిలి బలమైనది. అది కాంగ్రెసు సోషలిస్టు గ్రూపు. కాంగ్రె

సులో తమ ప్రచారం మూలంగా ఈ పెద్దదైన మధ్యకక్షి మిగ తావారిని తమ అతివాద పక్షంలోకి లాక్కోవాలి; ఆవిధంగా కాంగ్రెసులో అతివాద కక్షికి నాయకత్వం సంపాదించి సంపూర్ణ స్వరాజ్యం సాధించాలి.

(5) కార్మికులను, కర్షకులను వర్గపద్ధతిలో సంఘటిత పరిస్తే ఇండియా మొత్తంలో జనరల్ స్ట్రయికు తీసుకురాగలం. దానితో బ్రిటిష్‌గవర్నమెంటు ఆట కట్టివేయగలం. గాంధీగారి అహింసావాదానికి అనుగుణ్యంగానే యీపని చేయవచ్చు.

(6) అప్పుడు స్వరాజ్యంవల్ల తప్పకుండా నష్టపడేవర్గాలు అనగా బ్రిటిషువారు, సంస్థానాధిపతులు, జమీందార్లు, గొప్ప ఉద్యోగస్తులవర్గాలు హింస ప్రారంభించుతారు. తిరిగి ప్రతిహింస చెయ్యవలెనా, కూడదా? దెబ్బకు దెబ్బ కొట్టకపోతే సంపూర్ణ స్వరాజ్యం రాజాలదు. పూర్ణస్వరాజ్యమే పరమావధిగా యెంచేవారు ప్రతిహింసకు సంశయించకూడదు.

(7) కాంగ్రెసుఉద్యమము ప్రజాఉద్యమము. ఒక్కొక్క వ్యక్తికి బలం లేకపోవచ్చు. అనేక చినుకులు కలిసినప్పుడు గంగాప్రవాహంలాగా బలవంతులవుతారు. అట్టి బలవంతులముందు శత్రుకక్షి నాశనంకాక తప్పదు. కాబట్టి మనమందరం కాంగ్రెస్ సోషలిష్టుపార్టీతో కలిసి పనిచెయ్యాలి. కార్మిక-కర్షకులను సంఘటితపరచాలి. విద్యావంతులు, మధ్యతరగతులు దేశభక్తులతో కలిసి పనిచెయ్యాలి. వీరందరిని కాంగ్రెసు సోషలిష్టులుగా మార్చాలి.

ఇలాంటి రాజకీయవిమర్శన, బోధలమూలంగా రాజేశ్వరరావుగారు నన్ను, నా భార్యను కాంగ్రెసుసోషలిష్టు పార్టీలో

చేర్పించారు. ఇద్దరము ప్రథమ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసోషలిష్టు పార్టీ మహాసభకు (1936) రాజమండ్రి వెళ్లి పాల్గొన్నాము. సుభద్రమ్మగారిని రాష్ట్ర నిర్వాహకసంఘంలో సభ్యురాలుగా ఎన్నుకొన్నారు.

## సోషలిస్టు పార్టీ

ఈ మహాసభలో రెండుతెగలున్నాయి. సంఖ్యాబలంలో రెండూ సమానమే. ఒక కక్షికి నాయకుడు శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యాగారు; చిన్నవాడు; మీసాలు రాని నవయువకుడు. తెలివితేటలలోను, తన నాయకత్వాన్ని నిర్వహించడంలోను చాల సామర్థ్యం ప్రదర్శించాడు. రెండో కక్షికి నాయకులు శ్రీ రంగశాయి, లింగరాజుగార్లు. ఏపార్టీకి చేరకుండా రెండుగుర్రాలమీద ఒకేతడవ సవారిచేయాలని వేచియున్నవ్యక్తి శ్రీ మద్దూరు అన్నపూర్ణయ్యగారు.

ఈ రెండుపార్టీలలో భేదా లేమిటో నాకు అప్పట్లో బోధపడనేలేదు. సుందరయ్యకక్షి అతివాదకక్షిగాను, లింగరాజుగారిది మితవాదముఠాగాను తోచింది నాకు. నేను ఎవరతో చేరడానికి స్పష్టంగా భేదాలు తెలుసుకోలేకపోయాను. అధ్యక్షుడుగా వున్న యూసఫ్ మెహరాలీగారు లింగరాజుగారిపక్షానికి అనుకూలంగా వున్నారు. కాని, సుందరయ్యపక్షం కర్మయోగుల పార్టీగా ఉంది. వీరిని త్రోసి రాజు అని అన్నట్టయితే ఆంధ్రరాష్ట్రంలో కాంగ్రెసుసోషలిస్టు పార్టీ నిర్జీవమైపోతుం దని మెహరాలీకి తోచింది. ఇరుపక్షాలవారిని సమానంగా నిర్వాహకసంఘంలో వేసి అన్నపూర్ణయ్యగారిని కార్యదర్శిగా చేసి, ఏపక్షానికీ చెందని సుభద్రమ్మ

గారిని అదనపుసభ్యురాలుగా చేర్చి, ఎలాగో మసిపూసి మారేడు కాయ చేసి మెహరాలీగారు వెళ్లారు.*

మేము విశాఖపట్టణం జిల్లాలో కాంగ్రెసు సోషలిస్టు కమిటీని ఏర్పరిచాము. హార్బరు కార్మికుల సంఘాన్ని బలపరిచాము. మునిసిపల్, శాసనసభల యెన్నికలలో కాంగ్రెసు తరఫున తీవ్రంగా పనిచేశాము. సుభద్రమ్మగారు స్త్రీల క్లబ్బులో చైతన్యం కలిగించుటకు కృషిచేశారు. రాజకీయ సభలు జరిపారు. క్లబ్బుకు రు 15000 ల విలువగల భవనాన్ని సంపాదించారు.

1937 సంవత్సరంలో రాష్ట్ర కాంగ్రెసుసోషలిస్టు పార్టీ తరఫున కొత్తపట్టణంలో వేసంగి రాజకీయపాఠశాలలో విద్యార్థులకు డ్రిల్లు నేర్పుటకు ఒకరు కావలసివచ్చారు. రాజేశ్వరరావు తగినవాడని, సమర్థుడని, నాయకత్వం వహించగలవాడని నా నమ్మకము. కనుక ఆయన్ను డ్రిల్లు మాష్టరుగా తీసుకోవలసిందని సిఫార్సుచేసి పంపాను. ఆవిధంగా ఆంధ్రలో పనిచేస్తున్న అతివాదులతోను, కార్మిక-కర్షకవర్గాలలో పనిచేయుచున్న ఆర్గనైజర్లతోను ఆయనకు పరిచయం కలిగింది. పోలీసులు ఆ స్కూలును నాశనంచేయడానికి ప్రయత్నించినప్పుడు రాజేశ్వరరావు నాయ

* ఆ రెండు మతాలయందు నా కేమాత్రం సదభిప్రాయం కలుగలేదు. కుర్రవాళ్ళ పోట్లాటలుగా కనిపించింది నాకు. రెండు పక్షాల వారికి పరిణామం కలుగుతూ వచ్చింది. పది పన్నెండు సంవత్సరాలకు సుందరయ్య పక్షంవారు కమ్యూనిస్టులుగా బలపడిపోయారు. లింగరాజుగారి కక్షి నశించిపోయినట్టే. అప్పట్లో సూత్రధారిగా నాటకమాడిన అన్నపూర్ణయ్యగారేమో త్రిశంకు స్వర్గంలో ఉండిపోయారు.

కత్వంవహించి ధైర్యసాహసాలు ప్రదర్శించటతో రాష్ట్ర నాయకులలో ఒకరయ్యారు; తరువాత కృష్ణాజిల్లాకు వెళ్ళిపోయారు.

రాజేశ్వరరావుగారు విశాఖపట్టణంలో ఉన్న సమయంలో ఆంధ్ర యూనివర్సిటీ లైబ్రరీలో నవీన రాజకీయగ్రంథాలు చాలా ఉండేవి. బారిష్టరు ముఖర్జీ అనే ప్రొఫెసరుగారు వాటిని సేకరించి పెట్టారట. అవి మాకు చదువుకోటానికి లభించేవి. ముఖర్జీగారు వెళ్ళిపోయిన తరువాత వేసంగి శలవులలో అలాంటి పుస్తకాలన్నింటిని ఏరి తన బంగళాలోని బీరువాలలో పెట్టి తాళంవేసి, సీలువేశారట వైసుఛాన్సలర్ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు. అందువల్ల మా చదువులకు ఆటంకం కలిగింది; విద్యార్థులకు ఆయనపట్ల అసంతృప్తి పెరిగిపోయింది*. తరువాత మరల 1938 లో మేము మద్రాసులో స్థిరావాసం ఏర్పరుచుకున్నాము.

---

* శ్రీ రామలింగారెడ్డిగారితో నాకు పరిచయంలేదు. కాని, ఒకటి రెండు పనులు చేయించుకోవాల్సివచ్చింది. 1928-30 లో స్కూల్ ఫైనల్ తప్పిన ఆంధ్ర విద్యార్థినులు ఇంటరులో చేరుటకు ఆంధ్ర యూనివర్సిటీలో అవకాశం ఉంది. ఆంధ్ర యూనివర్సిటీ యేరియాకు వెలుపల చదువుతున్న ఆంధ్ర విద్యార్థినులకుకూడ అదే సౌకర్యాన్ని యివ్వమనికోరాము. శ్రీతుర్లపాటి వెంకటేశ్వరరావుగారు, శ్రీ కాశేశ్వరరావుగారు, నేనూ కమిటీగా ఏర్పడి ప్రయత్నించాము. కాని. సిండికేటు మీటింగులో శ్రీ రెడ్డిగారు అంగీకరించలేదు. శ్రీ రెడ్డిగారి అభిప్రాయాన్ని ఆక్షేపించుతూ వోటు చేసినవారు విదేశీ ప్రిన్సిపాలులు (గుంటూరు, బందరు కాలేజీలు) కాకినాడ కాలేజీ ప్రిన్సిపాలు రామకృష్ణారావుగారు మాత్రమే.

మరొక విషయంకూడ జ్ఞాపకం వున్నది. పశ్చిమదేశాల్లో డిగ్రీ పొందివచ్చిన ఆంధ్రులను ఆంధ్రయూనివర్సిటీగ్రాడ్యుయేట్సు లిష్టులో చేర్చుతారనీ, శ్రీ బాపినీడుగారు చేరారనీ తెలిసి నేను అర్జీపెట్టుకొన్నాను.

## కాంగ్రెసు-ప్రజాసంఘాలు

కాంగ్రెసు సోషలిస్టుల మయ్యాక ఆ పార్టీని బలపరచాలనే ఉద్దేశంతో ఫెయిజ్‌పూరు (1936) హరిపుర (1938) కాంగ్రెసు మహాసభలకు నేనూ, నా భార్య వెళ్ళాము. సంపూర్ణ స్వరాజ్యాన్ని గూర్చిన చర్చలు మాత్రమే నాకు యిప్పటివరకు జ్ఞాపకమున్నాయి.

విషయనిర్ణయ సభలో డాంగేగారు ఒక ప్రతిపాదన తెచ్చారు. ఇండియాలో వుండే ప్రజాసంఘాలను కాంగ్రెసుకు అనుబంధంగా చేర్చుకోవాలని, వాటిలో వుండే సభ్యుల దామాషా ప్రకారం ప్రతినిధులను కాంగ్రెసుకు పంపవచ్చునని తీర్మానం తెచ్చారు. దీనిని ఆచార్య రంగాగారు బలపరిచారు. అనగా అఖిల భారత కార్మికసంఘం, కర్షకసంఘములవారు ఈ తీర్మానాన్ని తెచ్చారు. నెహ్రూగారు అధ్యక్షులు. చాలా బాగున్నదని సమ్మతించారు. తరువాత కాంగ్రెసు వర్కింగు కమిటీ తరఫున శ్రీ సర్దార్ వల్లభభాయి పటేలుగారు తీర్మానాన్ని ఎదిరించారు. ఎన్నో సంవత్సరాలుగా కాంగ్రెసులో పనిచేసి, దానిని వృద్ధికి తెచ్చి, చివరకు కాంగ్రెసును డాంగే, రంగాల హస్తగతం చేసి, రాజకీయంగా తాము ఆత్మహత్య చేసుకొనుటకు సమ్మతించజాలమని వారి వాదన.

పటేలుగారు ఇంత గొప్ప ప్రజాసమూహాలతో కూడిన ఉద్యమాల సమస్యను వ్యక్తిగతంగా మార్చారని అందరికి అర్థ

శ్రీ రెడ్డిగారు ఆక్షేపించినందున నా అర్జీ అంగీకరింపబడలేదని తెలిసింది. ఆయన నేమి కారణాలు బాధించాయో!

మైంది. అఖిలభారత కిసాన్, కార్మిక సభలలో చాలమంది సభ్యులున్నారు. ప్రతినిధులెక్కువమంది రాగలరు; కాంగ్రెసు పెత్తనం కార్మిక, కర్షకుల చేతుల్లోకి పోతుంది. తాము కోరుతున్న పెట్టుబడిదారీ స్వరాజ్యానికి బదులు కార్మిక-కర్షకుల సోషలిష్టు స్వరాజ్యం ఏర్పడుతుందనీ, అందుకు కాంగ్రెసు వర్కింగుకమిటీ సమ్మతించజాలదనీ సర్దారుగారు వాదించివుంటే బాగుండేది; కాని డాంగే, రంగాలను వ్యక్తిగతంగా ఎదుర్కొన్నారు చివరకు జయించారుకూడాను. చంద్ర రాజేశ్వరరావుగారు చెప్పినట్టు కాంగ్రెస్‌లో నానా వర్గాలు ఉన్నప్పటికీ అది బూర్జువాసంస్థ యనీ, వారి పలుకుబడిలో వున్నదనీ బాగా తెలిసిపోయింది. సంశయ నివారణ అయింది. కార్మిక కర్షక సంఘాలను కాంగ్రెసు నాయకులు బలపరచకపోగా, అవి వృద్ధి చెందుతూంటే తమ కాంగ్రెసుసంస్థకు పోటీసంఘాలని నిందించి, నాశనం చేయుటకు ప్రయత్నించుతారనే భావాలు నాలాంటివారిలో నాటుకున్నాయి. కాంగ్రెసు సోషలిస్టులు జాగ్రత్తపడాలనీ, కార్మిక - కర్షకులను సంఘటితపరచాలనీ అనుకున్నాము.

పోరాటానికి కాంగ్రెసు వ్యతిరేకత

సుందరయ్యాగారు మరో తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. రెండవ ప్రపంచ యుద్ధం రాబోతున్నది. ప్రపంచాన్ని మళ్ళీ పంచుకొనుటకు సామ్రాజ్యదేశాలు యుద్ధంలోకి వురకబోతున్నాయి. ఇండియాకు స్వరాజ్యం సంపాదించుకోడానికి ఇదే సరియైన అదును; కాబట్టి, ఇప్పటినుండే స్వరాజ్య స్థాపనకు అవసరమైన అంతిమ పోరాటానికి తయారు చేసుకుందామని సుందరయ్యగారు చెప్పారు. అంతేకాదు; కార్మికులను, కర్షకులను, విద్యా

ర్థులను వారివారి వర్గసంఘాలలో సంఘటితపరిచి యుద్ధం రాగానే జనరల్ స్ట్రయిక్ చేసి, రైళ్లు, బస్సులు మొదలైన రవాణామార్గాలను నిలిపివేసి, రేవులలో దిగుమతి ఎగుమతులను ఆపివేస్తే బ్రిటిష్ ప్రభుత్వం ఆట కట్టివేయించవచ్చుననీ, వారిని తరిమి వేయవచ్చుననీ సుందరయ్యగారి ప్రతిపాదన. ఇందువల్ల హింస పుండదని, గాంధీగారి వాదము ప్రకారమే చేయగలుగుదుమనికూడా ఆయన విశదీకరించారు. అయితే కాంగ్రెసు వర్కింగుకమిటీ అంగీకరించలేదు. వర్కింగ్ కమిటీ తరఫున శ్రీ సర్దారు పటేలు గారే ప్రతిఘటించి మాట్లాడారు.

పటేల్‌గారి వాదనలోని సారాంశం ఏమంటే "రెండవ ప్రపంచయుద్ధం రాబోతున్నది వాస్తవమే. ఆ సమయంలో స్వరాజ్యం సంపాదించుకోవలసినదే. కాని ఎలా సంపాదించుకోవాలి? మే మెన్నిసార్లు యిలాంటి ఉద్యమాలను నడపలేదు; ఏమి చెయ్యాలో మాకు తెలియదా?" అని వాదించారు. సుందరయ్యగారి (కాంగ్రెసు సోషలిస్టుల) ప్రతిపాదన ఓడిపోయింది.

సుందరయ్య ప్రతిపాదనను వా రెందుకు ఒప్పుకోలేదు? కార్మికులను, కర్షకులను సంఘటితపరచాలిగదా? సంఘటితపరిస్తే సంపూర్ణ స్వరాజ్యం వస్తుందనికూడా కాంగ్రెసు నాయకులకు తెలుసు. కాని దానితోపాటు సోషలిస్టు ప్రభుత్వం ఏర్పడవచ్చు నన్న భయం వారిలో తిష్టవేసింది.

హరిపుర కాంగ్రెసునుండి నేను, నా భార్య తిరిగి మద్రాసుకు వచ్చాక కార్మికసంఘాల్లో పని చేయుటకు పూనుకున్నాము. 1939లో ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. కాంగ్రెసు కమిటీలు వార్ధాలో సమావేశమైనాయి. బోసుగారేమో నాగపూరులో మహా

సభ పెట్టారు. ఈ రెంటికి వెళ్ళాను. కాంగ్రెసు చేసిన తీర్మానం బాగాలేదు. "ఇండియాకు స్వరాజ్యం యిస్తారా?" అని బ్రిటిష సామ్రాజ్యప్రభుత్వాన్ని అడిగారు. ఇవ్వదని తెలియదా? కాంగ్రెసు కార్యాచరణకు సంశయించుతూ తాత్సారం చేయసాగింది. అతివాద పార్టీలు చాలా చిన్నవి. పలుకుబడిలేదు; కార్యాచరణకు ప్రారంభించాయి, కాని ఏమి చేయగలవు? జాతీయనాయకత్వం తన బలాన్ని ఉపయోగించుటకు పూనుకోదయ్యె!

కమ్యూనిస్టులతో పరిచయం

మద్రాసులో కార్మిక సంఘాలలో కాంగ్రెసు సోషలిస్టుగా పనిచేయుచున్న సందర్భంలో ఈ పార్టీ నాయకులు కమ్యూనిస్టులని తెలిసింది. వారు కార్మికులకొరకు ఉత్సాహంగాను, వాస్తవంగాను శ్రమపడటం చూచి వారిమీద నాకున్న అపోహలు, సందేహాలుపోయి, వారియందు నాకు గౌరవ ప్రేమ లేర్పడుతూ వచ్చాయి. రెండవ ప్రపంచ యుద్ధం పారంభం కాగానే వీరు చాల తీవ్రంగా బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదుర్కొంటూవచ్చారు. అది కూడా నాకు నచ్చింది. అందువల్ల నాకూ కమ్యూనిస్టులకు స్నేహం వృద్ధిచెందసాగినది, మద్రాసులో కమ్యూనిస్టుపార్టీ నాయకుడు కామ్రేడ్ ఘాటే. ఆయన నిష్కళంక జీవితము, దేశభక్తి, మానవసేవ, రాజకీయ విజ్ఞానము మమ్ము బాగా ఆకర్షించాయి. యుద్ధం ప్రారంభం కాగానే ఆయన నన్నీవిధంగా అడిగారు.

"సంపూర్ణ స్వరాజ్యం సంపాదించుటకు మంచి తరుణం వచ్చింది. మనం గెలిచినా, ఓడినా, మన విధిని మనం నెరవేర్చుకోవాలి. బ్రిటిష్ ప్రభుత్వంతో కమ్యూనిస్టులకు పోరాటం

తప్పదు. కొందరు వుండి పోరాటం జరపాల్సివుంటుంది. మరి కొందరు కార్మిక, కర్షక, విద్యార్థి సంఘాలలో పనిచేస్తూ గవర్న మెంటును ఎదిరించాలి. అట్టివారికి అరెస్టులు, జైళ్లు తప్పవు. నువ్వేమి చెయ్యదలచావు?" "నేను, సుభద్రమ్మ కార్మిక సంఘాల్లోనూ, ప్రజాహిత కార్యాల్లోను పని చేస్తున్నాము. మాలో ఒకరు పిల్లల్ని, సంసారాన్ని చూచుకోవాలి. నా భార్య బాగా చూచుకోగలదు. నేను మాత్రం కమ్యూనిస్టుపార్టీ యిచ్చేపనులు చేయటానికి సిద్ధంగా వున్నాను. బహిరంగంగా చెయ్యవలసిన పనులు చేస్తానేగాని, రహస్యంగా, ప్రచ్ఛన్నంగా మాత్రం నేను చెయ్యలేను. ఉద్యోగం చాలించుకోటానికి సిద్ధమే. ఎన్ని కష్టాలు వచ్చినా అనుభవించడానికి తయారుగావున్నా" నని చెప్పాను.

అందుకు ఘాటేగారు యిలా అన్నారు: "కమ్యూనిస్టులను, కార్మిక, కర్షకనాయకులను, విద్యార్థినాయకులను అరెస్టు చేసి, జైలులో పెట్టడం ప్రారంభమవుతుంది. కాంగ్రెసు మంత్రివర్గాలే మనలను శిక్షించుతాయి. మద్రాసులో కార్మికనాయకులు అరెస్టు అయినప్పుడు నీవు వారిస్థానంలో ఉండి, చెయ్యగల పనులను చెయ్యాలి" అని సలహా యిచ్చారు.

స్వరాజ్యం గురించి కాంగ్రెసువారి అంచనాలు

అప్పుడు మద్రాసురాష్ట్రి జైళ్ళ శాఖామంత్రి (కాంగ్రెసు) డాక్టరు సుబ్బరాయనుగారు. కామ్రేడ్సు అజయఘోష్, ఎ. యస్. కె. అయ్యంగారు, నేను కలసి జైళ్ళ మంత్రివద్దకు డెప్యుటేషను వెళ్లాము. జైళ్ళలో రాజకీయఖైదీలకు కొన్ని సౌకర్యాలు చెయ్యమని కోరాము. గవర్నమెంటువద్ద డబ్బులేనందున ఎలాంటి సౌకర్యాలు చేయడానికీ సాధ్యంలేదన్నారు. ప్రభుత్వం ఖర్చుపెట్టినవ

సరం లేదనీ, రాజకీయ ఖైదీలు తమ స్వంతడబ్బుతో తమ కి. మైన బట్టలు, పుస్తకాలు, వార్తా పత్రికలు, మందులు, ఆహార పదార్థాలు, సిగరెట్లు వగైరా కొనుక్కొనుటకు ఉత్తరువు యిస్తే చాలునని అడిగాము. అలాంటి మార్పులను చెయ్యవలసిందని తాను అంతకుముందే మంత్రివర్గాన్ని అడిగినట్టున్నూ, అందుకు వారు సమ్మతించ లేదనీ చెప్పారు. కారణమేమని అడిగాము. రహస్యంబయటపెట్టడానికి యిష్టంలేకపోయినా చివరకు "ఇప్పుడు కాంగ్రెసు పార్టీ అధికారంలో ఉన్నది. ఈ పార్టీకి విరోధులు మాత్రమే జైళ్ళకు వెళ్తారు. వారికి కాంగ్రెసు మంత్రులు సౌకర్యాలు ఎందుకు చెయ్యాలి?" అని కాంగ్రెసు మంత్రుల అభిప్రాయంగా చెప్పారు. "హిందీ వ్యతిరేకవాదులు" మీ మనసుల్లో వుండవచ్చునని మే మన్నాము. అందు కాయన నవ్వారు. మేము విషయం గ్రహించాము.

డాక్టరుగారు అంతటితో ఊరుకోలేదు. ఆయన జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలనుగురించిన గ్రంథాలెన్నో చదువుతారు. కాబట్టి తనకు చాలా తెలుసుననే అనుకుంటారు. అంతటితో పూరుకోక మాతో రాజకీయచర్చ ప్రారంభించారు: "ఈ యుద్ధ కాలంలో మనకు స్వరాజ్యం యివ్వకతప్పదు. మనం జైళ్లకు వెళ్ళవలసిన అవసరం లేనేలేదు. కాంగ్రెసుపార్టీ సహాయం లేకపోతే గవర్నమెంటు స్తంభించిపోతుంది. మన కాళ్ళమీద పడి, రాజ్యం చెయ్యండని కాంగ్రెసును బ్రతిమలాడక తప్పదు" అన్నారు మంత్రిగారు.

"బ్రిటిష్ గవర్నమెంటు అంత అసహాయ స్థితిలో లేదు. పోలీసు, మిలిటరీ బలాలతో రాజ్యం చేస్తారు. ఈ యుద్ధంలో

ఇండియాను పోగొట్టుకొని, తమ సామ్రాజ్యం దివాలా యగుట కెంతమాత్రమూ సమ్మతించరు. అడ్డముచ్చినవారిని నాశనంచేస్తారు కాంగ్రెసు కష్టాలు పడుటకు సిద్ధంగా ఉండాలి: రక్తప్రవాహం జరుగుతుంది" అని మేము గట్టిగా చెప్పాము. కమ్యూనిస్టులు, అతివాదులు, ఎంతో అజ్ఞానులని వాడు జాలివెల్లడించారు. కాంగ్రెసు నాయకులు రాజకీయ విజ్ఞానంలో ఇంకా బాల్యస్థితిలోనే ఉన్నారని మేము మా విచారాన్ని వెలిబుచ్చాము. అయితే, డాక్టరుగారు మాతో కార్మిక కర్షక నాయకులు జైలుకు వెళ్తే, తనతో చెప్ప వలసిందనీ, ప్రతి వ్యక్తి విషయంలోను ప్రత్యేకంగా సౌకర్యాలు కలిగిస్తూ ఆర్డర్లు వేస్తాననీ చెప్పి ఆశపెట్టారు. "మీ రెంతకాలం మంత్రిగా ఉండగలరు? కొద్దిమాసాల్లో మీరుకూడా జైలుకు వెళ్ళక తప్పదే! మీరు ఎంత అజ్ఞానులు!" అని మేము జవా బిచ్చాము. డాక్టరుగారు మా అజ్ఞానానికి కాబోలు నవ్వారు.

ఒక సంవత్సరం గడవకముందే మే మందరం జైళ్ళలో కలుసుకొన్నాము."డాక్టరుగారూ! బ్రిటిష్ గవర్నమెంటు కాంగ్రెసు నాయకుల కాళ్ళమీద యింకెప్పుడు పడుతుంది?" అని పరిహాసం చేశాము.

సుబ్బరాయన్‌గారితో సంభాషణ

అంతేకాదు; ప్రపంచ యుద్ధ సంబంధమైన మిలిటరీ విషయాలను గురించి, జయాపజయాలను గురించి కూడా మా డెప్యుటేషనుకు ఉపన్యాస మిచ్చారు: "ఫ్రాంసులో వుండే మాజి నాటు దుర్గశ్రేణిని దాటి జర్మనులు పోజాలరు. ఫ్రెంచి, ఇం గ్లీషు సైన్యాల సంఖ్య కంటె మూడంతలు ఎక్కువగా వుంటేనే దానిని దాటగల్గుతారు. జర్మనీకి అంత సైనికబలం లేదు. కాబట్టి,

మాజీనాటు దుర్గశ్రేణి కిరుప్రక్కల యుద్ధం దీర్ఘకాలం సాగి, అందరూ అలసిపోతారు. ఈలోపల బ్రిటిష్ సామ్రాజ్య రాజకీయ వేత్తల ఎత్తులతో హిట్లరు ఒకటి రెండు సంవత్సరాలలో నాశనం కాక తప్పదు" అన్నారు. తన కుమారుడు సైన్యంలో మేజరు; ఆయన వద్దనున్న పుస్తకాలను తాను చదివి తెలుసుకొంటూనే ఉన్నారట!

"అయితే, మాక్సువెర్నరుగారి పుస్తకాలను చదివారా?" అని అడిగాము. "లే"దన్నారు. మద్రాసు శాసనసభ లైబ్రరీలో ఉన్నాయనీ, చదవండనీ సలహా యిచ్చాము. ఫాసిస్టు రాజకీయాలను గురించి కూడా చదువమని చెప్పాము.

అంతర్జాతీయ రాజకీయాలలో ఇంత అయోమయంలో వున్న డాక్టరు సుబ్బరాయనుగారిని గురించి శ్రీ సి. రాజగోపాలాచారిగారు తమ కాంగ్రెసు మంత్రివర్గం రాజీనామా యిచ్చేటప్పుడు చట్ట సభలో యిలాగన్నారు. "అంతర్జాతీయ రాజకీయాలలో డాక్టరుగారు గొప్ప విద్యాపారంగతుడు. అలాంటి విషయాల్లో నేను ఆయన పైనే ఆధారపడతాను. కాబట్టి, ఆ విషయాలను గురించి సుబ్బరాయనుగారు మాట్లాడుతారు." అది విని కాంగ్రెసు శాసనసభాసభ్యులు ఎంతగానో చప్పట్లు కొట్టారు.

## కాశేశ్వరరావుగారి కలలు

కాంగ్రెసు మంత్రివర్గం రాజీనామా యిచ్చుటకు కొద్ది రోజులు ముందుగా అప్పుడు చీఫ్ పార్లమెంటరీ సెక్రటరీగా వున్న నా మిత్రులు శ్రీ కాశేశ్వరరావు పంతులుగారిని కలుసుకున్నాను. అసెంబ్లీ గ్రంథాలయంలో ఒక పుస్తకం కావలసి వెళ్లాను. ఒక

గంట ముందుగా వెళ్ళినందున, పంతులుగారి గదిలోకి వెళ్లి కబుర్లు చెప్పుకున్నాము:—

నేను:- పంతులుగారూ! పుస్తకాలను కట్టలు కట్టిస్తున్నారే! కాంగ్రెసు మంత్రులు రాజీనామా యివ్వాల్సివస్తుందా?

ఆయన.- "ఎందుకైనా మంచిదే! గవర్నమెంటు రిపోర్టులు వగైరా ఇక్కడ వుంటే, అరెస్టు కావడం సంభవించితే తిరిగి తీసుకువెళ్ళడం కష్టం. అందువల్ల రోజూ కొద్ది కొద్దిగా తీసుకువెళ్లుతున్నాను.

నేను:- అయితే జైలుకు వెళ్ళాల్సివస్తుందా?

ఆయన:- కావచ్చు! మనకు స్వరాజ్యం యివ్వక తప్పదు. కాంగ్రెసు మంత్రుల సహాయం లేనిదే ప్రభుత్వం నడవదు. ఆ విషయాన్ని బ్రిటిష్ ప్రభుత్వం గ్రహించలేక మమ్మల్ని అరెస్టు చేస్తే, జైళ్ళలో మాత్రం పెట్టజాలరు. పోలీసులు ఎలా అరెస్టు చేయగలరు చెప్పండి? మాజిస్ట్రేటులు మమ్ములను శిక్షించుటకు సాహసించగలరా? మమ్ములనే అరెస్టు చేస్తే, అడయారు దగ్గర పెద్ద బంగళాలలో వుంచి, ఎంతో మర్యాదగా చూడకతప్పదు. అలా అరెస్టు చెయ్యడంకూడా ఒక విధంగా మంచిదే! ఒక్క వారం రోజుల్లో గవర్నమెంటు రాజీకి రాక తప్పదు. నాయకులను అరెస్టు చేసినందున మన కింకా ఎక్కువ అధికారాలు యివ్వకతప్పదు.

అని అప్పటి రాజకీయ పరిస్థితులను గురించి చెప్పారు. ఏమి కలలు! శ్రీ కాశేశ్వరరావుపంతులుగారివంటి నాయకులు యిలా

భావిస్తున్నప్పుడు ఇతర కాంగ్రెస్‌వారిని గురించి వేరే చెప్పనక్కర లేదు.

కాంగ్రెసు మంత్రివర్గం "అధికారంలో" ఉండగా కామ్రేడ్ బి. శ్రీనివాసరావుగారు బ్రిటిష్ గవర్నమెంటుమీద తిరుగుబాటు చేయమని, స్వరాజ్యం గుంజుకోమని ఉపన్యసించారు. నే నా సభకు అధ్యక్షత వహించాను. ఆయనకు శిక్ష విధించారు. కొన్ని నెలల్లోనే ఆయన్ను శిక్షించిన మంత్రివర్గంవారు కూడా ఆయనతో పాటు జైల్లో వున్నారు.

చావుకు తెగించి పోరాడే రాజకీయపార్టీ ఇండియాలో లేదు! అందువల్లనే మనం బానిసలుగా ఉంటున్నాము! అనుకునే వాణ్ణి నేను.

## డి టె న్ష న్

1939-40లో బ్రిటిష్ అడ్వైజర్ల పరిపాలన కాలంలో సింప్సన్ కంపెనీ కార్మిక సంఘానికి నేను అధ్యక్షుడుగా వున్నాను. దానిలో 1500 మందికార్మికులు సభ్యులుగా వున్నారు. యుద్ధానికి అవసరమైన యంత్రాలు, మరలు, లారీలు వగైరాల పనులు ఆ కంపెనీలో జరుగుతుండేవి. బ్రిటిష్ గవర్నమెంటుకు చిక్కులు కలుగజేయాలనే ఉద్దేశ్యం యుద్ధారంభంలోనే మాకు కలిగింది. అందువల్ల, ఆ ఫ్యాక్టరీలో సమ్మె చేయించాము. ఆ సందర్భంలో నన్ను అరెస్టుచేసి వెల్లూరు జెయిలులో డిటెయిను చేశారు.

లోగడ 20 సంవత్సరాల క్రితం ప్రథమ ప్రపంచ యుద్ధ కాలంలో 4 సంవత్సరముల ఆరుమాసాలు ఏడు జైళ్ళలో జీవితం గడిచింది. మద్రాసు రాష్ట్రం అంతటిలోను అప్పట్లో రాజకీయ

ఖైదీని నేనొక్కడినే. 20 సంవత్సరాలలో ఎంత మార్పు వచ్చింది! నాలాంటివారు వందలు, వేలు జైళ్ళకు అలవాటు పడ్డారు.

ఈసారి ఎన్ని సంవత్సరాలు జైల్లో వుండాలో కాలనిర్ణయం లేదు. బయట వుండి స్వరాజ్యంకోసం ఏమీ చెయ్యజాలక పోయినందుకు అసంతృప్తి, అశాంతీ కలిగాయి.

అయితే, కాంగ్రెసునాయకులతోను, కమ్యూనిష్టు నాయకులతోను కలిసి వుండవచ్చు. వారిరాజకీయాల్లోని భేదాలు, గాంధీవాదానికీ, కమ్యూనిజానికీ గల వ్యత్యాసము విపులంగా తెలుసుకోవచ్చు. వారి వారి సిద్ధాంతాలకు, చేతలకూ ఎంత సంబంధమున్నదో తెలుసుకోవచ్చు; నా జీవితంలో మిగిలిన కొద్ది సంవత్సరాలు దేశసేవకు అర్పించి, చిన్నప్పటినుండి నాకు ఆశయంగా వున్న సంపూర్ణ స్వరాజ్య సంపాదనకొరకు కృషి చేయవచ్చునని భావించాను.

ఇప్పటికే షుమారు 15 మంది డెటిన్యూలు వెల్లూరు జైలులో ప్రత్యేకంగా ఒక వార్డులో వున్నారు. కమ్యూనిస్టులు పదిమంది, ఫార్వర్డుబ్లాకువారు ముగ్గురు, అఖిల భారత ఖాక్సార్ నాయకుడు అల్లామామష్రిఖీ ఒకరు, ఏ పార్టీకి చెందని భయంకరాచారిగారు ఒకరు వున్నారు.

మొట్టమొదట జైలులో ప్రవేశించిన ఘాటేగారు చేయించవలసిన సౌకర్యాలన్నీ చేయించారు. మేము నిర్దోషులము; మామీద కేసులు పెట్టడానికి ఆధారం లేదు; ఇకమీదట హాని చెయ్యకుండా మాత్రమే జైలులో బంధించి వుంచారు; బయట మా జీవితాలు ఎలా వుండేవో అలాగే జైలులో వుండవచ్చునని బ్రిటిష్

ప్రభుత్వం తరపున రూథర్ ఫర్డుద్వార అంగీకరించారు. అందువల్ల ప్రభుత్వంవారు భోజనానికి సుఖమైన వసతు లేర్పరిచారు; ఒక్కొక్క రికి ఒక మంచం, రెండు కుర్చీలు, ఒక బీరువా మొదలైనవి యిచ్చారు. వార్తా పత్రికలు, పుస్తకాలు, బట్టలు, మందులు వగైరా ఏమి కావలసివచ్చినా మా స్వంత డబ్బుతో కొనుక్కోవచ్చు. టెన్నిసుకు ఏర్పాటు చేశారు. మా యిష్టం వచ్చినన్ని వుత్తరాలు తెప్పించుకోవచ్చు; వ్రాసుకోవచ్చు. వంట పనులకు, బట్టలు వుతుకుటకు నౌకర్లను ఇచ్చారు. అంతేకాదు; మా కుటుంబాలకు ధారాళంగా అలవెన్సులుకూడా యిచ్చారు. ఆరంభదశలో ప్రభుత్వం సవ్యంగానే ప్రవర్తించింది. డెటిన్యూలందరికి ఒక కమ్యూను అనే సంఘం పెట్టుకున్నాము. దానికి ఒక మేయర్‌ను, నిర్వాహక కమిటీని ఎన్నుకుంటూ వచ్చాము. మా అందరి తరపున మేయరుగారు ఒక్కరే సూపర్నెంటుతో మాట్లాడి, మా సమస్యలనన్నిటినీ పరిష్కరించాలి. ఒక హాస్టలుమాదిరిగా వుండేది. ఘాటేగారు ఇవన్నీ చేయించినా బోనులో వున్నట్టు మాకు విసుగు పుట్టేది.

చదువులు, రాజకీయగ్రంథపఠనము, క్రొత్త భాషలను నేర్చుకోవడం, డ్రిల్లు మొదలైన కార్యక్రమం ప్రారంభించాము.

క్రమంగా ఎక్కువమంది డెటిన్యూలు రాసాగారు. కార్మిక, కర్షక సంఘాల నాయకులు, అటుతరువాత విద్యార్థి సంఘాలవారు, కాంగ్రెసు సత్యాగ్రహనాయకులు, చివరకు రంగా ముఠావారు వచ్చారు. ఆరునెలలలో మా సంఖ్య 200కు పెరిగింది.

సంఖ్య పెరగడంతో ప్రారంభంలో ఒప్పుకొన్న సౌకర్యాలను అందరికీ అన్వయించకూడదని రెండుక్లాసులుగా విభజించుటకు ప్రభుత్వం ప్రయత్నించింది. మా సంఖ్య పెరగడంతో మా బలంకూడ పెరిగింది. సర్కారుతో పోరాడి, వారిఆటలు, అన్యాయాలు కట్టిపెట్టించడం ఒక విధిగా ఏర్పడింది. దీనితో మరొక భావంకూడ ఏర్పడింది. భావికాలంలో సర్కారుతో పోట్లాడి, స్వరాజ్యం సంపాదించటానికి సిద్ధంకావలెననే ఆలోచన ప్రతి పార్టీకి కలిగినది. అయితే యీ రెండువిషయాల్లోను ఒక్కొక్క పార్టీ ఒక్కొక్క పద్ధతంతో పనిచేస్తూ, తమ తమ పార్టీలను బలపరచుకోటానికి ప్రయత్నించుతూ, వారిలో వారు పోటీలు పడుతూండేవారు.

రెండువందలమంది డెటిన్యూలలో పదిమంది మాత్రమే కమ్యూనిష్టులు; 185 మంది కాంగ్రెసు సభ్యులు, ఇతరులు ఐదుగురు. రెండు సంవత్సరాలకు కమ్యూనిష్టులసంఖ్య సుమారు 165 మందికి పెరిగిపోయింది.

## జైలులో కమ్యూనిస్టుల కార్యక్రమం

కాంగ్రెసు నాయకులు రాజకీయ గ్రంథాలను చదువరు; తర్కించాల్సిన విషయాలుకూడ వారికి లేవు. స్వరాజ్యం వస్తుందనీ, తప్పక వస్తుందనీ, యోచనలు, ప్లానులు గాంధీగారికే వదలిపెట్టుట మంచిదనీ వారి అభిప్రాయం. కమ్యూనిస్టులు క్లాసులు పెట్టుకొని, రాజకీయాలను చక్కగా చదువుతూ చర్చించుకుంటూండేవారు. దినమంతా ఏదో ఒక ప్లాను ప్రకారం జైలును రాజకీయ విశ్వవిద్యాలయంగా మార్చారు.

కమ్యూనిష్టులలో ఒక పెద్ద ఆవేదన ఉండేది. యుద్ధ కాలం గడచిపోతోందనీ, స్వరాజ్య సంపాదనకు మంచి అను కూల సమయం చెయిజారిపోతున్నదనీ వారి విచారము. ఇతర దేశాలకు స్వరాజ్య మెలా లభించింది? ఇండియాకు రాకపోవడా నికి కారణ మేమిటి? ఎలాంటి పంథా, ఎలాంటి కార్యక్రమం ఉండాలనేవి చర్చించేవారు.

జమీందారీ తత్వము, సామ్రాజ్య తత్వము, ఫాసిజము, టెర్రరిజం, సోషలిజము, కమ్యూనిజము మొదలైనవాటి స్వరూ పాలు యెలాంటివి? వాటిలోని వ్యత్యాసాలు ఏమిటి? అనే విష యాలను చదువుతుండేవారు.

కార్మిక, కర్షకుల సహాయం లేకుండా స్వరాజ్యం వస్తుందా? వారిని వర్గాలుగా సంఘటితపరిస్తే వచ్చే మంచి చెడ్డలు ఏమిటి? వర్గ పోరాటం జరుపవచ్చునా? సామ్రాజ్య వాదులతో తప్పకుండా కలిసిపోయి, స్వరాజ్యం రాకుండా అడ్డు పడే వర్గా లేవి? విప్లవాన్ని కోరే వర్గాలేవి?

ఫాసిజం గెలిస్తే మనకు స్వరాజ్యం వస్తుందా? లేక సోష లిజం గెలిస్తే వస్తుందా? దౌర్జన్యం ఉపయోగించకూడదా? ఏ పరి స్థితుల్లో ఉపయోగించవచ్చు? మన పరమావధి స్వరాజ్యమా, అహింసా వాదమా? అహింసవల్ల స్వరాజ్యం తప్పకుండా వస్తుందా?

అలాంటి విషయాలమీద శాస్త్రచర్చ, గ్రంధపఠనము జరుగుతూండేవి. డెటిన్యూలలో చాలమందికీ, అన్ని పార్టీలవారికీ నచ్చుచుండిన యీ చర్చలు నాయకులలో కొందరికి మాత్రమే నచ్చలేదు.

ఇలాంటి ప్రయత్నాల మూలంగా కమ్యూనిస్టులు ఇతరులను మార్చుతూ, తమ సంఖ్యను పెంచుకుంటూవచ్చారు. కమ్యూనిస్టులతో చేరవద్దని, వారి క్లాసులకు వెళ్ళవద్దని, వారితో చర్చించవద్దని, వారితో కలసి ఏ పనీ చెయ్యవద్దని కాంగ్రెసు నాయకులు శ్రీ పట్టాభి, కాశేశ్వరరావు, కళా వెంకట్రావుగార్లు చెప్పుచుండిరేగాని, తాము వేరే క్లాసులుగాని, చర్చలుగాని ఏర్పాటు చెయ్యలేదు. వారి సంఖ్య దినదినమూ క్షీణింపసాగింది.

ఆచార్యత్వానికి రంగా నిరాకరణ

ప్రొఫెసరు రంగాగారు జైలుకు రాగానే చాలమంది యువకులకు ఉత్సాహం కలిగింది. ఆచార్య రంగా వద్ద ఎన్నో విషయాలు నేర్చుకోవచ్చునని అనుకొన్నారు. కారల్ మార్క్సు వ్రాసిన "కాపిటల్" (పెట్టుబడి) అనే అర్థికరాజకీయగ్రంథాన్ని బోధించమని కొందరు రంగాగారిని ప్రార్థించారు. రంగాగారు సమ్మతించలేదు. కారల్‌మార్క్సుగారి కొన్ని అభిప్రాయాలతో తాను ఏకీభవించడంలేదని వారి ఆక్షేపణ. "మరీ మంచిది. మీ ఇద్దరి అభిప్రాయాలు మాకు తెలుస్తవి. తప్పక మీరే క్లాసు తీసుకోవా"లని ఎంతో బ్రతిమలాడిరి. కాని, రంగాగారు అంగీకరించలేదు; రంగాగారు ఇంతగా ఎందుకు సంకోచించాలి? అని అందరికీ ఆశ్చర్యం. ఆయనను అడిగినవారు కమ్యూనిస్టులా? కాదు. కార్మికసంఘాలలో పనిచేయుచుండిన కాంగ్రెసువాదులు, యువకులు, జైళ్ళకు వెళ్ళినవారు. డాక్టరు పట్టాభిగారు జెయిలుకు రాగానే రాజకీయవిషయాలలో జెయిలులో ఉన్నంతకాలం జోక్యం కలుగజేసుకోనని ఖచ్చితంగా చెప్పేశారు. మరి క్లాసులు తీసుకోగలవారు కాంగ్రెసునాయకులలో లేరు.

డాక్టరు కె. బి. కృష్ణ

అటు తరువాత డాక్టరు కె. బి. కృష్ణ Ph. D. గారు జైలుకు వచ్చారు. వారుమాకు క్రొత్త. వారిని గురించి వివరాలు తెలియవు. రాజకీయశాస్త్రంలో గొప్ప పండితుడని మాత్రం విని వున్నాం. యువకులు "ది కాపిటల్" గ్రంథాన్ని బోధించమన్నారు "మీయింతట మీరే నేర్చుకొనవచ్చునే; కష్టంలేదే;" అనివారు అంటే అందరికీ ఆశ్చర్యం కలిగింది. బోధించడానికి ఒప్పుకొని మరునాడే క్లాసు ప్రారంభించారు. ఎంతో సులభంగా బోధించారు. ఆయన శక్తి మాకు ఆశ్చర్యంగావుంది. ఆచార్య రంగాగారుకూడ విద్యార్థిగా చేరారు అంతేకాదు; కాంగ్రెసు నాయకులు చాలామంది చేరారు. అయితే పట్టాభి మొదలైన నాయకులు వారిని వెళ్ళకూడదని నివారించారు. కృష్ణగారు "ఇండియాలో మైనార్టీల చరిత్ర" (The History of the minorities in India) అనే గ్రంథాన్ని వ్రాసినవారు. ఆయన రాజకీయ, ఆర్థిక శాస్త్రాలలో పారంగతుడు; వేదాంతశాస్త్రంలో అసమానపాండిత్యం కలవాడు. చరిత్ర పఠనలో ఆరితేరినవాడు. ఆయనది చాల నిశితమైన బుద్ధి. ఏవిషయాన్నైనా శాస్త్రీయంగా యోచించి పరిష్కరించగల మేథావి. వారి సహాయంతో డెటిన్యూల క్యాంపు ఒక సర్వకళాశాలగాను, విప్లవ కళాశాలగాను మారింది.

సంఘం ఒక వ్యవస్థనుండి మరొక వ్యవస్థకు మారుతూ అభివృద్ధిచెందుతున్నట్లు మార్క్సు సిద్ధాంతాల ప్రకారం మాకు నిరూపించారు. ప్రకృతిలోని మార్పులన్నీ ఆ సిద్ధాంతాల ప్రకారమే కలుగుచున్నట్లు బోధించారు. అలాగైతే వేదాంతంలో కూడ యిలానే మార్పులు కలుగుతున్నాయని మార్క్సు సిద్ధాం

తాలప్రకారం వృద్ధికి వచ్చుచున్నట్లు నిరూపించమని నేను కోరాను. జైలులో ముఖ్యగ్రంథాలు లభించకపోయినా క్లాసులు పెట్టి చర్చలు ఏర్పాటుచేసి, అనేకవిషయాలు బోధించుతూం దేవారు. ఎన్నో నెలలు ఈ క్లాసులు జరిగాయి. ఆచార్య రంగా గారుకూడా ఆ క్లాసులకు వచ్చుచునేవుండిరి.

రంగాగారి రాజకీయాలు

కాంగ్రెసు రాజకీయాలమీద ఎంత తీవ్రంగా విమర్శనలు జరిగినవో అదే రీతిగా ఆచార్య రంగాగారి రాజకీయాలమీద చర్చలు జరిగాయి. విద్యార్థులు సామాన్యులుకారు; షుమారు 20 సం॥ల మొదలు 40 ల వయస్సుగలవారు. రెండు మూడు సార్లు కాంగ్రెసు ఉద్యమాలలో జైళ్ళకు వెళ్ళినవారు. రాజకీయ విషయాలలో చక్కని అనుభవం గలవారు. కాబట్టి అభ్యుదయవాది యని ప్రఖ్యాతి గాంచిన రంగాగారి రాజకీయాలకు, ఇతర పార్టీల రాజకీయాలకు ఉండే వ్యత్యాసాలను బాగా తెలుసుకోవాలని అభిలాషతో డాక్టరు కృష్ణగారి సహాయం కోరారు.

అంతట రంగాగారు వ్రాసిన గ్రంథములపై చర్చ జరిగింది. రంగాగారు చర్చలో పాల్గొన లేదు; కాని వింటూ కూచున్నారు. వారి గ్రంథాల్లో పరస్పర వైరుధ్యాలు ఉన్నట్లున్నూ, ఒకే అధ్యాయంలో ఒక ప్యారాగ్రాఫ్‌కు మరొక ప్యారాగ్రాఫ్‌కు పరస్పర వైరుధ్యం ఉన్నట్లు, చివరకు ఒకే ప్యారాలో మొదటి వాక్యానికి చివర వాక్యాలు విరుద్ధంగా ఉన్నట్లు నిరూపించగా అందరూ ఆశ్చర్యపడ్డారు. ఆఖరున కృష్ణగారు "రంగాగారు చాలా చదివారు. వారి పుస్తకాలలో చాల భోగట్టా వున్నది. కాని, ఆయన ఆ విష

యాలను జీర్ణం చేసుకోలే"దన్నారు. అయినా రంగాగారు మాట్లాడలేదు.

మరికొన్ని రోజులకు ఆచార్య రంగాగారి రాజకీయాలను గురించి చర్చ జరిగింది. ఒకే సమస్యమీద దేశంలోని మూడు పార్టీలవారి తీర్మానాలను పరిశీలించాము. అవి కాంగ్రెసు, కమ్యూనిస్టు, కిసాను సభల తీర్మానాలు. కమ్యూనిస్టుపార్టీ తీర్మానంలోని ఉపోద్ఘాతాన్నీ (ప్రియాంబుల్), కాంగ్రెసు తీర్మానంలోని కార్యాచరణకు సంబంధించిన భాగాన్ని (ఆపరేటివ్ పోర్షన్) కలిపితే రంగాగారి కిసానుసభాతీర్మానాలు ప్రత్యక్షమైనాయి. అందువల్ల డాక్టరు కృష్ణగారు యీవిధంగా నిర్ధారణ చేశారు:- "కమ్యూనిస్టుల అతివాదభాష, కాంగ్రెసువారి మితవాద కార్యక్రమముల కలగలుపే రంగాగారి రాజకీయపంథాగా వున్నది."

రంగాగారికి కోపం వచ్చింది. మౌనంగా వుండలేకపోయారు. "ఇక్కడ మీ యిష్టం వచ్చినట్టు వాగండి; బయటకు పోయిన తరువాత ప్రజలవద్ద మాట్లాడి సమర్థించుకోండి, చూతాం" అని బెదిరించి, మీటింగులోనుంచి లేచి వెళ్లారు.

చర్చలు, కోపాలు

మరొకప్పుడు ఒక ముఖ్యసమస్యను గురించి చర్చ జరిగింది. "అహింసావిధానంవల్ల స్వరాజ్యం రాగలదా?" అన్న విషయాన్ని గురించినచర్చ. అందరూ తమతమ అభిప్రాయాలను తెలుపవచ్చునని కోరారు. కాంగ్రెసువాదులు దానిలో పాల్గొనకూడదని డాక్టరు పట్టాభిగారు సలహా యిచ్చారు. కాని స్పీకరు సాంబమూర్తిగారు ఏకీభవించలేదు; కాంగ్రెసువాదులైనవారు తప్పక చర్చలో పాల్గొనాలని వారి అభిప్రాయం. అయితే వారి

అభిప్రాయం ప్రకారం పాల్గొన్న కాంగ్రెసు నాయకులు వారొక్కరే. మామూలు ప్రకారం డాక్టరు కృష్ణగారు అధ్యక్షులు. ఒక్కొక్కరి ఉపన్యాసానంతరం దానిని గురించి తన అభిప్రాయాన్ని యిస్తూండేవారు. స్పీకరు సాంబమూర్తిగారు చాలా సేపు ఉపన్యసించారు. అంతట కృష్ణగారు తన అంత్యనిర్ణయాన్ని యిలా గిచ్చారు:—స్పీకరు సాంబమూర్తిగారి ఉపన్యాస ధోరణి అజ్ఞానులైన పల్లెప్రజల ఎదుట మాట్లాడిన రీతిగా ఉన్నదేకాని, విజ్ఞానులైన దేశభక్తులముందు శాస్త్రోక్తంగాను, తార్కికంగాను మాట్లాడలేదు." అన్నారు.

కాంగ్రెసు నాయకులకు మాత్రం కోపాలు వచ్చాయి. "కమ్యూనిస్టులతో చేరవద్దు; మన మర్యాద కాపాడుకోవాలంటే వారితో చర్చించ కూడదు" అని పట్టాభిగారు అన్నారట.

"నే నెందుకు కమ్యూనిస్టునయ్యాను?"

ఆ రెండు సంవత్సరాలలో రాజకీయచర్చలకు అంతమే లేదు. "నేను ఎందుకు కమ్యూనిస్టునయ్యాను?" అని ఒక్కొక్కరు మాట్లాడాలి. జైలుకు వచ్చినవారిలో ఎక్కువమంది కాంగ్రెసువారే. వారిలో నాయకులు కొద్దిమంది, అనుచరులు చాలామంది. అనుచరులు కమ్యూనిస్టులుగా మారిపోసాగారు. ఈవిధంగా కమ్యూనిస్టు లయినవారే తా మెందుకు కమ్యూనిస్టులయ్యారో ఉపన్యసించాలి. ప్రతి ఉపన్యాసానంతరం చర్చ జరుగుతుంది. వారందరూ కాంగ్రెసులో పనిచేసినవారే. కాంగ్రెసు నాయకులకు జమీందారీవర్గంమీదా, పెట్టుబడిదారీవర్గంపైన వున్న సానుభూతినీ, కష్టజీవులయిన కార్మిక కర్షకులయందు గల అలక్ష్యభావాన్ని నిరూపించారు. అంతేకాక ఎలెక్షన్లలో అనేకులు చేయుచుండిన

మోసాలను బయటపెట్టారు నాయకులలో వ్యక్తిసంబంధమైన కక్షలు, అధికారాపేక్షలు, అంతఃకలహాలు, కట్టుగా కలిసి పనిచేయలేకపోవడం, ఒకరు మరొక దేశభక్తునికి చేయుచున్న ద్రోహము మొదలైన కుళ్లను బయటపెట్టారు. దీనితో జైలులోని కాంగ్రెసు నాయకులకు కమ్యూనిస్టులతో కలసివుండడమే కష్టమనిపించింది.

## తర్క వితర్కాలు

ఈవిధంగా రెండు ముఠాలుగా తయారైన సమయంలో శ్రీ రవీంద్రనాథ ఠాగూరుగారు మరణించారు. వారి గౌరవార్థం మీటింగు జరిగింది. డాక్టరు పట్టాభిగారు అధ్యక్షత వహించాలని అందరం కోరాము. కాని, పట్టాభిగారు ఒక షరతుకు ఒప్పుకోమని అడిగారు. తాను మాట్లాడి ముగించిన తరువాత యింకెవరూ మాట్లాడకూడదని వారి షరతు. కొందరు ఒప్పుకోలేదు. అందువల్ల స్పీకరు సాంబమూర్తిగారు అధ్యక్షతవహించారు. డాక్టరు కృష్ణగారు తన ఉపన్యాసాన్ని చదివారు. ఠాగూరుగారిని మహాత్మాగాంధీగారితో పోల్చి మాట్లాడారు. గాంధీగారు మహా దేశభక్తిగల వ్యక్తి "(a Great dynamic Personality)" అనిన్నీ, ఠాగూరుగారిలో ఆ శక్తి లేదనీ చెప్పారు. అయితే, ఠాగూరుగారి అభిప్రాయాలు ఎక్కువ అభ్యుదయకరంగా ఉన్నట్టు ఉదాహరణలను గ్రంథాలలోనుండి చదివి వినిపించారు. గాంధీగారి రామరాజ్యం అభివృద్ధి నిరోధకమని నిరూపించారు. ఠాగూరుగారిది ముందుచూపు అనీ, గాంధీగారిది వెనుకచూపు అనీ చెప్పారు.

కాంగ్రెసు నాయకులకు ఆగ్రహం వచ్చింది. "ప్రపంచంలో మహాత్మాగాంధీగారితో పుట్టిఅయిన గొప్ప వ్యక్తి జన్మించనేలేదన్న ధోరణిలో స్పీకరుగారు ఉపన్యసించారు. కాంగ్రెసు వాదులను, వారి నాయకులను డాక్టరు కృష్ణగారు అవమానపరిచారని విమర్శించారు వాదాలు ముదిరాయి. "నా అభిప్రాయాలను గ్రంథసహాయంతో నిరూపించుతాను; ఒక కమిటీని యేర్పరచు"మని కృష్ణగారు సవాలుచేశారు; స్పీకరుగారు ఆ సవాలును అంగీకరించలేదు

## సవచైనా

కాంగ్రెసు నాయకులకు, కమ్యూనిస్టు యువకులకు జరుగుచుండిన తర్కవితర్కాలను (Intellectual Competition Discussions) గురించి, నాయకుల ఓటమిని గురించిన ఈ అధ్యాయాన్ని పూర్తిచేసేముందు మరొక ఉదాహరణను వ్రాస్తాను.

ఈ వాగ్వాదాలలో సాధారణంగా శ్రీ కాశేశ్వరరావు పంతులుగారు జోక్యం కల్పించుకోవడంలేదు. కాని, నాయకుల పక్షానికి ఓటమి కలిగినప్పుడు అందరికంటె ఎక్కువగా కోపపడుతూండేవారు. యువకుల శక్తి సామర్థ్యాలను డాక్టరు పట్టాభిగారు గ్రహించారు. కాని, శ్రీ కాశేశ్వరరావు పంతులుగారు మాత్రం గ్రహించలేదు.

వారు అంతర్జాతీయ సమస్యలను బాగా చదివి, గ్రంథాలు కూడా వ్రాసియున్నారు. ముఖ్యంగా టర్కీలోను, చైనాలోను జరిగిన విప్లవాలను గురించి వ్రాశారు. కాబట్టి చైనా విప్లవాన్ని గురించి ఉపన్యసించుతానని శ్రీ పంతులుగారు కమ్యూనిస్టులకు తెలియపరిచారు.

తన ఉపన్యాసాన్ని ఆనాడు 1925 సంవత్సరంతో పూర్తి చేశారు. యువకులు తమ సంశయాలను తీర్చుకొనుటకు ప్రశ్నలు వేశారు. అది మామూలే, కాని పంతులుగారు సమాధానం చెప్పేందుకు నిరాకరించారు. ఒక విద్యార్థి లేచి ప్రశ్నలన్నిటికి సమాధానం చెప్పారు. పంతులుగారికి ఆశ్చర్యం కలిగినది.

కాని, యువకులు పంతులుగారిని అంతటితో విడిచిపెట్టలేదు. 1925 సంవత్సరం మొదలు 1940 సంవత్సరం వరకూ చైనాలో జరుగుతూన్న పరివర్తనను గురించి ఉపన్యసించవలసిందిగా కోరారు. తనకు తెలియదని శ్రీ పంతులుగారు ఒప్పుకొన్నారు. ఒక యువకుడు మరునాడు ఆ విషయాన్ని పూర్తి చేశాడు. ప్రశ్నలకు సమాధానం చెప్పాడు. ఆ మీటింగుకు పంతులుగారే అధ్యక్షత వహించారు.

కమ్యూనిస్టు యువకులు జాతీయ అంతర్జాతీయ రాజకీయ సమస్యలను గురించి ఎంత తీవ్రంగా, ఎంత సమగ్రంగా చదివి గ్రహించుకొంటున్నారో తుదకు శ్రీ కాశేశ్వరరావు పంతులుగారు కూడ ఒప్పుకోవలసి వచ్చింది.

కాంగ్రెసు నాయకులు బుద్ధికౌశల్యములోను, విజ్ఞానంలోను కమ్యూనిస్టు యువకులతో పోట్లాడి ఓడిపోతూవచ్చారు. దాని ఫలితంగా కాంగ్రెస్‌వాదులు కమ్యూనిస్టులుగా మారిపోతూ వచ్చారు.

ఈ విషయాలను ఇంతటితో ముగించి. ఈ రెండు పార్టీల వారి ప్రవర్తనను గురించి కొంత వ్రాస్తాను.

నిరశనవ్రతము–కాంగ్రెసునాయకులు

పై కారణంవల్ల మాత్రమే 160 మంది కమ్యూనిష్టులుగా

మారిపోయారని తలచకూడదు. జైలు జీవితంలో ఎన్నో క్లిష్ట సమస్యల నెదుర్కోవలసి వస్తుంది. ఆ ఎదుర్కోవడంలో పార్టీలవారీగా ఎవరి పంథా ప్రకారం వారు తమతమ సమస్యలను పరిష్కరించుకుంటూ వచ్చారు. పరిష్కారాలలో అభిప్రాయభేదాలు, తగాదాలు కలుగుతూ వచ్చాయి. ఇంతవరకు తర్కవితర్కాలలోని కొన్ని వ్యత్యాసాలను వివరించాను. మరి కొన్ని ముఖ్య సమస్యలను ఏ పార్టీ ఎలా ఎదుర్కొన్నదీ వ్రాస్తాను.

డెటిన్యూలసంఖ్య పెరగగానే ప్రభుత్వం రెండుతరగతులుగా విభజించింది. ప్రథమంలో ఎంతో న్యాయంగా చెయ్యవలసిన సౌకర్యాలను చేసింది; కాని, ఆ పాలసీని మార్చుకొన్నది. షుమారు 25 మందిని మాత్రమే మొదటి తరగతిలోను, మిగిలిన 85 మందిని రెండవతరగతిగాను మార్చారు, మొదటితరగతి వారికి మామూలు వసతులన్నీ యివ్వబడినై; అధికసంఖ్యాకుల రెండోతరగతి వారిని నేరంచేసి శిక్షననుభవించే మామూలు ఖైదీల స్థితికి మార్చారు. భోజనానికి రోజుకు ఆరు అణాలకు మారుగా రెండు అణాలు మాత్రమే; దుస్తులు కూడా అలాగే; ఉత్తరాలూ అంతే. స్వంతడబ్బుకూడా ఉపయోగించుకోకూడదు.

అప్పట్లో కమ్యూనిస్టులు ఏ పదిమందో వుండేవారు. మిగిలినవారు కాంగ్రెసు నాయకులు, వారి అనుచరులు. ఎవరూ ఈ మార్పులను ఒప్పుకోలేదు. అసమ్మతిని తెలియజేశారు. అయితే, గవర్నమెంటు లక్ష్యపెట్టలేదు. డెటిన్యూలు నిరశనవ్రతం ప్రారంభించారు. కాంగ్రెసునాయకులు, ముగ్గురునలుగురు రంగాపార్టీవారు మొత్తం పాతికమంది నిరశనవ్రతంలో చేరుటకు నిరాకరించారు. చేరుతామన్నవారిలో ఇద్దరువ్యాధిగ్రస్తులను చేరకూడదని తతిమ్మా

85 మంది ఏకగ్రీవంగా తీర్మానించారు. ఆ ఇద్దరిని మాత్రం నిరశనవ్రతానికి సంబంధించిన వ్యవహారాలను చూచుకోమని కోరారు. ఆ ఇద్దరిలో ఒకరు బాలచంద్ర మీనన్, రెండోవ్యక్తి నేను. ఈ నిరశనవ్రతం జయప్రదం కాకూడదని కాంగ్రెసునాయకులలో ఇద్దరుముగ్గురు పట్టుదలతో పని చేశారు. వారిలో ముఖ్యులు శ్రీ కాశేశ్వరరావు పంతులుగారు మూడునాలుగు రోజులలో ఈ నిరశనవ్రతం భగ్నమవుతుంది; మానేస్తారని ప్రచారం ప్రారంభించారు. ఆ నాలుగు రోజులు అయిన తరువాత "వీరేదో దొంగతనంగా తింటూండాలి" అని ప్రచారం సాగించారు. మధ్యలో నిలిపినవారిని అభినందించారు. రాజీమాటలలో క్షోభ్యం కలుగజేసుకొని విచ్ఛేదానికి ప్రయత్నించారు. జైలు బయట చాలమంది దేశభక్తులు బహిరంగ సభలు జరిపి, డెప్యుటేషన్లు తీసుకువెళ్లి విజయవంతంగా అంతమయ్యేవరకూ సహాయం చేస్తూనే వున్నారు. వారిలో ముఖ్యులు: శ్రీ జగన్నాథదాసు, యస్; కృష్ణమూర్తి, దరిశి సుభద్రమ్మ, వి. భాష్యంఅయ్యంగారు, ఆర్, సూర్యనారాయణరావు, న్యాయపతి నారాయణమూర్తిగార్లు. పందొమ్మిది రోజులు వ్రతం జరిగింది. చివరకు పూర్తిగా జయం లభించింది. దేశమంతా సంతోషించింది; కాని, మాతోనే వున్న కాంగ్రెసు నాయకులు చాలమంది హర్షించలేకపోయారు.

### జైలుకోడ్‌లో కాంగ్రెసువారి మార్పు

ఈ సందర్భంలో ఒక ముఖ్య విషయాన్ని వ్రాయాలి. కాంగ్రెసు మంత్రివర్గం అధికారంలో వుండగా (1936-39) బ్రిటిష్ రాక్షసుల అమానుష జైలు కోడులో మరి ఒకటి రెండు అమానుషమైన మార్పులు చేశారు. జైల్లో వుండగా నిర

శనవ్రతం చేసి, చస్తామనేవారిని చావనివ్వాలి; కాని, జీవించేలా ఎంత మాత్రమూ సహాయం చెయ్యకూడదనే మార్పు ముఖ్యమైనది. హిందీభాషకు వ్యతిరేకంగా పనిచేస్తూన్న అభివృద్ధినిరోధకులను భయపెట్టి లొంగదీయుటకు ఈ మార్పును చేసివుంటారు. అయితే కాంగ్రెసువారు అప్పుడు (1940-41లో) అధికారంలోలేరు. శ్రీ భయంకరాచారిగారు నిరశనవ్రతం చేశారు. ముందుగా మేము ఒక అంచనా వేసుకొని 21 రోజులవరకూ యీ వ్రతాన్ని సాగించాలనీ, ఈలోగా ప్రజలు అలజడిపుట్టి, ఒత్తిడితెచ్చి, ప్రభుత్వాన్ని లొంగదీయగలరని అందరం కలసి తీర్మానించుకున్నాము. ఆచారిగారు ఒకప్పుడు అండమానులో చాలారోజులు నిరశనవ్రతం చేసి అనుభవం సంపాదించినందున, యిరవైఒక్కరోజులవరకూ ప్రాణాపాయంలేకుండా ఎలా జరపాలో చక్కగా వుపాయాలు బోధించారు. ముఖ్యంగా నీళ్ళను సమృద్ధిగా తాగుచుండాలని సలహాయిచ్చారు. వ్రతం ప్రారంభంకాగానే తానుమాత్రం యీ సూత్రాన్ని ఉల్లంఘించి నీళ్లు త్రాగక మూడు రోజుల్లోనే చావుబ్రతుకులస్థితికి లోనయ్యారు. అప్పుడు జైలు సూపర్నెంటు డాక్టరు మేజరు గిల్లు. తగవులమారికాదు. అందరికి అనుకూలంగా ఎలాగో సవరించుకొంటూండేవారు. భయంకరాచారిగారిమీద ప్రత్యేకాభిమానం ఆయనకు.

కాంగ్రెసు చేసిన మార్పు అమలులో వుంది. ఆ ప్రకారం చేస్తే భయంకరాచారికి ప్రాణాపాయం తప్పదు. రూల్సును ఉల్లంఘించి బ్రతికేలాగు సహాయం చేస్తే, తన ఉద్యోగానికే భంగం కలుగవచ్చు; ముఖ్యంగా తాను త్వరలోనే ఇన్స్పెక్టరు జనరలు అవుతాననే నమ్మకంతో ఎదురుచూస్తున్నారు. డాక్టరు పట్టాభి,

సాంబమూర్తి, కాశేశ్వరరావు, మాధవమీనన్, నాడార్, కళావెంక ట్రావు, సంజీవరెడ్డి, ఆచార్యరంగావగైరా కాంగ్రెసు నాయకు లతో తన కష్టాన్ని మేజరు గిల్లుగారు చెప్పుకున్నారు. ఎలాంటి సలహాగాని యివ్వలేకపోయారు మన నాయకులు. చివరకు తానే ఒక నిర్ణయానికివచ్చి "ఏమయినాసరే; భయంకరాచారిని జీవించే లా చేస్తా"నన్నారు. బలవంతంగా ఆసనంద్వారా నీళ్లు ఎక్కిం చారు. 20 రోజులు నిరశనవ్రతం సాగించారు. కాంగ్రెసు మంత్రి వర్గం చేసిన మార్పుకు అందరికి చాల అసహ్యంకలిగింది.

భ య ం క రా చా రి

భయంకరాచారిగారు అలా ఎందుకు చేశాడో తెలుసు కోవాలని కుతూహలం కలుగవచ్చు. వారి మనసులో ఏముందో మాకు తెలియదు. తన మీదనే ప్రజలదృష్టి నిలవాలని, తనవల్లనే జయం వచ్చిందని గర్వపడడానికి యెత్తువేసివుంటారనీ అను కున్నాము మేము.

ఆ రెండుసంవత్సరాలకాలంలో మరొకరితో కలసి ఆయన ఏపనికాని చెయ్యలేకపొయ్యాడు. భయంకరాచారిగారికి తనగదిలోకి రెండవవారు లభించలేదు. అలాగే కష్టపడుచున్న కాశేశ్వరరావు పంతులుగారే చివరకు భయంకరాచారిగారి గదిలో వుండవలసి వచ్చింది.

వి భ జి ం చి పా లి ం చ డ ం

నిరశనవ్రతం పరిష్కారమైంది; కాని, ప్రభుత్వం మరొక తగాదా తెచ్చి పెట్టింది. పరిష్కారంలో సామ్రాజ్యవాదుల విషం నిండివుంది. రెండు తరగతు లనే విభజనను అలాగే వుంచారు. "విభజించి పాలించడం" అనేది ఎక్కడకి పోతుంది? అయితే,

విభజనను ఏపార్టీ కూడా ఒప్పుకోలేదు. మామూలుగా అంత వరకూ కలిసివుంటున్నట్టే వుమ్మడిగా కమ్యూను జీవితపద్ధతిని నడుపుదామని మెజారిటీ తీర్మానించింది. ఒకటవతరగతిలోని ప్రతి డెటిన్యూకు రోజుకు షుమారు నాలుగుఅణాల వెలగల వెన్న, పండ్లు, చక్కెర యిచ్చారు. మొదటితరగతిలో 25 మందినీ, రెండవతరగతిలో 85 మందినీ వేశారు. కాంగ్రెసువారిలో మొదటితరగతివారు పదిమందిమాత్రమే; రెండవ తరగతివారు చాలా ఎక్కువ.

కాంగ్రెసు నాయకుల "ప్రత్యేకత"

తరగతివారీగా రెండు వంటశాలలు ఉండాలని శ్రీ కాశేశ్వరరావుగారి వాదన; అయితే ఈ వాదన వోడిపోయింది. పోతే నేం? అందరకు కలసి ఒకటే వంటశాల ఉండవచ్చు; కాని, ఒకటవతరగతివారికి అధికంగా వచ్చేవి ఎవరివి వారికే యివ్వాలని శ్రీ వారు పట్టుపట్టి వాదించారు. కాని మిగతావారు అందుకు ఒప్పుకోలేదు. ప్రత్యేకంగా ఒక వంటశాల పెట్టుకొనుటకు వుత్తరు విమ్మని శ్రీ రావుగారు సూపర్నెంటుగారైన మేజరు క్లైమెన్సుగారిని అడిగారు. రెండవతరగతిలో వుండే కాంగ్రెసు వారందరిని తమతో కలిసి వుండమని కమ్యూనిస్టులు ఆహ్వానించారు. అందుకు కాంగ్రెసు నాయకులు నైతికంగా తిన్న దెబ్బ ఇంతా అంతా కాదు. కాంగ్రెసువారి అనుచరులు చాలమంది కమ్యూనిస్టుపార్టీలో మరి ఏ వాదన అవసరంలేకుండానే చేరిపోసాగారు. చివరకు మేజరు క్లైమెన్సు రెండో వంటశాల పెట్టుకొనుటకు అనుమతి యివ్వనేలేదు. అందు కాయన శ్రీ పంతులుగారితో చెప్పిన కారణం ఎంతో సమంజసంగా వుంది;

"మీరు మంత్రివర్గంలో వుండి రాష్ట్రాన్ని పాలించారు. మళ్ళీ పాలించవలసివుంటుంది. మీ గౌరవాన్ని మీరు కాపాడుకోవాలి. రెండో పంటశాల పెట్టుకున్నారా, మీకు కళంకం తప్పదు. భావిలో మీకు హాని జరుగుతుంది. కాబట్టి, నేను అంగీకరించను" అన్నారు సూపర్నెంటు. శ్రీ కాశేశ్వరరావుగారు వట్టి చేతులతో వచ్చేశారు. కాంగ్రెసునాయకులలో శ్రీ సాంబమూర్తిగారు శ్రీ కాశేశ్వరరావు పంతులుగారిని ఈ విషయాలలో బాగా మందలించుతూవచ్చారు.

## ప రా రీ

జైలుజీవితం చాల దుర్భరమైనది. అందరూ ఓర్చుకోలేరు. ఐదుగురు కమ్యూనిస్టులు జైల్లోనుండితప్పించుకుపోయారు. ప్రహరీగోడ నేలమట్టానికి సమీపంలో రెండుమూడడుగుల వెడల్పుంటుంది. కొందరు గోడకు ఒక కన్నంచేసి, ఒక నెల రోజులు కన్పడకుండా మూసిపెట్టివుంచారు. ఎ. కె. గోపాలన్ నలుగురిని వెంటబెట్టుకొని తప్పించుకొని వెళ్ళిపోయాడు,

గోపాలన్‌కు బ్రిటిష్ ప్రభుత్వంమీద అమిత ద్వేషం. బయటి కెళ్ళి పనిచెయ్యాలని గంపెడంత ఆశ. జైయిలో ఎల్లప్పుడు అధికారులతో తగవులు పెట్టుకొనేవాడు. అధికారులకుగానీ, డెటిన్యూలకుగానీ విరామ ముండదు. అప్పుడు జైల్లో రెండు వందలమంది డెటిన్యూలలో ఏ. కె. గోపాలన్, డాక్టరు *కృష్ణగార్లు

* డాక్టరు కృష్ణ 1949 జనవరిలో స్వగ్రామం నిడుబ్రోలులో చనిపోయిరి. 15 సంవత్సరాలు యింగ్లాండు, అమెరికాలలో చదువుకొంటూ పనిచేస్తుండేవారు. హార్వర్డ్ యూనివర్సిటీలో ఈ మేధావితో బాధలు పడలేని ప్రొఫెసర్లు ఆయనకు Ph.D డిగ్రీ యివ్వకుండా అడ్డుపడ్డారు.

గొప్ప వ్యక్తులు. వీరివల్ల కాంగ్రెసువాదులు కమ్యూనిస్టులుగా మారిపోతున్నారని కొందరు నాయకులకు కడుపుమంట. వీరిద్దరి మీద గవర్నమెంటుకు రహస్యంగా రిపోర్టును ఒక కాంగ్రెస్ నాయకుడుపంపించాడనీ, ఛీఫ్ సెక్రెటరీగారైన శ్రీ శౌంఠి రామమూర్తి గారు రిపోర్టు పంపిన నాయకుని ప్రవర్తనను అసహ్యాంచుకున్నారనీ తెలిసింది. స్వరాజ్యంకోసం ప్రయత్నించే రెండు పార్టీలలో, ఒక పార్టీ మరొక పార్టీమీద చాటు అర్జీలు పెడుతున్నందుకు రామమూర్తిగారు ఏవగించుకున్నట్టు నేను విడుదలైన తరువాత శ్రీ సూర్యనారాయణరావుగారు (సర్వెంట్సు ఆఫ్ ఇండియా) నాతో చెప్పారు.

పై రిపోర్టుల వల్ల డాక్టరు కృష్ణగారితో, ఏ. కే. గోపాలన్ గారితోను మద్రాసు జైలుకు ఉదయాన వెళ్ళాలని, ముందురోజు సాయంత్రమే జైలు అధికారులు చెప్పివేశారు. ఆ రాత్రే ఏ. కే. గోపాలన్, కొరపాటి పట్టాభిరామయ్య, సి. వి. కె. రావు, దాట్ల సూర్యనారాయణ రాజు (తణుకు), కన్నన్‌గార్లు తప్పించుకుని వెళ్ళిపోయారు. పట్టాభిరామయ్యగారు జైలుకు వచ్చినందుకు చాల విచారపడేవారు. వచ్చినప్పటినుంచి తప్పించుకొని పోవుటకు ప్రయత్నాలు ప్రారంభించారు. అలాగే రాజుగారూను. ప్రతిరోజు బాటలు, రోడ్లు వగైరా గీతలు గీస్తూండేవారు. వెళ్ళేటప్పుడు రహస్యాన్ని సి. వి. కె. రావుగారితో చెప్పి, తమ తరపున మిగతావా రందరికి ముందుగా చెప్పనందుకు క్షమాపణ తెలుపు

---

చివరకు ఆయననుండి తప్పించుకోవడం మంచిదని డిగ్రీ యిచ్చి పంపివేశారు. కృష్ణగారు మహా మేధావి.

మని కోరారు. "నేనుకూడా వస్తా" నని ఆయన కూడా దూరి పోయారు.

మరునాడు జైలులో గందరగోళమయింది. అంతవరకు రాత్రిళ్ళుమేము ఆరు బయట పడుకొంటూండేవాళ్ళం. ఆ సౌకర్యం పోతుందని తప్పించుకుని పోయినవారిని పెద్దలు కొందరు నిందించ సాగారు. అయితే కమ్యూనిస్టులను మాత్రమే మూసి వెయ్యాలని ఉత్తరువు వచ్చినా, కోనసీమ కాంగ్రెసు నాయకుడు మాత్రం నిందించడం మానలేదు. వారితో ఒకేగదిలో వున్న శ్రీ సాంబమూర్తి గారికి విసుగెత్తి "సత్యాగ్రహమట! ఏమి టీ వాగుడు? అలా వెళ్ళటానికి ధైర్యం, సాహసం, త్యాగమూ కావాలి; నిన్నూ. నన్నూ ఆ కన్నంలో పెట్టి నెట్టినా వెళ్తామటోయ్?" అని కసిరారు. అంతటితో ఆ కాంగ్రెసు నాయకుని కోపం చల్లారింది.

వెళ్లిపోయిన వా రిద్దరు నా గదిలో ఉండేవారు. అందువల్ల మా బంధువుల యిండ్లవద్ద పోలీసులు కాపలా కాచారట. పరారైనవారు నాచేతి గడియారం, మరికొందరి గడియారాలు మాకు తెలియకుండానే తీసుకెళ్లారు. ఎక్కడైనా అమ్ముకుని ప్రయాణం సాగించాలని అనుకున్నారట, కాని మా గడియారాలను తిరిగి పంపివేశారు.

## గౌరవనీయులైన సాంబమూర్తి

ఈ విధంగా ప్రభుత్వం ఓడిపోతున్నా తన దుష్టత్వాన్ని మానలేదు. డెటిన్యూలము 174 మంది మయ్యాము. ఎక్కువ అపాయకరమైనవారు, తక్కువ ప్రమాదకరులు అని రెండు తరగతులుగా నూపర్నెంటుగారు విభజించారు. 25 మందిని స్త్రీల

పాతయార్డులోను, మిగతవారిని వెలుపల క్వారంటీనులో ఉంచారు. శ్రీ కాశేశ్వరరావుగారు తనకిష్టమైన యిరవై అయిదు పేర్ల పట్టీ తయారుచేసి సూపర్నెంటుకు యిచ్చారని వదంతి. దానితో ఒక నిరసనసభపెట్టి ఆయన్ను ఖండించారు. కాంగ్రెసు నాయకులు కూడా నిరసించారు. *శ్రీ సాంబమూర్తిగారి గాంభీర్యము, త్యాగములవల్ల కాంగ్రెసు సంస్థకు, కాంగ్రెసు నాయకులకు గౌరవ మెంత అధికమగుచుండెనో శ్రీ కాశేశ్వరరావుగారివల్ల అంత అధోగతిపాలవుతున్నదని అనుకునేవారు.

రష్యాపై హిట్లరుదాడి : కాంగ్రెసునాయకుల కలబు

పైవిధంగా విడదీసి రెండుప్రదేశాలలో వుంచేముందుగా హిట్లరు సోవియట్ రష్యామీద దండెత్తాడు. కమ్యూనిస్టులలో చాల కలవరంపుట్టింది. వారు విచారగ్రస్తులయ్యారు. కొందరు కాంగ్రెసునాయకులు సంతోషాన్ని ప్రదర్శించారు. 'రష్యా ఓడిపోతుంది; తప్ప'దని ప్రచారం సాగించారు. ఇన్నిరోజులలో,

*మద్రాసు గవర్నరుగారు మరునాడు జైలును చూచేందుకు వస్తారనగా ముందురోజున డిస్ట్రిక్టుమాజిస్ట్రేటు శ్రీ సాంబమూర్తిగారిని కలుసుకొని "గవర్నరుగారికి మీతో మాట్లాడాలని వుంది. రేపు ఆఫీసులో ఫలానా టైముకు కలుసుకుంటారా?" అని అడిగారు. "ఎప్పుడూ 24 గంటలూ నా గదిలోనే వుంటాను. గవర్నరుగారు ఎప్పుడు కలుసుకోవాలంటే అప్పుడు నాగదిలో కలుసుకోవచ్చు" అన్నారు సాంబమూర్తిగారు. "కాదు, ఆఫీసులో కలుసుకోండి" "నాకు వారితో పనేమీ లేదే! వారికి నాతో పనివుంటే నాగదిలో కలుసుకోవచ్చు"నని చెప్పారు. అందరం సంతోషించాము. మరునాడు గవర్నరు మే మున్నచోటికి వచ్చినప్పుడు ఎవరిగదిలో వారు వుండాలని తీర్మానించుకున్నాము.

ఇన్ని గంటలలో మాస్కో-నగరాన్ని హిట్లరు పట్టుకుంటాడని కమ్యూనిస్టుల చెవుల్లో పడేలాగా శ్రీ కాశేశ్వరరావుగారు గట్టిగా మాట్లాడేవారు.

"లండను, బెర్లిను, మాస్కో-లు- ఏవి నాశనమైతే నా కేం? ప్రపంచానికి ఢిల్లీ ముఖ్యపట్టణం కావాలి" అని ఒక నాయకాగ్రణి తన దివ్యమైన దేశభక్తిని వెల్లడించారు.

"కాకసస్ కొండలు దాటాడా, సరాసరి మనదేశానికి వస్తాడు; పెషావరు చేరగానే ముఖ్యరాజకీయపార్టీఅయిన కాంగ్రెసు నాయకులను పిలిపించి హిట్లరు "ఆంగ్లేయులకు మాకూ విరోధాలున్నాయి. మీకు మాకు ఎల్లప్పుడూ సఖ్యం వుంటూ వచ్చింది; ఇకమీదటకూడా వుంటుంది. ఇంగ్లీషువారిని మీ దేశాన్నుండి పారదోలాము. ఇక మీ దేశాన్ని మీరు సుఖంగా పరిపాలించుకోండి అని కాంగ్రెసుపార్టీతో సంధిచేసుకొని వెళ్లిపోతా"డని బహిరంగంగా కాంగ్రెసువారు చర్చించేవారు. కాంగ్రెసులో ఎవరైనా సంశయంగా మాట్లాడితే "ఎందుకండీ మీ కీ సంశయం? మరోవిధంగా జరగటానికి ఎలా సాధ్యపడుతుందో చెప్పండి?" అని దబాయించేవారు.

కాంగ్రెసువాదుల కమ్యూనిస్టులమధ్య చర్చ జరిగినప్పుడు శ్రీ కాశేశ్వరరావుగారు "ఇది ప్రపంచయుద్ధం కావచ్చు; ఇందులో రెండు పార్టీలు మాత్రమే వుండవచ్చు. కాని ఇండియాకు సంబంధించినంతవరకూ మన శత్రువు బ్రిటన్. బ్రిటను శత్రువులైన జర్మనీ, జపాను, ఇటలీలు మన మిత్రులు. బ్రిటనుతో కలసిపోయిన అమెరికా. రషియాలు ఇండియాకు శత్రువులే" నని ఖండితంగా, తేటతెల్లంగా చెప్పారు. కాంగ్రెసువా రందరికీ ఈ

విశదీకరణ నచ్చింది; అయితే కమ్యూనిస్టులకు మాత్రం నచ్చలేదు. "మరి చైనాగతి ఏమి"టని "గాంధీ నెహ్రూలతో ఏకీభవించరా?" అని మరికొందరు ఆక్షేపిస్తూ మాట్లాడారు. కాని. కాశేశ్వరరావు గారికి అవి ఎంతమాత్రం అడ్డురాలేదు."ఈ పుక్కిరిటిపురాణాలన్నీ కట్టిపెట్టం"డన్నారు.

ఫాసిస్టుల జయం కోరడంతోను, సోషలిస్టురష్యా ఎంత త్వరగా, ఎంత సులభంగా ఓడితే అంత త్వరగా ఇండియాకు స్వరాజ్యం వస్తుం దనుకోవడంతోను కాంగ్రెసు కమ్యూనిస్టుపార్టీ లకు ద్వేషాలు ఏర్పడ్డాయి. షుమారు 150 సంవత్సరాలకాలం మన దేశాన్ని నాశనం చేసిన బ్రిటిష్ గవర్నమెంటును భారతీయులు నాశనంచేయుటకు బదులు శత్రువైన బ్రిటన్‌తో కలసిన రష్యా జయాన్ని కాంక్షించుతున్న భారతకమ్యూనిస్టులను కాంగ్రెసు దేశ భక్తులు అసహ్యించుకొన్నారు; అంతేకాదు, దేశద్రోహులని తిట్టనారంభించారు. అప్పటినుండి ఈ రెండుపార్టీలకు పొత్తు కుదరలేదు.

సమిష్టిజీవితము - కాంగ్రెసునాయకులు

ప్రథమంలో జైలుకు వచ్చిన కమ్యూనిస్టు, ఫార్వర్డు బ్లాకు డెటిన్యూలు కలసి ఒక "కమ్యూను" స్థాపించారు. ఎవరికే ఆహారపదార్థాలు తమ యిండ్లనుండి వచ్చినా (పండ్లు, మిఠాయీలు, పచ్చళ్ళు, అప్పడాలు వగైరా) కమ్యూనుకు యిచ్చేవారు. అందరూ కలసి సమిష్టిగా అనుభవించడ మనే పద్ధతి ఏర్పాటు చేశారు. అలాగే చాలకాలం చాలా బాగా జరిగిపోతూవచ్చింది. అయితే, కాంగ్రెసునాయకులకు ఈ పద్ధతి నచ్చలేదు. వారేమో వ్యక్తిగతంగాను, వారిలోవారు చిన్నచిన్న ముఠాలుగాను వుంటూ

వచ్చారు. కమ్యూనిష్టులు తమ పద్ధతిని మానలేదు. ఈ పరస్పర భేదాలు పెరిగిపోయాయి. అందరం కలిసి భోజనంచేసే సమయంలో ముఠాలవారీగా జరగడం ముఖ్యంగా విద్యార్థులైన యువకులకు నచ్చలేదు; వారు అల్లరి ప్రారంభించారు.

యువకుల అల్లరి పడలేక కాంగ్రెసు వృద్ధ నాయకులు తమతమ గదులలో ముఠాలవారీగా భోజనంచేయనారంభించారు.

యువక దేశభక్తుల మనోభావాలను, దృక్పథాలను, వారి త్యాగాలను వృద్ధనాయకులు గ్రహించలేకపోయారు. ఉమ్మడిగా కమ్యూనిష్టులు జీవించడమనేది నన్ను బాగా ఆకర్షించింది. కమ్యూనిష్టు యువకులు నన్ను కమ్యూనిష్టుగా మార్చగల్గుటకు ముఖ్యకారణం యిదే.

అనేకవేల సంవత్సరాలుగా మనలో పాదుకుపోయిన సహపంక్తి భోజన నిషేధాన్ని రూపుమాపి, అందరం మానవులమే నన్న ఉన్నత భావాన్ని కలిగించుటకు జైలు జీవితం బాగా ఉపయోగపడింది.

అయితే మాంసాహారానికి అలవాటుపడని వారికి సహపంక్తి భోజనం చాల కష్టమైన పని. అందువల్ల మాంసం వున్న సమయాల్లో ముందుగా శాఖాహారులు భోంచేసిన తరువాత "మాంసాహారులకు భోజనం పెడుతుండేవారం. ఇందుకు జనాబ్ అబ్దుల్ రహిమాన్ యం. యల్. ఏ. గారొక్కరుమాత్రం ఆక్షేపించుతూ వుండేవారు. వారికి సమాధానం చెప్పడం ఎవరికీ సాధ్యంకాలేదు. వంటపాత్రలు సైతం శాఖాహారులకు, మాంసాహారులకు వేరుచేశాము. కమ్యూనిష్టులలో చాలమంది శాఖాహారులున్నారు.

## కాశేశ్వరరావుగారి లేఖ

జైలునుండి విడుదలై వచ్చిన తరువాత మహాత్మా గాంధీ గారికి శ్రీ కాశేశ్వరరావుగారు ఒక ఉత్తరం వ్రాశారు. దానిలో కమ్యూనిస్టులు కాగానే శాకాహారులు మాంసాహారులుగా మారి పోతున్నారనీ, వేల ఏండ్లుగా వుండిన సాంప్రదాయాన్ని మానే శారనీ ఒక బ్రాహ్మణ యం. ఏ. గారిని, ఒక వైశ్య బి. ఎస్. సి. గారిని ఉదాహరించారు. కమ్యూనిస్టు డెటిన్యూలలో ఇద్దరు ముగ్గురు బ్రాహ్మణ ఎం. ఏ. లు వున్నారుగాని, అందరూ శాకా హారులే. వైశ్య బి. ఎస్. సి. నే నొక్కడినే. నేను మాంసం తిననే లేదు; అందరికీ బాగా తెలుసు. శ్రీ కాశేశ్వరరావుగారు వచ్చి అబద్ధం ఎందుకు వ్రాశారో ఇంతవరకూ నాకు అర్థంకావడం లేదు. కమ్యూనిస్టు కాగానే రాక్షసుడుగా మారిపోతాడనే అభిప్రా యాన్ని గాంధీగారికి కలుగజేయడానికి అలా వ్రాసియుండ వచ్చును. బహుశా ఆ వుత్తరం రహస్యంగానే వుంటుందని అను కొన్నారేమో!

## కాంగ్రెసుయువకులు కమ్యూనిస్టులయ్యారు

జైల్లో గడచిన రెండుసంవత్సరాలలో బయటలాగే లోపల కూడా ఒక ప్రాతకొత్తలయుగసంధిగా వున్నది. యువకులు, వృద్ధులు ఒకరి కొకరు దూరమయిపోతూవచ్చారు. సుమారు 150 మంది కాంగ్రెసుయువకులు తమ నాయకుల యెదుటనే కమ్యూ నిస్టులుగా మారిపోయారు. విడుదలకాగానే రాష్ట్రమంతటా ప్రతి జిల్లాలోను, తాలూకాలోను కమిటీలను స్థాపించారు. కమ్యూ నిస్టుల, కాంగ్రెసువాదుల విభజన అప్పటినుండి స్థిరపడిపోతూ వచ్చింది.

జీవితము చాల కష్టమైనది. భోజనాలు, బట్టలు, పుస్తకాలు వార్తాపత్రికలు కావలసినన్ని వున్నా, మానసికంగా చాల బాధ కలుగతుంది. జీవితంలో మార్పు వుండదు. రోజూ ఒకే మాదిరిగా ఉంటుంది. విసుగు పుడుతుంది. దానితో మానసికవ్యాధులు, కలుగుతాయి. ఘాపే రక్తపుపోటు (Blood Pressure) వ్యాధితో ఎన్నోసార్లు చావుకు సిద్ధమయ్యాడు. అల్లూరి సత్యనారాయణరాజు గారికి మూర్ఛవ్యాధి వచ్చింది. అతని బాధ భయంకరంగా వుండేది; అలాగే గారపాటి సత్యనారాయణగారికిన్నీ ఆ వ్యాధి సోకింది. విడుదలకాగానే వారందరికీ స్వస్థత చిక్కింది.

అల్లామా మష్రూఖీకీ (అఖిలభారత ఖాక్సార్ నాయకుడు) అబ్దుల్ రహిమాన్ (M. L. A.) కూ, నాకూ అనవసరంగా కోపాలు వచ్చేవి. నిష్కారణంగా తగవులాడేవాళ్ళం. మేము ముగ్గురము పిచ్చివాళ్ల మవుతామని అనుకునేవారు. చివరకు అల్లామాగారు సగం పిచ్చివాడైనాడు. "ఆ చెట్టుమీద నా భార్య కూర్చుని రమ్మని పిలుస్తున్నది. మీకు కనపడుతున్నదా?" అని అడిగేవాడు. రెండు సంవత్సరాలక్రితం జైలుకు వచ్చినప్పుడు జైలు ఆఫీసర్లు ఆయన దగ్గరకు రావడానికే భయపడేవారు. విడుదల కాగానే మేము ముగ్గురము బాగుపడ్డాము.

విడుదల అయిన కొన్నిమాసాలకు అబ్దుల్ రహిమాను హఠాత్తుగా ఒక ప్రదర్శనంలో కనపడి కౌగలించుకొని నవ్వసాగాడు. "మనమిద్దరం జైల్లో కోడిపుంజుల్లాగా పోట్లాడుకొనేవాళ్ళంగదా? ఆ విషయం జ్ఞాపకం వచ్చినప్పుడు సిగ్గువేస్తూ ఉంటుంది" అన్నాడు. నాకుకూడా అలాగే సిగ్గువేస్తూవున్నది.

మన యిండ్లలో స్త్రీలు అనవసరంగా పోట్లాడుకొనుటకు కారణం అర్థమయింది. విసుగు జీవితమే అందుకు కారణము.

అలాంటి బాధలు లేనివారుకూడా వున్నారు. మద్దూరి అన్నపూర్ణయ్యగారు, సాంబమూర్తిగారు, యం. ఆర్. వెంకట్రామన్ గారు ఆహారం అధికంగా తీసుకొనేవారు. ఎంతైనా జీర్ణించుకొనేవారు; ఎన్నిరోజులైనా నిరశనవ్రతం చేసేవారు అలాంటి శరీరదార్ఢ్యం కలవారు అరుదు. జైలులో విసుగూ విరామం లేకుండా జీవించగలవారు అదృష్టవంతులు. సంగీత సాహిత్యాలు. చిత్రలేఖనము, ఆట పాటలు, నాటకాలయందు అభిరుచిగలవారికి అంతగా విసుగుండదు. ఏ. యస్. కె. అయ్యం గారు, యం. ఆర్. వెంకట్రామన్, డాక్టరు కుప్పా వెంకట్రామ శాస్త్రిగారు ఎప్పుడూసంతోషంగా వుండేవారు; ఇతరులు సైతము సంతోషంగా వుండేందుకు సహాయపడేవారు. కొందరు గ్రంథాలు వ్రాసేవారు. డాక్టరు పట్టాభి, ఆచార్య రంగా, డాక్టర్ కె. బి. కృష్ణ గార్లకు రోజుకు 24 గంటలూ చాలేవికావు.

## తారుమారైన ప్రపంచం

మాకు 1942 జూన్‌లో విడుదల అయింది; ప్రపంచ మంతటా యుద్ధం వ్యాపించింది. రెండు పార్టీల బలాబలాలు సరిసమానంగా వున్నాయి. ఎవరు గెలుస్తారో ఎవరు ఓడిపోతారో చెప్పడానికి సాధ్యంకాని సమయము.

విడుదల కాగానే మద్రాసుకు వచ్చాము; ముందుగా టెలిగ్రాము యిచ్చి వచ్చాము. కాని ఒక్కరూ సెంట్రల్ స్టేషనుకు వచ్చి మమ్మలను కలుసుకోలేదు; కుశలప్రశ్నలైనా అడిగే వారు లేరు. దేశంకోసం రెండు సంవత్సరాలు జైలుకు వెళ్ళి

వస్తే ఆదరించేవారు ఒక్కరైనా లేకపోయారు. బ్రాడ్వేలో కమ్యూనిస్టుపార్టీ ఆఫీసు తాళం చెవి ఎక్కడున్నదో విచారించి, వీధులు తిరిగి తెచ్చుకోవలసిన గతి పట్టింది. రెండు సంవత్సరాలలో ప్రపంచమంతా తారుమారైనది. బాహ్యప్రపంచంలో వచ్చిన మార్పులు జైలులో ఉండగా మాకు అర్థంకాలేదు.

పరిస్థితులను అర్థం చేసుకోవాలి. అందుకుగాను రాజకీయ మిత్రులను, మిత్రులయిన నాయకులను కలసి కొంటిని. వాతావరణం సందిగ్ధంగా వుంది. మిత్రుడు ఖాసా సుబ్బారావుగారిని కలుసుకున్నాను. కుశలప్రశ్న లడుగుటకు బదులు "మిమ్మ ఎందులకు విడుదల చేశారు? కమ్యూనిస్టులు బ్రిటిష్ గవర్నమెంటుకు ఏమని మాట యిచ్చారు? లేకపోతే, ఈసమయంలో మిమ్మలను ఎందుకు విడుదల చెయ్యాలి?" అని ప్రతిమాటలో, ప్రతి చూపులో సందేహాన్ని, తిరస్కార భావాన్నిచూపారు. మేము దేశద్రోహులమనే భావాన్ని కనపరిచారు. ఈవిధంగా ఎవరైనా ప్రశ్నించుతారని తలచనేలేదు; నిర్ఘాంతపోతిని.

"మేము గవర్నమెంటు కేమీ మాట యివ్వలేదే!" అన్నాను.

"మీరు వ్యక్తిగతంగా యివ్వకపోతేనేం? మీ పార్టీ ఇచ్చి వుంటుంది?" అన్నారు సుబ్బారావుగారు.

"ఆ సంగతి నాకు తెలియదులే! ఏమని ఇచ్చివుంటారని మీ ఊహ?" అని అడిగాను,

"కాంగ్రెసుతో పోట్లాడుతామని, యుద్ధంలో బ్రిటిష్ గవర్నమెంటుకు సహాయం చేస్తామని, జపానును ఎదిరించుతామని మాట ఇచ్చి వుంటారు." అని వారి వాదన.

నే నిలా చెప్పాను:-"కమ్యూనిస్టుపాలసీ నాకు తెలుసు. అందుకు నాయకుడిని కావలసిన అవసరం లేదు. కాంగ్రెసుతో పోట్లాడము. కాంగ్రెసు లీగుల ఐక్యత కొరకు ప్రయత్నించు తాము. బ్రిటిష్ సామ్రాజ్యానికి సహాయం చెయ్యము; ఇండి యాకు స్వాతంత్ర్యం యిస్తామని సరిగా దోవకు వస్తే, వారితో చేతులు కలుపుతాము; జపానును మాత్రం ఎదిరిస్తాము. వారిని ఇండియాలో కాలు పెట్టనివ్వము; పెట్టినచో ఆక్రమించిన ప్రదే శాలలో వారిని నాశనం చేయడానికి ప్రయత్నిస్తాము."

"బ్రిటిష్ గవర్నమెంటుకు సహాయం చెయ్యకుండా, జపాను నెలా యెదిరించగల"రని అడిగారు.

కమ్యూనిస్టుల యెడల దేశంలో ప్రబలిన అపోహ సుబ్బా రావుగారి సంభాషణవలన స్పష్టమవుతోంది.

బ్రిటిష్ వ్యతిరేకత—ఫాసిస్టు అనుకూలత

ఒక విషయం బాగా బోధపడింది; బ్రిటిష్ ప్రభుత్వం మీద సహజంగా వుండే ద్వేషభావం జపాను ఫాసిజానికి అను కూల వాతావరణాన్ని కలుగజేస్తూవచ్చింది. జపాను సైనికులు మద్రాసు హార్బరులో దిగివుంటే మన విద్యాధికులైన దేశభ క్తులు పూలదండలువేసి స్వాగతమిచ్చియుందురు. తరువాత ఒక రిటైర్డు హైకోర్టు జడ్జీగారిని కలుసుకున్నాను. ఆయన హిందూ మతసాంప్రదాయంలో గాఢాభిమానంగలవారు; అయితే గాంధీ భక్తుడు; నాకు స్నేహితుడు. "మనదేశంలో రాజకీయసమస్యలు చాల క్లిష్టమైపోయినయి. బ్రిటిష్‌వారే ఇందుకు కారకులు. వా రున్నంతకాలము ఈ సమస్యలు పరిష్కారం కాజాలవు, హిందూ ముస్లింసమస్యను పరిష్కరించడమనేది ఇక వారికి సాధ్యంకాదు!

ఏ జపానో యింగ్లీషువాళ్ళను తరిమివేస్తే, ఈసమస్యలకు పరిష్కారం ఏర్పడవచ్చు. మరొక మార్గం నాకు తోచటలే" దన్నారు ఆ హిందూమహాసభ భక్తుడు. ముస్లిములతో రాజీపడి, స్వతంత్రంగా రాజ్యం చేసుకుందామనే భావమే వీరికి లేదు. కాబట్టి, జపాను నాహ్వానించుటకు సిద్ధంగావున్నారు వారూ, వారిలాంటి గొప్ప గొప్ప ఉద్యోగస్తులూను.

ప్రముఖ కాంగ్రెసు నాయకుడూ-నాకు మిత్రుడూ అయిన వారినొకరిని కలుసుకొంటిని. వారు యిలాగన్నారు: "జపాను ఇండియాను తప్పకుండా ఆక్రమించుకుంటుంది; అడ్డుపెట్టగల వారులేరు" ఆయన చాలా ఉత్సాహంగా మాట్లాడడం చూచి వారు చెప్పే దంతా చెప్పనిచ్చాను. "జపానువారికి బ్రిటిష్‌వాళ్ళ మీద అమిత ద్వేషము; కాబట్టి బ్రిటిష్‌వాళ్ళపాలసీకి ప్రతివిషయంలోను వ్యతిరేకించుతారు. బ్రిటిష్‌సామ్రాజ్యం ముస్లింలీగుకు ప్రోత్సాహమిస్తూవచ్చింది; జపానువారు తప్పకుండా కాంగ్రెసుకు సహాయంచేసి, లీగును అణచివేస్తా"రన్నారు. ఈ రాజకీయవేత్త ఒకనిముషం ఆగి, మెల్లగా పరమరహస్యాలను చెప్పనారంభించారు. "జపానుయుద్ధనావలు మనతూర్పుతీరానికి వస్తూన్నాయట. చాలా దగ్గరకు వచ్చాయట; మన రాష్ట్రంలో దిగుతారు; మన రాష్ట్రం సులభంగా వారికి స్వాధీనమవుతుంది. తాత్కాలిక ప్రభుత్వాన్నికూడా అప్పుడే జపానువారు తీర్మానించుకొన్నారు; గవర్నరు ఎవరో తెలుసా? మనపంతులుగారే" అన్నారు. నాకు ఆశ్చర్యం వేసింది. ఎలాంటి ఆశలు! ఎలాంటి ఆలోచనలు! జపానువారే మద్రాసులో దిగి వుంటే ఎన్నెన్ని బండ్ల పూలదండలు వేసేవారో! జయభేరీలతో ఎంత వైభవంగా ఊరేగించేవారో!

మన కవులు ఎన్ని పద్యాలు పాటలూ వ్రాసేవారో! దేవాలయాల్లో ఎన్నిపూజలు జరిగివుండేవో!

జపానువారు మద్రాసుపైని బాంబులు వేస్తారనే భయంతో ప్రజలు మద్రాసు విడిచి పారిపోయారు! సహించరాని బాధలు పడ్డారు; మద్రాసునగరంలో ట్రాములు, బస్సులు ఖాళీగా తిరిగేవి. కాఫీహోటళ్ళను మూసివేశారు. వీధుల్లో ప్రజలే కనిపించేవారు కాదు. అయినప్పటికీ, జపానువారు రావాలి; ఆంగ్లేయులను పారద్రోలాలి; ఎక్కడ విన్నా ఇదే భావం. జపానువారు స్వరాజ్య మిస్తారా? అని అడిగితే—తప్పకుండా యిస్తారని గ్రుడ్డినమ్మకం, ఇవ్వకపోయినా సరే! ఆ విషయం ఆ తరువాత చూచుకోవచ్చు. ఆంగ్లేయులను మనంతట మనం తరిమివెయ్యలేము. తరిమి వేయుటకు సిద్ధంగావున్న జపానువాళ్ళకు మనం సహాయం చెయ్యాలి; చెయ్యలేకపోతే కనీసం అడ్డుపడకూడదు. అలా అడ్డంవచ్చే కమ్యూనిస్టులు దేశద్రోహులు అని మధ్యతరగతి దేశభక్తుల మనోభావం. ఈ మనోభావమే బీదప్రజానీకానికికూడ ప్రాకిపోయింది.

ఇలాంటి వాతావరణంలో జపాను ఫాసిజాన్ని గురించి ఆలోచించేవారే లేరు. చైనాకు పట్టిన గతిని జ్ఞాపకం చేసుకొనే వారే లేరు; గాంధీ, నెహ్రూల అభిప్రాయాలను ఆలకించేవారే లేరు. కమ్యూనిస్టులని స్పష్టంగా తెలిస్తే తన్నడానికి కూడా సిద్ధంగా ఉన్నారు.

కాంగ్రెసు రైతునాయకుని కలలు!

విడుదలకు ముందు జపానువారు సింగపూరును సమీపించే కాలంలో ఒక ఆంధ్ర కాంగ్రెసు రైతునాయకుడు ఇలాగన్నాడు:

"జపానువారు ఆంధ్రదేశంలో ప్రవేశించితే, మన కిసానులు ఎలా ప్రవర్తించాలో, రక్షించాలో మనం బోధించాలా? వారు రామాయణాలు, మహాభారతాలు చదివి ఆరితేరారు. సమయస్ఫూర్తిగా ప్రవర్తించగలరు. మన రైతు లున్నారే, మంచి లోక పరిజ్ఞానం కలవారు. జపానువారు ఇంగ్లీషువారిలాంటివారు కాదు. మనఅన్నం తింటారు! అన్నంలో పెరుగూ, ఆవకాయ వేసి పెడితే జపాను వాళ్లు మన భాయి భాయీ లవుతారు! కావాలంటే చేపలుకూడా లభించుతాయి! జపానువారికి చేపలంటే మహా యిష్టం. ఆంధ్ర రైతులు గట్టివాళ్లు; మన మేమీ భయపడనక్కరలేదు, వారు నాయకులకు కూడా నేర్పగలరు! వారి లోకజ్ఞానానికి వదలి పెట్టడం మంచి"దని గుక్క తిప్పకుండా ఉత్సాహంతో మాట్లాడి ఎంతో ఆనందంతో నవ్వారు. దేశభక్తిలో ఎన్ని రకాలున్నాయి! స్వరాజ్య సమస్యను గూర్చి మాట్లాడేవారే లేరు. జపాను మన దేశాన్ని ఆక్రమించుకొన్న తరువాత, మనగతి ఏమవుతుందా అని ఆలోచనే లేదు.

"ఆగస్టు 9 తేదీ విప్లవం"తో కమ్యూనిస్టులు "రష్యా భక్తు"లనీ, "మాస్కో డబ్బు తింటున్నా"రనీ అనడమే కాదు. "దేశద్రోహులు" అనే ముద్ర పడిపోయింది. అయితే కమ్యూనిస్టులు ఊరికే వుండలేదు. కరపత్రాలను పంచిపెట్టాము; చిన్న చిన్న పుస్తకాలను, వార్తాపత్రికలను అమ్మాము. అక్కడక్కడ తిట్లు తిన్నాము. కొందరికి దెబ్బలుకూడ పడ్డాయి. నోరు తెరచి గట్టిగా వాదించడం సాధ్యంకాలేదు.

## కమ్యూనిస్టు వ్యతిరేకత

జపానుతో యుద్ధం చేయడానికి సిద్ధపడినా కమ్యూనిస్టు

లను బ్రిటిష్ గవర్నమెంటు నమ్మలేదు. కమ్యూనిస్టులను సైన్యం లోగాని, వైమానిక దళంలోగాని, నేవీలోగాని చేర్చుకోలేదు. "కమ్యూనిస్టు లెవరో మాకు తెలుసు: ఫాసిజాన్ని, ఇంపీరియలిజాన్ని, రెంటినీ నాశనం చేస్తారు. సైన్యంలో చేర్తారు, బోధ చేసి, సైన్యాన్ని తమవైపుకు మార్చుకుంటారు. ఇవాళ జపానును ఓడిస్తారు; రేపు ఆ తుపాకులతోనే బ్రిటిష్‌వాళ్ళను కాల్చేస్తారు. వారిని నమ్మకూడదు: జపానువాళ్ళకు చేతనయితే మమ్మలను తరిమివెయ్యమను. చేతనయితే ఇండియాను పాలించుకోమను. మేము మాత్రం కమ్యూనిస్టులను, కాంగ్రెసువారిని నమ్మము: తుపాకులను వారి చేతుల్లో పెట్ట"మని ఆంగ్లేయులు వాదించేవారు.

వాస్తవమే; కమ్యూనిష్టు కత్తికి రెండువైపులా పదునే: ఆంగ్ల సామ్రాజ్యవాదులు దేశంలోని వివిధ రాజకీయ శక్తులను, రాజకీయ వాతావరణాన్ని అర్ధం చేసుకొన్నారు. మా విషయంలో జాగ్రత్త పడుతూ వచ్చారు. కాని, మమ్మలను కాంగ్రెసు నాయకులు మాత్రం అర్థం చేసుకోలేదు. కమ్యూనిష్టులను దేశద్రోహులనే భావించారు.

యుద్ధకాలంలో ప్రతి దేశంలోను కమ్యూనిష్టులు దేశభక్తులుగా ప్రవర్తించారని అన్ని పార్టీలవారు అన్ని దేశాల్లోను ఒప్పుకున్నారు. జపానుతో పోట్లాడుటకు ఆయుధాల నివ్వమని కమ్యూనిస్టులు కోరినప్పుడు ఇంగ్లీషువారు యివ్వలేదు. జపానువారు ఆక్రమించుకొన్న ప్రదేశాలలో వారితో పోట్లాడుటకు మాత్రమే ఆయుధాల నిస్తామన్నారు; ఆయుధాలను దాచిపెట్టిన

రహస్య స్థలాలను అప్పుడుమాత్రమే చెప్పుతా మన్నారు ఇంగ్లీషు ప్రభుత్వంవారు.

ఏమి వాతావరణం! రెండు పార్టీలవారికీ కమ్యూనిస్టుల సహాయం కావాలి. కాని, ఒకరూ కమ్యూనిస్టుల షరతులను ఒప్పుకోరు. స్వరాజ్య స్థాపనకు వుపయోగపడని ఆలోచనలతో ఏం ప్రయోజనం?

కాంగ్రెసు, సోషలిస్టు, ఫార్వర్డుబ్లాకు, కమ్యూనిస్టుల పంథాలు వేరువేరుగా వుంటూవచ్చాయి; అయితే, అందరి ఉద్దేశ్యము ఒకటే- సంపూర్ణ స్వరాజ్యం. ఏ పార్టీకాని మరొకపార్టీకి నచ్చచెప్పలేకపోయింది, కమ్యూనిస్టుల పంథా మిగిలిన పార్టీలవారికి అయోమయంగా వుంది. అందరూ దేశభక్తులే! అందరికీ శత్రువులు బ్రిటిష్ సామ్రాజ్యవాదులే. అందరూ కలసి శత్రువు నెదిరించ కూడదా? అంత దూరదృష్టి, అంత విశాల దృష్టి లేవు. దేశభక్తులు తమ మనోరథాన్ని యీడేర్చుకొనుటకు వున్న చక్కని అవకాశాన్ని కాల్దన్నుతూ వచ్చారు.

1942 ఆగష్టు ఎనిమిదవ తేదీని చేయబడిన కాంగ్రెసు తీర్మానంతో ప్రజలలో గందరగోళం, అయోమయం ఏర్పడింది. శ్రీ ఖాసా సుబ్బారావుగారు సంశయించినట్లు కమ్యూనిస్టులు తెల్ల దొరలకు యే మాటా యివ్వలేదు. ఆగ్లేయులు తలచినరీతిగా కమ్యూనిస్టులసహాయం లభించలేదు. మన దేశభక్తి భావాలు సంకుచితంగా ఉన్నందువల్ల మనసోదరులే మనకు శత్రువులయ్యారు. లక్షలకొలది భారతీయులు ఆహుతి అయ్యారు. మన రాజకీయోద్యమాలఅపరిపక్వత తెల్లదొరలకు అదృష్టంగా పరిణమించింది.

## అతిక్లిష్ట సమస్యలు

1942లో విడుదలయి బయటవున్న మూడునాలుగు సంవత్సరాలలో జాతీయ సమస్యా పరంపరకు అంతంలేదు. వాటిలో కొన్ని చాల క్లిష్టమైనవి. వాటిని అర్థంచేసుకోవడం కష్టంగా వుండేది. సామాన్యపరిజ్ఞానంతోను, సామాన్యదృష్టితోను పరిష్కరించడానికి అసాధ్యంగా వుండేవి. కాని, కొన్ని ముఖ్యసమస్యలను సూటిగా అర్థంచేసుకోవడం సులభమే; అయినా, అన్యవిషయాలతో కలిపినందువల్ల సూటిగా అర్థంచేసుకోలేకపోయాము. నా వుద్దేశ్యంలో ప్రజలు అర్థంచేసుకోజాలని సమస్యలు ఇవి:-

1. జపాను, జర్మనీల ఫాసిజమే జయించితే ఇండియాకు స్వాతంత్ర్యం వస్తుందా?

2. రష్యా, అమెరికాలు జయిస్తే బ్రిటను జయించినట్లేకదా? ఆ జయంతో బ్రిటను యింకా బలపడుతుందికదా! అప్పుడు మన స్వాతంత్ర్యోద్యమానికి భంగంకలుగదా?

3. కాంగ్రెసు లీగుల ఐక్యత లేకుండా సంపూర్ణస్వరాజ్యం సంపాదించగలమా?

4. సంపూర్ణస్వరాజ్య సంపాదనకు అహింసావ్రతము అడ్డు వస్తుందా? రాదా?

5. పాకిస్తాను ప్రదేశాలలో నివసించే ప్రజలకు వయోజన ఓటింగుహక్కు యిచ్చి, స్వయంనిర్ణయప్రకారం పాకిస్తానును నిర్మించుకోనియ్యవచ్చునా? కూడదా?

6. రాజ్యాంగ నిర్మాణసభ ప్రతినిధులను ఎన్నుకొనుటకు వయోజన వోటింగు అవసరమా లేదా?

7. మతసంస్థ అయిన లీగు కూలినాలి జనానికి చేస్తాననే ఆర్థిక

సౌకర్యాలకన్న, కాంగ్రెసు ఎక్కువగా చేస్తానన్న ఆర్థిక సౌకర్యాలేవి?

ఇలాంటి సమస్యలను పరిష్కరించుకోజాలక ప్రజలు చాల తికమకలుపడుతూవచ్చారు. నాకుకూడా తలనొప్పి కలుగుతూండేది. కమ్యూనిష్టుల పరిష్కార పథకం అర్థమవుతున్నది; కాని, నేను ప్రజలను, స్నేహితులనూ ఒప్పించలేకపోయాను.

అయితే మరోరకం ప్రశ్నలను సూటిగా అర్థంచేసుకోవచ్చు; అప్పట్లో ఆ వాతావరణంలో సూటి అనే మాటే లేదు. ఎచ్చట చూచినా పక్షపాతమే; కొన్నిసమస్యలను ఉదహరిస్తాను.

1. బెంగాలులో క్షామంవల్ల చచ్చిపోతున్న లక్షలజనానికి సహాయంచేస్తే స్వరాజ్యం రాదనే విద్యాధికులు చాలామంది వున్నారు; వస్తుందనేవారే చాల తక్కువమంది.

(2) బియ్యం, కట్టెలు. కిరసనాయిల్ జనసామాన్యానికి లభించేందుకు రేషనింగు పెట్టవలసిందని ప్రయత్నించడంవల్ల స్వరాజ్యం రాదనీ, ఆ ప్రయత్నం దేశద్రోహకరమనీ వాదించిన దేశభక్తుల సంఖ్య ఎక్కువ; అలా కాదనే బీదప్రజల సంఖ్య అధికం.

(3) కంట్రోళ్లు అధికం చెయ్యడం ప్రజాసామాన్యానికి అనుకూలమా? ప్రతికూలమా? అనే విషయాన్ని దేశభక్తులు తమతమ వర్గ దృక్పథాల్లో అర్థం చేసుకోగలిగారే గాని అందరం మానవుల మనే భావం లేకపోయింది.

(4) బియ్యం, బట్టలు, నూలు దొంగమార్కెట్టులో అమ్మే దోపిడిగాండ్రను దేశభక్తులనీ, వారిని శిక్షించ కూడదనీ వాదించిన దేశభక్తులు, నాయకులు ఎందరో ఉన్నారు.

(5) జీవితావసర వస్తువుల వెలలు ఎంత పెరుగుతున్నవో ఆ దామాషా ప్రకారం కూలి అధికం చెయ్యాలని వాదించడమే దేశద్రోహమని ఎందరో భావించారు.

(6) చౌకగా మిల్లు గుడ్డలనైనా కొనలేని బీదప్రజలు ఖద్దరు కొనజాలరనీ, మిల్లుల నెక్కువగా స్థాపించి బట్టలవుత్పత్తి నెక్కువ చెయ్యవలసిందనే వాదన దేశద్రోహమా ?

పైన వ్రాసిన సమస్యలన్నిటి విషయంలోను కమ్యూనిస్టుల పరిష్కార పథకమే నాకు నచ్చినందున యథాశక్తిని బీద ప్రజలసేవ చేశాను.

ఆకాలంలో స్వయం నిర్ణయ సూత్రాన్ని గాంధీగారు ఒప్పుకున్నా కాంగ్రెసు ప్రజానీకం ఒప్పుకునేట్టు లేదు. వారు హిందూ మహాసభాసభ్యులవలె వాదించారు "ముసల్మానులు దేశభక్తులు కారు. వారు పదికోట్లు అయితే, మనం ముప్పయికోట్లు. వారికి బుద్ధివచ్చి దాసోహం అనేలా చెయ్యాలి" అనేవారు.

ఎలా వారితో యుద్ధం చెయ్యడం? బ్రిటిష్‌వారి 'విభజించి పాలించా'లనే విధానం బలపడదా? చివరకు బ్రిటిష్‌వారు మాత్రమే బాగుపడుతారుకదా! అనే యోచనే మనసుకు తోచడం లేదు. కొందరు అమాయకులు ఇద్దరితోను పోట్లాడుదామనేవారు.

గాంధీగారి నిరశనవ్రతకాలంలో మహమ్మదీయులలో ప్రచారం చేశాను. గాంధీగారు జీవించాలని ముసల్మానులలో ఎంతో ప్రేమ, గౌరవాలు వున్నాయి. "పాకిస్తాను కోరికలను గాంధీగారు సమ్మతించితే ఎంత బాగుండును? హిందువులతో కలసి అంగ్రేజీలను నాశనంచెయ్యమా!" అన్నారు కొందరు. "హిందువుల మీద రాజ్యం చెయ్యాలని మేము కోరడంలేదే!

మామీద రాజ్యం చేయ్యాలని హిందువులు కోరడం అన్యాయం కాదా?" అని ప్రశ్నించారు మరికొందరు ముసల్మానులు.

స్వయంనిర్ణయసూత్రం మంచిదని నేను వాదించేవాణ్ని. నా స్నేహితురాలు సోదరి శివభోగం "చెంచయ్యా! ముస్లిం లీగులో ఎప్పుడు చేరావు?" అని హేళనచేసింది. శాస్త్రి అండ్ షా కంపెనీలోని శాస్త్రిగారు ఇంకా తీవ్రంగా ఖండించారు. ఇలాంటి ప్రచారం దేశాన్ని నాశనంచేస్తుంది; మాస్కోనుండి డబ్బువస్తుం దంటారే, నిజంకాదంటరా?" అని హేళనకు దిగారు.

క్షా మం తో స్వ రా జ్యం

కొందరు ధనాఢ్యులూ, దొంగమార్కెట్‌దారులూ బెంగాలులో ఒక క్షామాన్ని కల్పించి, 35 లక్షలమంది ప్రజలను చంపారు. అలా నిత్యమూ ప్రజలు చచ్చిపోయేరోజుల్లో కొందరు దేశభక్తులు సూటిగా ఆలోచించుటకుబదులు యిలాగన్నారు- "40 కోట్ల ప్రజలున్నారు. అందులో కొందరు చస్తేనేమి? ఆవిధంగానైనా ప్రజలుకోపంతో రెచ్చిపోతారు.; లూటీలు చేస్తారు; పోలీసు స్టేషన్లను తగులబెడతారు. ఈ విధంగా స్వరాజ్యంవస్తుంది! త్యాగం చేయకుండా, ప్రజలు చావకుండా స్వరాజ్యంవస్తుందా?" అని దేశభక్తిని పెడత్రోవ పట్టించారు.

మరికొందరు మహానుభావులమనుకొనేవారు "విత్తనం నాటితే నేలలో కుళ్ళిపోయినతరువాతనే మొక్కగా పెరుగుతుంది. అలాగే సంఘంలో వచ్చే కల్లోలాతో, క్షామాలతో దేశానికి స్వరాజ్యం ప్రాప్తిస్తుం"దని విశదీకరించారు. ఇదీ వారి దేశభక్తి!

ప్రజలు చస్తేనా స్వరాజ్యంవచ్చేది? లేకసామ్రాజ్యవాదులునశించితేనా? ప్రజలు క్షామాలతో చస్తే స్వరాజ్యం రాదు! స్వాతంత్ర్యోద్య

మాన్ని నిర్మాణయుక్తంగా త్యాగంతో సాగిస్తే స్వరాజ్యం వస్తుంది. ఆ రోజులలో గ్రుడ్డిద్వేషం ఎంత పెరిగిపోయింది! యుద్ధకాలంలో ఎందరో రాక్షసులవుతారు! తత్ఫలితమే మనం (1947-48-49సం. లలో) అనుభవించాము. రాక్షసత్వమనే విత్తనం నాటాము! ఇక రామరాజ్యం యెలా వస్తుంది?

కట్టెలు, కిరసనాయిలు, బియ్యం లభించక బీద ప్రజలు నానా బాధలు పడుతున్నారు. రేషనింగు వుంటేనే లభించడం, లేకపోతే లభించవని మధ్యతరగతివారు కూడ అనుభవంమీద తెలుసుకొన్నారు. అయితే రేషనింగు కోసం ప్రయత్నించినది కమ్యూనిస్టులు మాత్రమే. ఊరేగింపులతో, సభలద్వారా ప్రచారం చేసి, ప్రభుత్వంపైని ఒత్తిడి తెచ్చారు. కార్మిక సంఘాలు బాగా పనిచేశాయి. చివరకు మద్రాసు కార్పొరేషన్ హాలులో గొప్ప సభజరిగింది. కాంగ్రెసునాయకుల తరఫున మాట్లాడుతూ శ్రీ చంగల్వరాయన్ రేషనింగు అవసరం లేదని వాదించారు. మేయరు శ్రీ తాండులింగం పిళ్ళెగారు భాగ్యవంతులు అలవాటుపడిన మంచిరకం బియ్యం రేషనింగుమూలంగా లభించవు; కాబట్టి రేషనింగు పనికిరాదన్నారు. చివరకు పరప్రభుత్వమే రేషనింగు పెట్టి బీదల, మధ్యతరగతివారల కష్టాలు తొలిగించుటకు కొంతైనా ప్రయత్నించారు.

ఫార్వర్డుబ్లాకువారూ, సోషలిస్టులూ మరో విధంగా వాదించారు. "కట్టెల రేషనింగు కావాలట! ప్రజలు స్వరాజ్యం కావాలనే రోజుల్లో ఈ కమ్యూనిస్టు దేశద్రోహులు చిల్లర విషయాలతో దృష్టిని మరల్చుతున్నారు. మాస్కో-డబ్బు మన దేశాన్ని నాశనం చేస్తున్న"దంటూ సభలలో తిడుతూండేవారు.

అయితే, ఒకవిషయం నాకు బోధపడలేదు. ప్రజలకు కడుపునిండా తిండి, ఒంటినిండా బట్ట వుంటే స్వరాజ్యం కొరకు ప్రయత్నించరనీ, అది లేక ఈసురోమని ప్రజలు మలమల మాడి పోతూంటేనే స్వరాజ్యంకోసం పోరాడుతారనీ అనడం అవివేకం గాక మరేమిటి? ఫ్రెంచి విప్లవానికి ముందు రైతులకు కొద్దిగా భూములు లభించాయి. ఈ అనుభవమే పూర్తిగా భూములను భూస్వాములనుండి సంపాదించుకోవాలనే కోరికను పుట్టించింది. ఫ్రెంచి రైతులు తిరుగబడి భూములను పూర్తిగా లాక్కొనే వరకు విప్లవం ఆగలేదు.

ఎందుకు మారాను?

దయాదాక్షిణ్యాలు గలవారు పరోపకారం చేస్తారు. ఈ ఉపకారం సంఘసేవగాను, దేశసేవగాను, మానవసేవ రూపాల్లో ఉంటుంది. వాస్తవమైన మతభక్తులు కూడా స్కూళ్లు, ఆసుపత్రులు, అనాధ శరణాలయాలు స్థాపించి సేవ చేస్తూవుంటారు. ఇలాంటి భూతదయ కొంచెమో గొప్పో నాలో ఉండడంవల్లనే మానవ కళ్యాణం కొరకు ఏర్పడిన ఉద్యమాలలో పనిచేస్తూ వచ్చాను.

"కమ్యూనిస్టువు ఎలాగయ్యా"వని ఎందరో స్నేహితులు అడుగుతూంటారు. వారందరికి నన్నుగురించి కొన్ని విషయాలు బాగా తెలుసు. హింసాసిద్ధాంతం నాకు యిష్టం లేదనీ, దేశభక్తి కలవాడననీ, త్యాగం చెయ్యగలననీ కమ్యూనిస్టులు కాని నా స్నేహితులకు తెలుసు.

నేను కమ్యూనిస్టును కావడానికి ముఖ్యకారణం స్త్రీల కష్టాలను తొలగించడానికి ప్రయత్నాలు చేసి, చేసి పూర్తిగా

సాధించలేక పోవడంవల్ల కలిగిన అసంతృప్తి; స్త్రీల కష్టాలు ఒక్క సోషలిస్టు రష్యాలో మాత్రమే నశించాయన్న సత్యమే నన్ను కమ్యూనిజంవైపుకు తిప్పింది. 1940—42 సంవత్స రాలలో జైలులో ఉన్న రెండు సంవత్సరాల్లో కమ్యూనిస్టు సిద్ధాం తాలను చదివాను. ఆ సిద్ధాంతాలను చదువుటద్వారా సంఘ నిర్మా ణము ఆర్థిక నిర్మాణముపై ఆధారపడి వుంటుందనీ, ఆర్థిక నిర్మా ణము మారాలంటే వర్గ పోరాటం అవసరమనీ గ్రహించాను. కాని, ఈ సిద్ధాంతం జీర్ణంకాలేదు.

సిద్ధాంత గ్రంథాలద్వారా మరికొన్ని వివరాలను తెలుసు కున్నాను. అవి ఏవనగా:- సంఘంలో ఆర్థిక పరిస్థితులు మారుట వలన రాజకీయంగాను, సాంఘికంగాను మార్పులు కలుగుతూం టాయనీ, వర్గ పోరాటాలు ప్రతి సంఘంలో సర్వదా ఉన్నవనీ చదివాను. రెండు వర్గాలకు స్వప్రయోజనాలు వేర్వేరుగా వుం టాయి. ఈ రెండువర్గాల మధ్య పోరాటం జరిగినప్పుడు రెం డింటి పక్షమూ వహించి రెండింటికీ సహాయం చెయ్యజాలము; ఏ వర్గానికి చెందియుంటామో ఆ వర్గానికి మాత్రమే సహాయం చేస్తాము; జమీందార్లకూ రైతులకూ పోరాటం వచ్చినప్పుడు, మిల్లు యజమానులకు కూలీలకు పోరాటం జరిగినప్పుడూ ఎవరో ఒకరి పక్షమే వహించగలమని చదివియుంటిని.

1942—46 సంవత్సరాలలో కార్మిక సంఘాల్లో పని చేయుటకు అవకాశం లభించింది. ఆ విధంగా పై సిద్ధాంతాలను పరీక్షించుటకు కూడా అవకాశం ఏర్పడింది. నేను పనిచేసిన సం ఘాలలో కార్మికులు, వారి యజమానులు కాంగ్రెసు భక్తులే! బీడీ పరిశ్రమలో మాత్రం ఇద్దరూ లీగు భక్తులే: 1936—39 సం॥

లలో ప్రభుత్వం కూడా కాంగ్రెసు భక్తులదే. ఇందువల్ల కమ్యూనిస్టుల వర్గ పోరాట సిద్ధాంతంలో లోపముండివుంటుందని సంశయించుతుండేవాడిని.

1942లో విడుదలయినతరువాత మద్రాసు కో క్రింది కార్మిక సంఘాలలో పనిచేశాను.

1. బీడీ పరిశ్రమ; 10వేల కార్మికులు.
2. చుట్టల పరిశ్రమ; 250మంది కార్మికులు
3. కార్పొరేషను (మునిసిపల్) 10వేల కార్మికులు

ఈ పరిశ్రమల యజమానులు, కార్మికులూకూడ కాంగ్రెసువారు; లేదా లీగుభక్తులు; 10,000 కార్మికులలో కమ్యూనిస్టు ఒక్కరూ లేరు. పై సంఘాల సమ్మెల సందర్భంలో కాంగ్రెసు కౌన్సిలర్లను కలుసుకొని వారి సహాయం తీసుకొంటూవచ్చాను. నాకు కలిగిన అనుభవాలను క్లుప్తంగా వ్రాస్తాను.

పేద బీడీ కార్మికులు

మద్రాసులో వీరికుటుంబాలు పదివేలుంటాయి. అనగా సుమారు 50,000 జనసంఖ్య. ఈ పరిశ్రమ ఫ్యాక్టరీలలో నడవదు. ముఖ్యంగా గుడిశెలలోనే చేస్తారు. అందువల్ల కుటుంబములోని వారందరు-భార్య, బిడ్డలుసహా దామాషాను ఇంటికి యే ఐదుగురో పనిచేస్తారు; 12 గంటలుకూడా పనిచేస్తూనే వుంటారు. అయినప్పటికీ, రైళ్ళలో, ట్రాముల్లో, మిల్లులలో ఒక కార్మికుడు ఎనిమిది గంటలు పనిచేసి సంపాదించినంత కూలి డబ్బులు పై ఐదుగురికి కలసి లభించదు. ఇందువల్ల మద్రాసులో కూలీలకు కుటీర పరిశ్రమలంటే యిష్టంలేదు. ఫ్యాక్టరీఆక్టు బీడీ పరిశ్రమకు అన్వయింపచెయ్యాలని నేను చేసిన ప్రయత్నాలు

విఫలమైనాయి; అందుకు యజమానులు కాని, ప్రభుత్వంకాని సమ్మ తించలేదు. మద్రాసులో కార్మికులకంటే దరిద్రులు మరొకరుండరు. వారు సాధారణంగా గుడిసెలలో కాపురం చేస్తారు. పల్లపుప్రదేశాల్లో ఇళ్లుకట్టుకుంటారు; అద్దెకూడా నామమాత్రమే. వర్షాకాలంలో గుడిశెచుట్టు నీరు నిలుస్తుంది. గుడిసెలకు రోడ్లువుండవు; దీపాలు కాని, నీటి కొళ్ళాయిలు కాని తగినన్ని వుండవు. మరుగుదొడ్లు కూడా అరుదే. ఎక్కడ చూచినా పెంటలే. పందులు మాత్రమే పాకీపని చేస్తుంటాయి; గుడిశెలచుట్టూ రొచ్చు, మురుగూను.

ఈ కూలీలు సాధారణంగా తురకలు. స్త్రీలకు ఘోషా వుంటుంది. 1943సంవత్సరం ఆఖరులో వరదలు వచ్చినయి. వారుండే గుడిశెలు కూలిపోయాయి. స్త్రీలు, పిల్లలు. పురుషులు వీధుల్లోకి వచ్చారు. కుటుంబంలో ఇద్దరు స్త్రీలుంటే వున్నది సరియైనచీర ఒక్కటే. వీధులపాలైనప్పుడు స్త్రీలందరికీ మానం కాపాడుకోటానికి చీరలు లేవు. అప్పుడు పురుషులు సిగ్గుపడి తమ స్త్రీలమానం కాపాడాలనే ఉద్దేశ్యంతో చాలమంది సైన్యంలో చేరిపోయారు. బీడీ కార్మికులగతి అలాగున్నది.

అయితే వారి యజమానుల స్థితి యెలావుంది? ఈ 10 వేల కుటుంబాలచేత బీడీలు చేయించే కంపెనీ యజమానులు షుమారు ఎనిమిదిమంది వుంటారు. ఒక్కొక్కరికి సంవత్సరానికి యాభై వేలనుంచి మూడులక్షలదాకా ఆదాయం వస్తుంది. వారూ ముసల్మానులే. కార్మికులూ, యజమానులూ కూడా లీగుభక్తులే. తమకు లభించే లక్షల ఆదాయాన్ని ఏ ఫకీర్లకో, ఏ బిచ్చగాళ్ళకో,

ఏ రాజకీయనాయకులకో యిస్తారు; కాని, తమ పనివాండ్రస్త్రీల మానాన్ని కాపాడుటకైనా వస్త్రదానం చెయ్యరు.

బీడీ కార్మికుల సంఘాన్ని కమ్యూనిష్టులము పెట్టాము. వేలమంది చేరారు. కూలి నెక్కువ చేయించాము. కాని, ఆహార వస్తువుల వెలలు పెరిగినంతగా కూలి నెక్కువ చేయించలేక పోయాము.

వీరిలో ఐకమత్యంవుంటే కూలి నెక్కువ చేయించవచ్చు. కాని, ఐకమత్యంలేదు. అందువల్ల వారిలో కొందరిని ఏరి తరిఫీదు చెయ్యాలి. పదివేలమంది కార్మికసంఘంలో బయటివాళ్ళం ఏ యిద్దరు కమ్యూనిస్టులమో సహాయ మేం చెయ్యగలము? కార్మికులలో బాగా చైతన్యంగలవారికి క్లాసులుపెట్టి, తరిఫీదునిచ్చి తమ యూనియనును తామే నిర్వహించుకొనేలాగు చెయ్యాలి. కాని, ఎప్పుడు నేర్చాలి చదువు? 12 గంటలూ పనిచేస్తారు. పగలు వారికి తీరికే వుండదు. రాత్రి 9 గంటలకైతే క్లాసుకు రాగలరు; కాని, అప్పటికి అలసిపోయి ఉంటారు. క్లాసులోనే నిద్రపోతారు. కాబట్టి ప్రయత్నాలు చేసినా వృద్ధికి తేజాలకపోయాము.

అయితే యిలాంటి దిక్కులేని బీదకార్మికులు సమ్మెలకు తయారుగాఉంటారు. కాని, కొన్ని రోజులైనా సమ్మె జరగనిది కూలి పెంచేందుకు యజమానులు సమ్మతించరు.

సమ్మెలు జరిగినప్పుడు లీగు నాయకులు సహాయం చేస్తామని కూలీలను ఒప్పించి, చివరకు యజమానులకే సహాయం చేస్తూండేవారు. యజమానులు న్యాయానికి ప్రయత్నించకుండా పోలీసుల లాఠీల మీద ఆధారపడుచుండిరి. అందుచే కార్మికులు ఓడి పోతూండేవారు.

కార్పొరేషన్ ఎలెక్షన్లలో ఎంతరో అభ్యర్థులు నీళ్ళ కొళాయిలు పెట్టిస్తామని, లైట్లు వేయిస్తామని, రోడ్లు వేయిస్తామని, మరుగుదొడ్లు కట్టిస్తామని, మెరక భూముల్లో గుడిసెలు కట్టుకోటానికి వసతు లేర్పరుస్తామని బీడీ కార్మికులకు ఎన్నెన్నో ఆశలు చూపుతుంటారు. నే నా బీడీ కార్మికుల సంఘంలో పనిచేసిన రెండు మూడు సంవత్సరాలకాలంలో లీగు కౌన్సిలర్ల యిండ్లకు, కాంగ్రెసు కౌన్సిలర్ల యిండ్లకు తిరిగి తిరిగి వేసారి, కార్మికుల కేమీ అనుకూలాలు చేయించలేక పోతిని. ఇక నా ధర్మాన్ని నెర వేర్చుకోవాలి? ఎలాగు?

ఈ అనుభవంవల్ల వర్గ పోరాటమున్నదని నాకు తెలిసి పోయింది. ఇక బీడీ కార్మికులకు సహాయం చేయాలంటే ఒకే మార్గమున్నది. వర్గ పోరాటాన్ని గురించి బోధించడం, ప్రస్తుత దోపిడీ సంఘాన్ని నాశనం చేయించి, నూతన సంఘం అనగా వర్గ రహితమైన సోషలిస్టు సమాజాన్ని నిర్మించేలాగు తర్ఫీదు చెయ్యాలి. అనగా ఒక విప్లవం తేవాలి; దీనికి నేను తయారుగా లేను. అందువల్ల బీడీ కార్మికుల సంఘంలో పనిచేయుట మాని వేసితిని.

నాకంటె బాగా రాజకీయ చైతన్యాన్ని అభివృద్ధికి తేగల శక్తివంతులు నా స్థానంలోకి వచ్చారు. సమ్మెలు జరిగిన కాలంలో లీగునాయకులు, కాంగ్రెసు నాయకులు మానుండి విడదీయుటకు చాలా చమత్కారం చూపించి "కమ్యూనిష్టులు రష్యా భక్తులు; మాస్కోడబ్బు తింటున్నా"రని బోధించి మమ్మల్ని ఓడించుటకు ప్రయత్నించుచుండిరి. ఇప్పుడు అయిదారు సంవత్సరాల తరువాత అలాంటి ప్రచారంఉపయోగపడడంలేదు. కార్మికులలో చైతన్యం

ప్రబలిపోయింది. చివరకు బీడీ కార్మికులు సభలు జరుపుకొనుటకు అనుమతి లభించడమే కష్టమైపోయింది.

బీడీ పరిశ్రమ గుడిసెలలో జరిగేటంతవరకు బీడీ కార్మికులు బాగుపడజాలరు. దేశభక్తులు ఎంత త్వరగా యంత్రాలతో ఫ్యాక్టరీలలో ఈ పరిశ్రమను చేయిస్తారో అంత త్వరగా బీద కూలీలు బాగుపడుటే గాక, వస్తూత్పత్తికూడ అధికమవుతుంది. ఎక్కువగా కూలి యిచ్చినా ఎక్కువ లాభాలు కూడా వుంటాయి.

చుట్టల కార్మికులు

ఈ కార్మికులు మద్రాసులో షుమారు 250 మందివుంటారు. వీరందరు అయిదారు ఫ్యాక్టరీలలో పనిచేస్తారు. వారి సంఘానికి నేను అధ్యక్షుడుగా ఉన్న మూడునాలుగుసంవత్సరాలలో ముఖ్యంగా నేను కూలీలకు ఫ్యాక్టరీలలో మరుగుదొడ్లు పెట్టించడానికి, తరువాత పాకీదొడ్లల్లో నీరు వుండేట్లు చెయ్యడానికి, అటుతరువాత ఫ్యాక్టరీలలో త్రాగడానికి నీరు సప్లయి అయ్యేలా చెయ్యడానికి మాత్రమే ప్రయత్నించినా నేను ఆ పనులుకూడ చేయించలేక పోతిని.

ఈ పరిశ్రమను ఫ్యాక్టరీలలో చేస్తున్నారు; కాని, ఫ్యాక్టరీఆక్టు అన్వయించదు. ఈ ఫ్యాక్టరీలు కొత్వాలుచావిడికి సమీపంలో వున్నాయి. కార్మికులు పబ్లిక్ పాకీదొడ్లకు పోయి రావాలి. బ్రాడ్వేలోను, స్క్వయిరుపార్కులోను అన్నం తిని, కొత్వాలు చావిడిలో చేతులు కడుక్కోవాలి. యజమానులు చదువురానివారైనందునను, ఒకప్పుడు గుమాస్తాలుగా పనిచేసినందునను 1942-44 సంవత్సరాలలో లేబరు కమీషనరును చూడగానే భయపడి

లేచి చేతులుకట్టుకొని కొంతవరకు సౌకర్యాలు కల్గించుచుండిరి. ధరల పెరుగుదలతో ఈ వ్యాపారస్తులు వేలూ, లక్షలూ లాభాలు గడించారు. అప్పటినుండి వారి దృక్పథం మారిపోయింది. లేబరు కమీషనరు రమ్మంటే వకీలును వెంటపెట్టుకు వెళ్ళేవారు; ఆ వకీళ్లు తమ ఫీజు సంపాదించుకొనుటలో సమర్థులు. లేబరుకమీషనరును దబాయించేవారు. "ఏ ఆక్టుప్రకారం ఈ యజమానిని రమ్మని ఆజ్ఞాపించావు? ఏ చట్టంలో పాకీదొడ్లు కట్టించాలని ఉన్నది? ఫ్యాక్టరీఆక్టు ఈ పరిశ్రమకు అన్వయించనప్పుడు, యీ కుటీరపరిశ్రమలమీద మీకు ఏ అధికారమూ లేదని తెలుసుకోండి! కూలి పెంచనవసరంలేదు. ఫ్యాక్టరీ మూసివేస్తాము!" అని వాదించేవారు.

ఒక లేబరుకమీషనరు ఏమిచేయటానికి తోచక హెల్త్ ఆఫీసరుకు రహస్యంగా చెప్పుకొన్నాడు. మరొకరు యజమాని అన్యాయంచేస్తున్నాడని పోలీసుఆఫీసరుకు టెలిఫోనుచేసి, సహాయమర్థించాడు. ఈవిధంగా ఫ్యాక్టరీపరిశ్రమే అయినా చుట్టలకార్మికులకు ఫ్యాక్టరీఆక్టును అన్వయింప జేయడానికి నేను చేసిన ప్రయత్నాలన్నీ వృథా అయినాయి.

తిరుచునాపల్లి, వెల్లూరు పట్టణాలలో యిస్తున్నంత కూలి యిప్పించండని ఎందరో నాయకులను, మంత్రులను, లేబరుకమీషనర్లను అడిగాను. తమకు అధికారం లేదని, సెంట్రల్ గవర్నమెంటు చెయ్యాల్సినపని అని చెప్పుతూ వచ్చారు. మద్రాసులో సమ్మె జరిగినప్పుడు ఏ తిరుచునాపల్లినుండో వేలూరునుంచో చుట్టలు తెప్పించి వ్యాపారం సాగించి యజమానులు సమ్మెలను ఓడించారు. అందువల్ల మానేశాము. చుట్టలకార్మికులు దేశభక్తులు

గాంధీభక్తులు, కాంగ్రెసుభక్తులు; యజమానులు కూడా అలాంటి వారే. తియ్యటి మాటలతో ఏ స్వల్పంగానో కూలినెక్కువచేయిం చగలిగాను. కాని, కార్మికులకు నామీద నమ్మకం పోయింది; నన్ను తొలగించి ఎక్కువ సమర్థులైనవారిని నియమించు కొన్నారు. ఇప్పటికీ ఆర్థికంగా చుట్టలకూలీలు బాగు పడలేదు; గాని, వారిలో రాజకీయచైతన్యం అభివృద్ధిచెందింది. సోషలిజము స్థాపించాలంటారు; కాంగ్రెసుప్రభుత్వం కూలీలకు సహాయం చెయ్యదంటారు. పోలీసుబాధలు చాలా హెచ్చిన వంటారు. చివరకు అక్షరాస్యులు కానివారు కూడ డెటిన్యూలుగాను, శిక్షితు లుగాను జైళ్ళలో వుంటున్నారు! కాంగ్రెసు ప్రభుత్వం సులభంగా సహాయం చెయ్యవచ్చు. కూలీలకు పాకీదొడ్లు, నీటి కొళాయిలు, కూలి పెంచటం మొదలైన సదుపాయాలు చేయించి వారిని తృప్తిపరచలేకపోతే ఎవరూ బోధించకుండానే వర్గపోరాటం నేరుకోగలరు; కొత్వాలుచావిడిచుట్టూ ఉండే వేనవేల కార్మికు లకు ఈ చుట్టలకార్మికులే నాయకులు కాగలరు.

ఇప్పుడు అధికారంలో ఉన్నారుగదా! ఈ దిక్కుమాలిన కూలీలకు దేశభక్తులు సహాయం చెయ్యకూడదూ? లాఠీదెబ్బలు, జైళ్ళేనా మనకు శరణ్యం!

స్పెన్సర్ కంపెనీ కార్మికుల సమ్మె

మద్రాసు స్పెన్సరు కంపెనీ కార్మికుల సమ్మె 1946 సం వత్సరంలో జరిగింది. అయిదువందలమందితో ప్రారంభమై, పన్నెండువందలమందికి ప్రాకిపోయింది. పికెటింగు చేసే కార్మి కులను పోలీసులు లాఠీలతో కొడుతున్నారు. కాళ్ళపైన, చేతుల పైన, తలలమీద బాదుతున్నారు. దూరంగా నిలబడి చూచేవారిని

సైతము పోలీసులు కొట్టి తరిమివేస్తున్నారు; లేదా పోలీసు స్టేష నులోకి లాక్కొనివెళ్ళి, పశువులను బాదినట్లు బాదివేస్తున్నారు. స్పెన్సరు కంపెనీ లారీలలో పోలీసులు వెళ్ళి బ్లాకు లెగ్సును* తీసుకొస్తున్నారు; ఈ అన్యాయాలను అరికట్టాలని మద్రాసులోని కార్మిక సంఘాలు ఐక్యంగా తీర్మానించినవి. కార్మిక సంఘాల ప్రతి నిధులను పదిమందితో ఒక డెప్యుటేషనును కార్మిక మంత్రి శ్రీ గిరిగారి వద్దకు పంపారు. ఆ పదిమందిలో నే నొకడిని.

శ్రీ గిరిగారి యింటివద్ద వందలకొలది కార్మికులు గుం పులు గుంపులుగా కూర్చుండి యున్నారు. గిరిగారు డెప్యుటేష నుకు మర్యాదచేసి "వెంటనే పరిష్కార మవుతుంది. ఇక మీరు విచారపడనక్కర్లేదు. కూలీలకు న్యాయం జరగకపోతే నే నెందుకు ఉద్యోగంలో ఉండడం?" అని చెప్పారు.

"గిరిగారూ! మీరు ఎంతో సమర్థులు; ఇన్నిరోజులు కావాలా, న్యాయం చెయ్యాలంటే! మీరు పూనికతో చెయ్యడం లేదు. వృథాగా కాలయాపన జరుగుతోంది" అని నే నన్నాను.

"అవును, లేదు; మీరు చూడండి-యజమానులు తెల్లదొ రలు. వారికి కొంత అవకాశం యిస్తున్నాను. వెంటనే పరిష్కార మవుతుంది" అని చిరునవ్వు నవ్వుతూ "రెండు మూడు రోజు లుండి సంఘ కార్యదర్శిని కోటలో నన్ను కలుసుకోమనండి" అన్నారు గిరిగారు.

* సమ్మె జరుగుతూండగా, దానిని విచ్ఛిన్నం చెయ్యడానికి యజ మానులు తీసుకొచ్చే కొత్తకొత్త కూలీలను "బ్లాక్‌లెగ్స్" అంటారు.

మాలో మేము ఒకరి మొఖాలు వొకరు చూచుకొని, బయటకు వచ్చి ఆలోచించాము. "యజమానుల తెల్లరంగు చూచి గిరిగారు జడిసిపోయారు. వీరివల్ల న్యాయం జరుగదు. కాలయాపన చేస్తారు. వీరిని నమ్ముకుంటే ఉపయోగముండదు. ప్రకాశం పంతులుగారిని కలుసుకొందాము. ఆయన తెల్లతోలును చూచి జడిసేరకం కాదు. ఆయన వల్లనే న్యాయం జరగాలి" అని నిశ్చయించుకొని ప్రధానమంత్రి ప్రకాశం పంతులుగారి యింటికి వెళ్ళాము. మా డెప్యుటేషన్ చెప్పినదంతా విని "కమ్యూనిస్టులు రాష్ట్రమంతటా అనవసరంగా సమ్మెలు చేయిస్తున్నారు" అని నిందించారు.

"ఇక్కడికి వచ్చిన కార్మిక సంఘ ప్రతినిధులలో చాలా మందిమి కాంగ్రెసువారమే" అన్నారు మాలో ఒకరు.

"రాష్ట్రంలో జరిగే సమ్మెలలో ఎక్కువ భాగం కాంగ్రెసు వారివే; కమ్యూనిస్టులవి కావు" అని మరియొకరన్నారు.

ముందుగా మంత్రులతో సంప్రదించకుండా నోటీసు యివ్వకుండా కమ్యూనిస్టులు సమ్మె చెయ్యడంలేదు" అన్నారు ఒక కమ్యూనిస్టు. పంతులుగారికి నోరు కట్టివేసినట్టయింది. అయినా, ఒకప్పుడు గొప్ప క్రిమినల్ లాయరు కదా!

"ఈ స్పెన్సరు సమ్మె అనవసరం కాదా? ఎందుకు చెయ్యాలి?" అని అడిగారు.

"కార్మికులు సమ్మె చెయ్యలేదు, యజమానులే సంస్థను మూసివేసి, కార్మికులను పనిలోనికి రాకుండా "లాక్-ఔటు" చేశారండి. దీన్ని సమ్మె అనడానికి వీల్లేదు" అని ఒకరు సమాధానమిచ్చారు.

"ప్రతిశనివారం మధ్యాహ్నం ఒకపూట సెలవు మామూలు. ఒక శనివారంనాడు తమిళ ఉగాది పండుగ వచ్చింది. ఆ శని వారం పూర్తిగా సెలవిమ్మని నెలరోజులు ముందునుంచే కార్మి కులు యజమానుల నడుగుతూవచ్చారు. అయితే పండుగకు ముందురోజు శుక్రవారంనాడు అయిదు గంటలకు చెప్పుతామని, కార్మికులందరిని నిలబెట్టి, 500 మంది తమిళ కార్మికులను డిస్మిస్ చేశారు. ఇది సమ్మె ఎలాగవుతుంది చెప్పండి?" అని మరొకరు ప్రశ్నించారు.

"సమ్మె చేసేవారు ఫ్యాక్టరీలో పనిచేసే కూలీలను కొడు తున్నారట! దెబ్బలు తిన్నవారిని చాలామందిని యజమానులు తీసుకొచ్చి చూపించా"రని పంతులుగా రన్నారు.

"ఒక విచారణ కమిటీని నియమించండి. అదంతా అబద్ధ మని నిరూపించుతాము. అంతేకాదు; పోలీసులు, యజమానులు కలసి సమ్మెచేసేవారిని కొట్టి, హింసించుతున్నారని నిరూపించుతా" మన్నాము. అందుకు ప్రకాశం పంతులుగారు జవాబు చెప్పలేదు.

"గిరిగారిని కలుసుకొని చెప్పం"డని వారు సలహా యిచ్చారు.

"మాట్లాడి వచ్చామండి!" అని నేనన్నాను.

"అలాగా! అయితే ఆయనమీద అప్పుడే అసంతృప్తి ఏర్పడ్డదా?" అన్నారు పంతులుగారు.

"యజమానులు తెల్లదొరలని గిరిగారు జడుస్తున్నట్లు మాకు తోచింది" అన్నాను నేను.

"మీకు ఏది తట్టితే అదే అనేస్తున్నారు" అని ఆక్షేపిం చారు ప్రధానిగారు.

"1200 మంది కార్మికులు కాంగ్రెసువారు. వారి కుటుంబాలు అన్నంలేక మాడిపోతూంటే ఇండియానుండి పారిపోవలసిన తెల్లదొరలు కాంగ్రెసు భక్తులను హింసించుతూంటే-ఇప్పుడు స్వేచ్ఛగా చెప్పకపోతే మరెప్పుడు చెప్పమంటారు?" అని అడిగాను.

కొంచెంసేపు ఊరకుండి పంతులుగారు ఏం చెయ్యమంటావు?" అని ప్రశించారు.

"వెంటనే అందరిని పనిలోకి తీసుకోమనండి. అరవ ఉగాదిని పండుగదినంగా పరిగణించడమా లేదా అనే విషయాన్ని నెమ్మదిగా తీర్మానించండి. మధురలో ఒకప్పుడు శ్రీ సి. రాజగోపాలాచారిగారు మిల్లు మూయించివేసి తెల్లదొరలకు బుద్ధి వచ్చేలా చెయ్యలేదా?" అన్నాను. నా వైపు తీక్షణంగా చూచారు పంతులుగారు. సి. ఆర్. పేరుతేవడం చాలా పొరపాటనుకున్నాను. మరొక గదిలోకి వెళ్ళి, తలుపులు బిగించి, గిరిగారితో టెలిఫోనులో ఏదో మాట్లాడివచ్చి "ఎల్లుండి గిరిగారిని కోటలో కలుసుకోండి" అని చెప్పారు. స్పెన్సరు కంపెనీ కార్మికులకు ఇక వెంటనే న్యాయం జరిగిపోతుందని మేమనుకొని గంపెడంత ఆశతో కూలీలను యిండ్లకు పంపివేశాము.

రోజులు, వారాలు గతించాయి; వారాలు నెల లయిపోతూ వచ్చాయి. పోలీసుల హింస ఎక్కువైపోయింది. బ్లాక్‌లెగ్స్‌తో ఫ్యాక్టరీలో పూర్తిగా పని సాగిపోతోంది. రాజీ (కన్‌సీలియేషన్) అనీ, మధ్యవర్తిత్వమనీ (ఆర్బిట్రేషన్) వట్టిమాటలతో కాలయాపన జరిగిపోతోంది.

ఈ విషయానికి సంబంధించిన "కాంట్రాక్టు ఆక్టు" ప్రకారం అరవకూలీలకు ఉగాదిపండుగలకు సెలవు యిమ్మని కోరే హక్కు లేదనిన్నీ, అయినా సమ్మెరోజులకు యజమాని కూలి యివ్వవలసిందనిన్నీ, యజమానికి యిష్టంలేని కార్మికులను పని లోనుండి తొలగించవచ్చుననీ కోర్టులో తీర్పు యిచ్చారు.

మంత్రి గిరిగారివద్దకు కార్మిక నాయకులు వెళ్ళి "ఆ తీర్పును ఒప్పుకోవద్దండి! యజమాని చాలామందిని డిస్మిస్ చేస్తారు" అని చెప్పారు.

"లేదు, లేదు; డిస్మిస్ ఎందుకు చేస్తారు? అందరిని యజమాని పనిలోకి తీసుకుంటారు. అలా చెయ్యమని తప్పకుండా చెప్తా"నని గిరిగారు సమాధానం చెప్పి పంపారు.

సుమారు మూడునెలలు సమ్మె (లాక్-ఔటు) జరిగింది. 500 కార్మికులకు ఉద్యోగం పోయింది. ఉగాదికి అరవ కూలీలకు ఒకపూట సెలవు యివ్వండని కోరినందుకు కాంగ్రెసు మంత్రులు తెల్లయజమానులకు పోలీసుమద్దతు నిచ్చారు; సమ్మె విఫలమయింది. కాంగ్రెసు భక్తులైన 1200 కార్మికులు నిర్ఘాంత పోయారు. మద్రాసులోని కార్మికులు ఒకరోజు హర్తాల్ చేసి తమ సానుభూతిని చూపాలని ఏదో ఒక కార్మిక సంఘం తీర్మానించగానే ఒక లక్షమంది కార్మికులు మద్రాసులో హర్తాల్ చేశారు. కాంగ్రెసు మంత్రులమీద, కాంగ్రెసుమీద భక్తి నమ్మకాలు కార్మికుల్లో ఎంతలోకి నశించిపోయినయి! "కమ్యూనిస్టు దేశద్రోహులు చేసిన మోసం" అని కాంగ్రెసు పెద్దలు మమ్మ నిందించారు. అయితే స్పెన్సరు కంపెనీ 1200 కార్మికుల సంఘంలో వున్న కమ్యూనిస్టు ఒక్కరు మాత్రమే. మిగిలిన వారం

దరు కాంగ్రెసు భక్తులే. కమ్యూనిస్టుపార్టీ సానుభూతి చూపిం చుతూ వచ్చినది; కాంగ్రెసుపార్టీ సానుభూతి చూపించనే లేదు.

ఈ సమ్మెతో మార్క్సిష్టు సిద్ధాంతాల సత్యాసత్యాలు తెలిసి పోయినయి. నా సంశయాలు మాయమైనవి. సంఘంలో వర్గాలు వున్నాయి; వాటికి పోరాటాలున్నాయి. మనం ఏదో ఒక వర్గానికి మాత్రమే సహాయం చెయ్యగలము. యజమాన్ల పక్షం వారు యజమానులకు సహాయం చేశారు; కార్మికులకు అన్యాయం చేశారు. అలాగే కార్మికవర్గంవారు కార్మికులకు మాత్రమే సానుభూతి చూపించారు. అంతేకాదు; దేశానికి శత్రువులైన తెల్ల యజమానులకు కూడ సహాయం చేశారు మన దేశభక్తులైన మంత్రులు. కార్మికులు దేశభక్తులనే విషయాన్ని గమనించలేక పోయారు. కమ్యూనిస్టు సిద్ధాంతాలలో పొరపాటు లేదని నాకు నమ్మకం కలిగింది.

అటుతరువాత కొన్ని పట్నాలలో సమ్మెల సందర్భంలో మలబారు పోలీసులు ఘోరంగా ప్రవర్తించారనీ, స్త్రీ కార్మికులను కూడ కాల్చివేశారనీ ఏమేమో చదివాను. ఈ విషయాలు ఎంత వరకు సత్యమో, అసత్యమో తేల్చుటకు ఒక కమిటీని నియమిం చవలసిందని కోరగా, కాంగ్రెసు మంత్రులు నిరాకరించారని వార్తాపత్రికలద్వారా తెలిసింది. ఎందుకు అలా చెయ్యకూడదా అన్న సంశయం నన్ను ఆవేశించింది.*

---

* దేశంలో మూడేండ్లుగా హత్యలూ, దోపిళ్ళు జరుగుతూ వచ్చాయి. వీటన్నిటికీ కారకులు కమ్యూనిస్టులేనని కాంగ్రెసు ప్రభుత్వము, పత్రికలూ ఆరోపిస్తూ వచ్చాయి. కాని ఇందలి సత్యాసత్యాలను నిర్ధారణ చేయవలెనంటే నిష్పాక్షికమైన ఒక విచారణ సంఘాన్ని ఏర్పరచి నిజ

ప్రకాశం పంతులు గారిమీద నాకు భక్తిగౌరవాలు ఉంటూం దేవి. ఆయన ధైర్య సాహసాలు, త్యాగము నాకెంతో నచ్చినవి. ఆయనమీద నాకుండినంత గౌరవం మరే ఆంధ్ర కాంగ్రెసు నాయకునియందును లేవు. అయితే, ఇప్పుడో?

కార్పొరేషన్ కార్మికుల సమ్మె

మద్రాసు నగరంలో వీధు లూడ్చి, పాకీపని చేసి, రోడ్లు బాగుచేసే కార్మికుల సంఖ్య పదివేలు. వారిలో పాకీవారు 4500 మంది. వీరందరూ తెలుగువారే. కాంగ్రెసు కౌన్సిలర్లే ఎన్నో ఏండ్లుగా వారి సంఘాలకు నాయకులుగా ఉంటూండేవారు. ఇందరు నాయకు లుండికూడా, పాకీవారిలో చాలామందికి జీతం నెలకు ఆరురూపాయల నుంచి ఇరవై రూపాయలు మాత్రమే రోడ్డుపని చేసే స్త్రీలకు నెలకు పదిరూపాయలు మాత్రమే; పురుషులకు పన్నెండు మొదలు పదహారు రూపాయలు. ఈ పరిస్థి

---

మేదో తెలుసుకోవాలి. అంతవరకూ కాంగ్రెసు ప్రభుత్వము, పత్రికలూ కమ్యూనిస్టులపై ఆరోపించిన చార్జీలను యథాతథంగా నమ్మడానికి అవకాశం ఉండదు.

సూళ్ళూరుపేటలో జరిగిన రైలు ప్రమాదానికి కమ్యూనిస్టుల చర్యలే కారణమన్నారు మొదట. విచారణ చేసిన మీదట అది అబద్ధమని రుజువు అయింది. అదేవిధంగా కమ్యూనిస్టులపై ఆరోపించబడిన నేరాలను విచారణ సంఘం సమగ్రంగా పరిశీలిస్తే తప్ప అందలి సత్యాన్ని ప్రజలు తెలుసుకోడానికి వీలుండదు.

కాంగ్రెసువారికీ, కమ్యూనిస్టులకూ వచ్చిన పేచీలలో పొరపాటు కేవలం కమ్యూనిస్టులది కాదని, లేక కాంగ్రెసువాదులదని చెప్పుటకు వీలులేదు. ఉభయపక్షాలలోను పొరబాట్లు లేకపోలేదు. ఈ సందర్భంలో "పద్మవ్యూహ" ఘట్టం నాకు జ్ఞాపకం వస్తుంది.

తులు దుర్భరంగా వున్నై. ఆహార పదార్థాల వెలలు పెరిగిపోతూ వచ్చాయి. కార్మికులు కమ్యూనిస్టుల సహాయం కోరారు కూలీలు చాలామంది తెలుగువారు; అయినా ఒక తమిళ కమ్యూనిస్టు తెలుగు తెలియకపోయినా పదివేలమందిని ఒకేఒక సంఘంలోకి ఒక సంవత్సరకాలంలో తేగలిగారు. అదివరకున్న కాంగ్రెసు నాయకుల సంఘాలు క్షీణించిపోయాయి. అయితే, కార్మికులు గాంధీ భక్తులు, కాంగ్రెసు భక్తులుగానే వున్నారు. కొందరు కాంగ్రెసు సభ్యులు కూడాను.

కార్మికుల కష్టాలను తొలగించండని కాంగ్రెసు కౌన్సిలర్ల యిండ్లచుట్టూ కమ్యూనిస్టులం తిరిగాము. కౌన్సిలర్లలో మెజారిటీ కాంగ్రెసువారే. కొంతమంది సహాయం చెయ్యాలని యిష్టం కన్పరిచేవారు. కాని, మరికొందరు ఆక్షేపించేవారు:- "కమ్యూనిస్టులు కోరినట్టు జీతాలు పెంచితే వారి పలుకుబడి స్థిరపడిపోతుంది. కాంగ్రెసు పలుకుబడి నశించిపోతుం"దని కొందరు కాంగ్రెస్ భక్తులు వాదించారు. అన్ని సంఘాలు కలిసి ఏకగ్రీవంగా కొన్ని కోరికలను అడుగుదాము అని కమ్యూనిస్టులం సలహా యిచ్చాము. కాని, కాంగ్రెస్ నాయకులు ఒప్పుకోలేదు. కమీషనరు షినాయి కొంతవరకైనా చెయ్యాలని ప్రయత్నించారు. కాని, పోటీ సంఘాల కాంగ్రెసు నాయకులు ముఖ్యంగా కౌన్సిలర్ల ఒత్తిడికి జడిసిపోయారు.

చివరకు కాంగ్రెసుమంత్రులను కలుసుకున్నాం. ఆరోగ్య శాఖామంత్రిగారైన శ్రీమతి రుక్మిణమ్మగారు మాతో "అయ్యో! నెలకు ఆరురూపాయలజీతమా! నెలకు ముప్పదిరూపాయలన్నా లేకపోతే ఎలా జీవించుతారు? ఈ అన్యాయాన్ని తొలగించాలి.

శ్రీ దేనియల్ థామస్‌గారితో మాట్లాడుతానని చెప్పారు; మాకు ఆశ్చర్యంకలిగింది. వెంటనే బయటికి వచ్చి నవ్వుకొన్నాము. "ఈమె ఎంత బాధ్యతారహితంగా మాట్లాడింది. ఇంత డబ్బు ఎక్కడినుంచి తెచ్చియిస్తుంది? కార్పొరేషనుకు అందుకు తగినంత ఆదాయం లేదే" అనుకొన్నాము.

కార్మికమంత్రి గిరిగారు "నాకు సంబంధంలేదు; స్థానిక శాఖామంత్రి డేనియల్ గారిని కలుసుకో"మన్నారు. అలాగే వారిని కలుసుకొంటిమి "జీతాలవిషయం చాలాకాలంగా తర్జన భర్జనజరుగుతున్నది. మీరేమో మొన్ననే మంత్రిపదవికివచ్చారు. కొంతకాలం బాగా ఆలోచించి చేస్తారా? లేక వెంటనే చేస్తారా?" అని థామస్‌గారిని అడిగాము.

"ఇదెంత! వెంటనే చేస్తాను. కమీషనరును పిలిపించి తీర్మానించుతా" నన్నారు. మూడు పార్టీల సమావేశాలు జరిగాయి. కార్పొరేషను కమీషనరు, మంత్రిగారు, కార్మికసంఘనాయకులము -నేనుకూడా ఆ సంఘనాయకులలో ఒకడిని- సమావేశమైనాము. ఒక్కొక్క కార్మికునికి నెలకు జీతము రెండురూపాయలు; ఇంటి బాడుగ రెండురూపాయలు మొత్తం నాలుగురూపాయలు పెంచ వలసిందని మంత్రిగారు తీర్మానించారు. మేము సమ్మతించలేక పోయాము "ఏ సమ్మె లేకుండా నాలుగురూపాయలు అధికంగా వచ్చింది! ఒప్పుకోండి! ఆరునెలల తరువాత తిరిగి ప్రయత్నించుదాము" అని మమ్ము సమాధానపరిచారు.

అయితే, మరొక విషయంలో మాకు సంశయంకలిగింది. కార్పొరేషను కమీషనరుగారితో మంత్రి థామస్‌గారు యిలా అన్నారు: "కార్పొరేషను కార్మికు లందరికీ ఇండ్లు కట్టించుదాము.

ఒక్కొక్క యింటికి పదిహేనువందలు సాంక్షను చేయిస్తాను. ముందుగా పాకీవాళ్ళకు నాలుగువేల యిళ్లు ఐదుసంవత్సరాలలో పూర్తిచేయించుదాము. సంవత్సరానికి ఎనిమిదివందల యిళ్లు; పన్నెండులక్షలరూపాయలు; మొత్తం అయిదు సంవత్సరాలకు అరవై లక్షలు"అన్నారు.

దీనికి కమీషనర్ షినాయ్‌గారు "ఒక్కొక్క ఇంటికి వెయ్యిరూపాయలు చాలు"అన్నారు. "చాల"దన్నారు మంత్రి థామస్‌గారు. "ఇండ్లు అవసరంలేదు. కాళీస్థలంలో రోడ్లు, దీపాలు కొళాయిలు, పాకీదొడ్లు, గుడిసెలు వేసుకొనుటకు ప్లాటులు చేయించి యివ్వండి. ఒక్కొక్క గుడిసెకు మీరు రెండువందల ఏభై రూపాయలు ఖర్చుపెట్టండి. చాలును; కార్మికులు స్వంత డబ్బుతో గుడిసెలు వేసుకుంటారు. వర్షాకాలంలో వాళ్ళగుడిసెలు మునిగిపోకుండా వుంటే చాలు"అని మేము వాదించాము. ఆయితే, మంత్రిగారు మాత్రం ఒప్పుకోలేదు. మాకు అబ్బురం గానేవుంది. బయటకు వచ్చిన కార్మికనాయకులము "ఏదో కుంభ కోణం ఉన్న"దనుకొని ఒక ఉత్తరం మంత్రిగారికి, ఒకటి కమీషనరుగారికి వ్రాశాము. దానిలో ముందురోజు తీర్మానించు కొన్న విషయాలనుగురించి వ్రాతమూలకంగా ఒప్పుకోవలసిందని వ్రాశాము. ప్రత్యుత్తరం రాలేదు. కమీషనరుగారిని కలుసుకొని అడిగితే నవ్వుతాడే గాని, మాట్లాడడు; కొంతకాలానికి అసెంబ్లీలో యిండ్లనుగురించి, జీతాలు, యిండ్లబాడుగనుగురించి, ప్రశ్నలు వేయించాము. తన కేమీ తెలియదని మంత్రి డేనియల్ థామస్‌గారు జవాబుచెప్పారు. తరువాత వారిని ఆఫీసులో కలుసు

కాని "అబద్ధం చెప్పవచ్చునా?" అని అడిగాను. వారి కెంతో ఆగ్రహంవచ్చింది. కాబట్టి, సమ్మె తప్పనిసరి అయింది,

సమ్మె నోటీసు యిచ్చాము. వేరే పాకీవారిని సప్లయి చేయించెదమనీ, సమ్మెను ఓడించగలమనీ కాంగ్రెసు మొదలైన పార్టీల కౌన్సిల్ సభ్యులందరూ కమీషనరుగారికి హామీయిచ్చారు. ఏదో ఇచ్చి రాజీచేసుకోవాలని కమీషనరుగారు చేసిన ప్రయత్నాలన్నీ నిష్ఫలమైనవి. సమ్మెకాలంలో కౌన్సిలర్లు పాకీవాళ్ళను సప్లయి చెయ్యలేకపోయారు. కమీషనుగారు భయపడిపోయారు. పోలీసుల లాఠీల సహాయంతో సమ్మెను అణచుటకు తీవ్ర ప్రయత్నాలు చేశారు. మంత్రులు-ముఖ్యంగా కూర్మయ్యగారు "ఎర్రజండా విడిచిపెట్టి కాంగ్రెసుజండా పట్టుకోండి; మీ కోరికలు నెరవేరేటట్లు చేస్తా"నని కూలీలకు సలహా యిచ్చారు. "ప్రతి పాకీపనివానికి భూములను యిప్పిస్తాను. మీ గ్రామాలకు వెళ్ళి వ్యవసాయం చేసుకొని సుఖంగా జీవించం"డని కూడ సలహా యిచ్చారు. "భూములను మా కిచ్చేబదులు మా జీతాలు హెచ్చించండి; మా కడుపులు ఆకలితో మాడిపోతున్నా"యని వారు సమాధానం చెప్పారు. అంతటితో కూర్మయ్యగారు తమ ప్రచారాన్ని మానుకున్నారు. "కమ్యూనిస్టులు దేశద్రోహులు. మాస్కో డబ్బు తింటున్నారు" అనే ప్రచారం ఎంతమాత్రమూ 1946—47 లో ఉపయోగించలేదు. చివరకు చాలమంది పాకీవారిని జైలులో వేయించారు. నేరాలు చేసే జాతుల చట్టము (క్రిమినల్ ట్రయిబ్సు ఆక్టు)ను అన్వయించేలాచేసి కొందరిని పోలీసు స్టేషన్లలో లాకప్ చేశారు. ఒక పోలీసువాని దెబ్బలకు, తన్నులకు ఒక స్త్రీ చచ్చిపోయింది. గుడిసెలోకి వెళ్ళి ఆమెను కొట్టి చంపాడు.

భాష్యంగారు అనే కాంగ్రెసు డాక్టరు ప్రధానమంత్రి ప్రకా
శంగారిని కలుసుకొని యిలా కొట్టించడం అమానుషమనిచెప్పగా
"కమ్యూనిస్టుపార్టీలో ఎప్పుడు చేరావు?" అని ఆయన్ను దబాయిం
చారు పంతులుగారు. కొందరు కాంగ్రెసు పెద్దలు మంత్రులను,
ప్రధానిని కలుసుకొని న్యాయమైన జీతం యిచ్చి, సమ్మెను ఆపు
చేయించండని ఎంతో బ్రతిమలాడారు; ఉపయోగం లేకపోయింది.
పురప్రముఖులు బహిరంగసభ పెట్టుకొని కాంగ్రెసు మంత్రులను
ప్రార్థించారు. ఒక డెప్యుటేషను ప్రధానిని కలుసుకొని అడుగగా
ప్రకాశంగారు అడ్డదిడ్డమైన ప్రశ్నలు వేశారు. చివరకు శ్రీ సం
జీవకామత్, డాక్టరు మహదేవన్‌గార్లు "కార్మికులు కాంగ్రెసు
భక్తులు, కాంగ్రెసు సభ్యులు అని మాకు తెలుసును; న్యాయంగా
యివ్వవలసినది యివ్వం"డని వత్తిడి చెయ్యగా తుదకు ప్రకాశం
పంతులుగారు కటాక్షించారు. ఒక్కొక్క కార్మికునికి నెలకు ఎని
మిదిన్నర రూపాయల వంతున సంవత్సరానికి కార్పొరేషను
షుమారు తొమ్మిదిన్నర లక్షల రూపాయలు ఎక్కువగా ఖర్చు
చేసేట్టు సమ్మె పరిష్కారమయింది. ఏ కూలీకి గాని నెలజీతము
పదహారు రూపాయలకు తక్కువ వుండకూడదని తీర్మానించారు.
21 రోజులు సమ్మెచేసి ఎన్ని కష్టాలు పడినా, కార్మికులు చివరకు
సంతోషించారు.

అయితే, కొన్నిరోజులలోనే పన్నెండువందల కూలీలను
పనిలోనుండి తొలగింపబడ్డారు. అలా తగ్గించకూడదని కౌన్సి
లర్లు తమసభలో తీర్మానించారు. ఈసందర్భంలో కమీషనరు
గారిని కలుసుకున్నాను. కౌన్సిల్‌లో ఉండే పార్టీనాయకులు రహ
స్యంగా తనను తగ్గించమని సలహాయిచ్చి, కౌన్సిల్ మీటింగులో

పబ్లికుగా మరొకరీతిని తీర్మానించారు. తా నేమీ చేయజాలనని ఆయన చెప్పారు. నేను నమ్మలేదు. ఆ సంగతి గ్రహించి "చంచయ్యగారూ! సమ్మెచేసిన బకింగ్‌హామ్ కర్నాటిక్ మిల్లుల కార్మికులకు ఒకలక్ష రూపాయలు యివ్వవలసిందని పబ్లిక్‌గా తీర్మానం చెయ్యలేదా? యివ్వవద్దని నాకు రహస్యంగా సలహా యివ్వలేదా? అందువల్ల, నేను యివ్వజాలకపోయాను; అలాగే మీ పన్నెండువందలమంది కూలీలను పనిలో చేర్చుకోజాలను" అని ఏమేమో సమాధానం చెప్పారు.

ఎంత నైతికపతనం! కాంగ్రెసునాయకులే యిలా చేస్తే దేశంగతి ఏమవుతుంది? దేశం నాశనానికి దారితీస్తున్నారని ఎప్పుడు తెలుసుకుంటారు? అని సిగ్గుపడ్డాను; దుఃఖించాను.

**అభ్యుదయరచయితల మహాసభ—**

**కామ్రేడ్ చదలవాడ పిచ్చయ్యగారు**

1946—47 సంవత్సరంలో ఆంధ్రరాష్ట్ర అభ్యుదయ రచయితల మహాసభ మద్రాసులో అత్యంతోత్సాహంగా జరిగినది. ఆఫీసు మా యింటిలోనే పెట్టాము. కార్యదర్శి శ్రీ పిచ్చయ్యగారు, వారి అనుచరులు మాయింటిలోనే బస. కమ్యూనిస్టు పార్టీ తీర్మానం ప్రకారం స్థానికంగా నేను సహాయం చేస్తున్నాను. నాకు ఆంధ్ర రచయితలతో దగ్గర పరిచయానికిదే ప్రారంభం. వీరి విషయంలో నాకున్న "ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు" ఇంత వరకూ నన్ను దూరం చేస్తుండేది. ఇక దూరంగా ఉండటానికి సాధ్యపడలేదు. కొన్నురెన్నువల్ల పైపై 'కాంప్లెక్సు' కుదిరిపోయింది. ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ రచయితల తరఫున శ్రీ పిచ్చయ్యగారు కార్యదర్శిగా నియమించబడినారు. కొద్దిరోజుల్లోనే శ్రీ పిచ్చ

య్యగారికి ఇతరులకు తగాదాలు వచ్చాయి. మెజారిటీతో అభిప్రాయ భేదాలు వచ్చినప్పుడు రాజీనామా యిచ్చివేయాలి. కాని, పిచ్చయ్యగారు అలా చెయ్యక, తన యిచ్చవచ్చినట్లు ప్రవర్తించారు. "మహాసభను నాశనమైనా చేస్తానుగాని, నేను వదిలిపెట్టి వెళ్ళ"నని పిచ్చయ్యగారి పట్టుదల. మధ్యలో పిచ్చయ్యగారిని తొలగించి అల్లరిపడటం కమ్యూనిస్టు రచయితలకు యిష్టంలేదు.

తన ధోరణి సరియైనదేనని పిచ్చయ్యగారు నాకు బోధించేవారు. ఎన్నిగంటలైనా తన వాదన మానరు. నాకు తలనొప్పిగా వుండేది. తుదకు యిలా చెప్పి తప్పించుకొనుటకు ప్రయత్నించాను-: "నేను పార్టీలో సభ్యుడను. పార్టీలో ఉన్నంత కాలమూ పార్టీ తీర్మానంప్రకారం ప్రవర్తిస్తాను; లేకపోతే పార్టీని వదలివేస్తాను; కాని, నీతో నేను చేర"నని ఖండితంగా చెప్పివేశాను. నాకూ, ముఠా తగాదాలకూ చాలా దూరం.

"నీకు బ్రెయిన్సు లేవా? ఎందు కాలోచించవు?" అని ఆయన ప్రశ్న.

"బ్రెయిన్సు ఉన్నవారు నీలాగా తగవులాడుతూ ఉండ"రని జవాబిచ్చాను.

## ప్ర జా నా ట్య మం డ లి

పై తగాదాల సందర్భంలో ఈ నాట్యమండలిని గురించి కూడ వ్రాయాలి. "ప్రజానాట్యమండలి" ఒక ప్రత్యేక సంస్థ. అది ఆలిండియాసంస్థ. దానికి ఆంధ్రరాష్ట్రంలో ఒక శాఖకూడా ఉన్నది. దానినికూడా కమ్యూనిస్టులే నడుపుచుండిరి. వారు ప్రదర్శించే నాటకాలు, బుర్రకథలు, చిత్రవిచిత్రవేషాలు నన్ను బాగా

ఆకర్షించాయి. వాటిని చూచేందుకు ప్రత్యేకంగా బెజవాడ వెళ్ళే వాడిని.

ఆంధ్రకమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలలో—ముఖ్యంగా వారి సంస్కృతీకలాపాలు నన్ను ఆకర్షించినంతగా మరే కార్యక్రమాలూ ఆకర్షించలేదు. నన్నే కాదు! వేలు లక్షల ప్రజలను ఆకర్షించాయి. ఆ కార్యక్రమాలే కోస్తాజిల్లాల్లో అనేకవేలమంది కమ్యూనిస్టుపార్టీలో చేరుటకు, ఆ పార్టీ అంత త్వరలో వృద్ధికి రావడానికీ కారణమని నా దృఢనమ్మకము.

ఎక్కడ ఆంధ్ర అభ్యుదయరచయితల మహాసభ జరిగినా, పై నాటకమండలి ప్రదర్శనాలను మామూలుగా ఏర్పాటుచేయుచుండిరి. అలాగే మద్రాసులో కూడా ఆ అవకాశాన్ని ఉపయోగించుకొని ఆ నాట్యమండలి కాన్ఫరెన్సునుకూడ మద్రాసులో జరుపుటకు నేను ఏర్పాట్లు చేయుచుంటిని. ఆ విధంగానైనా మద్రాసులో ప్రజానాట్యమండలి శాఖను స్థాపించి, సంస్కృతీ కార్యకలాపాలు ప్రారంభించాలని నా అభిలాష. మద్రాసు ఆంధ్రులచే ప్రదర్శనాలు జరిపించాలని నా ఉద్దేశ్యం.

అయితే, ప్రజానాట్యమండలి కాన్ఫరెన్సు మద్రాసులో ఏర్పాటుచేయుటకు శ్రీ పిచ్చయ్యగారు ఒప్పుకోలేదు. ముఠా తగాదాలు ఉన్నసంగతి నాకు తెలియదు. నాట్యమండలిని ముందుకు రానియ్యకూడదని, ఏమేమో కారణాలు పిచ్చయ్యగారు చెప్పారు. నాట్యమండలికి నేను పనిచేసేయెడల, రచయితల మహాసభ తాను మానేస్తానని పిచ్చయ్యగారు బెదిరించడమేగాక మూటాముల్లె సర్దుకొన్నారు. అందువల్ల నేను నాట్యమండలికి సంబంధించిన ప్రయత్నాలు మానుకోవలసివచ్చింది.

అప్పటికీ, వారి ఆగ్రహం చల్లారలేదు. రచయితల కాన్ఫరెన్సులో నాట్యమండలి ప్రదర్శనా లివ్వాలని ఆహ్వానించారే కాని, వచ్చినవారికి బసలు ఏర్పాటుచెయ్యలేదు; నన్ను చెయ్యనియ్యలేదు. మద్రాసులో దిగిన తరువాత, నాటకబృందంవారు పడ్డ కష్టాలు అన్నీ ఇన్నీ కావు. ప్రదర్శనాలు సరిగా జరుగకుండా ఉండాలనికూడా ప్రయత్నించారు; కాని, చాలా బాగా ఉన్నాయని ప్రేక్షకుల మన్ననలను నాట్యమండలివారు సంపాదించుకొన్నారు.

డాక్టర్ రాజారావుగారు రాష్ట్రనాట్యమండలి కార్యదర్శి; శ్రీ పిచ్చయ్యగారు రాష్ట్ర రచయితలసంఘానికి కార్యదర్శి; ఇద్దరూ కమ్యూనిస్టుపార్టీవారే, కాని, వారిద్దరిమధ్య చాలా తగాదాలున్నాయి. నాట్యమండలివారి కివ్వవలసిన ఖర్చులకు పిచ్చయ్యగారు పైకం యివ్వలేదు; నన్నూ యివ్వనియ్యలేదు. వాణీమహలులో కాన్ఫరెన్సు జరుగుతూండగా వారిద్దరూ ఆవరణ వెలుపల తగవులాడ నారంభించారు. మధ్యవర్తులం కొట్టుకోకుండా చెయ్యగలిగాము. ఇదంతా చూచాక నా "ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు" త్వరత్వరగా అంతరించిపోయింది.

కాండను త్ర వ్వా ము!

అభ్యుదయ రచయితలసంఘాన్ని గొప్ప ఉద్దేశ్యాలతో ప్రారంభించారు. అది అఖిలభారత సంస్థ. ఆంధ్రలో కమ్యూనిస్టు రచయితలుశాఖను స్థాపించి ఉత్సాహంతో పనిచేయుచుండిరి. వారు యువకులు; అభ్యుదయవాదులు. రచయితలందరిని అభ్యుదయమార్గంలోకి మార్చాలని వారి అభిలాష. అనగా, ప్రస్తుతం ప్రజలను పీడించే సమస్యాపరిష్కారాలకు ఆంధ్రరచయితలు తోడ్పడి,

మార్గదర్శకులై సంఘాన్ని ముందుకు నడిపించాలని వారి సంకల్పం.

అందువల్ల మద్రాసులో జరిగిన మహాసభకు చాలా ద్రవ్యం వసూలుచేసి, ఆంధ్రదేశంలో ప్రసిద్ధికెక్కిన రచయితలకు రానుపోను ప్రయాణఖర్చులను ముందుగానే పంపి రప్పించారు. ఈ రచయితలు "అభ్యుదయం" అనే మాటకు నిర్వచనం ప్రారంభించారు. ఒక్కొక్కరు ఒక్కొక్కవిధంగా మాట్లాడి తమ వాకచక్యాన్ని ప్రదర్శించారు. చాలమంది వేదకాలంలోని సంఘం అభ్యుదయంగా వున్నదనీ, ప్రస్తుతం కలియుగమనీ ఏమేమో బోధించారు. వీరికున్న వెనుకచూపును ముందుకు మరలించి వీరే శలింగం, భారతి, టాగూరు మున్నగు పురోగాములవలె అభ్యుదయానికి తోడ్పడేలాగున మహాసభను జరుపలేకపోయారు.

వాడుకభాష-శ్రీ రామలింగా రెడ్డిగారు

కాని, ఒక గొప్ప మార్పును తెచ్చేందుకు ప్రయత్నం జరిగినది. ఆంధ్ర యూనివర్శిటీ వాడుకభాషలో వ్రాయబడిన ఉద్గ్రంథాలను వినియోగించుటకు ఆక్షేపించారు. అందువల్ల ప్రజలు ముందుకు పోతున్నా, ఆంధ్ర యూనివర్శిటీ మాత్రం వారిని వెనుకకు లాగుచుండెను.

ఇది ఆంధ్రులకు ప్రధాన సమస్య. ఈ అభ్యుదయ నిరోధక విధానానికి కీర్తిశేషులైన శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డిగారే కారకులని రచయితల అభిప్రాయం. పిల్లికి గంట కట్టాలని ఎలుకలు పడిన పాట్లే ఈ రచయితలు కూడా పడుచుండిరి. చివరకొక మంచి తీర్మానం చేశారు. ఆంధ్రదేశంలోని కొంతమంది

సుప్రసిద్ధ రచయితలను ఒక డెప్యుటేషన్ పంపుటకు తీర్మానించారు. వారిలో కొందరు అత్యున్నత ప్రభుత్వోద్యోగులుకూడా వున్నారు. ఇక శ్రీ రామలింగారెడ్డిగారు మొగమాటపడవలసి వస్తుందనీ, వారి ఆట కట్టిపోగలదనీ రచయితలు సంతృప్తి చెందారు.

కాని, డెప్యుటేషను బయలుదేరనే లేదు. కార్యోత్సాహం గల కమ్యూనిస్టు యువకరచయితలను డిటెన్షనులో పెట్టుట వల్ల డెప్యుటేషన్‌లోని మెంబర్లకు ఉత్సాహం క్షీణించిపోయింది. కాని వారిలో కొందరు చెప్పిన సమాధానం ఎంతవరకూ వాస్తవమో నేను చెప్పజాలను. "రామలింగారెడ్డిగారికి అహంభావం ఎక్కువ. ఎంతటివారిని కూడా లక్ష్యపెట్టరు. డెప్యుటేషనును రిసీవు చెయ్యనని నిరాకరించవచ్చు. రిసీవు చేసినా మా సలహాను లక్ష్యపెట్టకపోవచ్చును. మర్యాదస్తులం? రిస్కు చెయ్యజాల"మని కొంతమంది మెంబర్లు చెప్పారు. చివరకు, మహాసభ ప్రయత్నాలు ఎలుకను పట్టిన సామెతలా జరిగిపోయాయి.

నాలుగు సంవత్సరాల తరువాత 1951 సం॥ జూలైలో ఒకవిధంగా ఈ సమస్యాపరిష్కారానికి తిరిగీ ప్రయత్నం జరిగి విఫలమైపోయింది. మద్రాసులో ఒక సారస్వత సభకు మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు అధ్యక్ష్యత వహించారు. వారు ఆంధ్రయూనివర్సిటీకి ప్రో-ఛాన్స్‌లరు. పై మార్పును చేయించండని ఒక అభ్యుదయవాది ప్రార్థించాడు.

"మార్పు లేకపోతేనేం? అరసున్నాలతో వ్రాయడం నేర్చుకుంటే తప్పేమిటి? ఇంటరు పరీక్ష పూర్తికాగానే మన యిష్ట

ప్రకారం వ్రాసుకొనుటకు ఏ యూనివర్సిటీ అడ్డుపడగలదు?"
అని తేలికగా మాట్లాడేశారు.

ఆంధ్రజాతి దురదృష్టం!

అరెస్టు – డిటెన్షను

ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభకు చాలమంది వచ్చి, మా యింటిలో బస చేశారు. ఆ సమయంలో నన్ను అరెస్టు చేసి, వెల్లూరు జైలుకు తీసుకెళ్ళి డిటెయిను చేశారు.

నన్ను హఠాత్తుగా డిటెయిన్ చేశారు; అయిదునెలల క్రిందట మద్రాసులో జరిగిన మునిసిపల్ వర్కర్ల (పాకీవారి) సమ్మె జయప్రదంగా ముగియుటకు నేను ముఖ్య కారకుడను. ఇది జయప్రదంగా అంతమైనట్లు ఆ సంవత్సరం ఇండియాలో మరొక సమ్మె జరుగలేదు.

ప్రధాని ప్రకాశంపంతులుగారు ప్రజానాయకుడే. కాని, నన్ను నిర్బంధించుతారని, వారిచర్యలవల్ల నాకు ముందుగానే తెలిసిపోయింది. ఏదో కేసు పెడతారని, విచారణ జరిపి శిక్షవేస్తారని అనుకొన్నాను. కాని, కాంగ్రెసు నాయకుడు నన్ను డిటెన్షనులో పెట్టిస్తారని అనుకోలేదు. దిక్కులేనివారికి మేలు చేయడం కూడ ఒక అపరాధమేననీ, చట్టంప్రకారం ప్రవర్తించినా తప్పేననీ అప్పటికి నాకు అనుభవంలోకి వచ్చేసింది.

నిలువు దోపిడీ

మేము ఊహించలేనట్టి విషయమొకటి జరిగింది. అరెస్టు చేసి, పోలీసు స్టేషనుకు తీసుకెళ్ళి, మా ఒంటిమీది వస్తువులను (కలం, గడియారం, డబ్బు, సిగరెట్లు) వగైరా తీసుకొని జైలువద్ద మళ్ళీ యిచ్చేస్తామని చెప్పియివ్వనేలేదు. మొత్తం

రాజధాని అంతటా సుమారు 170 మందిని అరెస్టుచేసి వెల్లూరు జైలుకు తీసుకొచ్చారు. సాధారణంగా అందరికీ అన్నిచోట్ల అలాగే నిలువు దోపిడి జరిగింది. కొందరి కళ్ళజోళ్ళను కూడ తీసుకొని యివ్వలేదు. ముందుగా యివ్వబడిన ఆర్డర్ల ప్రకారమే పోలీసులు చేశారని తెలిసిపోయింది. శ్రీ పంతులుగారు ప్రధానిగా వుండేటప్పుడు ఇంత అమానుషంగా జరగడం నాకు వింతగానే వున్నది. ఎన్నో వారాలు, నెలలు జరిగిపోయిన తరువాత శ్రీ పంతులుగారే కారకులని ఊహించుకోవలసివచ్చినందున విచారపడ్డాను.

పెట్టుకోవలసిన అధికారులందరికీ, అన్ని డిపార్టుమెంటులకూ ఎన్నో అర్జీలు పెట్టుకొంటిమి; వారాలు, నెలలు జరిగిపోతున్నాయి. కోర్టులో కేసులు దాఖలుచేసి మా సామాన్లను యిప్పించమని మా అడ్వొకేట్లకు వ్రాశాము. నూతనంగా పంతులుగారు ప్యాసుచేయించిన శాంతిరక్షణచట్టం ప్రకారం అలాంటి కేసులకు కోర్టులలో తావులేదని వారు మాకు తెలిపారు. పంతులుగారి ప్రతిభావిశేషానికి విస్తుపోవడమేగాక, విచారపడ్డాను.

చివరకు, ఒకనాడు డాక్టరు సుబ్బరాయను సతిగారు అల్లుని (యన్. కె. కృష్ణన్) చూచుటకు జైలుకు రాగా వారితో మా కష్టాలను గూర్చి కృష్ణన్‌గారు చెప్పారు. రాధాభాయిగారు మిత్రులకు. చీఫ్ సెక్రటరీగారికి, జైళ్ళ ఇన్‌స్పెక్టరు జనరల్‌కు టెలిఫోను చేశారట; ఉపయోగంలేకపోయిందట. తరువాత మద్రాసు పోలీసు కమీషనరుగారిని మొగమోటపెట్టి ఒప్పించి, మద్రాసు డెటిన్యూలకుమాత్రం సామానులు వచ్చేలా చేశారు. అయితే, ఇతరడెటిన్యూలకు అటుతరువాత పంతులుగారి మంత్రి

త్వం అంతమయ్యేకాలంలోగాని రాలేము. సులోచనాలు లేక ఎందరో పడినబాధలు నాకు పంతులుగారిని జ్ఞాపకం చేస్తూనే వున్నాయి.

## ఇంకా ఎన్నో బాధలు

ప్రకాశంపంతులుగారు మరికొన్ని కష్టాలుకూడా పెట్టారు. 1939 సంవత్సరంనుండి ఈ డిటెన్షనుపద్ధతి అమల్లో ఉంటూ వున్నది. కొన్ని వందలమంది కాంగ్రెసువాదులు, కాంగ్రెసేతరులు కలసి డిటెన్షనులోవున్నాము. మా కందరికి కొన్ని సౌకర్యాలు ఉంటూవచ్చాయి. ఇందుకు ముఖ్యకారణం మా మీద ఎలాంటి కేసులు, నేరాలు లేనందుననే నని విదేశప్రభువులు చెప్పారు, 1947లో కాంగ్రెసేతరులు మాత్రమే డిటెయిను చెయ్యబడ్డారు. వీరిలో ముఖ్యంగా కమ్యూనిస్టులు, కార్మిక, కర్షకసంఘాల నాయకులు మాత్రమే డిటెయినుచెయ్యబడ్డారు.

ఏడు సంవత్సరాలుగా బ్రిటిష్‌ప్రభుత్వం ఏర్పాటుచేసిన సౌకర్యాలను పంతులుగారు ఒక్కదెబ్బతో తుడిచిపెట్టారు. భోజనం విషయంలో సుమారు మూడోవంతుకు తగ్గించారు. శిక్షపడిన రాజకీయఖైదీలకు యిచ్చే భోజనాన్నే శిక్షలేని డెటిన్యూలకు కూడ యివ్వవలసిందిగా మార్పుచేశారు. అన్నం, పప్పు, గుమ్మడికాయలు, ఆకుకూరలు ప్రతిపూట తిని కడుపుబ్బరంతో బాధపడుతూండేవాళ్ళం.

అంతేకాదు; రాత్రి ఎనిమిదిగంటలకే మమ్ములను గదుల్లో మూసివేసి, తెల్లవారేదాకా తాళంవేసేవారు. మలమూత్రాలు సైతం గదిలోనే.

ఉత్తరప్రత్యుత్తరాలు, ఇంటర్వ్యూలు మొదలైన అత్యవస రాలకుకూడ అనుమతి యివ్వలేదు. జైలు సూపర్నెంటుగారేమో తనకు రూల్సునుగురించి ఉత్తరువులు రాలేదన్నారు. అలాగే అన్నారు ఇన్స్పెక్టర్ జనరలు. చీఫ్ సెక్రటరీగారుకూడ అదే జవాబు. చివరకు జైలు మంత్రిగారైన కె. భాష్యంగారిని అడగ్గా "ప్రధాని టంగుటూరు ప్రకాశం పంతులుగారికి నేరుగా వ్రాసుకో మన్నారు. ఇలాగే మూడునెలలకాలం బాధపడినాము. *

పంతులుగారి ప్రభుత్వం పోయి, రెడ్డియార్ మంత్రిత్వం రాగానే 1945 సంవత్సరానికి పూర్వం విదేశీప్రభుత్వంలో డెటిన్యూ లకున్న సౌకర్యాలు తిరిగి అమల్లోకి వచ్చాయి. పైన వ్రాసిన కష్టా లన్నీ తొలగిపోయినయి. గొప్పవారైన పంతులుగారి హృద యంలో చివరకు కరుణ అనేది పూర్తిగా నశించిపోయినదా అన్న సంశయంతో నా విచారాన్ని కొందరు మిత్రులకు తెలుపగా "ఎప్పటికీ వారిది జాలిగుండే; కాని ఎందుకలా చేశారో కారణం చెప్పలే"మన్నారు వారు. పంతులుగారిలో కలిగిన యీ పరిణా మానికి కారణాన్ని కనుగొనుటకు నేను మనస్తత్వశాస్త్రజ్ఞుడను కానుకదా!

పునర్విమర్శ

జైళ్ళలో డెటిన్యూలకు కావలసినంత తీరిక ఉంటుంది.

---

* ఇటీవల తెలుగు మాసపత్రికలలో మూడు కథలు చదివాను-
"మనుష్యులా, మరలా?"
"భస్మాసురుడు"
"బ్రహ్మరాక్షసులు"
అప్పటి రాజకీయపరిస్థితులనుగురించి ఎంతో బాగా వ్రాశారు.

కాబట్టి పునర్విమర్శలు జరుగుచుండేవి. లోగడ యుద్ధకాలంలోని కమ్యూనిస్టుపార్టీ పాలసీని ఇప్పుడు (1947లో) జైలులో పునర్విమర్శచేశాము. అప్పటిపాలసీ సరికాదని, (అనగా ఇంటర్‌నేషనల్ దృక్పథంమీద ఆధారపడినదని, జాతీయవాదంమీద ఆధారపడలేదని) చాలామంది అభిప్రాయపడ్డారు. పొరపాట్లు చేస్తూ వచ్చామనీ, అనుభవజ్ఞానంలేని లోపంవల్ల పార్టీ, పార్టీనాయకులూ తప్పుత్రోవల్లో పోయినారనీ కొందరు ప్రత్యక్షంగా నిర్మొగమాటంగా చెప్పారు.

1947 ఆగష్టు 15 తేదీకి మమ్ములనందరిని స్వాతంత్ర్య దినోత్సవసందర్భంలో విడుదలచేస్తారని తెలిసింది. రానున్న రాజకీయాలనుగురించి చాలా చర్చలు జరిగాయి.

1. రానున్న స్వాతంత్ర్యం సంపూర్ణస్వరాజ్యం కాదనీ, డొమీనియన్ ప్రభుత్వానికి దిగజారుతుందనీ,

2. బ్రిటిష్‌వారు తమ దోపిడిని సాగించుకొంటూనే ఉంటారనీ,

3. భారతీయ పెట్టుబడిదారులు విదేశ పెట్టుబడిదార్లతో కలసి, ప్రజలను మరీ ఎక్కువగా దోచుకొంటారనీ,

4. రాజులు, మహారాజులు, జమీందారులు తమ దోపిడిని ఏదోవిధంగా అనుభవించుతూనే వుంటారనీ,

5. ప్రభుత్వాధికారంలో అధికభాగం ఇండియాపెట్టుబడిదారులకూ వారితరఫున కాంగ్రెసునాయకులకు సంక్రమిస్తుందనీ,

6. కాంగ్రెసు నాయకులు, రాజులు, జమీందారులు, పెట్టుబడిదారులు కలసి రాజ్యమేలుతారనీ,

7. పరిశ్రమలు వగైరా జాతీయం చెయ్యరనిన్నీ.

8. పెద్ద ఉద్యోగస్థులు తమ అధికారాలను, అధికజీతాలను అనుభవిస్తూనే వుంటారనీ.

9. "ఇన్‌ఫ్లేషను" వల్ల వెలలు పెరిగిపోతూనే వుంటాయనీ, మధ్యతరగతి, కార్మిక-కర్షక జనానికి ఆర్థికబాధలు పెరిగిపోతూవుంటాయనీ అప్పుడు మేము అనుకొన్నాము.

అంతేకాదు; కమ్యూనిస్టుపార్టీకి, కార్మిక కర్షకసంఘాలకు కష్టాలు అధికమవుతాయనీ, విడుదలైనవారు మరల జైళ్ళకు పంపబడుతారనికూడ అనుకున్నాము.

అయితే నేని ఒక్క విషయంలో మాత్రం ఆశాజనకంగా కనుపించినది. వయోజనులందరికీ వోటుహక్కు ఉండడంవల్ల పార్లమెంటరీపద్ధతులతో ప్రభుత్వం నడుస్తుందని నమ్మాము. అందువల్ల, అధికసంఖ్యాకులైన పేదసాదలకు కమ్యూనిస్టుదృక్పథం అంగీకారమయ్యేలాగున బోధించవచ్చుననీ, భారతదేశంలో దౌర్జన్యము, రక్తపాతములు లేకుండా, అంతర్యుద్ధాలు, విప్లవము లేకుండా తీవ్రమైన మార్పులు రాగలవని ఆశించాము.

## రెండు దృక్పథాలు

కాంగ్రెసులో రెండుపార్టీలవారున్నట్టున్నూ, నెహూ్రపార్టీ అభ్యుదయకరమనీ, పటేలుపార్టీ అలా కాదనీ, అందువల్ల నెహూ్రను బలపరచాలనీ మాలో మెజారిటీ అభిప్రాయపడినారు. "ఇద్దరూ ఒకటే; పటేలుగారు చక్రం తిప్పుతారనీ, అభ్యుదయవాదులుగా కనపడే నెహూ్ర మొదలైనవారందరూ పటేలుగారి పరిపాలనావిధానంలో లీనమైపోతా"రని మైనారిటీ అభిప్రాయపడ్డారు.

షుమారు ఏడునెలలకాలం జైలులో యీవిధంగా చర్చలు జరిగాయి. కాలం ఉపయోగకరంగా గడిచింది. చదువులు బాగా సాగాయి. రాజకీయపరిజ్ఞానం అభివృద్ధి చెందినది.

ఎన్. కె. కృష్ణన్

కామ్రేడ్ ఎన్. కె. కృష్ణన్ జైలులో మాకు నాయకుడుగా వున్నారు. వారిబుద్ధితీక్ష్ణత ప్రశంసించదగినది. అనేక విషయాలను చక్కగా చదివి జీర్ణించుకొన్న ప్రతిభాశాలి. ఎంత గొప్పవిషయాన్నీ, ఎంత చక్కని సమస్యనైనా పండు ఒలిచి చేతిలో పెట్టినరీతిగా బోధించేవారు. రెండుమూడుగంటలు ఉపన్యసించినతరువాత ప్రశ్నలు వేసి సంశయాలను తీర్చుకోమని కోరేవారు.

ఎన్. కె. కృష్ణన్‌గారికి ఇంటరు, బి. ఎ. పరీక్షలలో వచ్చిన మార్కులు మద్రాసు యూనివర్సిటీలోనే అత్యధికమనీ, కొన్ని సబ్జక్టులలో ఇప్పటికీ వారి రికార్డును మించినవారు లేరనీ కొందరు చెప్పారు.

ఐ. సి. యస్. పరీక్షకోసం ఇంగ్లాండుకు వెళ్లి, కమ్యూనిస్టుగా మారివచ్చిన వ్యక్తి ఆయన.

గొప్ప మేధావి మాత్రమే కాదు. నిరాడంబరజీవి కూడాను. బట్టలు చాలక చాలమంది డెటిన్యూలు బాధపడుతూండేవారు. కొందరు వ్యవసాయకూలీలను పొలాల్లో అరెస్టుచేసి జైలుకు తీసుకొచ్చారు. మరికొందరు ఫ్యాక్టరీ కార్మికులు. వీరుపైబట్టలతో వచ్చారు. మాలో మేము ఎంత సహాయంచేసుకుంటున్నా, బట్టల సమస్యను పరిష్కరించడం సాధ్యపడలేదు. కృష్ణన్ ఒక్కతువాలు మాత్రమే చుట్టుకొని కాలంగడపడం ప్రారంభించాడు.

"ఏం! మహాత్ముడివి కావాలని ప్రయత్నిస్తున్నావా? అని పరిహసించాను.

"లేదు, బయటకి వెళ్తేబట్టలెక్కువ అవసరం. అందువల్ల దాచిపెట్టుకుంటున్నాను" అన్నాడు. అలాగే ఆయన జైల్లో తువ్వాళ్ళతో కాలంగడిపారు. బట్టలు చాలవని కష్టాలు చెప్పుకోవడం మానేశారు. అంతేకాదు; బయటినుండి బంధువులు తిను బండారాలేమి తెచ్చియిచ్చినా చూడనైనా చూడకుండా అందరికీ సమానంగా పంచిపెట్టవలసిందని యిచ్చేసేవారు. తనకు వచ్చే డబ్బునుకూడా లేనివారికి యిచ్చేవారు. ఆయనకు కొన్ని లోపాలుకూడా లేక పోలేదు. భోజనంకంటె కాఫీ, టీ, సిగరెట్లే ముఖ్యం;

కాంగ్రెసు మిత్రులు

1947 ఆగష్టు 14 తేదీన మేము విడుదల కాగానే మద్రాసు సెంట్రలు స్టేషనులో చాలమంది పూలదండలతోను, జండాలతోను వచ్చి మమ్మ సన్మానించారు. వీరందరూ మద్రాసులోని కార్మికులు, విద్యార్థులు. కాంగ్రెసువాదులు, మధ్యతరగతి విద్యాధికులు మాత్రం రాలేదు; దేశభక్తులు రెండువర్గాలుగా చీలిపోతున్నారని గ్రహించాము.

కాంగ్రెసు మిత్రులు నన్ను కలుసుకొన్నప్పుడు నా రాజకీయాలను ఖండించేవారు. కాంగ్రెసును అధికారాన్నుండి తొలగించి, కమ్యూనిస్టుపార్టీ అధికారంలోకి రావాలని ఉద్దేశించుతున్నట్టుగా నిందించేవారేగాని, స్వరాజ్యం ప్రజారాజ్యంగా మారుతున్నదా లేదా అనే విషయాన్ని ఆలోచించడంలేదు. ఎన్నికల ప్రణాలికల ప్రకారంకాని, పూర్వపు కాంగ్రెసు తీర్మానాల ప్రకారంకాని కాంగ్రెసు పరిపాలించుచున్నదా లేదా అని కాం

గ్రెసు మిత్రులు విమర్శించడం మానేశారు. ఆ కాలంలో (1947-48లో) కమ్యూనిస్టులు ప్రభుత్వాధికారం కొరకు తమతో పోటీ చేస్తున్నారని సంశయించి, వారిని ద్వేషించడం, వారిని చూచి భయపడడం ఎక్కువవుతూ వచ్చింది.

జైలునుండి బయటికొచ్చిన తరువాత కార్మిక సంఘాలలో పనిచెయ్యడం మానేశాను. దేహదార్ఢ్యం సన్నగిల్లుతోంది. అందువల్ల కష్టమైన పనులను, బాధ్యతతోకూడిన పనులను మానివేసితిని. పార్టీ కార్యకలాపాలను కూడ మానుకొంటూ వచ్చాను. నా వయసు అరవై సంవత్సరాలకు సమీపించుతున్నది. శక్తికి తగినట్లు ప్రవర్తించడం మంచిదని రాజకీయాలను కూడ పూర్తిగా వదలిపెట్టాలని నిశ్చయించుకున్నాను.

"మాభూమి" నాటక ప్రదర్శనాలు

ఆ కాలంలో నైజాం నవాబుప్రభుత్వంమీద, రజాకార్లమీద ఇండియా అంతటా ద్వేషం పెరిగిపోతున్నది. ఆగస్టు 15 తేదీ తరువాత నైజాం ప్రభువు ఇండియా ప్రభుత్వంతో కలిసిపోవుటకు నిరాకరించడంతో ప్రజలు కోపోద్రిక్తులయ్యారు. అప్పటికే తెలంగాణా ప్రజలు ప్రభుత్వంమీద తిరుగబడి పోట్లాడుతున్నారు. నైజాం సంస్థానంలో కాంగ్రెసు, కమ్యూనిస్టుపార్టీలవారు ప్రజలకు నాయకత్వం వహించి ఆయుధాలతో పోరాటాలు సాగించియున్నారు. మరొకవిధంగా రజాకారు రాక్షసులను అణచలేకపోయారు.

ఆంధ్రదేశంలో కమ్యూనిస్టుపార్టీవారు "మాభూమి" నాటక ప్రదర్శనాలతో ప్రజల అభిప్రాయాలను మార్చివేయుచుండిరి. నైజాం రాక్షసత్వాన్ని ద్వేషించుటకు ప్రజాప్రభుత్వమే శరణ్య

మని నిరూపించుటకుగాను, ఆ నాటకం బాగా వుపయోగపడుతు న్నది. రచయితలు, నాయకులు దానిని చాలా మెచ్చుకున్నారు. ఆ నాటకం చూడాలని, నాకు కోరిక కలిగింది.

నైజాం ప్రభుత్వంతో పోట్లాడే తెలంగాణా ప్రజలకు ఆయుధాలకని కాంగ్రెసుపార్టీవారు, కమ్యూనిష్టుపార్టీవారు ప్రత్యే కంగా ధనం వసూలు చేసి యిస్తూండేవారు. మద్రాసులోకూడ కాంగ్రెసువాదులు వసూలుచేసిన తరువాత కమ్యూనిష్టులుకూడ వసూలుచేసి పంపండని ఆంధ్రరాష్ట్రపార్టీవారు నన్ను కోరారు. "మాభూమి" ప్రదర్శనాలద్వారా వసూలు చెయ్యగలనని, నాటక బృందాన్ని పంపండని కోరాను.

అలాగే నాటక బృందం వచ్చింది. డబ్బు వసూలు అంత ముఖ్యం కాదనీ, మద్రాసు నగరంలోని ఆంధ్రనాయకులు, మం త్రులు, పత్రికా రచయితలు మొదలగు ప్రముఖులు చూచేలాగు, దానిని ప్రశంసించేటట్టు పత్రికలలో వచ్చేలాగా చేయమని కోరారు. అలాగే చేశాము. డబ్బుకూడా వసూలు చేశాము.

అప్పుడు కాంగ్రెసు మంత్రులు యిలాంటి ప్రచారానికి చాల సుముఖంగా వున్నారు. నాటకం ప్రజారంజకంగా ఉన్నది. అందరూ మెచ్చుకొన్నారు. కొందరు మంత్రులు, హైకోర్టు జడ్జీలు మెచ్చుకోవడమే గాక రు 116/ లు బహుమతు లిచ్చార

## శ్రీ సీ తా రా మ రా జు బు ర్ర క థ

మద్రాసులో "మాభూమి" నాటక ప్రదర్శనాలు చూచి మంత్రులు ఆనందించి ప్రోత్సహించుటవల్ల బ్రిటిష్‌ప్రభుత్వంచే నిషేధింపబడిన "సీతారామరాజు బుర్రకథ" రాజాజీ హాలులో

శాసనసభాసభ్యులకు ప్రదర్శించబడినది. దానిమీదవున్న నిషేధం తొలగించుతామని మంత్రులు ఆశపెట్టారు.

మూడునాలుగు నెలలు గడిచాయి. ఆ నిషేధం తొలగలేదు. సరిగదా "మాభూమి" నాటకప్రదర్శనాలమీద మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వం నిషేధం ప్రకటించింది.

ముందు ఆలోచన లేకపోవుటవల్ల కాంగ్రెసునాయకులు "మాభూమి"ని ప్రశంసించి విరాళాలిచ్చారు. వారే తరువాత నిషేధించి అణగద్రొక్కారు. ఈవిధంగా కాంగ్రెసుప్రభుత్వం తన అభిప్రాయాన్ని మార్చుకోవలసిన పరిస్థితి కలుగుతుందని మేము ముందుగా భావించినట్లే జరిగింది.

మహాత్ముని హత్య

గాంధీజీ హత్యకు ముందురోజు సాయంత్రం ఆర్. యస్. యస్. ర్యాలీని మైలాపూరులో చూచాను. నేను వారి ర్యాలీని చూడడం అదే మొదటిసారి. తిరుణాలకు వచ్చేట్లుస్త్రీలు, పురుషులు పిల్లలు గుంపులుగుంపులుగా వచ్చారు; ముఖ్యంగా విద్యావంతుల కుటుంబాలవారు-తెలుగు, తమిళ, మళయాళ, కన్నడ, హిందూ స్థానీయులు అందరూ వచ్చారు. హైందవేతరులుమాత్రం రాలేదు. బహుశా ఆహ్వానింపబడలేదేమో: ఏర్పాట్లు చాలా బాగా చేశారు. వేలమందివాలంటీర్లు పాల్గొన్నారు. క్రమశిక్షణ, వ్యాయామాలు చాల నైపుణ్యంగా ప్రదర్శించారు.

ప్రజలేగాక, చాలమంది విద్యాధికులు, ధనాఢ్యులు, అధి కారులు కూడ వచ్చారు. కాంగ్రెసు అగ్రనాయకులు రాలేదు. కాని, చిల్లరనాయకులుకూడ కొద్దిమంది వచ్చారు. కాంగ్రెసు ఉద్యమంతో గాని, ఏ జాతీయోద్యమముతోగాని సంబంధంలేని

పెద్దలు చాలామంది వచ్చారు. అలాంటివారి నందరిని మరొక మీటింగులో నేను చూచియుండలేదు. ఇంతమంది ఆర్. ఎస్. ఎస్. ఉద్యమాన్ని ఆదరించడం చూడగా నాకు ఆశ్చర్యం వేసింది. నా ఆశ్చర్యాన్ని చూచికాబోలు, యుద్ధకాలంలో ఐ. యమ్. ఎస్. ఆఫీసరుగా ఉన్న ఒక యువకుడు సగర్వంగా నాతో "ఆర్. ఎస్. ఎస్. ఉద్యమంలో చేరండి" అన్నాడు. నాకు నవ్వు వచ్చింది. తర్వాత చాలక్ గోల్వాల్కరుగారి ఉపన్యాసం కొంత విన్నాను. జాతీయోద్యమాన్ని జాతీయ యోధులను తీవ్రంగా ఖండించారు. నాకు అసహ్యంవేసింది. మధ్యలో లేచి వెళ్లిపోయాను. కాని, హిందూ విద్యాధికులలో ఆ కమ్యూనల్ ఉద్యమముయొక్క బలం మున్నగువాటి వ్యాప్తిని కళ్లారా చూచి నాకు భయం కలిగింది. వీరి కోరిక ప్రభుత్వయంత్రాన్ని పట్టుకోవాలని. తద్వారా జాతిమతద్వేషాలతోకూడిన నియంతృత్వాన్ని స్థాపించుతారు. మన జాతీయోద్యమానికీ, ప్రజాస్వామ్యమునకూ, అన్నివిధములైన అభ్యుదయోద్యమాలకు ఈ జాతి మత దురభిమానపూరితమైన వుద్యమంవల్ల తీరనిహాని సంభవిస్తుందేమోనని చాల విచారపడినాను.

మరునాడు ఉదయం ఒక మిత్రుని వెంటతీసుకొని శ్రీవీరేశలింగంగారి శతవార్షికోత్సవసందర్భంలో పనిచేయుటకు బయలుచేరాను. ఆ మిత్రుడు ఆంధ్రదేశంలో ప్రఖ్యాతిచెందిన ఒక హైస్కూలు హెడ్‌మాస్టరుగా వుండిరి. వారు అభ్యుదయభావములు కలవారనీ, గొప్పసంస్కారప్రియులనీ ప్రఖ్యాతిగలవారు. నేను చూచిన ర్యాలీనిగురించి ప్రస్తావించాను. "అది దేశభక్తుల సంస్థ. ఢిల్లీలో వారు చేసిన సేవ అమోఘం. ముస్లింలీగు పత్రలను

బయటబెట్టి, కాంగ్రెసునాయకుల ప్రాణాలను రక్షించారు" అని చెప్పి, తమ పట్టణంలో జరిగిన ర్యాలీకి తానే అధ్యక్షత వహించి నట్టుకూడ సగర్వముగా చెప్పారు; రెండురోజులకు జరుగబోయే ఆంధ్రరాష్ట్ర ర్యాలీలో నాలక్ గోల్వాల్కరుగారు ప్రసంగించు తారనీ, ఆ ప్రదర్శనంలో తానే ప్రారంభోపన్యాసకుడననీ చెప్పారు. నాకు ఈ విషయాలు చాల ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఇలాంటి గొప్పవ్యక్తి ఆర్. యస్. యస్. ఉద్యమాన్ని అభిమానించి గర్వపడ్డారంటే, జాతీయోద్యమం గతి ఏమవుతుందోనని విచార పడినాను.

ఆ సాయంత్రం కలకత్తా మెయిలులో గోల్వాల్కరుగారు బెజవాడకు బయల్దేరుతారు. ఆర్. యస్. యస్. వాలంటీర్ల వీడ్కోలు ప్రదర్శనా లుంటాయి. చూద్దామని నేను సెంట్రల్ స్టేషనుకు వెళ్ళాను. వేలమంది వాలంటీర్లు వచ్చారు. ట్రెయిను పొడవునా ప్లాటుఫారంమీద అయిదారు వరుసలుగా బారులు తీరి కూర్చున్నారు. ఎంత క్రమశిక్షణ!

ఇంతలో గాంధీగారిని హత్యచేశారనే వార్త పిడుగులా గున వచ్చిపడింది. ఒక్కక్షణం అలాగే స్థంభించిపోయాను. హృద యంలో భరించరాని బాధ కలిగింది. నాకు తెలియకుండానే కళ్ళ నుండి నీరు కారిపోతోంది. జాతీయ పితనే చంపేశారు. అంద రం తండ్రిలేని పిల్లలమైపోయాము. మ రేమేమో దుఃఖకర మైన భావాలు రాసాగాయి. మరి నిలువలేకపోయాను.

ఇంతలో ఆర్. యస్. యస్. వారివైపుకు నా దృష్టి మళ్లింది. వాలంటీర్లలో ఎంతమాత్రం అలజడి కనుపించలేదు. పైగా కొందరి ముఖాల్లో చిరునవ్వు కనుపించింది. ఈ దృశ్యం

నన్ను మరింత బాధపెట్టినది. ఇక నక్కడ ఉండలేక బయటికి వచ్చివేశాను.

ప్రజలలో మాత్రం ఈవార్త ప్రళయంలా బయలుదేరింది. హాహాకారాలు మిన్నుముట్టాయి. "మహాత్ముని చంపడమే!" "ఎవరు చంపారు?" "ఇండియాగతి ఏమవుతుంది?" "అంతర్యుద్ధానికీ, రక్తపాతానికీ దారితీస్తుందా?" అని ప్రజలనుకోవడం విన్నాను. నీరసంగా ఉంది; ఇంటికి చేరుకున్నాను.

ఇక ఇంటివద్ద నా భార్య, బిడ్డలు దుఃఖంలో మునిగి వున్నారు. రేడియోవద్ద కూర్చొని విషాద గీతాలు, ఏడ్పులు వింటూ, తామూ ఏడుస్తూ కూర్చున్నారు. ఎవరూ భోంచెయ్యలేదు; పడుకోలేదు; నిద్రలేదు. ఇంటిలో నౌకర్లు నిర్ఘాంతపడిపోయారు. అందులో ఒకరు నా భార్యను యిలా అడిగారు: "ఏమండీ అమ్మగారూ! మీ తండ్రి చనిపోయినపుడు కూడ మీరిలా దుఃఖించలేదుకదా? మరి ఇప్పు డింత దుఃఖిస్తారేమిటి?"

"అప్పుడు నాకు మాత్రమే తండ్రిపోయాడు? ఇప్పుడు నాకే కాదు; అందరి తండ్రి పోయాడు; మనమందరం దిక్కులేని పిల్లలమైపోయాము" అన్నారు సుభద్రమ్మగారు.

ముస్లిమే హత్యచేసి వుంటాడని మొదట్లో నే ననుకున్నాను. కొంతసేపటికి ముస్లిం చేసివుండడని తోచింది. చేస్తే ముస్లింలకు చాల హాని కలుగుతుందని వారికి తెలుసును. మత పిచ్చుగల హిందువే చంపి ముస్లిములమీద నిందవేసివుంటాడు; బహుశా ఆర్ యస్. యస్. లోనే యిలాంటి రాక్షసుడు, జాతీయవాదద్వేషి ఉండాలనుకొంటూ మరునాడు బజారులో నడుస్తున్నాను. ఐ. ఎమ్. ఎస్. లో వున్న ఆర్. యస్. యస్. యువ

కుడు ఎదురుపడ్డాడు. ఆర్. యస్. యస్. వారే హత్యచేసి వుంటారని నా సంశయాన్ని ఆయనతో చెప్పాను. "అలాగా?" అని సగర్వంగా చిరునవ్వు నవ్వి వెళ్లిపోయాడు. నాకు ఆశ్చర్యం కలిగి నిలబడిపోయాను. ఆయన వెళ్తూంటే ఆయనవైపే చూస్తూ వుండిపోయాను. రొమ్ము విరిచి నడిచిపోతున్నాడు.

హత్యనుగురించి వివరాలు తెలిసిపోయాయి. కొందరు ఆర్. యస్. యస్. భక్తులు మిఠాయీలను పంచిపెట్టారనీ విన్నాను. వారికి వ్యతిరేకంగా చాల ప్రదేశాలలో ప్రజలు ప్రదర్శనాలు చేస్తున్నారు. ప్రభుత్వం ఆ ప్రదర్శనాలను అణచివేస్తూ ఆర్. యస్. యస్. వారికి హాని కలుగకుండా కాపాడుతున్నారు.

రెండు మూడు రోజులు గడిచాయి. ఒక మాజీ ప్రిన్సిపాలుగారిని వారి యింటిలో కలుసుకున్నాను.

"హత్యలతో మన దేశసమస్యలు ఎలా పరిష్కారం కాగలవు? డెమాక్రటిక్ పద్ధతులు మాత్రమే మనకు శరణ్యమండి!" అన్నారు వారు.

ఆయన కుమారుడు అందుకొన్నాడు—"గాంధీగారిని చంపడం మంచిదేనండి; లక్షలకొలది ప్రజలు చచ్చిపొయ్యేదానికంటే ఒకరుమాత్రమే చావడం మంచిదికదా? ఇంకా ఒకరిద్దరు నాయకులను చంపేస్తే మనదేశం బాగుపడుతుంది" అన్నాడు ఆ యువకుడు.

తండ్రికీ, నాకూ ఆశ్చర్యం వేసింది. "ఒక మహాత్ముడు చాలడట్రా! ఇంకా ఇద్దరిని చంపాలనా?" అని తండ్రి మందలించారు.

"అవును! అప్పటికిగాని దేశం బాగుపడదు!" అన్నాడు కొడుకు. తండ్రిగారికి భయం కలిగింది.

"మా మాటల్లో నీ కెందుకు జోక్యం? నోరుమూసుకొని ఇక్కడినుండి వెళ్లిపో" అన్నారు తండ్రిగారు.

కొడుకు కాశీ హిందూవిశ్వవిద్యాలయ గ్రాడ్యుయేటు. అక్కడ ఆర్. యస్. యస్. పిచ్చి పట్టిందని చెప్పి తండ్రి విచారం వెల్లడించారు. విద్యార్థులు ఈలాగున రాక్షసు లవడం నా కంతవరకూ తెలియదు.

వెనుక చెప్పిన మాజీ హెడ్‌మాష్టరుగారు కనుపించారు. "ఆర్. యస్. యస్. వారు దేశభక్తు లనుకున్నాను. మా హైస్కూలు కాంపౌండులో వారి మీటింగులను జరుపుకో నిచ్చాను. వారు హత్య ఎందుకు చెయ్యాలి?" అన్నారు.

"అయితే, వారిమీద అభిమానం ఇంకా ఉన్నట్టుందే!" అని నా సంశయాన్ని తెలియపరిచాను.

"అవునండి. ఎలాంటి వుత్తమ సంస్థలోకూడ దుర్మార్గులైన వ్యక్తులు కొందరుంటారండి" అన్నారు హెడ్‌మాష్టరుగారు. ఆయన అజ్ఞానానికి జాలి వేసింది.

బొంబాయికి సంబంధించిన గొప్ప బ్యాంకుకు మద్రాసులో బ్రాంచి వున్నది. దాని మేనేజరుగారిని కలుసుకోవాల్సి వచ్చింది. అదే సమయంలో ఒక దిన పత్రిక యజమాని వచ్చాడు. ఆ రోజుల్లో ఎవరింటికి వెళ్లినా మహాత్ముని హత్యనుగురించిన బాతాఖానీ సర్వసామాన్యమైనది.

"మహాత్ముని అవతారం అంతరించడం దేశానికి ప్రస్తుతము మంచిదేనండి! ఆయన చేయగలిగిన దేదో చేశారు,

స్వరాజ్యం సంపాదించిపెట్టారు. ఇక కావలసింది ఆర్థికాభివృద్ధి. మిల్లులూ, బ్యాంకులూ వగైరా వృద్ధికి తేవాలి. ఇక ఆయన చేయగలిగినదేమీ లేదండి। అన్ని విషయాల్లోను, ఆయన జోక్యం కలుగజేసుకొంటూవచ్చారు; ఆయన చెయ్యలేదు. ఇతరులను చెయ్యనివ్వడు. ఇకమీదట దేశసౌభాగ్యరథము సాఫీగా సాగిపో గల"దని బ్యాంకు ఏజంటుగారు చిన్న వుపన్యాసమిచ్చి ఎంతో సంతోషంగా కన్పించారు. చెప్పుతో కొట్టాలన్నంత కోపం వచ్చింది నాకు. ఎలాగో కంట్రోలు చేసుకొన్నాను.

వార్తా పత్రిక యజమాని 'సినికల్‌గా నవ్వుతూ "హీ। హీ హీ।" అంటూ బ్యాంకు మానేజరు మాటలకు తాళం వేస్తున్నారు.

"అవతారపురుషు లెందరో అలాగే హత్యచెయ్యబడ్డారండి. కృష్ణావతారంకూడ అలాగే అంతమయింది" అని చెప్పి తృప్తి పడ్డారు.

గాంధీగారి హత్యకు దేశంలో ఎంత సానుభూతి ఉన్నదో తెలిసిపోయింది. కాల్చివేసింది ఒక్కడే అయినా వానికి వెనుక నైతిక మద్దతుగా ధనాఢ్యులు, విద్యావంతులు, మతోన్మా దులు, "దేశభక్తులు" వేలు లక్షలుగా ఉన్నారని గ్రహించాను. నలభై సంవత్సరాలుగా రాజకీయోద్యమాలలో పాల్గొంటూ వచ్చిన నేను మన మధ్యతరగతివారిని కూడ అర్థంచేసుకోలేక పోతినని సిగ్గుపడ్డాను. గాంధీజీని భారతీయుడే హత్యచేసినప్పటి నుండి రొమ్మువిరుచుకొని, తలెత్తి నటవడం నాకెంతో కష్టంగా వున్నది.

గాంధీజీ జీవించి యుండగా జీవించేభాగ్యం నాకు లభించి నందుకు గర్వపడిన సమయాలు ఎన్నో వున్నాయి. ఆయనను

హత్యచేసిన ఈ హంతకులకు నైతికంగా సహాయం చేసినవారు "దేశాభ్యుదయం కోసం" చేశామని విర్రవీగడం నా హృదయాన్ని కత్తితో పొడిచినట్లు బాధపడుతూనే వున్నాను.

గాంధీగారి హత్యతో కొందరు సంతోషపడుతున్నారనే విషయం నా కెంత విషాదాన్ని కలిగించిందో వ్రాయలేను.

## శ్రీ వీరేశలింగం శతవార్షికోత్సవం

1948 వ సంవత్సరంలో శ్రీ వీరేశలింగం పంతులుగారి శతవార్షికోత్సవం రానున్నదని తెలిసి మద్రాసులో వైభవంగా జరిపించాలని పూనుకొన్నాను. నగరంలో నున్న సంఘ సంస్కర్తలను, బ్రహ్మసమాజికులను సంఘటితపరచి ప్రారంభించాలని ప్రయత్నించాను. కాని, వారిలో ఉత్సాహం కనుపించనందున వారిని వదలివేశాను.

తరువాత అభ్యుదయ రచయితలు ఉపయోగపడెదరని ఆశించాను. కాని, వారు మాటలలో ఎంత ఉత్సాహం చూపెట్టినా నిర్ణీత సమయానికి మీటింగులకే రాకపోయిరి.

కట్టకడపటికి శ్రీ హరిసర్వోత్తమరావు గారు మాత్రం ఉత్సాహం చూపించుటేగాక, నిర్దిష్ట సమయంలో కలుసుకొనేవారు. మరొక గొప్ప సుగుణంకూడ వారిలో వున్నది. త్వరగా నిర్ణయానికి రాగలరు; కార్యనిర్వహణకు పూనుకోగలరు. అందువల్ల వారితో కలిసి పనిచేయడం చాల సులభంగా ఉండేది.

ఉన్నతోద్యోగులలో కీ॥ శే॥ శ్రీ వింజమూరి గోవింద రాజాచారిగారు చాల ఉత్సాహంతో సహాయం చేస్తారని తెలుసుకున్నాను. అలాగే ఆడిటరు శ్రీ పి. బ్రహ్మయ్యగారు, కీ॥ శే॥ శ్రీ కే. కల్యాణస్వామిగారు, శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ

గారు, శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు — వీరందరితో ఒక కార్యనిర్వాహక కమిటీని ఏర్పరచి పనులు ప్రారంభించాము. ఈమాత్రం చేయడానికే మూడునెలలకాలం పట్టింది. బస్సులకు, ట్రాములకు ఒక వందరూపాయలదాకా ఖర్చయినది.

కీ॥ శే॥ గోవిందరాజాచారిగారు

శ్రీ గోవిందరాజాచారిగారికి ఈ విషయంలో చాల ఉత్సాహముండేది. కమిటీలో చేరారు. వారు హైకోర్టు జడ్జీగారు. నేను కమ్యూనిస్టునని తెలుసు. నాతో కలసి పనిచెయ్యడం వారి కిష్టం లేదు. చెయ్యకపోతే తలపెట్టిన పని నెరవేరదు; ఎలాగో కలసి పనిచేస్తూనేవచ్చారు. కొంతకాలానికి తన పేరును కమిటీలో నుండి తొలగించవలసిందని కోరారు. కాని, సహాయం చేస్తూనే ఉండేవారు. లెటర్‌పేపర్లమీద లోగడ ఆయనపేరుసుకూడ కలిపి అచ్చు వేయించాను. ఆయనపేరు కనపడేటట్టు కొట్టివేసి ఉపయోగించుతుండేవాడిని. ఆయనపేరు ఉండడం ఎంతో అవసరంగా తోచింది నాకు. అంతమాత్రం కొట్టివేస్తే చాలదనీ, తన పేరు లేకుండా మళ్ళీ అచ్చువేయించవలసిందనీ నిర్బంధించారు. అలాగే చేశాను.

ఆయన సలహా, సహాయం ఈ సందర్భంలో చాల అవసరమని క్రమంగా తెలుసుకొంటిని. అందువల్ల నా కమ్యూనిజాన్ని ప్రదర్శించుకోలేదు. రాజకీయవాదాలు వారితో పూర్తిగా మానివేశాను. అంతటితో నాయందు వారికి నమ్మకం కలిగింది. కాని, చివరవరకు నాపుత్తరాలకు వ్రాతమూలకంగా ప్రత్యుత్తరాలు వ్రాయనేలేదు. అవసరముంటే టెలిఫోనులో మాట్లాడుతూండేవారు. అయితేనేం? మొదటినుండి కడపటివరకు వారు సహాయం

చేసియుండకపోతే మద్రాసులో అంత వైభవంగా, అంత జయ ప్రదంగా వీరేశలింగంగారి శతవార్షికోత్సవం జరిగివుండేది కాదు.

ఎలక్షన్లు—రాజకీయపు పెత్తులు

చివరకు శ్రీ గోవిందరాజాచారిగారు ఒకరోజున టీకి తన యింటికి రమ్మన్నారు. శతవార్షికోత్సవాన్ని గురించి తీర్మానించు కోవలసిన విషయాలు చాలా వున్నాయి.

అప్పుడు ఆయనే రాజకీయాలు తెచ్చారు. మరెవరూ లేరు. ఉన్నదున్నట్లు మాట్లాడుకోగలిగాము. కొంత సంభాషణ జరిగిన తరువాత ఎలక్షన్ల విషయం వచ్చింది.

"ఎలక్షన్లు జరుగవు" అన్నారు ఆయన.

"మీరు పొరపాటుపడుతున్నారు. 1950 సంవత్సరంలోగా జరుగుతాయని పేపర్లలో నాయకుల ఉపన్యాసాలు చదువడంలేదా?" అని అడిగాను.

"వయోజన వోటింగుహక్కు ఉన్నంతకాలం ఎలెక్షన్లు ఉండవు; కాలయాపన చేయబడుతూనే వుంటుంది" అన్నారు.

"నాకు నమ్మకం కలగడంలే"దన్నాను.

"నీకంటే ఎక్కువ రహస్యాలు తెలియుటకు నాకు అవ కాశాలున్నాయి" అన్నారు మళ్ళీ ఆయన.

"తుదకు మనకూ రష్యాగతీ, చైనాగతే పడుతుందా?" అన్నాను. వారు సమాధానం చెప్పలేదు. కాని, వారి ముఖంలో సంతోషం పోయి దిగులు మాత్రమే కన్పించింది. నాకు ఫలహా రాలు, కాఫీ చాలా చేదువేశాయి.*

* వయోజన వోటింగు విధానం వున్నంతకాలం ఎన్నికలు జరుగ వనే విషయం మనదేశ రాజకీయ రంగంలో ఎలా పరిణమిస్తుందోనని

## వీరేశలింగంగారి సంస్థల పాట్లు

శ్రీ గోవిందరాజాచారిగారికి శ్రీ వీరేశలింగంగారిమీద అత్యంత అభిమానం. అంతేకాదు: పంతులుగారు స్థాపించిన సంస్థలు, ఆస్తులు సరిగా నిర్వహింపబడుటలేదని, వాటిని సరియైన స్థితిలో పెట్టుటకు ప్రయత్నించవలసిందని మద్రాసు ఆంధ్ర ప్రముఖులు చాలామంది మాతో అన్నారు. ఇలాంటి విషయాలను గురించిన వివరాలు తెలియని నాలాంటివాడు ఎన్నో విచారకరమైన విషయాలను వినవలసివచ్చింది. పంతులుగారి శిష్యులలో నియోగి వైదిక తగాదాలతోను, బ్రాహ్మణ అబ్రాహ్మణ తగాదాలతోను వారు స్థాపించిన సంస్థలు పాడైపోతున్నాయని గోవిందరాజాచారిగారూ, నేనూ విచారపడితిమి.

"ఇంతమంది ఆంధ్రులము, హైకోర్టు జడ్జీలము ఉన్నాంగదా! సలహా యివ్వలేమా? తగాదాలు తీర్చుకోకూడదా? సరియైన స్కీము నేర్పరచుకోకూడదా? నేనే ప్రాక్టీసు చేస్తూవుంటే స్కీముసూటు వేసివుందును. ఇప్పుడూ మరెవరిచేతనైనా స్కీముసూటు వేయించవచ్చు. ఖర్చులకుగాను పదివేలరూపాయలు వసూలుచేద్దాము. కోర్టు కెక్కకుండా పరిష్కారం చెయ్యగలిగి

---

ఆలోచనలు కలిగాయి. కాంగ్రెసు కాక, ముస్లింలీగు, హిందూమహాసభ, కమ్యూనిష్టుపార్టీలు మాత్రమే ప్రజా సామాన్యంలో బలపడి ఉన్నాయి. ముస్లింలీగు, హిందూమహాసభ రెండేండ్ల లోపల అంతరించి పోయాయి. ఇక మిగిలినది కమ్యూనిష్టుపార్టీ ఒక్కటే. ఇప్పుడు దాని ఆటంకం కూడ తొలగిందనే నమ్మకం కలిగిన తర్వాతనే ఎన్నికలు జరుగుతున్నాయని తలుస్తున్నాను.

తిమా ఆ సొమ్మును పంతులుగారి సంస్థలకు యిచ్చేద్దాము" అని వారు తీవ్రంగా ఆలోచించారు.

ఈ శతవార్షిక సందర్భంలోనే తగాదాలు పరిష్కరించ వలసిందని కొందరు ఆంధ్రనాయకులు ఒత్తిడిచేశారు. ఖర్చులకు గాను విరాళాలు వసూలుచేయుటకు వెళ్ళిన కీ. శే. శ్రీ కె. కల్యాణస్వామిగారిని, నన్ను తీవ్రంగా ఆడిగేవారు. అంతట ఒక స్టేటు మెంటును తయారుచేసి ప్రముఖులచేత సవరణలు చేయించి, రాజమండ్రి సంస్థల కార్యనిర్వాహకులకు పంపాము.

అప్పుడు ఏమిచేయుటకూ టయిము చాలలేదు. వార్షికోత్సవము ముగిసిన తర్వాతనే చెయ్యాలి కాని, వార్షికోత్సవం పూర్తికాక ముందే నన్ను డిటైన్‌చేశారు. నేను జైలులో ఉండగా శ్రీ గోవిందరాజాచారిగారు కీర్తిశేషులయ్యారు. జైలునుండి విడుదలై రాగానే నా మిత్రుడు శ్రీ కె. కల్యాణస్వామిగారుకూడా మరణించారు. ఆ సంస్థలు ఇప్పు డెలాగున్నవో నాకు తెలియదు. తెలిసినవారికి, వాటిని సంస్కరించాలని కోరేవారికి నా సహాయం తప్పక లభిస్తుంది. కాని, నేనే ఆ బాధ్యతను నిర్వహించగల స్థితిలో లేను.

## మధ్యలో అరెస్టు

1948 మార్చిలో శ్రీ వీరేశలింగంగారి శతవార్షికోత్సవానికి పనిచేయుచున్న కాలంలో మరికొందరు జడ్జీలనుకూడా కలుసుకోవాల్సివచ్చింది. తమిళనాడు కమ్యూనిష్టుపార్టీకార్యదర్శి-నా మిత్రుడు ఎన్. కె. కృష్ణన్ నాతో

"ఏం చంచయ్యతాతా! హైకోర్టు జడ్జీలతో కలిసిపోయావు! మళ్ళీ అరెస్టు కాకూడదని నీ ఉద్దేశ్యమా?" అని నవ్వాడు.

"నే నలా అనుకోలేదు: శ్రీ వీరేశలింగంగారిని కొని యాడటం కమ్యూనిష్టులు చెయ్యవలసిన ముఖ్యకార్యంగా భావించాను" అని సమాధానం చెప్పాను.

అటుతరువాత కొద్దిరోజులలో అనగా 1948 మార్చి ఆఖరులో (29 తేది) శతవార్షిక కార్యనిర్వాహక కమిటీ మీటింగులో నన్ను యిలా ప్రశ్నించారు.

"పంచయ్యగారూ! పనులు ముమ్మరంగా జరిగిపోతున్నాయి; మీరే ఈ పనులను ముఖ్యంగా చూచుకొంటున్నారు. ఉత్సవానికి ఇంకా సుమారు యిరవై రోజులున్నాయి. ఒక వదంతి విన్నాము. కమ్యూనిస్టుపార్టీవారి నందరిని అరెస్టు చెయ్యబోతారట! మిమ్మల్ని అరెస్టుచేస్తే ఈ పనులన్నీ ఏం కావాలి?" ఇదీ వారి ప్రశ్నల సారాంశం.

"నన్ను అరెస్టు చేస్తారనుకోవడంలేదు. నేను గవర్నమెంటుకు వ్యతిరేకమైన పనులేవీ చేయటం లేదు. అయినా, న న్నేం చెయ్యమంటారో చెప్పండి! నా కార్యదర్శి బాధ్యతలను మరెవరైనా ఇప్పుడే పుచ్చుకోండి" అని ప్రార్థించాను.

"అలా చెయ్యొద్దు. ఈ కార్యం పూర్తి అయ్యేవరకూ మిమ్మల్ని అరెస్టు చెయ్యొద్దని మంత్రులతో చెప్తాము; ఒప్పుకోండి" అన్నారు.

"నే నందుకు సమ్మతించను. ఇప్పుడు నేను పార్టీకి రాజీనామా పెట్టడం సరికాదు. నేను పార్టీని వదులుకోనంతవరకూ మీకు మాట యిచ్చి, ఇద్దరివల్లా నేను చెడ్డవాడననిపించుకోవాల్సి వస్తుంది. కాబట్టి, మంత్రులను నా తరఫున అడుగవద్దు. నన్ను అరెస్టు చేస్తారని నేను నమ్మలేకుండా ఉన్నాను. ఎలాగైనా

నా రాజీనామాను అంగీకరించండి" అని వారిని వేడుకున్నాను. మరునాడే డబ్బు, ఫైల్సు వగైరా యిచ్చివేశాను. రెండురోజుల తరువాత నన్ను అరెస్టుచేశారు. ఏలూరు జైలులో డిటెయిను చేశారు.

## జైలులో నిరశన వ్రతాలు

డెటిన్యూల విషయంలో కాంగ్రెసు ప్రభుత్వం యేదోవిధంగా మమ్ములను రెచ్చగొడుతూనేఉంది. అతి కఠినంగా ప్రవర్తించి నది. వెల్లూరు జైలులో వుంచబడిన సుమారు మూడువందల మంది కమ్యూనిస్టు డెటిన్యూలలో ఎక్కువమంది కార్మికులు, కర్షకులు; చాలమంది విద్యాధికులు కారు. ఇంగ్లీషు చదివినవారి సంఖ్య చాల స్వల్పం. ప్రభుత్వం వారిని అనవసరంగా రెచ్చ గొట్టుతున్నదని వారు భావించారు. ప్రభుత్వం ఎంత తీవ్రంగా ఉన్నదో డెటిన్యూలు కూడ అంత పట్టుదలగానే వున్నారు. ఉద్రే కంతో ఎదుర్కొన్నారే కాని, ఎదుటిపార్టీ ఉద్దేశాలు, యెత్తుగడలు యేమిటో దీర్ఘంగా ఆలోచించడానికి పూనుకోలేదు. వీ రిద్దరి మధ్య నాలాంటి రోగులు, ముసలివారు బాధపడ్డారు.

మొదటి ఎనిమిది నెలల్లో పదమూడు తడవలు నిరశన వ్రతం చేశాము. అందులో పదితడవలు ఒక్కొక్కరోజు మాత్రమే. తతిమ్మా మూడుసార్లు కాలపరిమితి లేదు. "మరణిం చేవరకు" అని నిర్ణయించబడినది.

"బహిరంగ విచారణ లేక విడుదల" అనే నినాదం నాకు నైతికంగా నచ్చినది. నన్ను నిరశనవ్రతంలో చేరవద్దని ఎవరు ఎంత బ్రతిమలాడినా నేను సమ్మతించక చివరి జట్టులో చేరి ఎని మిదిరోజులు చేశాను. మిగిలినవారు పదిహేనురోజులు చేశారు.

దానితో నేను చాల నీరసించి పోయాను. కాని, గవర్నమెంటు చేసిన అన్యాయానికి గట్టిగా అసమ్మతి చూపించానన తృప్తి కలిగింది.

రెండవ పర్యాయం మూడురోజులు మాత్రమే చేశాము. అందరూ చెయ్యవలసిందేనని మేము తీర్మానించుకొన్నందున నేనూ చేశాను.

మూడోసారి నాలుగురోజులు చేశాను. గవర్నమెంటు మమ్ముల నేదో ఒకవిధంగా రెచ్చగొట్టుతూనే ఉన్నది. ఇంత కంటే మా ఆగ్రహాన్ని చూపించజాలక పోయాము. అయితే నాల్గవ రోజున నేను చాల బలహీనమైతిని. అందువల్ల స్ట్రైచరులో ఆసుపత్రికి మోసుకెళ్ళి చికిత్స చేశారు. అంతట నా బల హీనత నాకు తెలిసిపోయింది. కమ్యూనిస్టుపార్టీలో ఉండడంవల్ల వచ్చే కష్టాలను భరించలేక, త్యాగాలు చెయ్యలేక పార్టీకి రాజీనామా పెట్టాను. ముప్పైఅయిదు సంవత్సరాల తరువాత రాజకీయ రంగంలోనుండి విరమించాల్సివచ్చినందుకు ఎంతో విచార పడితిని.

### పార్టీలో మార్పులు – పదవీ వ్యామోహం

1940-42 లోను, 1947 లోను, 1948 లోను జైళ్లలో వందలమంది ముఖ్యనాయకులతో కలసివున్నందున పార్టీలో కల్గుతున్న అభివృద్ధిని చూస్తూవచ్చాను. చాలా త్వరితంగా సంఖ్యా బలంలోను, ఆర్గనైజేషన్‌లోను పార్టీ పెరిగిపోయింది. అంతేకాదు; ఇంగ్లీషు చదివినవారూ, విద్యాధికులూ, మధ్యతరగతివారి కంటే చదువురాని నిరక్షరాస్యులైన పక్కా కార్మిక-కర్షక నాయకుల సంఖ్య పెరిగిపోతూవున్నది.

కాని, పార్టీలో వయస్సు పరిపక్వం కాలేదు. కోపతాపాలు, మొండితనం, అసహనత మొదలైన యువకగుణాలు ఉంటున్నవి. తమ శత్రుపక్షం రెచ్చగొట్టితే సులభంగా రెచ్చిపోవడం, అభిమన్యు నిలాగా ప్రవర్తించటం పార్టీ యువకత్వాన్ని తెలుపుతుంది. అయితే వారి ధైర్యమూ, సహనమూ, త్యాగమూ మొదలగు గొప్పగుణాలకు నేను గర్వపడతాను

విద్యాధికులైన సభ్యులలో పెద్దమార్పు రాసాగింది. అదేదంటే పదవీవ్యామోహం (కెరియరిజము). ఈ దుర్గుణం ఇండియాలో ప్రతి రాజకీయపార్టీలోను ప్రవేశించి ఆ పార్టీలను నాశనం చేస్తున్నది. కమ్యూనిష్టుపార్టీలో పొడచూపిన ఈ దుర్గుణాన్ని వెంటనే అణచివెయ్యకపోతే పార్టీ నైతికదృష్టి క్షీణించిపోతుంది;

అంతర్జాతీయంగా, జాతీయంగా ఎన్నో అనుకూలమార్పులు వచ్చుచుండగా, పార్టీ వాటిని ఉపయోగించుకోలేకపోవడం పార్టీకి అనుభవము, ఆలోచనలు పరిపక్వం కాలేదని నిరూపిస్తుంది.

డెటిన్యూలతో పోలీసులు, జైలు ఆఫీసర్లు

"మమ్మలను నిందించవద్దండి; మేము యంత్రాలము. మీరు అధికారంలోకి రాబోతారుగా! అప్పుడు మీరు చెప్పినట్టేతూ. చ . తప్పకుండా నడుచుకొంటాము" అని అన్నప్పుడు కొందరు బుద్ధిహీను లా మాటలకే పుబ్బి, పదవీవ్యామోహంలో పడిపోతున్నారు.

తప్పులు చేసినా, కొంతకాలానికి తప్పులను గ్రహించడం వ్యక్తులలో నైతేనేమి పార్టీలో నైతేనేం గొప్పవిషయమే. అభివృద్ధిని సూచిస్తుంది. హిట్లరు రష్యామీద పడ్డప్పుడు బ్రిటిష్

సామ్రాజ్యవాదులకు సహాయంగా ఉండాలనే ఉద్దేశ్యంతో స్ట్రయి కులు రాకుండా చేశాము. అది తప్పని జైల్లో జరిగిన పునర్విమ ర్శలో ఒప్పుకొన్నందుకు చాల సంతోషం. అప్పట్లో బ్రిటిష్ సామ్రాజ్యాన్ని నాశనం చేయటానికి ప్రయత్నించిన పార్టీల వారిని "దేశద్రోహు"లని తిట్టడం కూడ తప్పేనని గ్రహించి నందుకు పార్టీకి నా అభివందనాలు.

ఈ పునర్విమర్శ సందర్భంలో కామ్రేడ్ ఎమ్. ఆర్. వెంకట్రామన్ చెప్పిన సమాధానం పార్టీసభ్యులందరూ ఆలోచిం చడం, గమనించడం బాగున్నది.

"మనం ప్రపంచ యుద్ధకాలంలో తప్పులు చేసినది వాస్తవమే కాని, దేశద్రోహుల మెంతమాత్రమూ కాదు. మనం సరిగా అర్థంచేసుకోలేకపోయాము. మన పార్టీ పసితనంలో ఉన్నది. అనుభవశాలురైన నాయకులు కూడా లేరు. తప్పులుచేసి నేర్చుకొంటున్నాము" అని ఆయన అభిప్రాయం. మహాత్ముడు "హిమాలయ పర్వతమంత తప్పు" చేశానని ఒప్పుకొన్నారు. అది ఆయన గొప్పతనాన్నే ప్రదర్శించింది.

గత మూడు నాలుగు సంవత్సరాలుగా జరిగిన విషయా లను కూడ సరిగా ఆలోచించుకొని, పార్టీ వయసు ఏ మ్ఫై నలభై యేండ్లో అనేలా యిక ప్రవర్తించడం మంచిదని నా సలహా. అభిమన్యునిలా పోట్లాడటం మానుకోవాలి. కుర్రతనంగా ప్రవర్తించడం ఇకనైనా మానడం మంచిదని విన్నవించుకుం టున్నాను.

36 సం॥ల రాజకీయ జీవిత సమాప్తి

నేను కమ్యూనిస్టుపార్టీలో సుమారు పది సంవత్సరా

లున్నా, వాస్తవంగా కమ్యూనిస్టును కాలేకపోతిని. కమ్యూనిస్టు అనదగినవాడు వర్గ పోరాటాన్ని నమ్మటమేగాక, నిత్యజీవితంలో కార్యరూపేణా ఆ తత్వం కన్పరచాలి. నాలో జాలి, దయ, దాక్షిణ్యాలు మొదలైన వున్నవే కాని, పెట్టుబడిదారీ వర్గాన్ని నాశనం చేయుటకు అవసరమైనంత ద్వేషం మాత్రం కలుగలేదు. గదరు పార్టీలో వుండగా సామ్రాజ్యవాదులైన బ్రిటిష్ ప్రభువులను చించి చెండాడాలన్నంత ద్వేషం చెలరేగుతుండేది; కాని, ఇప్పు డలా లేదు. ఎన్నికలలో జయం కొరకు మాత్రమే ప్రయత్నించుచుంటిని. పెట్టుబడిదారులచే కొద్దో గొప్పో ఇప్పించి, కార్మికులు సమ్మతించేలా, రెండు పార్టీలూ రాజీపడేలా ప్రయత్నించుచుంటిని. కాని, పెట్టుబడిదారీ పద్ధతిని, పెట్టుబడిదారులను, యజమానులను ద్వేషించి విప్లవానికి పునాది వేయుటకు ఇష్టపడలేకపోయాను.

అంతేకాదు; కార్మికుల జీవితం ఎంతో అధ్వాన్నంగా ఉన్నా, వారిపట్ల ఎంత జాలి ఉన్నా, నా ఆస్తిపాస్తులు వారికి వినియోగించాలనే త్యాగం నాలో కలుగలేదు. ప్రతిఫలం కోరకుండా సేవచెయ్యాలనే మామూలు ఆధ్యాత్మిక దృక్పథం మాత్రమే వుండేది. నా కున్న ఆస్తిని వారికి వినియోగించివేసి పేదజీవితానికి అలవాటుచేసుకోలేకపోయాను. ఎన్నో సంవత్సరాలు ప్రజాసేవ చేస్తున్నా స్వాభిమాని (Individualist)గా ఉండటమే ఒక గొప్పగుణమని తలచే నాలాంటివాడు కుర్రవాళ్ళతో చేరి, వారి శిక్షణకు లోబడి, వారిలాగా కష్టాలుపడి, త్యాగం చెయ్యడం చాల కష్ట మనిపించింది. నేను పార్టీలోనుంచి తప్పుకోవడం నాకూ వారికీ కూడా మంచిదే.

అయితే, నేను కమ్యూనిష్టుపార్టీలోనుంచి, రాజకీయాల నుంచి విరమించుకోవడానికి వ్యక్తిగతమైన అతి ముఖ్యకారణాలు ఉన్నాయి. వయసు ముదిరినకొద్దీ శారీరకంగా బలం క్షీణించిపోతున్నది. 1917లో గదరుపార్టీలో వున్నప్పుడు వెయ్యి బస్కీలు, నూటయాభై దండాలు తీసేవాడిని: ఇప్పుడు దండాలు చెయ్యనే లేను. బస్కీలు పదిమాత్రమే చెయ్యగలను. నిత్యము పదినిముషాలు కాళ్లు, చేతులు ఆడించడంకూడ విసుగేస్తుంది.

దీనికితోడుగా వ్యాధులు తీవ్రం (క్రానిక్) అయినాయి. భోజనం ఎంత ముఖ్యమో, మూడు మందులుకూడ అంత అవసరం. మా యింటిలో నా విస్తరిదగ్గర మూడు మందులూ పరిపాటి అయింది.

ఆర్థికంగాకూడ తీరని కష్టాలు వచ్చాయి. పది సంవత్సరాలుగా పార్టీలో పనిచెయ్యడంతో సంపాదించటం మానివేశాను. సంపాదించడమనేది కష్టజీవులను దోచుకోవడమేననే భావం నాలో కలిగినందుననే సంపాదన మానేశాను. 1942 వ సంవత్సరం తరువాత స్వరాజ్యం వచ్చిన దర్మిలా జీవితావసర వస్తువుల వెలలు తీవ్రంగా పెరుగుతూవచ్చాయి. భోజనం ఖర్చు తగ్గించుకొంటూ వచ్చాము. పాలు, నెయ్యి, నూనె, కూరగాయలు, పండ్లు వగైరా తగ్గించాము. పట్టు బట్టలు, సరిగ బట్టలు కొనటం పూర్తిగా మానేశాము. మిల్లు బట్టలుకూడ తగ్గించాము. ఇంతచేసినా ఆర్థికంగా సవరించుకోలేకపోయాము.

వెలలు పెరగడంవల్ల గత పదిసంవత్సరాలలో ఆదాయం కంటె అదనంగా యిరవైఐదువేల రూపాయలు ఖర్చు అయినది. నగలు, వెండిపాత్రలు, చిల్లర ఆస్తులు పదివేలరూపాయల విలు

వగలవాటిని అమ్మివేశాము. అప్పులుకూడ చేశాము. అంతకన్న ఎక్కువగా అప్పులు లభించలేదు. ఆదాయం వచ్చే ఆస్తులను వెంటనే అమ్మి అప్పులు తీర్చాలి. ఆర్థికంగా తీరని కష్టాలు కూడ రాజకీయ జీవితాన్ని మానుకొనటకు ఒక కారణం.

నేను జైలులో నిరశన వ్రతాలు చేస్తూవుంటిని. ఆ బెంగ వలన నా భార్య ఆరోగ్యం మరీ ఎక్కువగా క్షీణించుతూ వచ్చింది. ఆమెను చూచి నాకు, నన్నుచూచి ఆమెకు దుఃఖం పెరిగిపోయింది. ఈ కారణాలతో మా ఇద్దరి కూతుళ్ళ చదువులు క్షీణించడం చూస్తూవచ్చాము. అన్నివిధాల నేను ఇక రాజకీయ రంగానికి శక్తిహీనుడనైనట్టు గుర్తించాను.

పోలీసులను గురించి ఒకమాట చెప్పాలి. నేను జైలులో ఉండగా మా ఇంటిని పోలీసులు తరచుగా రాత్రిళ్ళు గంటల కొలది అనవసరంగా సోదాలు చేస్తుండేవారు. ఇంటివగ్గర పోలీసు నిఘా రాత్రిం బగళ్లు ఉండేది. వీటివల్ల నా భార్య, బిడ్డలకు సహింపజాలని ఇబ్బందులు కలుగుతూ వచ్చాయి. ఇవన్నీ కూడ నా రాజకీయజీవిత పరిసమాప్తికి కారణభూతమైనవి.

కాబట్టి 1948 సంవత్సరం అక్టోబరు 19 తేదీని కమ్యూనిస్టుపార్టీనుండియు, రాజకీయాలనుండియు విరమించుకోవలసి వచ్చింది. పార్టీసభ్యులు ఎంతో విచారము వెలిబుచ్చారు.

"తాతయ్యగారూ! విడిచిపెట్టవద్దు; కావలిస్తే, పార్టీలో అన్ని బాధ్యతలనుండి విరమించుకోండి" అని ఎంతో ప్రేమతో ప్రతిమలాడారు. కాని, రాజకీయ రంగంనుంచి విరమించుకోవడమే మంచిదని, 36 సంవత్సరాల తరువాత రాజకీయ జీవితం మానివేశాను.

ఈ విషయాన్ని నా భార్యతో చెప్పాను. అసలు రాచకీయ జీవితమునే మానుకోవలసివచ్చినందుకు దుఃఖించినది. రాచకీయాలద్వారా భారత ప్రజల అభ్యున్నతికి పాటుపడలేకపోతిమే అని ఆమెకు అసంతృప్తి కాని, ఒక పార్టీలో, ఒక మతాలో ఉండలేకపోతిమే అని కాని, పదవులు లేకపోయెనే అని కాని విచారం ఆమెకూ లేదు; నాకూ లేదు. మా ఇరువురికి అవసరమైనది మానవసేవ, భారత ప్రజాసేవ.

"విచారపడి ఏం ప్రయోజనం? మానివేయక తప్పదు! ఉడుతాభక్తిని ప్రతిఫలాపేక్ష లేకుండా దేశానికి సేవ చేశాము" అని ఎలాగో ఊరడిల్లినాము.

కమ్యూనిస్టుపార్టీలో వ్యక్తిస్థానం

ఈలాగు మానివెయ్యడం కష్టంకాదు. అంతకాలం పార్టీలో ఉన్నా, సామాన్య సభ్యుడుగా ఉన్నానే గాని, ఎలాంటి బాధ్యతగల స్థానంలోను ఉండలేదు; మొదటినుండీ ఉండదలచుకోలేదు. మరొక విశేష మేమంటే వ్యక్తి ఎంత గొప్పవాడైనా, కమ్యూనిష్టుపార్టీలో జయాపజయాలు, కార్యసాధన ఒక వ్యక్తిమీద ఆధారపడవు.

పార్టీ కార్యవిధానం తెలియని శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఒకసారి (1949 లో)

"చంచయ్యా! రావి నారాయణరెడ్డిగారూ దొరికిపొయ్యారు. ఇక తెలంగాణాలో కమ్యూనిస్టు పార్టీ పోయిందన్న మాటే" అన్నారు.

"రెడ్డిగారు దొరికి వుండరు. ఎందరు నారాయణరెడ్లు, ఎందరు నాయకులు దొరికినా ప్రజలలో లీనమైన పార్టీ నాశనం

కాదు" అని చెప్పగా, నాపైపు చూచి పిచ్చివాడనని అనుకొని నవ్వారు. నేనుకూడా నవ్వాను.

కమ్యూనిస్టుపార్టీ తతిమ్మా రాజకీయ పార్టీలవలె నాయకుల మీదగాని, వ్యక్తులమీదగాని ఆధారపడదని తక్కినపార్టీలవారికి తెలియదు.

### ఒక మహత్తర సంస్కృతీ ఉద్యమము

సుమారు పదిహేను సంవత్సరాలపాటు కమ్యూనిస్టులతో కలసి పనిచేశాను. తమిళనాడు, ఆంధ్ర పార్టీలతో నాకు దగ్గర సంబంధాలు ఉండేవి. రెండూకూడా చివరకు రాజకీయోద్దేశంతో ప్రారంభించినా, తమిళనాడులో కార్మిక సంఘాలు అభివృద్ధికి వచ్చాయి; ఆంధ్రదేశంలో సంస్కృతీఉద్యమం వృద్ధికి వచ్చింది.

నాకు ఈ సంస్కృతీ ఉద్యమమంటే చాల ఇష్టం. సంఘ సంస్కరణలతో కాలం గడుపుతున్న నాకు ఆంధ్ర కమ్యూనిస్టులు ప్రవేశపెట్టిన సంఘసంస్కరణలు చాలఉత్సాహకరంగా ఉన్నాయి. ఒక ఉదాహరణ యిస్తాను:

1946 - 47 (?) లో అనుకొంటాను: చల్లపల్లివద్ద నాదెళ్ళవారిపాలెంలో మహిళామహాసభ కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో జరిగింది. వేనవేల స్త్రీలు వచ్చారు.

ఆ ఆంధ్రస్త్రీల మహాసభలో ఎవరో ఒక తమాషా ప్రశ్న వేశారు.

"కూతుళ్ళను కమ్యూనిస్టు యువకులకిచ్చి వివాహం చేయించాలని తల్లులు ప్రయత్నించుతున్నారట, వాస్తవమేనా?"

"అవునండి" అని ఒక ముసలమ్మ లేచి సమాధానం చెప్పింది. అందరూ నవ్వారు. చప్పట్లు కొట్టారు.

"ఎందుకనండీ" అని మరొక ప్రశ్న.

"అనుభవంలో కమ్యూనిస్టు యువకులే మంచి అల్లుళ్లుగా ప్రవర్తించుతున్నారండి."

"ఆ అనుభవా లేమిటి?" అని మళ్ళీ ప్రశ్న.

"కమ్మవారిలో స్త్రీలకు ఒకరకమైన ఘోషాపద్ధతి ఉంది. కొత్తవారితోను, బంధువులతోను మాట్లాడునపుడు తలుపువెనుక నిలుచుంటాము. కమ్యూనిస్టులు ఈ ఘోషాపద్ధతిని ఒప్పుకోరు. అంతేకాదు; భార్యలను తమవెంట పెట్టుకొని సభలకు వెళ్తారు. భార్యయు చదువుకొని తమతో సమానంగా వృద్ధికి వచ్చేలా ప్రయత్నిస్తారు. శీలం విషయంలో భార్యలను శంకించరు. ఇరుగు పొరుగు యువతులమీద మనసు పోనివ్వరు, వితంతువులను, అన్య కుల కన్యలనుకూడ వివాహం చేసుకొంటారు. సాధారణంగా దురభ్యాసాలు తక్కువ. దిక్కులేనివారికి హృదయ పూర్వకంగా సహాయం చేయుటకు ప్రయత్నిస్తారు" అని ఒకముసలమ్మ చెప్పిన మాటలతో అందరికి ఆశ్చర్యం కలిగింది.

"కట్నాల విషయమో" అని మరొకరు ప్రశ్నించారు.

"కట్నాల విషయంలో వారు టోక్యం కలిగించుకోరు. వారికి ఇష్టంలేదు. కాని, వరుని తల్లిదండ్రులు వసూలుచేసుకొంటున్నారు. కట్నాల విషయంలో తేడాలు లేనప్పుడు కమ్యూనిస్టు యువకుడే మంచివరుడుగా భావిస్తున్నాము. వివాహము అయిన తరువాత ఆస్తిపాస్తులకొరకు బహుమతుల కొరకు, ఇచ్చి పుచ్చుకోవడాల్లో కమ్యూనిస్టులైన అల్లుళ్లు పీడించరు; పీడించి పుచ్చుకొనే తల్లిదండ్రులను మందలించుతారు" అని సమాధానం చెప్పినది.

ఈవిధంగా ఒకతరం జరిగితే ఆంధ్రదేశంలో వేలయేళ్లుగా వున్న దురలవాట్లు పోగలవు. గొప్ప సాంఘిక విప్లవం తప్పదు. సంఘసంస్కరణలయందు అభిమానం కలిగియున్నందున ఈ యువకులను హృదయపూర్వకముగా గౌరవించుతున్నాను. వారి సాంస్కృతిక ఉద్యమాలను, కార్యకలాపాలను ప్రోత్సహించు చుంటిని.

విడుదల—డొంకతిరుగుళ్లు

1948 ఏప్రిలులో నన్ను అరెస్టు చేసి డిటెయిను చేయగానే "విడుదల చెయ్యాలి; లేదా నేరం మోపి కోర్టులో బహిరంగ విచారణ చేసి శిక్షించండి" అని లాంఛనంగా ప్రభుత్వాన్ని డిమాండు చేశాను. అడ్వయిజరీ కమిటీకి అర్జీపెట్టుకొన్నాను. నామీది ఛార్జిషీటు చదివినవారు నన్ను విడుదల చేస్తారని నమ్మలేరు. అంత ఘోరమైన నేరాలు! అంతా అబద్ధమే! నేను జైలులో వున్న పదిమాసాల్లో నాకు జవాబే రాలేదు.

హైకోర్టులో పెట్టిన హెబియస్ కార్పసు పిటీషను డిస్మిస్ అయినది. ఏ జడ్జీ గాని నన్ను ఎలా విడుదల చెయ్యగలడు? పోలీసు కమీషనరువంటి వారే కోర్టుకు హాజరయి "విడుదల చేస్తే చాల అపాయం" అని సాక్ష్యమిచ్చాడు. నాకు నవ్వు వచ్చింది.

విడుదల ఉండదని నిరాశ చెందాను. దేశమంతటా యెలెక్షన్లు జరిగిన తర్వాత ఏ 1951 లోనో విడుదల జరిగితే జరుగవచ్చుననీ, ఎలెక్షన్లు జరుగక పోతే విడుదల వుండదనీ నిర్ధారణ చేసుకొని, విడుదల విషయం ఆలోచించుటే మానేశాను.

అయితే, 1948 అక్టోబరులో రాజకీయ రంగంనుండి విరమించుకొన్న తరువాత జైలులో ఉండడంలో యెలాంటిప్రయో

జనం కాని, ఎలాంటి పుణ్యం-పురుషార్థం కాని ఉన్నట్టు తోచ లేదు. అందుచే విడుదలకొరకు ప్రయత్నించడం మంచిదనే నిర్ణయానికి వచ్చాను.

కాని, ప్రయత్నించి ఏం ప్రయోజనం! నిర్దోషులు సుమారు ఇరవై మంది ప్రయత్నించి అప్పటికే ఆశాభంగంచెంది యున్నారు, ఎన్నెన్నివిధాల ప్రయత్నించాలో అన్నివిధాలా ప్రయత్నాలు చేశారు.

అడ్వయిజరీ కమిటీకి పిటీషన్ పెట్టుకోవాలని శాసన సభలో మంత్రిగారు చెప్పగా, నమ్మి పెట్టుకొన్నారు. లోగడ కొన్ని మాసాలుగా, సంవత్సరాలుగా రాజకీయాలతోను కార్మిక కర్షక సంఘాలతోను యెలాంటి సంబంధంలేదని వ్రాసుకొన్నారు. ప్రయోజనం లేకపోయింది.

తరువాత కొంతకాలానికి మరొక మంత్రిగారు "తప్పును క్షమించమని ప్రార్థిస్తే విడుదల చేస్తా" మని సలహా యిచ్చారు; ఆ యిరవై మంది మాజీ కమ్యూనిస్టులు అలాగే చేశారు. జవాబే రాలేదు.

మరికొంత కాలానికి మరొక మంత్రి శాసనసభలో "ఇక మీదట కమ్యూనిస్టుపార్టీ రాజకీయాలలో చేరమనీ, విధ్వంసక చర్యలలో పాల్గొనమనీ వ్రాసియిస్తే విడుదల చేస్తా" మన్నారు. అందుకుకూడ సమ్మతించి వ్రాసి యిచ్చారు.

మరికొంత కాలానికి మరొకమంత్రిగారు "ఎవరెన్ని హామీ లిచ్చినా, ఎవరెంత రికమెండుచేసినా విడుదల చెయ్యజాలము. కాని, డిస్ట్రిక్టు మాజిస్ట్రేటు విడుదల చెయ్యమని రికమెండు చేస్తేనే విడుదల చెయ్యగలం; లేకపోతే లే" దని చివరకు కుండ

బ్రద్దలుకొట్టినట్టుగా చెప్పారు. విడుదలకోరే యిరవైమంది మాజీ కమ్యూనిస్టులు వగైరా కలుసుకొని "దీనిభావమేమి?" అని తర్కించుకొని ఈవిధంగా అర్థంచేసుకొన్నారు:— "జిల్లా మాజి స్ట్రేటు సమ్మతించాలంటే ముందు పోలీసు సూపర్నెంటు ఒప్పు కోవాలి. అనగా స్పెషల్ బ్రాంచి పోలీసులు విడుదల చేయుటకు అంగీకరించి వ్రాయాలి. అప్పుడు ప్రధానిగారి కటాక్షం ఉంటే విడుదల అవుతుంది, లేకపోతే లే" దని దిగులుపడ్డారు.

ఇవన్నీ చూస్తూవున్న నేను విడుదలకొరకు ప్రయత్నించడం లో ఎంతమాత్రం ప్రయోజనం వుండదని నిశ్చయించుకొన్నాను. నా భార్య అక్టోబరుమాసంలో నన్ను జైలులో కలుసుకొన్నప్పుడు విడుదలకోసం ప్రయత్నించడం వృథా ప్రయాసయని సలహా యిచ్చాను.

ఆ తరువాత వారంరోజుల్లో నా అక్కగారు మరణావస్థలో ఉన్నదని కావలిసుండి కార్డు వచ్చింది. ఆ కార్డును ప్రభుత్వానికి పంపుతూ, పెరోలు యివ్వండని కోరాను. కాని, ఆమె చని పోయిన యిరవైఆరు రోజుల తరువాత పదిహేనురోజులు పెరోలు యిచ్చారు; అయితే? మద్రాసు మీదుగా ప్రయాణం చెయ్యకూడ దని ఉత్తర్వుచేశారు. నా విషయంలో పోలీసులు ప్రభుత్వాన్ని ఎంత భయపెట్టుతున్నారు! అని ఆశ్చర్యపడినాను.

పెరోలులో వుండగా రెండు అర్జీలు పెట్టాను. రాజకీయ రంగంనుండి విరమించుకొన్న నన్ను ఇంకా జైలులో డిటెయిను చెయ్యడంలో ఎంతమాత్రమూ న్యాయం లేదనిన్నీ, బేషరతుగా నన్ను విడుదల చెయ్యవలసిందనీ ప్రధాని రెడ్డిగారికి వ్రాసితిని.

ఈ సందర్భంలో జైళ్ళయిలాకా మంత్రిగారితో మాట్లాడుటకు మద్రాసుకు రానివ్వవలసిందని మరొక అర్జీపెట్టగా అంగీకరించారు.

నేను చేసిన నేరాలు

మద్రాసుకు రాగానే స్పెషల్ బ్రాంచి పోలీసు అఫీసుకు వెళ్ళి గడచిన పద్దెనిమిది మాసాల్లో నామీద ఏమేమి కంప్లయింట్లు ఉన్నాయో చెప్పవలసిందని అడిగాను. నేనేమి చేస్తూవుంటినో వారికి తెలియదనీ, పార్టీవనులు ఏమీ చెయ్యకుండా పార్టీలో ఎలా వుండగలననీ, ఏమేమిచేస్తూ ఉంటినో నన్నే చెప్పమనీ అడిగారు.

మా ఇంటిలో రాజకీయ తరగతులు నడుపుచుంటిననీ, బహిరంగసభలు పెట్టుచుంటిననీ చెప్పాను.

"కాబట్టి, మిమ్మల్ని ఎలా విడుదల చెయ్యడం?" అని తిరిగి నన్నే ప్రశ్నించారు.

"ఈ మీటింగులకు, క్లాసులకు ముందుగా మీ ఉత్తరువు పొందుతున్నానని, తప్పుచేసివుంటే అది వుభయులదీని; ఇద్దరం జైలులో ఉండాలిగదా!" అని సమాధానం చెప్పాను.

"ఉత్తరువు యిచ్చేటప్పుడు మేము తప్పుచేస్తున్నట్లు మాకు తెలియదే" అని నవ్వారు. ఏ షరతు లేకుండా విడుదల చేయవచ్చునని కాంగ్రెసు ప్రభుత్వానికి రికమెండుచేశారు.

విడుదల ఆర్డరు రాలేదు. జైలు మంత్రిగారిని కలుసుకొన్నాను.

"విడుదల చెయ్యండని ప్రధానికి వ్రాసిన అర్జీని చదివాను. మీరు కమ్యూనిస్టుపార్టీని వదలిపెట్టారు. కాని. మీ నమ్మకాలను (కన్విక్షన్సును) వదల్లేదని ఊహించాను; నా ఊహ నిజమేనా?" అని ప్రశ్నించారు మాధవమీనన్‌గారు.

"అవు" నన్నాను "నేను పనిచేసిన గదర్‌పార్టీ, కాంగ్రెసు, కమ్యూనిష్టుపార్టీల గొప్పఆశయాలలో నాకు నమ్మకంలేకపోలేదు. కాని, ఆ యా పార్టీల పంథాలలోను, కార్యక్రమాలలోను నాకు ఆక్షేపణలున్నాయి" అని అంటిని.

"మీరు ముసలితనమువల్ల, వ్యాధులవల్ల రాజకీయాలు మానేశారు. మీ నిజాయితీ నాకు తెలుసు. మిమ్ము నేను నమ్ముతాను. మన మిద్దరం చాలకాలం జైలులో కలిసివున్నాము. మీ విడుదలకు తప్పకుండా రికమెండు చేస్తాను" అని స్నేహపూర్వకంగా మాధవమీనన్‌గారు చెప్పారు.

"ఇప్పుడు పెరోలులో ఉన్నాను. ఇక జైలుకు పోదలచు కోలేదు" అని నవ్వాను.

"వెళ్ళనవసరంలేదులే! విడుదల అయ్యేవరకు పెరోలు యిస్తా" నని అలాగే చేశారు.

ప్రధాని రెడ్డిగారు

కాని, ప్రధాని రెడ్డిగారి కటాక్షం వెంటనే లభించలేదు. ఆ షరతును, ఈ షరతును ఒప్పుకోవలసిందని నాకు కబురు పంపారు. ఎలాంటి కండిషనుకుగాని నేను సమ్మతించననీ, తిరిగి జైలుకు పంపవచ్చుననీ ఖండితంగా చెప్పేశాను.

"ఇకమీదట నేరం చేస్తే ఎలా" గని స్పెషల్‌బ్రాంచి ఆఫీసరు అడిగారు.

చట్టం ప్రకారం కేసు పెట్టుకోండి" అన్నాను.

జైలులో అనవసరంగా పది నెల లుంచి చివరకు 1949 జనవరి 21 తేదీన ప్రధాని రెడ్డిగారు దయతో విడుదల చేశారు. పోలీసు ఆఫీసర్లు న్యాయంగానే ప్రవర్తించారనుకుంటాను.

## ఎనిమిది జైళ్ళలో

ఇది సంధియుగం. గడచిన ముప్పయ్యారు సంవత్సరాల రాజకీయ జీవితంలో నాలుగుసార్లు జైళ్ళలో నిర్బంధించారు. రెండుసార్లు విదేశీ ప్రభువులు, రెండుసార్లు ప్రజాప్రభుత్వము మొత్తం ఎనిమిది జైళ్ళలో పెట్టగా ఎనిమిది సంవత్సరాల జీవితం గడచిపోయింది.

1915—1919లో నాలుగున్నర సంవత్సరాలు
(గదర్ పార్టీ సభ్యుడుగా)

1940—2 రెండు సం॥ కొన్ని నెలలు.

1947 లో ఏడు నెలలు.

1948—9 లో పదినెలలు.

బాంకాకు, సింగపూరు, కలకత్తా, లాహోరు, ఢిల్లీ, కన్ననూరు, కోయంబత్తూరు, వెల్లూరు జైళ్ళలో ఉన్నాను.

సింగపూరు మిలిటరీ జైలులో ఆరు నెలలు ఏకాంత వాసం (సాలిటరీ ఇమ్‌ప్రిజన్‌మెంటు) వల్ల కలిగిన నరముల వ్యాధి (మ్యూకస్ కొలైటీస్)చే ఇప్పటికీ బాధపడుచేగాక, నా జీవితకాలమంతా కష్టపడక తప్పదు. కొన్ని పర్యాయాలు చేతులతో, కాళ్ళతో, బూట్సుతో, లాఠీలతో దెబ్బలు తిన్నాను. కొన్ని రోజులు నా బట్టలన్నీ తీసేశారు. ఎన్నెన్నో బాధలకు గురి అయింది యీ నా శరీరం.

నేను కోరిన సంపూర్ణ స్వరాజ్యం కాని, ప్రజాప్రభుత్వం కాని ఇంకా ఏర్పడనేలేదు. కాని, నా జీవితకాలంలో ఏర్పడుతుందనే నమ్మకం నాకు ఇప్పటికీ దృఢంగానే ఉన్నది.

ముగించే సమయంలో నా నమ్మకాలు

ఈ గ్రంథాన్ని ముగించే సమయం (1951—సెప్టెంబరు) లో నా ఆలోచనలు నమ్మకాలు (కన్విక్షన్సు) యెలాగున్నాయని ప్రశ్నించుకున్నాను. చాలమంది మిత్రులు నన్ను ముఖ్యంగా కొన్ని ప్రశ్నలు అడుగుతూవున్నారు.

"ఏ పార్టీ గెలుస్తుంది? కాంగ్రెసా, సోషలిస్టా, కమ్యూనిస్టా?" అని వారి ముఖ్య ప్రశ్న.

"ప్రజల సమస్యలను ఏ పార్టీ నిజాయితీగా పరిష్కరిస్తుందో ఆ పార్టీ గెలుస్తుం"దని నేను చెప్పిన సమాధానం.

"ఆ సమస్య లేవి?" అని రెండవ ప్రశ్న. ప్రజలకు అవసరమున్నంత ఆహార పదార్థాలను పండించాలి. పండించే కూలివానిని ఆ భూములకు స్వంతదారుడుగా చేసేవరకూ ఈ సమస్య పరిష్కారం కాజాలదని నా అభిప్రాయం. ఇది మనదేశానికి ప్రధాన సమస్య.

నిరుద్యోగ సమస్య పరిష్కారం కావాలి. మధ్యతరగతి విద్యార్థులు తినుటకు తిండిలేక మాడిపోతున్నారు వారు కార్మిక కర్షకులతో చేరి విప్లవం లేవదీస్తారు. ఆర్థికంగా ప్లానింగు లేకపోతే ఈ సమస్య సమస్యగానే ఉంటుంది.

కమ్యూనిస్టులకు విప్లవ మార్గమూ, రక్తపాతమార్గమూ తప్ప శాంతి మార్గం లేదా? అనేది మరొక ముఖ్య ప్రశ్న.

పిచ్చివాళ్లు తప్ప మరెవరూ దౌర్జన్యం చెయ్యరు. అయితే మంచివారుకూడ కొన్నికొన్ని సందర్భాలలో హింసామార్గం అవలంబిస్తారు. మహాఋషులు, దైవావతారాలు కూడ హింసామార్గాలను ఒక్కొక్కప్పుడు బోధించారు; అవలంబించారు కూడాను.

కాని, వయోజనులందరికీ వోటు అధికారంతో శాసన సభలద్వారా మెజారిటీ తీర్మానంతో పరిపాలన నిజాయితీగా జరుగనిస్తే ప్రజల కష్టాలన్నీ వెంటనే తీరకపోయినా, తీరగలవనే నమ్మకం ఏర్పడు తుంది; దానితో విప్లవాలు రావాలవు. అందుచేతనే ఇంగ్లాండు, ఫ్రాంసు, అమెరికా దేశాల్లో విప్లవాలు రావడంలేదు. ప్రజాప్రభు త్వాల్లేని రష్యా, చైనా, మలయా, బర్మా, ఇండోచైనా మొద లైన దేశాల్లో విప్లవాలు తప్పలేదు; తప్పవు.

ఏ దేశంలో నైతే కాన్‌స్టిట్యూషను (రాజ్యాంగ నిర్మా ణాన్ని) సామాన్య మెజారిటీ వోట్ల ననుసరించి మార్చుకొనుటకు అవకాశం ఉంటుందో అలాంటి దేశాల్లో విప్లవాలకు అవకాశం చాల తక్కువ. ఇంగ్లాండు, ఫ్రాన్సు దేశాలకాన్‌స్టిట్యూషన్లు అలాం టివి; అమెరికా అలాంటిది కాదు. అయితే మనవో?..........

గాంధీగారి ఉద్యమం వల్లను, కాంగ్రెసు పోరాటాల వల్లను ప్రజలలో రాజకీయ చైతన్యం చాల ఉచ్ఛస్థితిలోనున్నది. అదొక అగ్నిపర్వతంలాంటిది. వాస్తవమైన ప్రజా ప్రభుత్వం ఒక్కటే దానిని శాంతింప చెయ్యగలదు.

పోలీసులు, సైనికులు మాత్రమే రణకాలంలో ప్రజలను అణచివెయ్యజాలరు. ప్రజలు ఎలాగో ఐక్యమవుతారు; నియంతల ఆటలను కట్టివేస్తారు. అలా కాదనే మూర్ఖ నాయకులూ వున్నారు. చియాంగ్ కై షేకులు జయించే కాలం పోయింది.

ఇకమీదట సాహిత్య సేవ

రాజకీయ రంగాల్లోనుండి విరమించుకొంటిని గదా: ఏ పనీ పాటా లేకుండా కాలం గడపటం కష్టంగానే ఉన్నది. ఏదైనా సులభమైన పని చేస్తుండాలి.

ఇంకొ నా చిరవాంఛిత మొకటి నెరవేరలేదు. ప్రపంచ వాఙ్మయంలో నుండి ఒక వంద ఉత్కృష్ట గ్రంథాలను తెలుగులోకి తర్జుమా చేయించాలని యెన్నాళ్ళగానో అనుకొంటున్నాను. ఆ విధంగా మన వాఙ్మయాన్ని సుసంపన్నం చెయ్యాలని నా అభిలాష. "హోం యూనివర్సిటీ లైబ్రరీ" "థింకర్స్ లైబ్రరీ"ల లాగా మన వాఙ్మయాన్ని సుసంపన్నం చేసి ప్రజలను సంస్కృతీ సంపన్నులుగను, అభ్యుదయ దేశాల ప్రజలతో సమానంగా ముందుకు నడవగలిగేటట్లున్నూ చేయవలె నసుకొన్నాను. మన భాషమాత్రమే తెలిసినవారికి ఇంగ్లీషుభాష తెలియదనే విచారం పోగొట్టుటకు ఇదే సులభమార్గమని నా దృఢనమ్మకము.

1925 - 26 సంవత్సరంలో ఈ ప్రయత్నాన్నే గుంటూరులో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీ జి. వి. కృష్ణారావుగార్లతో కలిసి ప్రయత్నించి విఫలుడనైతిని. ఆకాలంలో తెలుగులో ఆలోచించి, తర్జుమా చెయ్యగలవారిసంఖ్య చాల అరుదు; చదువరుల సంఖ్యకూడా చాల తక్కువే. ఇప్పుడు అలా కాదు. తెలుగు భాష చాల అభివృద్ధిచెందినది. ఎన్నోభాషలలో ఆరితేరి తర్జుమా చెయ్యగలవా రున్నారు. చదివేవారి సంఖ్య-ముఖ్యంగా గ్రామాల్లో చాల పెరిగింది.

ఈ సంకల్పాన్ని నెరవేర్చాలనుకొన్న ఒక్క సంవత్సరానికి సరియైన వ్యక్తి - ఈపనికి పూనుకొని జయప్రదం చెయ్యగలననేవారు - విద్వాన్ విశ్వంగారు లభించారు. అటు తరువాత కొన్నివారాల్లోనే ప్రజాసేవ తప్పక చెయ్యాలని కోరే నలుగురు పాతస్నేహితులు ముందుకొచ్చారు. ప్రజలకు వాస్తవంగా సహాయం చెయ్యగలిగితే, డబ్బు సేకరించగలమనే దృఢనమ్మకంగల

ఈ స్నేహితులు ఈ పనిని తక్షణమే ప్రారంభించునట్లు ప్రోత్స హించారు; ఇంతేగాదు, ఆర్థిక విషయంలో భయపడనవసరంలేదని అభయహస్తమిచ్చారు. ఏతత్ఫలితంగా మద్రాసులో "ఇంటింటి విజ్ఞానమాల" అను సంస్థను 21 మే 1951 సంవత్సరంలో రిజిస్టరు చేయించితిమి. దీనిని ఆంధ్రులు ఆదరిస్తారని, జయప్రదంగా నెరవేరగలదని నమ్మకం ఇప్పటికి కలిగింది. నాకు ఇప్పుడు మరొక కోరిక కలుగుతున్నది. ఈ "ఇంటింటి విజ్ఞానమాల" ద్వారా ప్రకటింపబడిన పుస్తకాలతో "ఆంధ్ర విజ్ఞాని" పరీక్షలు పెట్టించి, అవసరమైతే కరెస్పాండెన్సు ద్వారా విద్యార్థులకు సహాయంచేస్తూ వేలూ, లక్షలూ రూపాయలు అవసరం లేకుండానే ఆంధ్రదేశంలో విజ్ఞానాభివృద్ధిని కల్గించగలమని ఆశించుతున్నాను.

సుభద్రమ్మగారు — బిడ్డలు

ఇది నా జీవిత చరిత్ర; స్వీయ చరిత్ర. కాబట్టి నా కుటుంబాన్ని గురించి వ్రాయకపోతే ఈ పుస్తకం పూర్తికాజాలదు. ముఖ్యంగా నా సుభద్రను గురించి వ్రాయక తప్పదు.

అయితే, నా భార్యను గురించి వ్రాసుకోవడానికి సిగ్గు వేస్తుంది, వాస్తవమే! అయినా ఇలాంటి అనవసరపు మొగ మాటాలతో మానివెయ్యడం మంచిదికాదు.

నా సుభద్ర మామూలు భార్యలవంటిది కాదు. ఆమె విద్యావతులైన భారత స్త్రీలలో ఎన్నదగిన ఆదర్శ గృహిణి. ఇక మీదట ఇలాటి స్త్రీల సంఖ్య పెరుగుతూ వుంటుంది. ఇప్పుడు మాత్రం మన సంఘంలో యిలాంటివారు అరుదు.

నాకు భార్య అవుటకు ముందే తన శక్తి—సామర్థ్యాలను బాగా అభివృద్ధి చేసుకొన్నది. నైతిక, ఆధ్యాత్మిక విషయాలను,

మానసిక శాస్త్రాన్ని, నవీన విద్యావిధానాలను చదివి, అనుభవం లోకి తెచ్చుకొని ప్రవీణురాలైనది. సంగీత సాహిత్యాలలోను, లలిత కళల యందును—ఒక్కమాటలో చెప్పాలంటే సంస్కారముగల సరస్వతి. పై విషయాల్లో ఆమెకు నికరమైన సిద్ధాంతాలూ, వ్యక్త్వమూ ఉన్నాయి; కాని ఇవి నాలో అంతగా అభివృద్ధి కాలేదు. అందువల్ల ఆమె సాంగత్యం వల్ల నా జీవితంలో వెలుతురు వచ్చి జీవితాన్ని అర్థంచేసుకొనేలా చేసినది. ఏదో తోచినప్పుడు ఉద్రేకంతో చెయ్యడం పోయి, మంచి చెడ్డలు, ముందు వెనుకలు ఆలోచించి చేసేలాగున మార్గదర్శిని అయింది.

"పరులకు అపకారం చేసే వ్యక్తి తన భార్యకు, బిడ్డలకు, దేశానికి కూడా అపకారం చెయ్యగలడు" అని మానసికశాస్త్రాన్ని గ్రహించి, నా జీవితాన్ని సంస్కరించుకోమని సలహా యివ్వడమే గాక, తన జీవితంలో ఆదర్శంగా పెట్టుకొన్న సుశీల.

ఒకరికి లోబడకుండా జీవించడం, నిరాడంబర జీవితం, ప్రతిఫలము కోరని సంఘసేవ ఆమె ఆదర్శాలు. అవి నాకూ, బిడ్డలకూ కూడా అలవాటుపడుతూవచ్చాయి. నేనూ, బిడ్డలూ, బంధువులూ, మిత్రులూ కూడా ఆమెవల్ల సంస్కారం పొందితిమి.

ఆమెలో అభివృద్ధికి రాని కొన్ని శక్తులు నాలో వచ్చి యుండవచ్చును. అందువల్ల మాలో పరస్పరం గౌరవం ఏర్పడింది. మేము మొదట యావజ్జీవిత మిత్రుల మైనాము. 1920లో ప్రారంభమైన పరిచయం క్రమంగా పరస్పర గౌరవంగా మారినది; తరువాత స్నేహము, ప్రేమ కలిగాయి. ఆమెకు నేను ఎంతో ఋణపడి ఉన్నాను. భోజనాల్లో రుచులు గ్రహించడం మొదలుకొని సంగీత సాహిత్యాల్లో అభిరుచి కల్గించడం, చివరకు

నైతికంగానూ, ఆధ్యాత్మికంగానూ లోతుగా అర్థంచేసుకొనేవరకూ నా జీవితంలో ఆమెకు భాగ మున్నది. ఆమె సమ్మతి, ప్రోత్సాహాలు ఉన్నందుననే పది సంవత్సరాల కాలము నిశ్చింతగా రాజకీయ రంగంలో గడిపాను. మొహమాటం మానేసి మామూలు సాంప్రదాయాలను లక్ష్యపెట్టక నా భార్యను గురించి నేను యిలా వ్రాసినప్పుడు నాతోను, నా భార్యతోను పరిచయం లేనివారికి ఆశ్చర్యం కలుగవచ్చు.

మన స్త్రీలలో అభివృద్ధికి రాని శక్తులెన్నో అంతర్గతంగా వున్నాయి. వాటిని వృద్ధికి తెస్తే మన సంసార జీవితం ఎంత ఆనందమయంగా ఉంటుందో అనుభవించిన ఏ కొద్దిమందికి మాత్రమో అర్థంకాగలదు. ఇది నా అదృష్టం.

ఆమె చేస్తూవున్న సంఘసేవలను గురించి ఇచ్చట కొంత వ్రాయడం సమంజసమే ననుకుంటాను.

పురాతన క్రూర సాంప్రదాయాలమీద చిన్నప్పటినుండి ఆమెకు అయిష్టం. తన పినతల్లి ఎనిమిది సంవత్సరాల వయసులోనే వితంతువయింది. ఆమె తరుణ వయస్సులో నున్నప్పుడు వెంట్రుకలు తీయించాలని పెద్దవారు ఎన్నో పర్యాయాలు చేసిన ప్రయత్నాలను సుభద్రమ్మగారు విద్యార్థినిగా వున్న కాలంలోనే ప్రతిఘటించి పోట్లాడి, తుదకు జయించింది. కులభేదాలను లక్ష్యపెట్టనందున తన అమ్మమ్మగారికి ఆగ్రహం వచ్చి, మనుమరాలితో దినముల కొలది మాట్లాడడం మానివేసేది.

ఆమెకు 18 సం॥ల వయస్సు వచ్చేరాకముందే "మహిళా భారత సమాజాన్ని (Women's Indian Association) శ్రీ అనిబిసెంటు, మిసెస్ కజిన్సు, మిసెస్ జినరాజదాస్ మున్నగు

వారితో కలసి స్థాపించిన భాగ్యం ఆమెకు లభించినది. ఆ సంస్థకు హైదరాబాదులో మొట్ట మొదట బ్రాంచిని స్థాపించి స్త్రీల కష్టాలను తొలగించుటకుపూనుకొన్నది.

పిల్లలను శిక్షించకుండా వారి మనస్తత్వ మెరిగి ప్రేమతో విద్య గరపడం అసాధ్యం కాదు అనే విషయాన్ని నిరూపించుటకు హైదరాబాదులో బాలికలకు ఒక యెలిమెంటరీ స్కూలును స్థాపించి, దానిని మహిళా భారత సమాజ శాఖ నిర్వహించునట్లు చేసినది.

పాతికేళ్ళ వయసులోనే మద్రాసులో అఖిలభారత మహిళా మహాసభలో (All India Women's Conference) కార్యనిర్వాహక సభ్యురాలుగ వుండి స్త్రీల వోటు హక్కుకు, ఉద్యోగాలకు, ఆనరరీ మేజిస్ట్రేట్లుగా వుండుటకు, శాసనసభాసభ్యులుగా నుండుటకు సాగింపబడిన ఉద్యమాలలో పాల్గొంటూ, పాటుపడ సాగినది. బహు భార్యా నిషేధం, విడాకుల హక్కు, జన్మ నిరోధం మొదలగు విషయాలను గురించి ప్రచారం చేసి, తుదకు తన ప్రాణమిత్రుల ఆగ్రహానికి పాత్రురాలైనది. శారదా ఆక్టును సమర్థించి పనిచేసింది. స్త్రీలకు ఆస్తిహక్కు విషయంలో ఇప్పటికీ పనిచేయుచునే ఉన్నది.

1932 - 34 సం॥ల మధ్య మద్రాసులో స్థాపింపబడిన "రెస్క్యూహోం" (Rescue Home) ను, మాంటిసోరి స్కూళ్ళను డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి, మిసెస్ కజిన్సు, మిస్ బ్యారీలతో కలసి స్థాపించుటేగాక, చాలకాలం వాటి నిర్వాహకకమిటీలలో వుండి పాటుపడింది.

1934 – 35 లో అఖిలభారత మహిళామహాసభ మద్రాసు స్టాండింగుకమిటీ మెంబరుగా వుండి కొంతకాలం పనిచేసెను. హిందూకోడు బిల్లు చట్టమగునని గంపెడంత ఆశతో వున్నది. కాని, దానిని మానివేయడంతో ఆగ్రహ, దుఃఖములతో బాధ పడుతున్నది.

స్త్రీల, బిడ్డల అభ్యున్నతికొరకు 1920 నుంచి మద్రాసులో సాగింపబడుచుండిన ప్రతి ఉద్యమములోను ముందంజ వేయు చుండెను.

ఇప్పుడు మద్రాసులో శ్రీమతి దుర్గాబాయిగారు ఆంధ్ర మహిళాసంఘం తరపున ఎన్నెన్నో ప్రజోపయోగకరమైన సంస్థ లను ఏర్పాటుచేయుచుండుట ఆమె కెంతో ఆనందదాయకంగా వున్నది. శ్రీమతి దుర్గాబాయిగారు నిర్వహించుచున్న "ఆంధ్ర మహిళ" మాసపత్రికలో పిల్లల మనశ్శాస్త్రమును గురించి, నవీన శాస్త్రీయ దృక్పథంతో పెంచవలసిన పద్ధతులనుగురించి ప్రతినెల రెండుమూడు సంవత్సరాలుగా వ్రాయుచునే ఉన్నది.

నవీన విద్యావిధానాలను శిశు మనస్తత్వశాస్త్రంలో నిపుణు రాలైన మిస్. బేరీ సహాయంతో చదివి అడయారులోను, ఋషివా లీలోను శ్రీ జి. వి. సుబ్బారావుగారు నవీన విద్యాపద్ధతులతో నిర్వహించుచుండిన హైస్కూళ్ళలో ఉపాధ్యాయినిగా పనిచేసి, వారిద్దరి మన్ననలను సంపాదించింది. 1925 మొదలు 1930 వరకు నవీన విద్యాపద్ధతులలో శిక్షణపొందుటకు ఆమెవద్దకు కొందరు టీచర్లు - ఇండియాలో అనేక ప్రదేశాలనుండి వచ్చుచుండెడివారు. ఇప్పుడుకూడ నవీన విద్యాపద్ధతులను, మనశ్శాస్త్రమును, పిల్లలను పెంచవలసిన పద్ధతులను గురించి ఎంతో కృషిచేస్తూనే ఉన్నది.

1932 లో కాంగ్రెసు ఉద్యమము ఆమెను బాగా ఆకర్షించి నది; శ్రీ బి. జగన్నాథదాసుగారు ఈమెకు మంచి తర్ఫీదు నిచ్చి, ఎన్నోపనులు చేయించుచుండిరి. వారి నిరాడంబరసేవ, వారి స్వచ్ఛమైన దేశభక్తి ఆమెను ఆకర్షించినవి. హరిజనోద్యమాన్ని 1932 లో గాంధీజీ ప్రారంభించిన సందర్భములో మద్రాసులో శ్రీ బి. జగన్నాధదాసు, శ్రీ కె. బాష్యం (మాజీమంత్రి) మున్నగు ప్రముఖులు దాని శాఖను స్థాపించారు. జాతీయోద్యమములో పనిచేస్తున్న సుభద్రమ్మ జైలుకు సిద్ధపడుతున్న తరుణంలో ఆమె అంగీకారం తీసుకోకుండానే ఆమెను మద్రాసు హరిజన సేవా సంఘమునకు మొట్టమొదటి కార్యదర్శిగాను, శ్రీ ప్రకాశం పంతులుగారిని మొదటి ప్రెసిడెంటుగాను ప్రజలు ఎన్నుకొన్నారు. జైలుకు వెళ్ళకుండ అభ్యంతరపెట్టినందుకు ఎంతో చింతిలినా ప్రజల ఆదేశాన్ని శిరసావహించి, హరిజన సేవలో నిమగ్నురాలై పోయింది. అప్పటినుంచి ఇప్పటికీ ఆమె ఆ ఉద్యమములో పనిచేయుచునే ఉన్నది. 1933 లో కీ॥ శే॥ శ్రీ వి. వెంకట సుబ్బయ్యగారు (సెక్రటరీ, సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ) శ్రీ వి. భాష్యం అయ్యంగారు, సుభద్రమ్మగారు కలసి ఒక హరిజన బాలికల హాస్టలును స్థాపించారు. దానిని శ్రీ గిరిగారు మొదటిసారి కాంగ్రెసు మంత్రిగా ఉన్నకాలం (1938-39) లో, వారిసహాయంతో ఒక్కొక్క బాలికకు నెలకు పదిరూపాయల చొప్పున గవర్నమెంటు గ్రాంటును సంపాదించారు. ఆ హాస్టలు దినదినాభివృద్ధి చెందుతున్నది. ఇప్పుడు వందమంది బాలికలున్నారు. వీరందరికి అన్ని ఖర్చులూ కాంగ్రెసు ప్రభుత్వం భరించి పోషించుచున్నది. వీరికి హాస్టలు కట్టుటకు సుమారు 1½

ఎకరా భూమిని ఇచ్చారు. ఒక పెద్ద భవనముకూడ శీఘ్రకాలం లోనే తయారుకాగలవని ఆమె ఆశిస్తున్నది.

హాస్టలులో ఉండే దిక్కులేని బాలికలను ప్రేమించి, వారిప్రేమను ప్రతిఫలంగా స్వీకరించి తృప్తిపడుతున్నది. వారిని విద్యా వినయ సంపన్నులైన ఇల్లాండ్రుగాను, తల్లులుగాను, డాక్టర్లు గాను, టీచర్లుగాను, లాయర్లుగాను వృద్ధికి వచ్చేలా ప్రోత్సహించుతూ, వారు అభివృద్ధిచెందుచుండుటను చూచి పరమానంద భరితురాలవుతూంటుంది.

మాకుటుంబ ఇష్టాగోష్టిలో గాంధీజీని గురించి ఆమె ఇలా అన్నది:— "ఇంటా బయటా—ఏ రంగంలో గాని - రాజకీయరంగంలో కాని, సంఘసంస్కరణ క్షేత్రంలో కాని పనిచేయుటకు అహింస, ప్రేమలే సర్వోత్కృష్ట సాధనాలు. ఇట్టి సాధనముల ద్వారా నిర్మించిన సంఘమే శాంతి సౌభాగ్యములతో విలసిల్లుతుంది; సర్వమానవ కల్యాణం జరుగుతుంది"

నవీన మనశాస్త్రజ్ఞుల అభిప్రాయంకూడ అదేనని ఆమె అభిప్రాయం.

మా ఇద్దరికోరికలు సంఘసేవ చెయ్యాలనే కాబట్టి ఎవరికి తోచిన కార్యాలను వారు చేయుచు, పరస్పర సహాయం చేసుకొంటూ ఒకటి రెండు తరాలు గడిపాము.

స్త్రీలు పురుషులవలెనే శక్తివంతులు కాగలరు. తండ్రులు, భర్తలు సహాయం చెయ్యాలి; లేనిచో వారి శక్తి సామర్థ్యాలు అభివృద్ధి చెందకపోవడమేగాక, కుటుంబములో సంస్కృతి, సంఘంలో అభివృద్ధి రాజాలవు.

స్త్రీలకంటె పురుషులము సహజంగానే గొప్పవారమని గర్వపడుతుంటాము. పురుషులం ఎన్నో వందలు, వేల యేండ్లుగా సంఘాన్ని, దేశాన్ని, ప్రపంచాన్ని నిర్వహించుతున్నాము; కాని, అన్నం, బట్టలు ఇళ్లు మొదలగు సామాన్య మానవావసరాలైనా తీర్చలేకపోతిమి. ప్రపంచయుద్ధాలతో కొట్లప్రజలను క్రూరంగా చంపి, ఎందరినో అనాథలను చేసి, ఆస్తిపాస్తులను నాశనంచేసి, "అన్నమో రామచంద్రా!" అనేలాగా చేస్తున్నాము. మరొక మారణహోమానికి సన్నాహాలు చేస్తున్నాము. ఆటంబాంబులను, హైడ్రోజన్ బాంబులను తయారు చేస్తున్నాము. ఇప్పటికైనా మన గర్వాన్ని కొంత తగ్గించుకొని, ఈ ప్రపంచ నిర్వహణలో స్త్రీ జాతికికూడ సమానస్థానం ఇచ్చినచో మనజాతికి మనం చేసినంత అన్యాయం ఇకమీదట జరుగదని నా దృఢవిశ్వాసం. నే నీవిధంగా అంటున్నందుకు పురుషులు నన్ను క్షమిస్తారని ఆశించుతాను.

ఇక బిడ్డల విషయం. ఇద్దరు కూతుళ్లు, ముగ్గురు మరదలుబిడ్డలు, ఒక మేనల్లుడు—వీరందరిని బాగా చదివించుటకు ప్రయత్నించాము. ఇద్దరు డాక్టర్లు అయ్యారు; ఒకరు యల్. టి. ఇద్దరు బి. ఎస్. సి. చదువుతున్నారు. ఒక్కరు మాత్రమే కాలేజిలో చదువుతూ వివాహం వల్ల మానివేసెను.

వీరందరి విషయంలోను మా ఉద్దేశ్య మేమనగా.—

1. ఎంతవరకు చదువుకు అవకాశాలున్నాయో అంత వరకు చదివించాలి.

2. ఆర్థికంగా ఎవరి స్వార్జితంమీద వారు ఆధారపడాలి. స్త్రీలు భర్తల ఆస్తిపాస్తులమీద కాని, వారి సంపాదనమీదకాని ఆధారపడకూడదని తీర్మానించుకొంటిమి.

3. సంస్కృతికొరకు సంగీత సాహిత్యాలు, లలితకళలే గాక, సైన్సులు బాగా చదివేలాగు చేశాము. మానసేవ చెయ్యవలసిందని బోధించాము.

అయితే, వీరందరి విషయంలో మామూలు స్కూళ్ళ, కాలేజీలలో చదివి, తప్పకుండా ప్రతి సంవత్సరం ప్యాసవడానికే వారికి వ్యవధి చాలదు. అందువల్ల సంగీతము సాహిత్యము, భరతనాట్యము నేర్చుకొనుటకు ఎన్నోతడవలు ప్రయత్నించి మానుకొంటూవచ్చారు. ఈ సబ్జక్టులు విద్యాసంస్థల "కరికులం"లో తప్పక వుండాలి.

ప్రస్తుత విద్యావిధానం సరిగా లేదు. ముఖ్యంగా పరీక్షా విధానాలు అమానుషంగా ఉన్నాయి. విదేశాలవారి అనుభవాన్నయినా వినియోగించుకొని మన విద్యావిధానంలో మార్పులు ప్రవేశపెట్టనంతవరకు మనబిడ్డలు చాల బాధపడవలసివుంటుంది. వ్యక్తులు ఎంత ప్రయత్నించినా నెరవేర వీల్లేకుండా సంఘపరిస్థితులు అడ్డుగా ఉన్నాయి. మనదేశ దురదృష్టాన్ని ఏమనుకోవాలి!

స్వా తం త్ర్య యా త్ర

మోక్షంకొరకు ఎన్నో యాత్రలు చేస్తారు. జీవితంకూడ ఒక యాత్రే! దైవభక్తి, దేశభక్తి మానవసేవలేకదా! ప్రజలు ప్రశాంతంగా జీవించాలనే కదా వీటి ఆదర్శం. "సర్వేజనా సుఖినో భవంతు." మానవులు వాస్తవమైన మానవుల్లాగా అనగా సర్వశక్తులను అభివృద్ధికి తెచ్చుకొనుచూ జీవించుటకే కదా ఈ సాధనాలు. ఇతరుల సేవకొరకు, దాస్యంకొరకు కాదు మానవులు జీవించేది.

స్వార్థం ఒకదశలో మానవునికి అవసరం; జీవితమంతా కూడా కొంతవరకు అవసరమే! అయితే, మానవునిలోని మాన

వత్వం చక్కగా వికసించాలంటే నానాటికి పరార్థం పెరుగుతూ ఉండాలి. తన కష్టసుఖాలు సోదరమానవుల కష్టసుఖాల్లో లీనం కావాలి. స్వార్థపరుడే దోపిడిగాడుగాను, రాక్షసుడుగాను, చివరకు భస్మాసురుడుగాను పరిణామం పొందుతాడు.

ఆదిలో మానవుడు మోక్షంకొరకు ఎన్ని ప్రయాసలు పడ్డాడు! తిరుపతిలో ఏడుకొండలు ఎక్కుతాడు. అడవుల్లో, కొండల్లో భీకరమృగాలచే, దొంగలు, దోపిడిగాండ్రవల్ల ఎందరో చచ్చిపోయారు. చివరకు మానవుడు కష్టాలను జయించి, తాను ఆరాధించే దేవతను దర్శించాడు. సర్వజనులు తనవలెనే మోక్షం పొందాలనే ఆదర్శంకొరకు సోపానాలు కట్టాడు. సత్రాలు నిర్మించాడు; కోనేరులు త్రవ్వించాడు; గుళ్ళు, గోపురాలు కట్టాడు; అందరిని మోక్షం పొందమన్నాడు. అంతవరకు తన ఆత్మకు శాంతి, సుఖము, మోక్షము కలుగవనే ధర్మాన్ని గుర్తించాడు.

కాలానుగుణ్యంగా మానవుని అభిప్రాయాలు మారుతాయి. దైవభక్తే మానవసేవ అవుతుంది; అదే దేశభక్తిగా పరిణమించుతుంది.

ప్రస్తుత కాలంలో దేశసేవే మోక్ష సాధనము. 1900 సంవత్సరం నుండి స్వాతంత్ర్యం కొరకు, విముక్తికొరకు, దేశం సుభిక్షంగా ఉండుటకొరకే, నలభై కోట్ల భారతీయులూ సుఖంగా జీవించుట కొరకే మన తాతలూ, తండ్రులూ ఎంతో ప్రయాసపడ్డారు. స్వాతంత్ర్య దేవత ఎక్కడో ఉన్నది. ఆమెను దర్శనం చేసుకోవాలి. వరాలు సంపాదించుకోవాలి. మోక్షం సాధించాలి. అందుకు ఎన్నో కష్టాలు పడాలి. నలభైకోట్ల భారతీయులు సుఖసంపదలతో జీవించాలి: అదే దేశభక్తిలోని సారం.

1900 సంవత్సరంలో యువకులు స్వతంత్ర యాత్రకు బయలుదేరారు. పెద్దలు అడ్డుపడ్డారు. అయితేనేమి? కొందరు యువకులు సాహసించి ప్రయాణం సాగించిరి. కొండల్లోను అడవుల్లోను ఉండే భయంకర మృగాలకన్న క్రూరమానవులున్నారు, తెల్లరాక్షసులు వారిని కొట్టి జైళ్ళలో వేశారు; చివరకు చంపారు. అయితే నేమి? పెద్దల హితబోధను చెవిని పెట్టలేదు. ఉద్యోగము, దాస్యము, ద్రవ్యము మోక్షసాధనాలు కావని యువకులకు తెలుసు. తెల్లరాక్షసులతో పోరాడి ఎందరో నశించారు. అయితే ఏం? ఏ కొద్దిమంది యువకయోధులో మొదటికొండ ఎక్కారు. అలసిపోయారు. స్వాతంత్ర్య దేవత ఆలయమైనా కనుపించలేదు. "టెరరిస్టు"లని తిట్లుతిన్నారు.

వారి అగచాట్లు చూస్తూ కొందరు జీవచ్ఛవాల్లాగ ఉండలేకపోయారు. తమ తండ్రులు, తాతలు, ముత్తాతలు ఎన్నో యుద్ధాలు చేసినవారే! అట్టి సంతతివారు అయినందుననే ఇట్టి పౌరుషం కలిగింది. టెరరిస్టుల సహాయానికి, స్వాతంత్ర్యదేవత దర్శనానికివెళ్లారు. ఎందరోనశించిపోయారు. కాని, తమ యాత్రను వదల్లేదు. మరొక కొండ నెక్కారు, స్వాతంత్ర్య దేవత దర్శనం మాత్రం లభించనేలేదు. కాని, ఆ గదరు వీరులలో చాలామంది ఆహుతి అయ్యారు.

"భయపడవద్దు; నిరాశచెందవద్దు; ఇదిగో వస్తున్నాము లక్షలు కోట్లమందిమి! సంపూర్ణ స్వాతంత్ర్యదేవత దర్శనం అయ్యేవరకు మా సంకల్పం విడువము! రాక్షసులను, దోపిడిగాండ్రను నాశనం చేస్తాము. ధనం, ధాన్యం, సౌఖ్యం, విజ్ఞానం అందరికి కలిగేలా చేస్తాము" అని గర్జిస్తూ ముందుకు నెట్టు

కుంటూ గుంపులు గుంపులుగా, తండోపతండాలుగా వచ్చారు జాతీయ యోధులు. గదరు వీరులను రెండో కొండ శిఖరంమీద కలుసుకొన్నారు.

మూడవకొండ ఎక్కడం ప్రారంభించారు. ఎంత దూరం! ఎంత ఎత్తు! అయితే నేం? రాక్షసిమూకను ధ్వంసం చేస్తూ ముందుకు సాగిపోయారు. కొంతమంది పారిపోయారు; కొందరు దాసులయ్యారు. జాతీయయోధులకు తోడ్పడుతామని ప్రమాణం చేస్తున్నారు.

అదిగో నాల్గవ కొండ! ఆ కొండమీద స్వాతంత్ర్య దేవత దేవాలయం ఉన్నది; చూడండి. అయితే "ఆ కొండపై కెక్కడం సాధ్యంకాదు; నిటారుగా వున్నది; చాలా ఎత్తు, జారుతుంది" అని ప్రజా ద్రోహులు, దోపిడిగాండ్రు భయపెట్టారు. జాతీయ యోధులు ముసలివారయ్యారు. ముప్పయి సంవత్సరాల పోరాటం వల్ల నీరసించిపొయ్యారు. ఇక కొండ ఎక్కలేరు. మనోబలం కూడ క్షీణించిపోతున్నది. చివరకు శత్రువులనే మిత్రులుగ భావించి మోసగింపబడుతున్నారు. మూడవకొండ శిఖరము మీద నుండే గుడివైపు తిరిగి సాష్టాంగ నమస్కారం చేశారు.

"ఓ దేవతా! మేము నీవద్దకు రాజాలము. నీవే మా వద్దకు వచ్చి, నీ భక్తులమైన మాకు దర్శన మివ్వాలి" అని ప్రార్థించుతున్నారు. వస్తుందని భక్తులు కలలుగంటున్నారు.

అయితే, ఈ యోధుల బిడ్డలు, మనమలు మోసపోలేదు. నాల్గవ కొండ ఎక్కవలసిందేనని సంకల్పించారు. ఎక్కడం ప్రారంభించారు. జారి పడిపోతున్నారు. ఎన్ని కష్టాలు వచ్చినా ముందుకు దూకుతున్నారు. కొండలు, లోయలు, అడవులు, భీకర

మృగాలు యువకయోధుల ధైర్య సాహసాలకు తాళలేక భయ పడిపోతున్నాయి. ఏమి సంకల్ప దీక్ష! ఏమి సాహసం! ఏమి త్యాగం! ఎంతమంది నశించినా ముందుకాలు ముందే ఉంటున్నది.

అదిగో! గుడిలో జ్యోతి వెలుగుతున్నది. అరుణకాంతులు విరజిమ్ముతున్నది. ఆ దీపంలో ఉన్నది వీరాధివీరుల - దేశ భక్తుల రక్తం!

"అబ్బ! లోయ ఎంత లోతు! శిఖరం ఎంత ఎత్తు! అయ్యో! నేను దూకలేను! అయ్యో! నేను ఎక్కలేను" అన్నాను కాళ్ళ నొప్పులతో.

"తాతగారూ! ఇంతదూరం వచ్చారు. భయపడవద్దు. ఆ బరువు మొయ్యలేవు! ఆయుధాలు మా చేతికి యివ్వు! మా చేతులు పట్టుకో! మా భుజాలమీద కూర్చో! దేవతాదర్శనం చేయిస్తాము! రా! తాతా! రా!" అన్నారు యువకయోధులు.

"36 సంవత్సరాల సాధన, తపస్సు జ్ఞాపకముంచుకో! ధైర్యం చెయ్యి! ఒక్కదూకు దూకు!" అన్నారు మనుమలు, మనుమరాండ్రు.

"యువకుల్లారా! యోధుల్లారా! మీరు ముందుకు సాగి పోండి! మీ వేగాన్ని కుంటుపరుస్తున్నాను. నాకొరకు కాచుకో వద్దు! నేను విశ్రాంతి తీసుకోవాలి! వెళ్ళండి, నాయన్లారా! వెళ్ళండి" అని వేడుకొన్నాను.

"యువకుల్లారా! దేవతను ఏమేమి వరా లడుగుతారు? సంపూర్ణ స్వరాజ్యం మాత్రమే చాలదు. కేవలం ప్రజాప్రభుత్వం కూడా చాలదు. అందరికి అన్నం, ఇండ్లు, బట్టలు, మందులు, చదువు, సంస్కృతి కావాలని అడగండి. మన నలభై కోట్ల

భారతీయులకే కాదు! సర్వమానవజాతికి కావాలని కోరండి..... చాలదు!....చాలదు! అందరికి రేడియోలు, కార్లు, ఏరోప్లేనులు కావాలని అడగండి! సంశయించవద్దు సుమా! దోపిడీతనం పోతే, పదవీవ్యామోహం పోతే అందరికీ అవి లభిస్తాయి! యుద్ధాలు నశిస్తాయి! అందరం బాగుపడుతాం! సమృద్ధిగా వుంటాయి అన్నీ" అని దీవించాను.

"తాతయ్యగారూ! అలాగే అడుగుతాం. మీరు కోరిన వరాలన్నీ లభించేవరకు మా పట్టుదల మానం; ముమ్మాటికీ మానం! అప్పటికి మీరు జీవించివుంటే విమానంలో తీసుకెళ్ళి దేవతాదర్శనం చేయిస్తాము" అన్నారు.

"అలాగే, నాయన్లారా! తప్పక జీవిస్తాను!

30-9-1951
మద్రాసు.

ఇట్లు,
దరిశి చెంచయ్య.

సమాప్తం.



